శ్రీరస్తు

# శ్రీ శాంతి సమ్రాట్టు - - అశోక చరిత్రము

శ్రీశ్రీ కల్లూరి సుబ్బారాయ



షష్ఠ్యుత్సవ సత్కృతి.

గ్రంథకర్త:

బోధాక్షే

శ్రీ గురుభ్యోనమః

# కృతిముఖము

ఉభయభాషికల్పులు, గురుకుల క్లిష్టులు నగు శ్రీ కల్లూరి వెంకట నారాయణరావుగారి యవ్యాజ వాత్సల్య రసానుభూతులతోఁ బాటు వారు రచించిన "శ్రీమదశోకచరిత్ర" ముఖమున వారి సారస్వతోపాసనతోఁ బ్రత్యక్ష ప్రత్యక్షరపరిచయము లభించుట నా భాగ్యము. ఎన్నఁడో "విద్వాన్" పరీక్షకై వారి "ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము" పఠించినప్పుడు రసోత్తరంగితమైన యంతరంగముతో నేను జేసిన భావనయే, పరోక్షప్రియులై "కవిత్వవేదిగా" డాగియున్న వారి యపరోక్ష సాక్షాత్కారసిద్ధి కిప్పుడు కారణమైనది. అందులకు నా భావనాశుద్ధి యెడల నేను గృతజ్ఞుఁడను.

ఇప్పుడీ గ్రంథము వారిని 'కవిగా' సాక్షాత్కరింపఁజేయుచున్నది. విమర్శకుఁడు తార్కికుఁడును కవియై నెగ్గుట చాలకష్టము. కాని మునుపటి కవిత్వవేత్తృత్వము, ఇప్పటి కవిత్వమును నేకముఖాభినయముగా నటించుట కీకృతి వీరి కుత్తమరంగమైనది. ఇందు వీరి ప్రయోగ నైపుణ్యము నరసి యానందించి మెచ్చుకొనుట కాంధ్రవిద్వత్కవి సామాజికలోక మెదుట సిద్ధముగనే యున్నది. 'నాందిగా' నీకృతి ముఖమును దిద్దుటయే నా కర్తవ్యము.

ఆంధ్రగీర్వాణాంగ్ల కన్నడ భాషామృతపారావారము నీదియీఁది బాల్యదశలోనే వీరు సంతరించుకొన్న రసికత్వము, రాజ్యాంగ చరిత్రాద్యవలోకనమున యౌవనదశనంది, వయఃపరిపాకమున గురుభక్తిచేఁ బరిణతమైన యాత్మానుభూతిచే సుపరిపక్వమై, నించిన ఘుమఘుమల కెక్కుడై యీకావ్యము నేటి యత్యుత్తమ చారిత్రక ప్రబంధముల కెల్ల మేల్బంతియై యవతరించినది.

పీరికవిత సమర్థ వృత్తభంగిమల నన్నయను (చూ. కాం. ౨ ప. 214,) దీని యనుపదమే 'తిక్కన'ను (ప 215 కాం ౫ ప 109 ప. 122) విభావాది రససామగ్రీ పరిపోషణమునను తెలుఁగు నుడి కారపు సొంపునం జాతిం దిక్కనను (చూ. ౨ ప 154 నుంచి 161 వరకు కాం ౫ ప 183) భక్తివైరాగ్య విన్యాస ములం బోతనను(చూ. కాం ౧ ప 7 ప 21. ప 24.31) పదగుంభ నాదుల పాండురంగకవిని (చూ. కాం ౧. ప 6. కాం ౬. 108.277) పదార్థపాక సమృద్ధిని, రాచరికపుఠీవిని గొండ్లోకచో నాముక్తమాల్యదాకర్తను (చూ కాం ౨. ప 96 కాం ౪ ప. 21 నుండి ప. 25 వరకు కాం ౪. 6 ప.) ఒక్కొక్క తఱి సర్వజ్ఞసోముని (చూ కాం ౬. ప 220) వృత్తిరీతులఁ గవిసార్వ భౌముని (చూ. పరి శిష్ట సప్తమకాండ ప 168) స్ఫూర్తిగం గొలుపు చున్నది. ఇంచుమించు తెలుఁగు శారద కలంకారములగు ముక్క తిమ్మనాదుల పలుకు కులుకు లందం దిందు కనిపించుచునే యున్నవి.

ఇందలి యితివృత్త మశోకుని రాజ్యాంగ సరణితో నారంభమై, దృశ్య - శ్రవ్యరూపము లగు నుభయ కావ్యరీతులను బ్రదర్శింపచుటకు వలయు పాత్రపోషణ, కథాచిత్రణ - సంభాషణములందు విరాటో ద్యోగాదులందలి తిక్కనను, బుద్ధ బింబిసా రాశోక విరక్తి ద్వారమున శాంతరస ఘట్టములచే శాంత్యనుశాసనికములందలి కవి బ్రహ్మను దలపించు చున్నది.

బౌద్ధ వైదిక సంప్రదాయములకుఁ బొంతన మున్నంతవరకు ననగా నీతి ధర్మశాస్త్రములం బేర్కొనఁబడిన "అహింస" సత్య మస్తేయ" ఇత్యాది విశ్వమానవ సామాన్యధర్మముల ప్రచారము దృష్టిలో నిడుకొని వీరెన్నికొన్న యీ కథావస్తువును బ్రజోపయోగ మునకుం దెచ్చునపుడు, కేవల బౌద్ధ సిద్ధాంతములకు, ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతములకుఁగల వైషమ్యమును రాద్ధాంతముసేసి సనాతన సాంఖ్యమార్గమును బునరుక్తము గావించుట యనవసరము.

కలి విజృంభణము పూర్తి కాకుండనే కేవలైహిక భోగదృష్టి బలిసి, సత్యాహింసలకు దూరమై, రామరాజ్యముమీఁద మనోరథయాత్ర చేయుచును, నాహారవిహారాదుల నియమపాలన మెఱుంగక కేవల స్థూలశరీరపాటవమేని లేని జనమ్మునకు సూక్ష్మశరీరదర్పణము నందలి మకిలిని తొలించుటకు వలయు సామగ్రి నందించవలెనను తహతహగల యీ గ్రంథము కేవల రసలుబ్ధులనేకాక, ఆధిదైవికాధ్యాత్మిక సాధన జిజ్ఞాసువులను గూడ దనియింపఁ జేయఁగలదని భావించుచున్నాను.

“ఝల్లునఁ దెల్లవారిన నభస్థుఁ డనూరుఁడు పిల్వ, నయ్యుషా
వేల్లిత బాహువల్లరులు వీఁగఁగ విశ్లథ తారకాత్త ధ
మ్మిల్లము నొత్తి, వీడ్కొని సమిద్ధ కుసుంభరుచి ప్రకీర్ణపూ
నొల్లను దాల్చి యెక్కెను మహోదయుఁ డర్కుఁడు
ప్రాఙ్నగాగ్రమున్.

లలితరసాలపల్లవములన్ మెసవన్ బరువెత్తు పిల్లకో
కిలల కలధ్వనిన్ సగసకేళకుళిన్ జిగిడోలలైన యు
త్కలికల బాతుకూనల కుదారసమీరుఁడు పాడె సందె పా
టల నవి వించు నర్కుఁడు హుటాహుటిఁ బశ్చిమదిక్కు ముట్టఁగన్”

అని ఇట్లు జగద్బంధు నుదయాస్తమయమ్ముల వధిగా క్షణక్షణ నవ్యతను మురిపించుచు నిక్కావ్యకన్య సంతరించుకొన్న ప్రతిపద మధుర నైపథ్యమును దర్శింప నూరక యువ్విళ్లూరుచున్న రసికజన మిళింద బృందములు, కొండు రెండు పద్యకుసుమమ్ముల నిదర్శన ప్రదర్శనమ్మునం బని వోవదని మొత్త మీకృతిని గృతిగా నందించి విందు వెట్టి కృతినయ్యెదఁగాక! యని యింతతో నీకృతిముఖమునఁ గల్యాణ తిలకము దిద్దుచున్నాను.

కవిపద మన్వర్థమ్మగు
కవులన్ వినుతింతు సుకవి కలితాశ్లోక
ప్రవిమల దివ్యచరిత్రో
త్సవకృతిఁ గృతిముఖము దిద్దుసరణిన్ దీక్షన్.

స్ఫుటశబ్దార్థము బోధగర్భము రసాస్తోక స్ఫురద్ భావనా
నటన మ్మద్యతన ప్రజాభ్యుదయ సంధానమ్ము ప్రాక్పుణ్య సం
ఘటన మ్మాంధ్ర సరస్వతీ పరమమాంగళ్యమ్ము కల్గాగి వెం
కటనారాయణ సత్కవీంద్ర కృతిఁ దత్కావ్యాత్మఁ గీర్తించెదన్.

భాండారమ్మిది శాంతిరత్నమయ శోభాస్ఫూర్తి, కర్థాప్తికిన్
భాండారమ్ము, పదార్థచౌర్య మిచటన్ భగ్నాశమై పోయెఁ, గో
దండజ్యా స్ఫుటటంకృతిన్ మొలసె శబ్దబ్రహ్మ, మా శాంతి రా
ట్కాండీవ్య మ్మిట నించె భారత యశశ్చంద్రాతప మ్మంతటన్.

ఊరును గల్లటంచు మము నూరక హాస్యము లాడుచుందురు, ర
య్యా! రసికావతంసుల కనోపమభక్తికు లైన వారి కా
ధోరణియంతె; యయ్యినుఁడు తూగిన బండికిఁ జక్రమొక్క, డా
తోరపు కల్లు వేదగతితో మఱి యాపిరి వంశవృద్ధు, లా
పేరటు లింటిపేరగుచుఁ బేర్మి ఘటించిరి మాపురాతనుల్.

సోమరసమూరు వట్టి కల్లూర దన్న
దీయ వంశాన నను నాదు తీరుకొంత
సత్యమన మత్సనామ వంశమున మధుర
కావ్యరస మూరుసనుట కీ కవియె సాక్షి.

నన్నొక తమ్ముఁడట్లుగని నాయెడఁ బెద్దరికమ్ము పెట్టి తా
నన్నిఁట జాణయయ్యు నవురా ! కవిరా జనిపిల్చె నన్ను, నా
సన్నుతి సిద్ధవాక్కగుట సత్యముకాఁగలదన్న భక్తి నా
యున్నది యున్నయట్లు స్తుతి నొప్పితి, నేఁ గృతినైతిఁ దత్కృతిన్.

రామవియోగశోకము కర మ్ముదవించి యశోక మన్న పే
రీ మహిఁ గాంచె, రాక్షస మదెల్ల; నటన్ హనుమత్సమాగమ
మ్మై మరి నామ సార్థకతనందెను సీతకు నీడయిచ్చి; యా
పై మరి పక్వపుణ్యమయి వచ్చె నరాకృతి నీయశోకుఁడై.

ఆ రమణీయమూర్తి యుదయమ్మున రాముని రాజ్యచిహ్నముల్
భారతమందుఁ దోఁచె నొకపాటిగఁ; బ్రాక్తన పుణ్యకోటి నా
చారుచరిత్ర శాంతి యటుచాటగు పాలనవేళ సంస్మృతిన్
జేరిచె నీకవీంద్రకృతి చిత్రిత సంస్కృతి సంస్తుతించెదన్.

“కాలేఽస్మిన్ కవితాయశోవ్యసనిభి శ్చోర్యాత్పదాహర్తృభిః
కావ్యం తత్కరకోపలేన రచితం పాత్రం న చాంద్రోపలమ్
స్యందా త్తత్ క్షణమేవ నశ్యతి యత స్తత్రాహితో యోరస
స్సోఽపి స్యాత్ క్షణభంగురో గురుధియాం స్వాదాయ నోకల్పతే.

ఆచార్య స్మితచంద్రికాప్రసరణా దంతర్బహిశ్చ ద్రవ
స్యందిన్యాం కవితాసుధాకరమణిద్రోణ్యాం తు బ్రహ్మాత్మకం
దివ్యం పాయన మాగళం హి పిబతాం ప్రాచాం కవీనాం కృపా
సారం సారతరం త దౌపనిషదం సారస్వతం జృంభతే”

—గురుకృపాలహరీ

వ్యాససమితి,
విజయవాడ.
5—4—1958

క. వెం. సుబ్రహ్మణ్య దీక్షితులు,

# మున్నుడి

(1) అధునాతన సాహితీ జగత్తునకు గుప్తనామముతో "ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము" ప్రసాదించి "కవిత్వ వేది" గా, సుగృహీత నామధేయుడైన, సహృదయ సార్వభౌముఁడు, శ్రీ కల్లూరి వేంకట నారాయణరావుగారు. ఆంధ్ర సారస్వత నందనవనమును, ఎడదలో నాటుకొనిన యీ తోటమాలి, కర్మయోగియై, జీవిత ప్రాతః స్సంధ్యారోచిస్సులలో నిష్కామ సేవగ సంతరించిన తొలికృతియది.

(2) 'కావ్యం యశసే అర్థ కృతే—" అనునది ఆలంకారిక ప్రవచనము. కాని యశస్సు గుప్తనామమునకు - అర్థకృతి _ వావిళ్ళవారికి దక్కినది. అది "సంగ్రహ" వాఙ్మయ చరిత్ర యైనను - తరతరముల సాహిత్య పథికులకు వెలుగు త్రోవలు చూపించినది. "సమగ్ర" వాఙ్మయచరిత్ర కల్లూరి వారి కలము సృష్టించి యుండిన బాగుండెడిది. ఇంకను నాకు ఆ ఆశ మిగిలియే యున్నది. దానికి బదులు-బ్రదుకు పడమటి మలిసంజ నీడలు క్రమ్ముకొనుచున్న సమయములో శ్రీ కల్లూరి వారి కలమునుండి ఈ బృహత్ కావ్యము, శ్రీమ దశోక చరిత్రము ఉద్భవించుట, వింతగొలుపు సంతోష సన్నివేశము ఈ రెండు కృతుల మధ్యకాలమున, ఈ సాహితీ తపస్వి - ఉపాధ్యాయ వృత్తిలో పండి - అర్థమునకేమిగాని - గౌరవింపదగిన వార్ధకమును సంపాదించుకొన గలిగినాఁడు. ఈ మధ్య కాలమున వీరు రచించిన యితర కృతు లున్నవని వినికిడి. కాని - వీరికి సహజమైన ఆముష్మికరక్తి - ఐహికవిరక్తి - చే, అవి యే మారుపేరుల, మేలిముసుగుల, మాటున మసలుచున్నవో, తెలిసికొనుట కష్టము! భవతు!—

"నా నృషిః కురుతే కావ్యం" ఋషి కానివాడు కావ్యమును నిర్మింపలేడని ప్రాచీన భారతీయాలంకారికుల యభిప్రాయము. "విశ్వశ్రేయః కావ్యం" నన్నయ మహాకవి పెట్టిన ఒఱవడి. శ్రీమ దశోకచరిత్రము జగద్ధితమైన ఇతివృత్తమగుటచే, ఈ కోవకుచెందిన కావ్యమగుట స్పష్టము.

(4) "ఏమున్నది మానవ జాతి చరిత్ర; అంతా పరపీడన పరాయణత్వము" అని విషాద వైక్లబ్య విహ్వలులై అధిక్షేపించు అధునాతన విమర్శకులున్నారు! నిజమే! ఘోరయుద్ధ పరంపరా కలుషితమైన, ప్రపంచ చరిత్రలో మరువరాని పవిత్ర ఘట్టమొకటి యున్న, అది కళింగయుద్ధమున అశోకచక్రవర్తి హృదయ పరివర్తనమే! పాలికలనిలోని రుధిర వాహినులలో, పొరలాడు వికలాంగుల, వేదనారావములమధ్య అశోకునకు, యవనికాంతర ధ్రువాగాన గీతికలుగా, బుద్ధభగవానుని దివ్య ప్రబోధములు వినిపించినవి.

(5) ఒకనాటి అర్థరాత్రి - శ్రీమతిని, చిరంజీవిని- సింహాసనమును త్యజించి చీకటిలో బయలుదేరినాఁడు సిద్ధార్థుఁడు. విశ్వకల్యాణ గవేషణకది, శంఖుస్థాపన! కాల పురుషుని కటికి యెడద తొలిసారి కదలి, సిద్ధార్థుని గుఱ్ఱపుగిట్టల చప్పుడునకు శ్రుతిఁ గల్పికొనినది. ఆ లోకోత్తర పవిత్రయాత్ర మహాభి నిష్క్రమణమై, ప్రపంచ

చరిత్రకు, పవిత్రతఁ గల్పించినది. సిద్ధార్థుడు బుద్ధుఁడైనాఁడు. అహింసా సిద్ధాంతమును, భూతదయను, ఆచరణలోని కనువదించి, చూపిన, అనుష్ఠాన వేదాంతి, అశోకుఁడు. విజయలక్ష్మికి, తిలోదకములనిచ్చి కరుణామయుఁడై కొషాయాంబరముల ధరించి విశ్వ జనీన చరిత్రుఁడైన అశోక చక్రవర్తి అమృతగాథ, పాషాణ హృదయములనుఁగూడ నవనీత పేశల మొనర్పకలదు.

(6) ప్రపంచచరిత్రలో, ఇటువంటి అద్భుతఘట్టము మఱియొకటి యున్న అది గాంధీయుగము. అస్త్ర సన్యాసము సల్పి, అజాతశత్రువై "శాంతి వీరము"తో సత్యాగ్రహసమరమున, స్వాతంత్ర్యము నార్జింపగలిగిన గాంధీమహాత్ముని, చరిత్రకు, భవ్యకవితావేశము కల్పించినవి, బుద్ధభగవానుని భూతదయ అహింసావాదములే. స్వతంత్రభారతమునకు ఏకైకధ్యేయము, శ్రేయోరాజ్య సంస్థాపనము. ప్రపంచచరిత్రలో శ్రేయోరాజ్య సంస్థాపకులలో ప్రాతఃస్మరణీయుడు అశోకుఁడు! అందుచేతనే ఈ యితివృత్తము స్వీకరింపుమని ప్రోత్సహించిన వ్యక్తి, గాంధీయుగమునందలి, అతిరథ మహారథ శ్రేష్ఠులలో నొకరగు శ్రీ కల్లూరి సుబ్బారావు గారగుట వింతగాదు. శ్రీ కల్లూరి సుబ్బారావుగారి షష్టిపూర్త్యంకముగ, నీ కృతి వెలువడుట ముదావహమైన విషయము! శ్రీ కల్లూరి సుబ్బారావుగారి కనుగొల్కులలో కలలు కలివరించుచుండుట, అందరకు అనుభవ పునరుక్తమైన సంగతియే. నవయుగ నిర్మాతలలో నొకరైన ఆ కల్లూరివారి కల ఈ కల్లూరివారి కలము వలన ఇట్లు అక్షరరూపమున, కలరూపు ధరించుట యెంతయు సముచితము.

(7) శాంతి సామ్రాట్టు - అశోకుని చరిత్ర - రచించి శ్రీ కల్లూరి వేంకట నారాయణరావుగారు అన్యాపదేశముగా అద్యతన భారతీయుల, తద్వారా విశ్వశాంతి ప్రియుల ఆశయములను, ఆదర్శములను, ఛందోగానముగ సంతరించినారు. అంతియకాదు. ఈ కృతిలో అలనాటి సాంఘిక పరిస్థితులు, రాజకీయ మర్యాదలు, వేయేల మౌర్యయుగ విశ్వరూప సందర్శనము లభించును. పద్యరచనమున వీరి కొక విశిష్టత కలదు. వీరిది నారికేళపాకము. ఆపాతమధురమైన ద్రాక్షాపాకము నాదరించువారెప్పుడు నుందురు. అయినను అర్థగంభీరమై, రీతి శుభగమై, శయ్యాపరిపక్వత గల యీకవిత్వమును పరిణతజ్ఞులు మాత్రమే ఆదరింపగలరు. బహుశాంగ్లాంధ్రోక్తిమయ ప్రపంచమును కూలంకషముగ మథించిన బహుముఖప్రజ్ఞ ఈ బృహత్కృతియందు సర్వత్ర జీవనాడివలె స్పందించుచుండుట, విద్వద్రసికులు గమనింపగలరని నా విశ్వాసము.

(8) ఈ విశ్వశాంతి సందేశము వినిపించుటకు బుద్ధభగవానుడు — అశోకుడు — గాంధీమహాత్ముడు పుట్టిన పుణ్యభూమికే కలదు! శ్రీ కల్లూరి వేంకట నారాయణరావుగారి కృతి విశ్వజనీనమైన విశ్వశాంతి జాగృతి వెల్లివిరియచేయుగాత! ఈ శాంతిసందేశము నేడు అవశ్యపవిత్ర కర్తవ్యము. ప్రపంచమంతయు ఈ

సందేశము వినక తప్పదు! కానిచో ఉదజని బాంబులతో యుద్ధమే దాపురించినచో ప్రపంచమే విశాల స్మశాన మగును.

ఉ॥ ఈ పెనుమంటిదిబ్బ వసియించిరిగా కానొక సాదు, మానవుల్,
పాపము శేముషీ విభవ పారగులై ప్రకృతిన్ జయించి, వి
శ్వాపర సృష్టి సల్పి, ప్రళయాంతక బుద్ధిని, గుండెలేక, ఆ
త్మాపహతిన్, వినాశనము నొందిరి, అందరు జ్ఞానశూన్యులై॥

తే॥ గీ॥ అనుచు హతశేషమై అంత, అవని, నిగులు
యే పిపీలికలో, రచియించుకొనును
కరుణగీతి కల తమ వాఙ్మయములోన
ఈయది అవశ్య భవితవ్యమేమొ మనకు॥

అని, అనిపించుచున్న యీతరుణమున, శ్రీమదశోకచరిత్ర, చిమ్మచీకటిలో దూరమున తోచు ధ్రువతార.

(9) ఈ బృహత్కృతికి మున్నుడి వ్రాయుట నిజమునకు సాహసమే. అయి నను జ్ఞానవయోవృద్ధులైన శ్రీ కల్లూరివారి అనుశాసనము మీఱరానిది. ఈ తప్పు తెలిసి చేసినదే.

విళంబి వసంతము. నండూరి రామకృష్ణమాచార్య, ఎం. ఏ.,

కవిసమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ., గారి

శ్రీ

# శాంతి సమ్రాట్టు — అశోకచరిత్రము

## పీఠిక

రాయలసీమ నిజముగా రాయలసీమయే. ఈసీమకు ప్రాచీనకాలము నుండి మహారాజవాడి, మహారాజరనాడని యే నామము. మహారాజరనాడు, జనవ్యవహారమున మార్పుజెంది తుదకు మార్జవాడియైనది. కడప, నెల్లూరు, అనంతపురమండలములకు, విజయనగరాధీశ్వరులైన సదాశివరాయల కాలము అనగా క్రీస్తుశకము పదునారవ శతాబ్దము మధ్యవరకు, మార్జవాడియన్నది అరుదుగనైనను, వ్యవహారము నందుండెను. అది దక్షిణాపథపతులైన, ఆంధ్రనరేంద్రులు సాతవాహనుల వలన కలిగినదని నావిశ్వాసము. ఆపురాతనకాలమున మహారాజులనగా, సాతవాహన మహారాజులే: భూపాలవర్గమును జయించి, యశ్వమేధ యాగమునే కాక యనేక వైదికక్రతువు లాచరించి అశోకుని తరువాత యవన శక పహ్లావాది, విదేశాగత విజృంభణము నరికట్టి, వర్ణాశ్రమ ధర్మ పరిరక్షకులైన, ఆంధ్ర సాతవాహన కులజులొకప్పుడు, అనాడు రాజపదార్హులు.

ఆంధ్ర సాతవాహనుల సదనసీమ యగుటవలన, రాయలసీమ, మహారాయలసీమ యని, ప్రఖ్యాతిగాంచుట, అబ్బురము కాదు. మహారాణా ప్రతాపసింహుని చరిత్రము, శివాజీమహారాజు చరిత్రము, దివ్యాంధ్ర ప్రబంధములుగా రూపొందినదని కూడ, ఈరాయల సీమలోనే: భారతధర్మ దరక్షకులు. వేదమూ

జోపనిషద్రహస్య మార్గానుగులు, ఆర్ష ధర్మపరిరక్షకులు నైన మహారాజుల చరిత్రలు సువర్ణాంచిత గ్రంథరూపమున నక్షరము లైనదియు నీరాయలసీమలోనే! పరులనిప్పుడు మహారాజమౌళి శ్రీ మదశోకచరిత్రముకూడ నవతరించినదియు ఈ రాయలసీమ లోనే! సర్వవిధముల రాయలసీమ సార్థకనామ!

మౌర్య వంశవిభూషణుండు అశోకచక్రవర్తిని గురించిన, కట్టుకథలనేకములు; అచక్రవర్తిని జైనవాఙ్మయ మొకవిధము నను, బౌద్ధవాఙ్మయము మరొకవిధముననుు, పురాణవాఙ్మయము మరొకవిధముగను చిత్రించినవి. సత్యమేదో యసత్యమేదో నిరూపింప గుదురని పరస్పరవిరుద్ధ విషయములనేకములు— అట్లగుట, అశోకుని అస్తిత్వము, చారిత్రకత కూడ సందేహాము లేమైనవి. క్రీస్తుశకము పందొమ్మిదవ శతాబ్దాంతమున, బ్రాహ్మి, ఖరోష్ఠి, లిపులనేకము తెలిసి, శతాబ్దుల తరబడి అజ్ఞాతములుగ నుండిన అశోకచక్రవర్తి ధర్మలిపుల, స్తంభలిపుల పాఠములు విడివడి అర్థమై. అశోకుడు, ఒక భారతదేశ చరిత్ర మునకేకాక, ప్రపంచచరిత్రమునకే వన్నె తెచ్చు దివ్యమణిగా గుర్తింపబడినాడు. అతని రాజ్యతంత్రకౌశలమున కాతని విశాల సామ్రాజ్యమే నిదర్శనము. అతని సమరాంగణ సార్వభౌమతకు ఆతని కళింగవిజయమే ప్రబలతార్కాణము. అతనిలో మన కాశ్చర్యము కలిగించి యతనిని మనకెక్కువ సన్నిహితుని చేయులక్షణ మాతని మానవత. యుద్ధవిజయ మానందము చేకూర్చుటకు మారుగ నత్యంతశోక పరితాపమును పెంపొందించిన సందర్భము ప్రపంచచరిత్రలోనే అశ్రుత పూర్వము. నాసంతాన మ్మున కిహమున పరమునను శ్రేయస్సుఖముల నెట్లుకోరుచున్నానో

ప్రజలవిషయమున నట్లే కోరుచున్నానని చాటి, ప్రజలలో ధర్మ చింతనుద్దీపింపజేసి, వారి యాధ్యాత్మికాభ్యున్నతికి కృషిచేసిన ధర్మాత్ముఁడగు మహారాజు ప్రపంచచరిత్రలో నాటికి, నేటికి నాతఁడొక్కఁడే! అఖిలప్రపంచరాజపాళి చూడామణి, ఆతఁడు. ధర్మవిజయమే విజయమను డిండిమనిర్ఘోషము మారుమ్రోగినది.

అశోక చరిత్రము పరమాద్భుతమైనది. ఇంతవరకశోకుని గురించి వచనగ్రంధములును వచ్చినవి. పద్యప్రబంధములును వచ్చినవి. అశోకజీవిత కథాఘట్టములను గైకొని రచియింప బడిన నాటికలును నాటకములును గలవు. కాని ఈయశోక చరిత్ర ప్రబంధమనేక విధముల విశిష్టమైనది. వివిధవాఙ్మయ ముల వలన దెలియనగు గాధలేవియు అశోకుని సమగ్రజీవిత మును విశద పరుపవు. సరికదా, పరస్పర విరుద్ధములగుట వానికైక్యము లేదు. వానినన్నిటిని. ఆ మహారాజు ఘనతకు దగి నట్లు, కార్యకారణ సంబంధమును గల్పించి, తెగి వేనికవియే విడివడి చెదరిపోయిన హారములోని వివిధవర్ణముల మణులవంటి వాని నన్నిటిని కలియజేర్చి కూర్చి, శ్రీ వేంకటనారాయణరావు గారు ఈయశోకచరిత్రమను రత్నహారమును రమణీయమగు రీతిని, కడునైపుణితో, ప్రబంధించి, పాఠక లోకమునకందిచ్చి నారు. అశోకచరిత్రమును నిబంధించునది యొక దివ్యప్రబం ధము. శ్రీ వేంకటనారాయణరావుగారు తమకావ్యకళానైపుణిని పట్టి పేలపిండివలెనీరుసమైన చరిత్రకు, జీవముపోసి, షట్కాం డాంచిత రస వన్మధుర ప్రౌఢ నిర్వచన కావ్యముగ వెలయించి నారు.ప్రతికాండమును ధారోప విభాగ శోభితము. ఏతత్కావ్యావ తారికయే ఒక విచిత్రప్రారంభము.

గ్రంథమంతయు, బిగువైన సార్థకపదబంధములలో వ్యర్థ పదములు లేక, నవ్యనూతనములైన వర్ణనములతో, ధారాళముగ ప్రాచీనపద్ధబంధమార్గమున, నడచిపోయినది. చక్కని శయ్యాలంకార సౌభాగ్య ముతోను. ఎడనెడ క్రొంగ్రొత్త కల్పనలతోడను, మృదుమధుర పదగుంభనముతో నొప్పుచు, మనమలరించు శైలి సంపదతోను పెంపెసలారు రసవత్ప్రబంధమిది. దీనిలో ప్రాచీన కవులపోకడలకు చూడుడు (215 పుటలో 220; 221 పుటలో 249 ప; 164 పుటలో 177 ప; 121 పుటలో 118 ప;— మొదలైనవి.), శైలీసారస్యమునకు, 55 పుట 105 పద్యమును 84 పుటలో 43 పద్యమును. 107 పుటలో 42 పద్యమును చూడుఁడు. కావ్యము ప్రారంభమై పోనుపోను, రచనలోపాటవమును, కవితలో రసమును, మెరుగులుదేరి గుభాళించినవి. ఈ పద్యములు చూడుఁడా పద్యములు చూడు దని పాఠకులకెత్తి చూపుట సుమనోమనోభిరామమైన, యుద్యానవనమున నెత్తావులు విరజిమ్ము ఈపూలు జూడుమా పూలజూడు మన్నట్లుండును. ఇందలి విశేషము లింకను నెన్నియోకలవు. కావ్యపిపాసువులకిది యమృతకలశము— పాఠకలోకము దీనినితప్పక యాదరించు ననియు. శ్రీ వేంకటనారాయణరావుగారింకను నిట్టికావ్యములను వెలయించి, శారదాదేవికి పూజాకుసుమములుగ నర్పింతురనియు ఆశించుచున్నాము.

శా॥ శకము 1880, జ్యేష్ఠము }
పరశునాకము మదరాసు }

మల్లంపల్లి సోమశేఖరశర్మ

---

విశ్వనాథ్ పవర్ ప్రెస్, అనంతపురం.

# కొన్ని పండితాభిప్రాయములు

(1) బాలచక్రగ ఉన్నది — శబ్దార్థముల స్వాధీనములైన వారి రచనలో నేది బాగుండదు ? — శ్రీ సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు

(2) కళాప్రపూర్ణ బిరుదము కల్లూరి నారాయణరాజు కవికై కైవారమిచ్చుగాక!

— శ్రీ జమ్మలమడక, మాధవరామశర్మగారు

(3) ఆంధ్ర సారస్వతోద్యానమున నవనవ్య కావ్యకుసుమము వికసించినది. ఆంధ్ర సోదరులు దాని క్రొత్త సౌరభముల నాఘ్రాణించి యలరుదురుగాక!

— డాక్టరు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, M. A.

(4) ఇది అఖిలభారత సాహిత్య అకాడమీవారు సన్మానింపదగిన మహాకృతి

— శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు, M. A.

(5) అశోకచక్రవర్తి పవిత్రచరిత్రము మీ కలమున సువర్ణలిఖితమగుట సమస్త కవి పండిత పామరులకు గౌరవపాత్రమైనది.

— శ్రీ పి. శ్రీరాములురెడ్డిగారు, చిత్తూరు

(6) వస్తువిజ్ఞానము, వేదాంతబోధ, ప్రాచీనకవితయందలి వైశాల్యము, భావగాంభీర్యము, సర్వాంగవ్యాప్తమైన యైకకంఠ్యము, పాశ్చాత్య సంపర్కమువలని నైశిత్యము, మీ కావ్యములో నిమిడియున్నవి.

— శ్రీ విద్వాన్ జి. కె. సోమయాజిగారు, M. A.

(7) రాయలసీమకు మీ కావ్యం, కీర్తికిరీటాన్ని కీలించగల దనడం అత్యుక్తి కాదు

— శ్రీ జి. జాషువగారు

(8) పరిణత బుద్ధులగు తమ కావ్యము, చిక్కని పదబంధములో, చక్కని ధారతో ప్రౌఢముగా సాగినది. మీ కావ్య మాలోచనామృత మనుటకు సర్వథా తగి ఉంది — శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు M. A.

(9) మీకృతి నశోకచరిత్రాఖ్యానము కొంటి, మదిని హర్షించితి, ఆంధ్రీకంఠాలంకృతియై యాకల్పము నిల్చు సృష్టియని యనుకొంటిని

— శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు

## కవిసమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ., గారి

# అ భి ప్రా య ము

శ్రీ కల్లూరి వెంకటనారాయణరావు గారు 'బోధాశ్రీ' నామాంతరులు రచించిన "అశోక చరిత్రము" అను పెద్ద గ్రంథము తత్రతత్ర చూచితిని. నా కాశ్చర్యము వేసినది. తొలివిశేష మేమనగా, వీరి కవిత్వము పూర్వ మెన్నడును నేను జూడలేదు. పత్రికలలోఁ గూడ యెక్కువగా పడలేదు. వీరే కవిత్వవేదియన్న విషయము కూడ చాలా కొద్దిరోజుల క్రిందటనే నాకుఁ దెలిసినది. ఇట్టి వారి రచనలో ధారాశుద్ధి నిరంతరముగా నున్నది. ఇది యెంతో అభ్యాసముచే సమకూరెడి గుణము. ఇంత యభ్యాసము వీరెప్పుడు చేసిరి? యెట్లు చేసిరి? అభ్యాసైక సాధ్యమయిన యీ గుణము వీరియందు స్వతస్సన్నిహితముగా నున్నదా ? యనిపించినది.

ఇంత గ్రంథము పద్యములో రచించుట యొక గహనమైన విషయము. రెండు మూడు వందల పద్యములు వ్రాయుపరకే నేటి మహాకవుల జివ తఱిగిపోవుచున్నది. ఇంతటి శక్తి దైవదత్తమే కావలెను.

ఈ గ్రంథములో నీకవి గొప్ప సంస్కృత భాషావేత్తగ గూడ కన్పించుచున్నారు. దీర్ఘ సమాసములు, పలు తెలుఁగుఁ బలుకుబడులు వారి చరిత్రజ్ఞానము, ఆధునిక జ్ఞానసమృద్ధి గ్రంథమం దెక్కడ పడిన నక్కడ గన్పించుచున్నది. వీరి కవితాశక్తి కుదాహరణముగాఁ జూపించుటకుఁ బద్యము లేరనక్కరలేదు. ఇంత గ్రంథము నోపికగాఁ జదివినఁగాని తదితర గుణముల ప్రశంస చేయరాదు.

ప్రస్తుతము నా యనారోగ్య స్థితిని బురస్కరించుకొని యింత మాత్రమే వ్రాయఁగల్గినందులకు వీరిని క్షమార్పణము గోరుకొనుచున్నాను.

విశ్వనాథ సత్యనారాయణ,

15-4-58.

# కృతజ్ఞత

1. మదీయ భాషాధ్యాపకులగు బ్రహ్మశ్రీలు, మల్లాది సూర్య నారాయణశాస్త్రిలు, ప్రయాగ వెంకటరామశాస్త్రిలు, గరిమెళ్ల సోమన్న పంతులుగారికిని, కవితాధ్వదర్శకులు రాళ్ళపల్లె గోపాల కృష్ణమాచార్యులకు నమోవాకములు. గీర్వాణ శబ్దశిక్షకులు శ్రీపుట్ట పర్తి నరసింహాచార్యులకు ప్రణామములు.

2. కృతిలో, పదప్రయోగ సంస్కరణముల నమూల్యములఁ గొన్నిటిని సూచించిన శ్రీ నాగభూషణరావుగారికిని, సూచనలనే కాక, గ్రంథముద్రణ మంతయు జూచుకొన్న వేదమూర్తులు, మిత్రులు కల్లూరి వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులకును, కథాసమగ్ర తకు సలహాలిచ్చిన శ్రీ లక్ష్మణాచార్యులకును కృతజ్ఞతాంజలి నెత్తు వాఁడను.

3. పీఠికకై తిరుపతికి రాయబారము పోయివచ్చిన శ్రీ శేషా చార్యులకు, కవియయ్యును మత్సరములేక సహృదయులై, వ్రాతప్రతి తయారు చేయుటకుఁ దోడ్డైన శ్రీ విద్వాన్ జనార్దనశాస్త్రి గారికిని, శుద్ధప్రతి నందించిన శ్రీ భీమరావుగారికి నా యభివాదనములు.

4. చిరంజీవి మేడా రామయ్య B. Sc. గారు, ముద్రణ మొనరించి తమ యవ్యాజభక్తి భాషాభిమానముల వెల్లడించిరి. వారికి శ్రీ వేంకటనాథుఁ డాయురారోగ్య భాగ్యసంపత్తు లిచ్చి రక్షించుఁగాత.

గ్రంథకర్త

శ్రీరస్తు

# శ్రీమ దశోకచరిత్ర కృతి పరిచయము

అది ఐతిహాసికయుగము. జీవితమార్గ ధర్మానువర్తి యగునట్లు జేయ రాజులు దీక్షాస్వీకరణము చేసిరి. ధర్మగ్లాని నాత్మార్పణము జేసి నివారించిరి. వారి బాహు వీర్యము, "ఆదిక్షత్ర" చరిత్ర సృష్టికాలంబైనది. ఆధునిక జనతకా చరిత్రయంతయు, వాస్తవములో, కాల్పనికములో, స్పష్టముగ నిర్ణయింపగరాని గాథలుగా నైనది. కారణము ఆర్షకవితల్లజుల యుల్లేఖనములు దప్ప చక్షుగోచరములగు "చారిత్రకాధారములు" గన్పట్టవు. చరిత్ర, గాథగా మారునంత ప్రాచీనత నందుకొన్నప్పు డెవరి దాలోపము? ఆ ప్రాచీనచరిత్రలో గాథలు త్రవ్వి పోసి దర్శించునపుడు, కనులు మిరుమిట్లుగొలిపి, వానిలో నింద్రధనస్సులు విరిసి హృదయపటము రాగరంజితమై కావ్యములు, పురాణములు, ఇతిహాసములు కొల్లలుగా నిష్పన్నములైనవి.

ఇది చారిత్రకయుగము. ఇందలి తొలి యుషస్సులనాటి దీ గాథ. చరిత్ర పునరావృత్తి నిరాఘాటముగ, అకుంఠితముగ సాగుచుండును. "ఆదిక్షత్రచరిత్ర" అనంతముగ సాగుచుండజేయు ధర్మదీక్ష నాటివలె నేఁడును ఆరాధ్యమైన ధ్యేయము. ఇది సత్యమగుచో నాటి గాథలు సత్యములుగావా? ఈ యంకురమున కది బీజము. దాని కంతకు పూర్వముండిన దేమగును? మాటలు చెప్పలేవు.

అగణితమణిస్థగితమకుటము మోయువలయు మస్తకము జీవజగ దుద్ధారకము, అరిషడ్వర్గ ప్రబోధిత విషవ్యూహచ్ఛేదకము నగు పీయూషాన్వేషణకై విజ్ఞానసాగర మథన క్షోభ మోసినది. సిద్ధార్థుఁడు బుద్ధదేవుఁడై అమృతమును నేల నాల్గు చెరగుల బంతులు దీర్చి వడ్డించినాఁడు. జీవకారుణ్యాశయ మూఁతగా "ధర్మచక్ర" ప్రవర్తన మారంభమైనది. ఆ జ్యోతిస్సు, మానవులలోని ఆసురమైన అంధకారము, తొలగ జేసి దివ్యత్వమును ప్రస్ఫురింపజేసినది. ఆ ప్రవర్తన మవిచ్ఛిన్నముగజేసి "ఆది క్షత్ర చరిత్ర"ను మరల నీ యుగమున తలపింపజేయబూనినవాఁడు అశోకుఁడు. ఆ మహా మనీషి విజయాంకములై, నిరవధిక కాలప్రవాహ తరంగ ఘట్టనల కెదురొడ్డి నిల్చి అత డెంతటి యున్నతుడు, స్థిరుడు, ఉదారుడో తెల్పు నుత్తుంగ శిలాశాసనములు, సువిశాల సీమా ప్రతిష్ఠితములు, వాకొనుచున్నవి. వితరణశీలియగు నశోకుని సంప్రేషణ మున బౌద్ధ పరివ్రాజక సంఘములు సార్థవాహులుగ శాంతిసందేశ భాండారముల విశ్వవిపణివీధుల కెత్తించి, విజ్ఞాన సత్రములు సాగించిరి. అతడు చరిత్రకందిన వ్యక్తియా? ఔను! కాదు! అశోక స్తంభములు, టిబెట్టు, చైనీయ శ్రమణకుల యుల్లేఖనములు, ఢిల్లీ ఎర్రకోటపై రెప రెపలాడు భారతీయ త్రివర్ణపతాక, ఔననును. హేమాచలశృంగసమున్నతము, సముజ్జ్వలమగు నాతని ప్రభుతా ప్రతిపాదకము లగు నీ యస్తిత్వము మాటున పరమకారుణికోత్తముఁడుగా పరిణతినందిన సజీవ

మానవ వ్యక్తిత్వ వికసనము, శుష్కచారిత్రిక పరిధులలో నిముడక కొదనును. కవియూహాలు పండి, రసవత్కావ్య సరిత్తరంగ ప్రతిభాసితమై, ఆ వ్యక్త్యావిష్కృతి కమనీయత నందుకొను నంతే.

ధర్మపథ ప్రతిష్ఠాపకుఁడగు నశోకుని జీవిత పరిణామకావ్య మీ యశోక చరిత్రము. "కావ్యస్రష్ట" శ్రీ వేంకట నారాయణరావుగారు, "కవిత్వవేది"గా, నాధునికాంధ్ర సాహిత్య ప్రపంచమునకు మూడు దశాబ్దులకు మిక్కిలిగా పరిచితులు. వారి "ఆంధ్ర వాఙ్మయచరిత్ర సంగ్రహము," నిర్ద్వంద్వకృతియై సాహిత్య చరిత్ర రచనకొక శ్రీకారము జుట్టినది. నిగూఢ కావ్య తపస్సమాధిలో కాకలుదీరిన శైలి, కమ్మచ్చున లాగిన యపరంజివలె, తీగలై సాగినది. స్ఖాలిత్యములులేని విశుద్ధధారకు తోడు పుష్కల జీవనానుభవము, నిశిత పరిశీలనాపటిమ, ఉద్వేల భావనాప్రాగల్భ్యములు, అనుశీలకుల కడుగడుగున నామెతలు పెట్టుచుండును. దిఙ్మాత్ర ప్రదర్శన మిందుకు నిదర్శనముగా నుండగలదు.

నిండైన భారతీయాభిమాన మీ కావ్యవస్తు స్వీకరణకు కారణ మనిపించును. రాజకీయస్వేచ్ఛ, చిరంతన సామాజిక ధార్మిక ప్రవర్తన కొక యాలంబనుమాత్ర మని, మన ప్రబల విశ్వాసము. అట్టి వ్యవస్థాపరిరక్షణకై పాటుబడిన శివాజీ ప్రభృతులను దలపించి పీష్వా బాలాజీరావునకు భారతావని నశోకముగ జేసి మనిన యశోకుని కథను వినిపించినాడు. బృహద్భారతభావము కవినావేశ పరవశునిజేసిన తరి, ఆర్ష పావిత్ర్యమతఁ డందులో దర్శించును.

"పెన్నయురవడి, కష్ణాగభీరతయును
తుంగభద్రాతరంగ మాధుర్యగతియు
నఘహరణ యమునా ప్రవాహంబురీతి
నలరి శ్రమణుని వాగ్ధాటి సాంతమయ్యె."

పాశ్చాత్యుల స్వాతంత్ర్య భావాభిరతి, ఆంగ్ల కావ్యాధ్యయన ఫలితముగ మనసున నాటినది. అదను జూచి తనదై, కవి యూహాలో రూపు నందుకొన్నది.

"ఇదియె నా జన్మభూమి యిం దెదురులేని
పుణ్యయశము గడించిన పూజ్యజనని
యనుచు నెద ముదం బొదవఁగ మనని యట్టి
మనిసి పీ న్గొకండును లేడు మౌర్యసీమ."

ఇచట నిన్నమొన్నటి స్కాట్, మౌర్యసీమ కెగబ్రాకినాడు. కళింగయుద్ధ వర్ణన సందర్భములోగూడ, నిట్లే ఆంగ్లకావ్యములలోని పలుకుబడులు చక్కగా నదికినవి.

"ఎగిరిపోవు ప్రాణముల లెక్కిడగరాదు
క్రుళ్ళు పలలంబు ప్రోవుల కొలత లేదు
ధనికులు దరిద్రు లెవరో కన్గొనగరాదు
మొనగలంచుటంతయు, మృత్యువునకె పాదు."

"Friend and foe in one Red Ruin Lost—"
ఇచట భీభత్సస్ఫూర్తి దర్శనీయము.

ప్రాచీనాంధ్రకావ్య ప్రపంచములో కవిని మిక్కిలిగ యాకర్షించునవి భాగవతము, మనుచరిత్ర, విజయవిలాసములు.

భాగవతములోని అనుప్రాసములు, తమ శ్రవణపేయములకు రవళితో, నిట ననేక సందర్భములలో స్ఫురించినవి.

"జడిమఁ బడతియు నడుగిడు
నుడుగడు ప్రియతమను జూచు నుత్కంఠ ప్రియుం
డెడమయ్యెఁ బ్రణయమునకు
నడుమంత్రపు సిగ్గ దౌత్య నటనమొనర్పఁ."

1, 2 పాదములలో గజేంద్రమోక్షన కథలోని పద్యగతియు, 3, 4 పాదములలో నడుమంత్రపు సిగ్గుచేయు దౌత్య నటన మనోజ్ఞమై విజయవిలాసమును స్ఫురణకు దెచ్చును.

1) "పాదద్వంద్వము నేల నూని, పవనుఁ బాలించి సర్వేంద్రియో
న్మాదం బీఁగియు, గేవలత్వమను నుధ్యానంబులో, నోంక్రియా
నాదాంగార మహార్చిఁ బేర్చుము! మనోనాళీక కుండామృతా
స్వాదానందవిభూతి పక్వమగు విశ్రాంత్యాకృతిస్ఫీతమై."

2) "స్వస్తి జగత్రయీసుపరివస్య విశస్త శివాంఘ్రిపంకజ
న్యస్తమనీష! బుభుక్షకమనాస్య కళాపరివేష! సమ్యగ
భ్యస్త శరప్రయోగ పటిమోరు ధనుర్గుణఘోష! శాత్రవ
గ్రస్త పయోధివేల్లిత ధరావిజిగీష! యశోకరాణ్మణీ!

ఈ పై రెండు పద్యములుకూడ పోతనామాత్యునిపై కవికి గల యత్యంత భక్తి ప్రపత్తులను ప్రదర్శించునవి.

మనుచరిత్రలోని "ఇంతలుం" గాక, అచటి యాఖేటన సంరంభముగూడ, కవికి శ్రీతిపాత్రములై క్రొత్తరూపములు సంతరించుకొన్నవి.

కావ్య కమనీయతాస్ఫూర్తికి మనోజ్ఞాలంకారములు ప్రోదిసేయు పాటలు ఈ యుద్యానమున నట్టి వెన్నియేని గలవు.

"అనయంబోకిలి వేవి
ళ్ళను దినముగ గలత వెట్టె నంతంతకు
గ్రొన్నన దోడిగెడు రెమ్మకువలె
మినుకెక్కెగ మన్నుమెక్క మిడుకు పోలతికిగ."

తొలి చూలు కొంతకు గూర్చు కమనీయ వికాసము! ఈ పోలికలతో సహృదయ హృదయ వికాసము గూర్చునుగదా! అట్లే,

"విపినరమ రాజు డాసిన ద్రప వహించె
పొసగు వలి వెంపుటివము మే ల్ముసుగు దాల్చి

దీని స్వారస్యము చదువరు లాస్వాదింపగలరు. భావుకుడగు నీ కవి,

"అర్థచంద్ర వలయంబను తబుకున
శీతలమరీచి గణోదనముల
నుడుతతికి" దినిపించినాడు.

ఈ యూహ క్రొత్తదేగాక పాశ్చాత్య భావనావైఖరిం దలపించును.

అచ్చపు రాయలసీమ ప్రాంతీయపు నుడికారములు మనోజ్ఞముగ నట నట పాదుకొన్నవి.

"ఏకాయకి, రెండున్నర" మొదలగునవి.

"పండిన జోనాళము జూచు రైతు" ఎడదలోని నిర్భరానందము రాసిబోసి కొలిచిన కవి తన కావ్యములో నీ యుపమను గుదిగ్రుచ్చినాడు.

"తన వీపుం దానె చూడడు
మనుజు డిసీ యెటుల ధర్మమర్మ మెఱుంగుగ."

ఈ పలుకుబడి పల్లెపట్టులలో జీవము బోసికొన్నది. కావ్యమున కిట జీవము బోసినది.

వర్తమానాధికారమార్గ విహరణమును సవాలుజేయు వాడుకవలె,

"స్వీయబంధువులకే............"

అన్న పద్యములో తన యంతరంగములోని క్షోభను ప్రదర్శించుచునే, సుపరిపాలన మేయే లక్షణములతో నుండవలెనో యుపదేశించును.

స్వీయకాలిక, సామాజిక పరిస్థితులకు కావ్య మాదర్శమనుట కిది యొక నిదర్శనమేమో!

కావ్య వస్తువు రెండువేల యేండ్లకు పూర్వముదైనను ముసల్మానుల పరిపాలనాప్రభావము జీర్ణించిన పీఠ్యాలనాడు, చెప్పించినది నేఁడు చెప్పినది, గనుక హిందీ లేక ఉర్దూపదము లాయా సందర్భములలో నౌచిత్యభంజకములుగాక యున్నవి. (పతిత్యలోకమున కీ కావ్య సృజనాకౌశల మితఃపూర్వ మపరిచితము. పండితప్రకాండులుకూడ తల లూపవలయు, శాబ్దికాధికార మీ కావ్యములో నడుగడుగున నెగురగుచున్నది.)

ముమ్మరముగ ప్రాపంచిక జీవన సమర మున్మత్తముగా సాగి విజయ మెటో తెలియరానియదనున శాంతికొరకై యాక్రోశించు మానవపథికుని కది ఉదాత్త గంభీరముగా గోచరించి హృదయప్రసన్నతను గూర్చునట్లే శాంతి సమ్రాట్టశోకుని జీవితము ఆంతరిక తపఃఫలితముగ దివ్యప్రశాంతిని తథాగతుని యమృతవాక్కులలో దర్శించి ధన్యమైనది. కావ్యముగూడ ఆరంభఘట్టములలో నిర్ఘరిణీగమనవైఖరిఁ దలపింపజేయుచు బోయి కావ్యాంతమున ప్రబోధితుని యంతఃకరణమువలె ప్రసన్నగంభీరమగు నాశ్రమవాటికఁ జేరుసరికి నట్టిదియే యగు గతి సంతరించుకొని కావ్యార్థస్ఫోరకముగా నైనది.

ఇవి మచ్చునకు కొన్ని దర్శనీయములుగా గుణములు నాకు దోచినవి. అధికారులగు రసపిపాసుల కీ కొన్ని గుటకలతో దప్పిదీరదు. కావ్యసరి త్తదియే మీ యెదుట నున్నదిగదా! తనివితీర గ్రోలగలరు!

ఓం తత్ సత్.

బుధ విధేయుఁడు,

నెల్లూరు,
హేమలంబి
శ్రావణ శుద్ధవిదియ.

అనుపూరు నాగభూషణరావు, యం. ఏ.,

# శ్రీమదశోక చరిత్ర కథాసంగ్రహము

## ప్రథమ కాండము

లీగ్ ద్విజాతి సిద్ధాంత కారణముగ, భారతదేశము ద్విభాగమగుటను తలంచి, సంక్షుభిత మనస్కుఁడై యుండిన కవి మనఃఫలకమున 'పీష్వా బాజీబాలాజిరా' వను మంత్రీంద్రుఁడు, చిత్రితుండగుటచే, కవి, యాయనయే శ్రోతగ, నొక్క కావ్యమును చెప్పబూనెను.

పానిపట్టు యుద్ధరంగమున మహారాష్ట్రుల సైన్యమంతయు చెదరిపోగా ప్రజలు సంపదలు కోల్పోయి కుందిరి. బాలాజిరాయని హృదయ మాకారణమున కలత జెందెను. ఆ దుఃఖముతో నాతఁడు భారతమాతను గూర్చి తలపోయుచు, తనకు మనస్థైర్యను నిమ్మని యామెను ప్రార్థించుచు, తన పూర్వులను, శివాజీ ముఖ రాణ్మూర్ధన్యులను, ఐక్యభారత స్థాపనకై పడిన పాట్లను తలంచి తపించుచు, బ్రహ్మేంద్ర కరోత్థుఁడగు వేదానందుని మనికికి, నశ్వారూఢుఁడై చనెను. (బ్రహ్మేంద్రుఁడు, బాజీరాయని ప్రసిద్ధ గురువుగా చరిత్ర పేర్కొన్నది.)

ముని నివాసభూమి నాతఁడు చేరబోయిన సమయమున ప్రకృతియే యాతనికి స్వాగతమిచ్చెను. బాలాజి, దేహళీప్రాంతమున, నశ్వావతరణముగావించి, ఆదర్శ గుణ ప్రధానుఁడగు వేదానంద సద్గురుని దర్శించి, నమస్కరించెను. మునీంద్రుఁడును మంత్రితో, క్షేమోక్తి నెఱపి, యాతని ముఖభంగికి నాత్మ యురియ, నాతని ననున యించెను. బాలాజిరాయఁడును "భావో విశ్వాసరావుల పతన చరితను" గురూత్తమునకు వర్ణించి చెప్పుచు, దుఃఖోద్వేగమున, కంటదడిపెట్టెను. వేదానందుఁ డాతని నోదార్చుచు, మతసమున్నత స్థితికిని, భారతీయత సవ్యమై పరగుటకును, కలుగ వలసిన పరిణామముల గూర్చి యుపన్యసించెను.

బాలాజియు, నా మాటలవలన కొంత చిత్తవిశ్రాంతి నొంది, పునహానగరము నకు రా నాతని ప్రార్థించి వీడ్కొని చనెను.

కొంతకాలము తరువాత బాలాజీరాయని యాహ్వానమును పురస్కరించుకొని వేదానంద మునీంద్రుఁడు పునహానగరమునకు పోయి యచ్చట నొక నగాగ్రమున నుండు పార్వతీదేవి యాలయమున బసచేసెను.

మరునాఁ డాతడు తన్ను చూడవచ్చిన బాలాజీతో నిట్లు చెప్పబూనెను.

"భారతమాత పరమపవిత్ర. దివ్యశోభాసమేత. ఈ భూమి నెందరో రాజన్యులేలి చనిరి. కలియుగారంభమునుండియు భారతమును, అయోధ్య, హస్తిన, రాజ్యగృహము, కేంద్రములుగ ఎందరో భూపులేలిరి, మొదటి వారిలోనివాఁడగు,

శుద్ధోదనుని పుత్రుఁడే శాక్యుఁడు. అతఁడెల్లప్రాయముననే సౌందర్యరాశియగు, సతిని ముద్దుల సుతుని, వదలి, యడవులను జొచ్చి శ్రమించి, జనసామాన్యమునకు మోక్షమార్గమును జూపెను. అతఁడు నిస్పృహ, యహింస, సత్యము, నిర్లిప్తత నిండుకొనఁగా మోక్షరాజ్యమును సాధించెను. అందుచేతనే, ప్రజలెల్లరాతని వివేకసారమును భజించిరి.

ఆతనికాలమున మగధకు బింబిసారుఁడును, అజాత శత్రుఁడును రాజులైరి. అజాతశత్రుఁడు పాటలిని నిర్మించెను. ఆ శిశునాగాన్వయము లంతరించిన పిదప మహాపద్మనందుఁడు కొంతకాలము మగధనేలి వానప్రస్థాశ్రమము స్వీకరించెను. అతని తనయులు నవనందు లవినీతులై చాణక్యు నవమానించి, యాతని కోపవహ్నికి, శలభములైరి. నందవంశ నిర్మూలనానంతరము చాణక్యుఁడు మురాసుతుఁడగు చంద్రగుప్తుని మగధరాజ్యాభిషిక్తుని గావించెను. అతని తరువాత నతని కుమారుఁడగు బిందుసారుఁడు మగధాధినాథుఁడయ్యెను. అతఁడు ప్రజాక్షేమమే తన క్షేమముగా నెన్ని, సుపరిపాలన సాగించి కీర్తిశేషుఁడయ్యెను. ఆ బిందుసారుని కుమారుఁ డశోకుడు బుద్ధపాదముల గొల్చి లోకవంద్యుఁడై ప్రజాపాలనం బొనరించెను''

అని యీ విధముగా వేదానందుఁడు చెప్పఁగా విన్న బాలాజియు, 'స్వామీ, అశోకుఁడు సనాతనమగు వేదమును డిగి నూతనమార్గము నేల యవలంబించెను?' అని ప్రశ్నింప, యమీంద్రుఁ డిట్లు చెప్పనారంభించెను.

'బిందుసార నృపాలుఁడు అతులపరాక్రమశాలి. స్వప్రజాచకోర చంద్రముఁడు. అతఁడు చాణక్యుఁ డేర్పఱచిన రాజ్యాంగనీతిని 'తుచ' తప్పక అనుసరించెను. రాజ్యమంతయు నాలుగు రాష్ట్రములుగ విభజితమై యుండెను. ప్రతిభాగమునకు నొక్కొక్క ప్రతినిధి పౌరుల కుత్తరవాదియై పాలించుచుండెను. వివిధ వ్యవహారముల దీర్ప ముప్పది ప్రత్యేక సభలుండెను. అర్హులు అధికారపదములనుండి పాలన సాగించుచుండ పాలక పాలితుల మధ్య సుహృద్భావమేర్పడి యుండెను. లంచగొండితనము లేకుండెను. ధనికు లుదారవర్తనులు. పేదలు సైతము నిత్యసంతుష్టిగనిరి. మగధరాజ్యము రామరాజ్యమునా వాసికెక్కెను. మెలఁకువతో చారచక్షువై రాజుపాలించుచుండెను. మౌర్యసైన్యమున ముప్పదివేల రథములు, అన్నియే యశ్వములు తొమ్మిదివేల గజములు ఆరులక్షల పదాతిసైన్యము అమరియుండెను. రాజు సోమరితనమెట్టిదో యెఱుఁగక నిరంతరము పరిపాలనా వ్యవహారనిమగ్నుఁడై యుండెడివాడు. అతనికి పదునైదుమంది భార్యలు. పట్టపుదేవి వసుగాత్రి. ఆమెను బౌద్ధులు 'సుధర్మ'యని పిలుచుచుండిరి. వారివలన నతనికి తొంబదెనమండుగురు సుతులు గలిగిరి. వారిలో జ్యేష్ఠుఁడు సుషీముఁడు. సుమనసుఁడనియు నాతఁడు పిలువబడుచుండెను. వసుగాత్రి యాతని తల్లి.

ఇట్లుండ బిందుసారుఁడొక నాటిరేయి, కలలో నొక సుందరిని చూచి, యామెను ప్రత్యక్షముగా గన నువ్విళ్ళూరు చుండెను. రాజ్ఞియగు సుధర్మ యావిషయము నొకకంట కనిపెట్టుచునే యుండెను. గదాధరుఁడు రాజునకు మిక్కిలి కూర్చువయస్యుఁడు. వారిరువురు 'తనువు - ప్రాణము' నా, కడు నెయ్యు

మున వర్తించుచుండిరి. ఒకనాఁడు రాజాతనితో తాను, కలలో చూచిన యువతిని గూర్చి ప్రస్తావింప, నతఁడును, రాజును వేటకు పురికొల్పెను.

## ద్వితీయకాండము

ప్రియవయస్యుని ప్రోత్సాహమున, భూపాలుఁ డొకశుక్లాష్టమి ప్రాతస్సమయమున, వేటకై యేతెంచు వీరవ్రజంబులతో గూడి యత్యుత్సాహమున, నరణ్యప్రాంతమునకు బయల్దేరెను. వారాదినమెల్ల కొంతవడి మృగయావిహారమగ్నులై యుండి ప్రొద్దెక్కుతరిని యలసి, కొండసెలయేటిచే నేర్పడిన, యొక కాసారతీరమును చేరిరి. అత్తటినీ సమీపమున వారొక సుందరాంగిని చూచిరి. ఆమె చక్కని రూపసంపద వారి నాకర్షించెను. ఆమె శరచాప హస్తయై యుండెను. శరసంధానకార్య తన్మయయగు నా సుందర తరుణిని భూజానియు చూచెను. వేటకాండ్ర సవ్వడి చెవిసోకగనే యాతన్వంగి యచ్చోటువాసి చనెను. ఆ క్షణముననే ఒక బాణము ఎద నాటియుండగా కడువేగముగ వచ్చుచుండు నొక పెద్దపులిని చూచి రాజు బాణమొక్కటిని సంధించి దాని నేసెను. ఆ దెబ్బతో నది నేలగూలెను. భూరమణుని యనుచరులెల్ల గొబ్బునఁ జుట్టుముట్టి రాజు వేసిన బాణమేగాక మఱొక్కటియు నందుండుటను చూచి, అది యెవ్వరిదో తెలియఁగోరి దానిని బయటికి లాగిరి. దానిపై నుండిన యక్షరములలో మొదటి యక్షరము మాసియుండెను. మిగిలిన యక్షరములను 'భద్ర' యని వారు చదువగలిగిరి. రాజును ఆ బాణమును ప్రయోగించిన యా వీరవనిత జాడలరయ భటులనంపెను. వారేగిన పిదప రాజా బాణమును, చచ్చిపడియున్న పులిని చూచి యాకన్నియ బలిమిని, మదిని తలపోయుచు, నాటికి వేటచాలింపుఁడని భటుల కాజ్ఞయిచ్చి తన పటకుటీరమును చేరెను. అచ్చట ప్రియవయస్యున కాబాణమును దానిపైనున్న యక్కరములను చూపి 'కలలో నేనొక యువతిని చూచితిని. ఆ కలికియే నాకంటబడినది. ఈ కన్య నాకిచ్చిన అది నాభాగ్యమే యగును' అనియెను. గదాధరుఁడును "స్వామి! ఆమెపై మనసు గల్గిన నన్నునుపుము. నేనామెను నీకడకుఁ దెత్తును." అనెను. వనిత, నన్వేషింపబోయియుండిన, భటులింకను తిరిగి రానందున, రాజు చింతనవ్యాకులవ్వి యూరకుండెను.

ఆ మధ్యాహ్నానంతర మచ్చటికి వచ్చి యుండిన యొక భిల్లుని మూలమున రాజభటులాకన్నియ విషయమై కొన్ని విషయముల వినిరి. ఆ మానిని శిశునాగవంశమున బుట్టినదనియు, ఆమె బంధుగులు శత్రువులకు భయపడి వనభూముల ప్రచ్ఛన్నవృత్తి నివసించుచుండిరనియు తెలిసికొనిరి. ఆ విషయములన్నియు రాజు చెవికెక్కెను. అంత రాజు వారట్లు అజ్ఞాతముగ నరణ్యమున నిడుమలబడ పనిలేదనియు యేదేని జనపదమున సుఖముగ కాలము గడపవచ్చుననియు చెప్పి ఆ విషయముల నామెకు చెప్పి వత్తమని భిల్లునికొలకు పంపెను. అప్పటికే యాతడచ్చోటు వాసెనని విని, రాజును సాయంసమయ విహారార్థమరిగెను. ప్రియవయస్యుఁడగు గదాధ

రుఁడు రాజునానతి పొంది విశ్రాంతికై యేగియుండెను. కావున, రాజొక్కరుఁడే వాహ్యాళి వెడలెను. విశ్రాంతికని పోయియుండిన గదాధరుఁడు భిల్లుని పేరు నివాసము మొదలగు కొన్ని విషయముల దెలిసికొని రాజును కలిసికొన బయల్దేరెను.

రాజును, విహారానంతరము తిరిగివచ్చుచో, నొక్కచోట వీనుల విందొనరించు శ్రావ్యగాన మొక్కటి యాతని చెవుల బడెను. ఆ పాట వినుచు రాజు వచ్చుచుండగా గదాధరుఁ డాతని కలసికొనెను. రాజాతనితో "మిత్రమా" నీవును ఈమధురగీతమును వింటివిగదా ! నా స్వప్నవృత్తాంతమును, నా మనసులోని వలపు సంగతియు నీకెరుకయే. బుద్ధిమంతుఁడవు కావున మిగిలిన పనుల నేరీతినేని నెరవేర్ప నీవ సమర్థుఁడ" వనెను. నావుడు గదాధరుఁడిట్లనియె. "స్వామీ ! ఇంక సందేహము వలదు. ఆమెయే నిన్ను చూచి ఈ గీతాలాపనముచేసి యుండనోపు. నేను పోయి యామె విషయమును తెలిసికొని వత్తును. భిల్లుడామె భృత్యుఁడు. అతని సాయమున నేనామెను నీకు కూర్తు"ననెను. రాజును యారేయిగడపి మరుదినమె తన నగరికి పోయెను. సతీవిషయమైన వార్తలను నిరీక్షించుచు రాజు కొన్ని నెలలు కడపెను.

రాజును వీడ్కొన్న గదాధరుఁడు భిల్లుని చూడబోయెను. అతఁడు భిల్లపల్లి యనుచేరి భిల్లుని గూర్చి ఎవరిని విచారించినను అతని జాడలు తెలియలేదు. అయినను గదాధరుఁడు, హతాశుఁడుగాక కొంత వైద్యము తెలిసినవాఁడు కావున, ప్రతి భిల్ల గృహముకడకును వైద్యనెపమున బోయి, వారితో స్నేహముచేసికొని వారిలో కొందరు తనకు తోడై త్రోవచూపగా, కొంతకాల మాప్రదేశము నంతయు గాలించి చూచెను. కాని యాతనికి భిల్లుఁడు కాని, తాను కనబోయిన కన్నియగాని కానరారైరి. నిరుత్సాహము తన్నలము కొనగా నాబాపఁడు దాపుననున్న పార్వతీదేవి యాలయమునకు బోయి దేవిని దర్శించి రాదలంచెను. పూజారి యింటికి పోయి దేవి సన్నిధి వాకిలి తెరువుమని కోరెను. ఆ పూజారి లేడు. అతని తల్లి యంతకు ముందు తన కోడలి కేదోమందిచ్చి యుండిన గదాధరుని గాంచినంతనే యాదరముతో నాహ్వానించి ఆలయపు తాళపు చెవినిచ్చెను. గదాధరుఁ డామెనుగూర్చి 'ఈపల్లెలో సుషేణుండను భిల్లు డెవఁడేనికలఁడా ?' యని ప్రశ్నించెను. అందులకా వృద్ధ 'అయ్యా, సుషేణుడు నా కుమారుఁడే. ఈ పల్లెలో నెవరికిని యీ పేరు తెలియదు. అంబ పూజారిగా మాత్రమే యాతని నిచ్చటివారెఱుంగుదురు. అతఁడిప్పుడు చంపానగరవాసియగు శంపుఁడను బ్రాహ్మణు నొద్దకు ఒక రాచకన్నియను విడిచివచ్చుటకేగి యున్నాడు రేపోమాపో రానున్నాడు" అనెను. విప్రుఁడును ఈ మాటలకు కడు సంతసించి గుడిలోనికేగి దేవిని దర్శించివచ్చెను. ఇంతలో గృహపతిరాగా గదాధరుఁడు సంతసించి యాతని ప్రయాణవృత్తాంతమును గూర్చి యడిగెను. అప్పుడా యంబపూజారి ఇట్లు చెప్పదొడంగెను.

'ప్రాజ్మగధమున చంపయను పట్టణము కలదు. అందు శంపుఁడను బ్రాహ్మణుఁడు గలఁడు. అతని కొక్క పెంపుడు కూతురుగలదు. ఆమె పేరు సుభద్ర. ఆమె శిశునాగకుల్యాభిదితయగు కన్నియ. ఆమె తల్లి తల్లి తప్ప సమస్త బంధువులును కాల

గతిని జెందిరి. కావున నాబాలికను, ఆమె మాతామహిని, శంపుఁడే ఆశ్రయ మొసంగి కాపాడుచుండెను. ఆమెకు విలువిద్య నేర్పుమని శంపుఁడా సుభద్రను నాకడ కనిపియుండెను. నేనిప్పుడా బాలికను ఆమె పెంపుడు తండ్రికడ దిగబెట్టి వచ్చితిని. ఇక నాతో నేమి పనియున్నదో సెలవిచ్చిన మీయాజ్ఞ శిరసావహింప సిద్ధుఁడ' ననెను. గదాధరుఁడా విషయముల నెఱుంగుట కెంతయు సంతసించెను. తరువాత జరుగవలసిన కార్యముల గూర్చి యాతఁడా భిల్లునితో కొంతచర్చించెను. తదుపరి యాతని వీడ్కొని చంపాపురికి పయనమై పోయెను.

అచ్చట గదాధరుఁడు తనకుగల జ్యోతిషవిద్యా ప్రభావంబునంజేసి బ్రాహ్మణ బృందముతో స్నేహ మొనర్చుకొని శంపుని వృత్తాంతమరసి, యాతనితో స్నేహ మొనర్చెను. అతఁడప్పుడప్పుడు శంపుని యింటికేగి సుభద్రాంగి చక్కదనమును సౌశీల్యమును గమనించి యామె రాజపత్ని కాదగునని నిశ్చయించెను. ఒకనాఁడా తడు శంపుని నడిగి యామె జాతకమును పరీక్షించి భావిఫలముల గూర్చి యాతనితో నిట్లనెను. "అయ్యా ఈమె రాజపత్ని కాగలదు. ఆమె కాతనివలన చక్రవర్తి కాగల కుమారుడు జనింపగలఁడు." ఆ మాటలకు శంపుఁడెంతయో ముద మొందెను. ఆవిషయము నాతడు సుభద్రాంగిని పెంచిన ధాత్రి, యశోకతో వివరముగా పలికి ఆమెకు గదాధరుని పరిచయము గావించెను. ఆమెయు నాతని సత్కరించి యతనితో చర్చించెను. తదనంతరము గదాధరుఁడు వారిని వీడ్కొని భిల్లుఁడున్న పల్లెకుపోయి యాతనితో మాటలాడి వర్షఋతు వేగునప్పటికి అశోకయు శంపుఁడును పాటలికి వత్తురు గావున వారికి వలయు సౌకర్యముల గూర్చుటకై భిల్లునితో గూడా పాటలిని జేరెను.

శిశిరనిదాఘములు చెల్లెను. శ్రావణమాసము సైతము కడచనెను. శంపుఁడు తన కూతునకు రాజసంబంధము గూర్చుటెట్లో యని యాలోచింప దొడగెను. అతడు తన భార్యతోను ధాత్రియను నశోకతోను, ఆ విషయముల పదింబదిగా చర్చచేసెను. అప్పుడశోక శంపునితో నిట్లనెను. "గదాధరుఁడు మనకు మిత్రుఁడు. అతఁడు పాటలీ నగరమున మనకు సాయపడగలఁడు. నేను పాటలికి బోయి రాజాంతఃపుర మున దాదినగుదును. నీవును నీ భార్యయు సుభద్రాంగితో గూడా పాటలికి వచ్చి విప్రులవాడలో నివాస మేర్పరచుకొని యుండుఁడు. సమయము చూచి పుత్రిని రాజునకు గూర్ప యత్నములు కావింతము' ఈ మాటలకు శంప దంపతులలరిరి. ఆ ప్రకారమే వారు తమ దుహితతో గూడా, కతిపయదినముల పాటలిని చేరిరి. భిల్లుఁడు వారికి తగు సదుపాయముల నేర్పఱచెను. అశోక రాజు కొలువున దాదిగా కుదిరెను. రాణియగు సుధర్మ, గదాధరుఁడేదో యుక్తి పన్ని, రాజునకు వేరొక కన్నియను కట్టిబెట్ట యత్నించుచున్నాఁడను విషయమెఱింగి యాతని నంతఃపుర కారాగార బద్ధుని గావించెను. ఈ విషయము నశోక ఎట్లో తెలిసికొనెను. రాజున కావార్త తెలుపుటకు ముందే రహస్య హర్మ్యమున నా గదాధరు నెచ్చట నిర్బంధి యుంచిరో యా ప్రదేశము నామె తెలిసికొనెను.

అట శంపుఁడును తనకుగల వేదశాస్త్రపరిచయమునచేసి, యచ్చటి బ్రాహ్మణులలో చక్కని పలుకుబడి సంపాదించెను. ఎన్ని దినములైనను, గదాధరుని జాడలే కానరానందుకు చింతించి తుదకాతని వృత్తాంతమును అశోక ద్వారా తెలిసికొని, యాతనికై, యిక తడయుట కార్యముకాదని నిశ్చయించి, తానే కూతురును రాజాంతఃపురమును చేర్ప యత్నములు సలుపసాగెను. అతఁడు ద్వారపాలురతోడను నృపబంధువులతోడను స్నేహము నెఱపి కూతును రాజసౌధమునకు గొనిపోవ సమ్మతుల వడసెను. ఆశ్వయుజమాసమున నొక్కనాఁడాతఁడు తన తనయతో గూడా రాజదర్శనమునకు పోయెను. రాజాజ్ఞపొంది శంపుఁడు యౌవనోజ్వలిత యగు సుభద్రాంగితో గూడా రాజు నెదుటికి బోయి యామె నాతని కుపాయనముగ నర్పించుచు 'భూనాథా! నీవీమెను దేవిగ గ్రహింపుము. ఈమె సామ్రాట్టు జనని కాగలదు. దీన నీకు శుభము లొదవును'' అని నుడివి వేదోక్తముగా నాతని నాశీర్వదించెను. అతఁడు ఛాందసుఁడగుట రాజు వని గన్న యువతియే యామె యని పలుకజాలఁడయ్యెను. రాజును ఆమెనొకసారి, అరగొఱగా జూచి యామెను అంతిపురిని విడిచిపొమ్మని, శంపున కానతిచ్చెను. ఆ మాటల కెంతయు హృష్టుఁడై శంపుడు మరుసటిదినమున నామెను తోడ్తెచ్చి విడుతునని చెప్పి రాజును వీడ్కొని యిల్లు చేరెను. రెండవనాడే, విప్రుఁడు సుభద్రను, రాణివాసమున విడిచివచ్చెను. అచ్చటి రాజాంగన లామెను సైరంధ్రిగా నొనరించిరి. సుభద్రాంగియు నచ్చటివారితో కలసిమెలసి వారికి తలలో నాలుకయై వర్తింపసాగెను.

పదినెలలైనను తాను వనిగన్న కన్నియజాడలు తెలియరాకుండుటచేతను, ఆమె నన్వేషింపబోయి యుండిన శంపుఁడు గూడ తిరిగి రాకుండుటకు కారణము తెలియకుండుటచేతను రాజు ఆందోళన పడసాగెను. శంపుడు తన తనయ, నట వదలి పోవుచు, ఆమె సామ్రాట్టు జననికాగలదని చెప్పిపోయెను. కాని ఆమెయె తాను వనమున చూచిన కన్నియ యనుట యాతడెఱుగఁడు. ఈ కన్నియను పూర్తిగా తాను చూడలేదు. కావున నామెను చూడ కాంక్షించుచుండెను. కాని యంతఃపురాంగన లామె రాజు కంటపడకుండునట్లు యత్నించిరి. సుభద్రాంగియు రాజాంతఃపురమున నూడిగములు సేయుచు సిగ్గుపెంపున రాజునెదుటికిమాత్రము పోకుండా తప్పుకొని తిరుగుచుండెను. రాజాదరణమునకు తాను నోచుకొనలేదేయని యప్పుడప్పుడు దుఃఖపడుచుండెను. ఆ విషయము నెఱిగిన యశోక ఏకాంతమున సుభద్ర నోదార్చుచు, ఎట్లైన నామెయెడ రాజు ప్రసన్నుఁడగునట్లు కావింతుననియు చెప్పెను.

ఇట్లుండ నొక్కనాఁడా రాజు మేడమీదినుండి సుభద్రాంగిని చూచెను. ఆ సమయమున రాజునకు అవంతి పౌరులుపాయనముగా నిచ్చియుండినవారువ మామెను వెన్నంటిరాగా ఆమె దానినొక్క చఱపు చఱచి పరువిడజేసి తులసిచెట్టుకడకు పోయెను. ఆ చర్యను చూచిన రాజు ఆశ్చర్యముతో "ఔరా! బ్రాహ్మణస్త్రీకి క్షాత్రగుణమెట్లబ్బెనో?" యని తలపోయసాగెను. తులసిపూజ కావించుచుండిన సుభద్రాంగి సోయగమాతని హృదయమును హరించెను. కాని విప్రాంగనల చూడ రాదని మోహము కల్గియు తన భావమునణచుకొని యుండెను. తాను వనమున

చూచిన కన్య ఛాయలీమెయందును కన్పడుచున్నను ఆమెయు ఈమెయు ఒక్కరే యగుదురో కాదో యని యాతని మనమున సందేహామలముకొని యుండెను.

ఒకప్పుడు రాజు 'భద్రా' యను పేరున్న బాణమును అశోకకు చూపి "ఈ యమ్మును చూచితివా?' యని ప్రశ్నించెను. అందుల కశోకయు 'ఔరా! ఇది రాజపుత్రికది. ఇది రాజుచేతికి ఎట్లు వచ్చెను? యని ఆశ్చర్యచకితకాగా రాజామెను "రాజపుత్రిక ఎవరు? ఆమె వృత్తాంతమేమి?" యని యడిగెను. అందులకు అశోక "ప్రభూ సుభద్రాంగి వీరవనిత. చారుశీల, నాబంధువు నామాట జవదాటదు. ఈ శరమామెదే! అని పల్కి భూపుని ప్రసన్నుని కావించుకొనెను. అప్పటినుండి అశోక సుభద్రను రాజుచెంత చేర్చుటకు తగిన సమయమునకై వేచి యుండెను.

ఇట్లుండ నొక్క మధ్యాహ్నమున రాజు కొలారమున నొక్కఁడే పరుండి యుండ నదియ, యదనని తలంచి యశోక సుభద్రను రాజును సేవింప పంపెను. ఆమెయు రాజు పాదము లొత్తుచుండెను. రాజు ప్రక్కకు తిరిగి పరుండగా ఆమె వీవనతో విసరదొడగెను. ఆ సమయమున హఠాత్తుగా నెచ్చటినుండియో యొక భుజంగము రాజు పరున్న మంచముకడకు వేగముగా వచ్చుచుండుటను గమనించుచుండిన, సుభద్ర రాజు ప్రక్కనుండిన కత్తితో, దానిని చంపెను. ఆ సమయమునకు సరిగా రాజునకు మెలకువ వచ్చి చచ్చిన పామును జూచి, యామెను 'కోమలీ! ఇటురమ్మని' చేయివీచెను. ఆమె సిగ్గుపెంపున తలవాల్చి యాతని పాదములపై వ్రాలగా రాజామెను ఆదరముతో లేవనెత్తి ఏమివలయునో కోరుమనెను. ఆమె నోట మాటరాలేదు. రాజామెను నిదానించి పరికింపగా స్మృతిదట్టి పూర్వగాథ యంతయు మనసునకు వచ్చెను. "నృపబాలిక బ్రాహ్మణునింట చేరెనేమో" యనుకొనెను. ఆ సమయమున దాపుననుండిన యశోక 'ప్రభూ! ఈమెను శంపుఁడు పెంచినాడంతియే. ఈమె రాజకన్యయే. 'భద్ర' ముద్రగల శరమీమెదే యనెను. రాజాసమయమున గదాధరుఁడామెకొఱకుపోయి యుండిన వాఁడేమయ్యెనో యన నామె యాతఁడెట్లు అంతఃపురమునందలి రహస్యమందిరమున బద్ధుడై యుండెనో తెలిపెను. రాజు సందేహము తీరిపోయెను. అతఁడప్పుడు సుభ్రదాంగి ననునయింప ఆమె తనచేతనుండిన వజ్రాంగుళీయమును తాను రాజకన్యయే యని నిరూపించుటకు రాజునకు చూపెను. వారలొండొరులతో ప్రేమసంభాషణముల ప్రొద్దుపుచ్చుచుండ నంతలో నొక చారుఁడువచ్చి రాజుతో యుద్ధప్రసక్తి చెప్పగా సుభద్రాంగితో సంభాషణను ముగించి గదాధరుని చెఱనుండి విడిపించి యాతనితో కూడా కొలువునకుపోయి యుద్ధమునకు పయనమయ్యెను. అచ్చట నాతఁడు అరివీరుల చెండాడి విజయుఁడై పాటలినిచేరిన సమయమున పౌరులాతనికి ఘనస్వాగత మొసంగిరి. అంతఃపురమును ప్రవేశించు సమయమున పరిచారికాగణమాతని సత్కరింప బూనిరి. ఆ సమయమున సుభద్రయు ప్రభువునకు మంగళారతులనిడ వారితో బోయెను. వారందఱిలోను సుభద్ర సుందరీ సవ్యకరమును బట్టి ముందరుగసాగెను.

ఆ సమయమున వారలకు 'శుభమగుగాక' యని గదాధరుఁడు పలికెను. వధూ సహాయుఁడై విజయలక్ష్మీ సమేతుఁడైన యా మహారాజు మేడనెక్కెను.

అంతఃపురాంగనలా దృశ్యమును చూచి యీసుగొనిరి. కాని సుధర్మేతరలు మాత్రము పుత్రార్థియై ఱేడు పూర్వము తమ్ము పెండ్లాడినట్లే సుభద్రను సైతము స్వీకరించెనని తలంచి రాజుదారుఁడగుటచే యూరడిల్లిరి. రాజును సుభద్రాంగియు నిష్టసుఖములదేలుచు కాలము వెళ్లబుచ్చుచుండిరి.

అశోకయు తుష్టమానసయై శంపున కావార్త నెమ్మదిగా చేరవేసెను.

# తృతీయకాండము

సుభద్రాంగియు, నృపాలుని సంతోషసాగరమున తేల్చి సవతిముద్దియలును, ముదమందునట్లు వర్తించుచు, కాలము గడుపుచుండెను. కొన్నిదినముల కామె గర్భవతియయ్యెను. ఒక శుభముహూర్తమున నామెకొక కుమారుఁడుదయించెను. ప్రజలందరు సంతోషించిరి. దైవజ్ఞులు సుగుణకీర్తులలో బాలుఁడఖండుఁడగునని వచించిరి. బాలునకు 'అశోకు' డని పేరుపెట్టిరి.

ఇట్లుండ రాజు సుభద్రాంగిని వివాహమాడెనో లేదో యను ఱట్టొకటి వినవయ్యెను. మంత్రులా యపవాదువిని సుభద్రాంగీ వివాహతంత్రమును నడపునట్లు రాజునకు సలహాయిచ్చిరి. రాజును అట్లే కావించెను. సుభద్రారాజ్ఞికి అశోకుఁడను పుత్రుడుదయించినాడని రాజ్యమందంతట చాటింపబడెను. ప్రజలు పండుగలు చేసికొనిరి.

అశోకుడు దినదిన ప్రవర్థమానుఁడగుచుండెను. రాజుమాత్రము బాలుఁడు కృష్ణాంగుఁడు కురూపియని యాతని యందంతగా ఆసక్తి చూపడయ్యెను. దానికై బాలుని తల్లియు నవ్వయు మనమున చింతించుచుండిరి. బాలుని పోషణయందు వారు కడుజాగరూకులై యుండిరి. సవతులలో సుధర్మ మాత్రము బాలునం దీసుగొని యుండెను. ఆమె తన కుమారుఁడగు సుషీముని సామ్రాట్పదమున నుంప నెంచుచుండెను. కావున యశోకుని జననమామె యుద్దేశ్యమునకు భంగకరమని యామెతల పోయసాగెను. ఎటులైనను తన కుమారునే రాజ్యాధికార పదమున నుంప నామె తహతహపడజొచ్చెను. సుభద్రాభ్యుదయ మామెకు కంటకముగా నుండెను. గదాధరుని బంధించియు సుభద్రాంగిని రాజు గ్రహింపకుండునట్లు చేయలేకపోయెను. తన చాకచక్యముతో నెట్లేని తన కుమారుని యావన రాజ్యాభిషిక్తుని గావింప నామె యత్నింప జొచ్చెను.

ఒకనాడు రాజు తన యింటికి రాగా, వసుగాత్రి యాతని కర్హమగురీతిని సత్కారములు, సపర్యలు, సలిపి సుఖాసనుని గావించి నెయ్యముమీర నిట్లనెను. "సుభద్రాంగి బ్రాహ్మణియే కాని క్షత్రియాంగన కాదు. అట్టిచో గృహమంత్రి

ఖిల్లాతకుఁడు లేనిపోని మాటలు చెప్పగా విని ఆమె కుమారుని యువరాజుగా చేయ యత్నించుట భావ్యమగునా? అశోకుఁడు కుకర్మజుఁడు నికృష్టుఁడు' అని వారి నాడి పోసెను. వసుగాత్రి చెవి నిల్లుగట్టుకొని యిట్టి దుర్బోధనలు చేయ రాజు మనసు చెదరెను. బాలునియం దుపేక్షభావము ప్రబల జొచ్చెను.

ఐనను రాజు దుడుకు చేయక శాంతముగ నాలోచింపసాగెను. శంపుని పిలి పించి కలరూపు తెలుపుమన్న యదార్థము తెలియగలదని తలంచి యాతని పిలిపించెను.

శంపాచార్యుడును రాజాజ్ఞ తలదాల్చి రాగా గౌరవించి 'సుభద్రాంగి ఉత్తమాభిజాత్యమును నిరూపింపజాలు సాక్ష్యమున్నదా?' యని ప్రశ్నించెను. శంపుఁడును వెంటనే సుభద్రాంగి తండ్రి యుంచిన సొన్నపుహారమును పచ్చలపతక మును శిశునాగకులాభరణుని రాజముద్రయు చూపెను. తరువాత నామె తన పోషణమున కెట్లు వచ్చెనో తెలిపి యాతని మనము రంజింపజేసెను. ఆ సొమ్ముల బాలుని కిడదగునని యాతడు చెప్పు చుండగా సరిగ నా సమయమునకు కుమారుని చంకనిడికొని సుభద్రాంగియు నచ్చటి కరుదెంచెను. వారి యభిమతానుసారము బాలుని మూర్ధమున రత్నపు కిరీటము నమర్చెను. రాజును శంపుడును మిక్కిలి హర్షించిరి. శంపుడు 'జయజయాశోక జయ బిందుసార' యని యాశీర్వదించెను. 'నీ తనూజుఁడు అఖండుఁడై విశ్వమునకే ప్రియుఁడగు' ననియు, వచించెను. నరేం ద్రుఁడును, నగుమోముతో 'విద్వద్ధనులగు తామే బాలుని సుకలా. కౌశలునిగ దిద్ది దీర్చదగువార'ని వచించెను. శంపుడును 'వల్లె' యని ధరణిపుని వీడ్కొనెను.

అశోకుమారునకు, తగిన విద్యను, గీతను చెప్పి, తరువాత శంపాచార్యుఁడు భార్యతోఁగూడ స్వస్థలమగు చంపాపురికి పయనమై పోయెను.

ఇట్లుండ కొంతకాలంబునకు బిందుసార సార్వభౌముఁడు, తరుణిమ డిల్లగా తన సుతులలో వివేకవంతుఁడు, శౌర్యధనుఁడు రాజపదవీపాత్రుఁడు ఎవ్వఁడో యని తలపోయసాగెను. అప్పటికి సుషీమున కిరువదియేడులు. అశోకునకు పదునారేండ్లు. ఇరువురును బహుబలాఢ్యులే. విద్యావంతులే. ఒకఁడు సురూపి ఒకడు కురూపి. కాని ప్రజల యభిమాన మెవ్వనియందున్నదో యరయఁగోరి రాజు మారువేషమున పురిలోనికి పోయెను. కొందరు అశోకుని, మఱికొందరు సుషీముని అభిమానించుచుండిరి. రాజేదియు నిర్ణయింప నేరక యుండెను. పుత్రుల వివిధ కళలయందును పరీక్షచేయ నిశ్చయించెను. ఆ విధమగు పరీక్షకొరక దినమేర్పఱచి రాజకుమారుల నెల్లర రావలసినదని, యాజ్ఞలంపెను.

క్రీడారంగమును సిద్ధపఱుప ముఖ్యమంత్రి రాధాగుప్తుఁడు నియోజితుఁ డయ్యెను. ఆ కాలమున నిష్పక్షపాతియని పేరుగాంచిన బౌద్ధబిక్షువు పింగళ వత్స జీవుఁడు మధ్యస్థుఁడుగ నియమితుఁడయ్యెను.

పింగళవత్సజీవుడు రాజసౌధమునకు రాగానే సుధర్మ యామహామహునకు, అతిథిపూజాదికములచేసి, తృప్తుని కావించెను. అతఁడు సుషీముని కొడుకు సామ్రా

ద్ధురువగునని చెప్పెను. సుధర్మ, తనకొడుకే రాజుకానిచో తన ప్రయత్నము వ్యర్థమగు నని వాపోయెను. వత్సజీవుఁడును ఆమెను ఊరడించెను.

కుమారవిద్యా పరీక్షకు ఎల్ల రాకుమారులకును ఆహ్వానములు పోయెను. అశోకునకు మాత్రము ఆహ్వానమందలేదు. ఖిల్లాతక మంత్రి యీ విషయమును రాధా గుప్తునితో నెచ్చరింపగా నాతడు 'రాట్సూనుడగు అశోకుఁడు తానై పరీక్షశాలకు వచ్చిన తప్పేమియు లేద'ని వాక్రుచ్చెను. అంత ఖిల్లాతకుఁడు అశోకున కావార్త నందజేసెను. అశోకుండును ఖిల్లాతకుని సందేశానుసారము బయల్దేరివచ్చి పాటలీ పుత్ర నగరప్రాంతమున పాడువడియున్న 'రాజగృహ' పురమునందలి యొక సౌధ మున విశ్రమించి యుండి, పరీక్ష జరుగుదినమున నొక్క వృద్ధదంతి నెక్కి క్రీడా రంగమును చేరెను.

## చతుర్థ కాండము

మరునాడు సూర్యోదయమయ్యెను. రాట్సుతులు జయాభిలాషులై యొక్క రొక్కరే వినీతవేషులై, క్రీడారంగమును చేరవచ్చిరి. మగధ సామ్రాట్టు సైతము క్రీడారంగము చేరి తనకై ప్రత్యేకముగ నుండిన వేదిక నలంకరించెను. రాజపుత్రులు విద్యాపాటవ దర్శనోత్సుకులై రాగా యచ్చట చేరిన ప్రేక్షకుల కలకలముతో నాప్రదేశ మంతయు మిగుల దర్శనీయమై యుండెను. సచివులు కార్యక్రమ పట్టికను రాజున కందించిరి. వెంటనే జనుల కోలాహల మణగుటకై గంటలు మ్రోయింపబడెను. ఆ సమయమున పరీక్షాధికారియగు పింగళవత్సజీవుఁడు తనకై యమర్పబడి యుండిన కాంచనవేదిక నెక్కి కూర్చుండెను. విద్యా ప్రదర్శన మారంభముకాగా ప్రేక్షక లోకమునుండి చప్పటలు విరివిగా విననయ్యెను.

ఆ సమయమున అశోకుఁడును తానెక్కివచ్చిన ద్విరదమును డిగ్గి క్రీడా రంగమును ప్రవేశించెను. రాజకుమారులు బాహాబాహి, కచాకచి, యొండొరుల నెదుర్చుచుండ నొక్కదిక్కున అశోకుఁడును, మరియొక దిక్కున సుషీముఁడును సకల క్రీడల విజయము గాంచిరి. ఎవ్వరెవ్వరెంతవరకు నెగ్గిరో పౌరసభలే నిర్ణయించు నని రాజుపలికెను. అంతట పింగళవత్సజీవుఁడును అప్పటి కార్యక్రమము ముగిసెనని ప్రకటించెను. అంతటితో ఆటలు నిలుపబడెను. క్రీడోత్సవ విశేషముల గూర్చియు ఫలితము లెట్లు నిర్ణయింపబడునోయనియు చర్చలు సేయుచు ప్రేక్షకులు ఎచ్చటివా రచ్చట తమ తమ యిండ్లకేగసాగిరి.

ఆహూతులగు వారు తమకై ప్రత్యేకముగ నేర్పరుపబడి యుండిన గుడార ముల చేరుకొనిరి. అశోకునకు మాత్రమచ్చట ప్రత్యేక శిబిరములేదు. కావున నాతడు రాజు శిబిరముచెంత నుండిన యొక పెద్ద మఱ్ఱిచెట్టు దగ్గరకుపోయి యచ్చట పూజలు సల్పుచుండిన యొక సాధుపుంగవునికి మ్రొక్కి చెంగట నిలిచెను. ఆ పరి వ్రాట్టును, తన పూజముగియవచ్చి యుండుటచే, దానిని ముగించి, యశోకునకు తీర్థ భోజనాదికములను ప్రసాదించెను. అశోకుఁడును భక్తి శ్రద్ధలతో వానిని స్వీకరించి

నేదదేరెను. తరువాత నాతఁడు ప్రక్కనున్న యొక నీటిపట్టుగట్టున దర్భాసనమున పరుండెను. కొంతసేపటికి మేలుకొని, కొలనున స్నానమాడి దగ్గరనుండు దృశ్యముల జూచు తలంపునలేచెను. దాపున నుండు పటకుటీరముననే విశ్రమించి యుండిన ప్రభువు అశోకుని చర్యలనెల్ల నొకకంట కనిపెట్టుచునే యుండెను.

అంతలో చెట్టుపైనుండి పక్షి యొక్కటి వేసడముద్రోయగా క్రిందపడెను. అశోకుఁడా వేసడమును పాఱద్రోలి పక్షిని కాపాడెను. తన ఏనుగునకు నీరు ద్రావించి లేత యనంటియంటుల దాని తొండమున కందింపసాగెను. ఇంతలో సంజెయయ్యెను. వ్యాయామాచార్యుఁడైన పింగళవత్సజీవుని నిర్ణయమును తెలిసికొన నెల్లరును ఎదురు చూడసాగిరి. ఆ సమయమున పింగళవత్సజీవుఁడు సత్యార్థము నిట్లు వచించెను.

'సామ్రాట్టుకాదగువాని కైదు లక్షణములుండదగునని ఆర్యులు నిర్ణయించిరి. మొదటిది హర్యక్షమో భద్రకరియో వాహనము. రెండవది వ్యాఘ్రాజినమో కుశాస్తరణమో ఆసనము. మూడవది మృగ, గోమహిష పక్ష్యాదుల బ్రోచునట్టి కారుణ్యబుద్ధి. నాల్గవది చతురంగబలముల తాకి నిల్వరుచు సాహసము. ఐదవది క్షాత్ర తేజము. ఈ యైదులక్షణములను ఎవనియందు నేడు కననయ్యెనో యాతఁడే ఉత్తముఁడు. చాపాద్యాయుధవిద్యల నెవ్వఁడు సమర్థుడో నిర్ణయింప ప్రభు వొక్కఁడే సమర్థుఁడు, అర్హుఁడు' అని వచించి రాజానుమతిగొని యాతడు సభవీడి చనెను.

పౌరులలో కొందరు 'ముని ఏ నిర్ణయమును చేయక ధర్మస్వరూపమును వివరించెను. ఇందెవ్వడు రాజు మదికెక్కునో తెలియదు. అశోకుఁడు నవభాషాకోవిదుఁడు. సర్వాయుధవేది. అతడందరికంటె మిన్నగా నేడు విజయుఁడయ్యెనుగదా!' యనుకొన, మఱికొందరు సుషీము నగ్గించి పలుక, పలువిధముల భాషించుకొనుచు, జనులు తమతమ నివాసములకేగ మొదలిడిరి.

రాజుకూడ ఇదమిద్ధమని నిర్ణయింపనేరక, మనమున నిట్లు చింతించెను. 'రూపము, ఔదార్యము, సుజనుల ప్రాపు, గాంభీర్యము, ఇన్ని యుండియు సుషీమునకు ఓపిక, దయ, సమయజ్ఞత, కొఱగా కన్పట్టినవి. కురూపియైనను అశోకుఁడే పట్టయోగ్యుఁడని తోచుచున్నది.' ఇంపగు రూపములేనివాఁడగుట అశోకుఁడు తండ్రి ప్రేమకు దూరుఁడయ్యెను. ఐనను తండ్రికి ప్రియమగు కార్యముల చేయుచు, అశోకుఁడు తన యభ్యుదయమును గూర్చి తలపోయుచుండెను.

ఇంతలో తక్షశిలాధినాయకులు ప్రభువునకు పన్ను చెల్లింపక తొందరపెట్టు చున్నారన్న వార్త రాజునకు తెలియవచ్చెను. అప్పుడాతఁడు 'తక్షశిలకుపోయి యుద్ధమాడక ప్రతిభాసహాయుఁడై యచ్చటి యరాజకమును చక్కబెట్టగల సమర్థు డెవ్వడా! యని యానతిచ్చునెడ సుషీముఁడు తానాపని జేయజాలుదునని చెప్పెను. ప్రభువు వెంటనే అతని తక్షశిలకు బంపనిర్ణయించెను.

## ద్వితీయధార - అంకితము

ఎగఁదీయఁ గోఁతలై దిగజారు మిణ్ణాగు
ముగుదల లాలించు మొగలిపూలు
భసలంబుల కగమ్యపరిణతిఁ బొదలెడు
శృంగారనిధులు సంపంగిపూలు
ప్రణయ బంధుర సువాసనల గుబాళించి
తనుపు సుగంధరాజనపుఁ బూలు
పందిరినిండ సొంపారి చుక్కల సొరు
చాటు మల్లెలు, విరజాజిపూలు

నీ పవిత్ర పదాగ్ర సన్నిధిని గ్రాలె
నిదె మదీయ జీవిత సుమం; బీవె నుడువ
రచితమైనట్టి మత్కృతి ప్రసవ మిదియు;
యంకిత మొనర్పనిమ్ము శ్రీవేంకటేశ !
రాజరాజేశ ! ఉభయతారక ! రమేశ ! 16

మా తుమ్మకొమ్మల మా రేఁగుకంపల
మా తాలచేల సంసారఁపొళవు
మా కుందువరదలో మా కుంజరార్భటి
మా పెన్నధాటిలోఁ జేఁపు చలువ
మా తరీకయ్యల మా నల్లరేనాట
మా చౌడునేలలో నేఁచు కలిమి
మా గండశిలలపై మా గండు గుండెల
కాఁపులలోని విక్రమపు బలిమి

మా తనకలాట, కపిలెల మాటుమ్రోఁగు
గీతములలోని వేదాంత మూఁత నీకు !
ఎసఁగె దెప్పుడు నీవు మా కేడుగడగ !
నుంక మంకితం బిదియె ! శ్రీ వేంకటేశ ! 17

## తృతీయధార - కావ్యావతారిక

స్వీయ బలమెల్ల పానిపట్సీమఁ జెదరఁ,
బ్రజలు సంపదఁ గోల్పోయి వనటఁ గుంద
బాజి బాలాజి, కడు దుఃఖపడుచు, భరత
మాతఁ గూరిచి పలికె నీరీతి మదిని. 18

"శ్రీదా? భారత మాతరో! కటకటా! శీర్ణప్రతాపంబు ని
ర్వేదా_క్తంబయి పోయె, నీ ప్రజ మహావీరుల్ స్వరాజ్యక్రియా
వాదోపేతులు చాటుమాటరిగి రీ స్వాతంత్ర్యహీన ప్రజా
ఖేదం బార్తువా లేదా? నీ వెపుడు మూకీభావముఙ్ వీడెదో? 19

క్రోధ లోభ మదాది సంక్షోభ మించు
కంతయును లేని సుమనస్సు, శాంత చిత్త
మనిశము నఖండ భక్తి కళానుభూతి,
నవితథ సుకర్మయుఁ నొసంగు మమ్మ! దేవి! 20

ఆకల్లాడక నిల్చె బుద్ధి కుజ మాశాంతంబు నిశ్శబ్దమై
లోకంబెల్ల సుషుప్తిఁ గన్నయటు గోల్పోయెఙ్ గ్రియాస్పంద మే
ఘోకం బోయిన నంత్యకాల జలదంబుల్ గ్రమ్మె నీవేళ ని
ర్భీకు న్ననొ్బసరించి గమ్యగతి కాన్పింపంగ దే యీశ్వరీ! 21

మును పేనుఙ్ బితయుఙ్ శివాజిముఖ రాణూర్ధ్వన్యు లాశఙ్ బునః
పున రుత్పన్న మహోద్యమం బెసఁగ నింపుం బెంపుఁ బెంపం దలం
చిన కార్యంబది మైక్య భారతము నార్జింపంగ నింకెట్లో? హృ
ద్వనజోల్లాస జయావహాధికృతి భవ్యా! భక్త చింతామణీ! 22

'ఇంద్రియ శక్తి యుక్తమగు నీ తను వీ సుఖజీవికాదు లీ
సాంద్ర తపఃప్రబోధమతి చాలవె నీకని యందు వేమొ? ని
స్తంద్ర మనఃక్రియావితత దార్ఢ్యము లేకడఁ దెత్తు? నీ కృపా
చంద్రిక తోడుగానిదె విచార తమోవృత జన్మయామినిఙ్. 23

శౌత్సుక్యంబడఁగెఁ, గృశంబులయి ధైర్యౌదార్యముల్ క్రుంగె, ను
ద్యత్సౌఖ్యాశ తొలంగెఁ, జిత్తరవి దుఃఖాంభోద సంఛన్నుఁడై
యుత్సాహ ప్రభు మంత్రశక్తు లుడిగెఁ, వ్యుత్పత్తి యాత్మీయ సం
విత్సంపన్నము గాదు, భీతుఁడను నీవే దిక్కు నిత్యాకృతీ!" 24

అని తర్కించుచు సైంధవ
మనుపమ రంహోత్కటంబు నదలించుచుఁ జ
య్యన "బ్రహ్మేంద్ర" కరోత్థుని
మనికికి నుత్తమ తపస్సమాశ్రయమునకున్. 25

కలఁగి యమాత్యవర్యుఁ డరుగన్ శుభసూచన లబ్బె సంభ్రమా
కులు నతనిం గుహాకృతిని గోమల మంగళగీతికల్, పికా
వలులు సమీప పాదప నవస్ఫుట పల్లవ ఖాదనోద్ధతిన్
బలికి బహూకరించె, జలపాతము మ్రోతలు సందడింపఁగన్. 26

అదనైనట్లు వసంతఖేలన లతాహాసంబు పుష్పోద్గమం
బిదె యంచుం గలకంఠము ల్మొరయఁగా నేచక్కి వీక్షింప ను
న్మద సూనాసవ పాన మత్త భ్రమరీనాదంబులున్ గీర కో
విద వాదంబులు చేరి కూర్చె విజయస్ఫీతంబుఁ దౌర్యత్రికన్. 27

కుంభ త్కలధౌత స్వ
చ్ఛాంభః ప్రతిబింబ భాజిష్ణు శాధవతారో
జ్జృంభ న్నదీ జనని వి
స్రంభంబునఁ బంచె నొద్దు చాయం జలువల్. 28

సకలారణ్య కుభృల్లతాంగనలతో సౌహార్దముం బెంచి కో
రక కన్యామణు లంజలు ల్గురియఁగన్, రాగాగమాభ్యాసి స్వా
తకు రీతిన్ మలయానిలుండు వలపు ల్దాపించి ద్వారంబునన్
నికటస్థున్ సచివోత్తముం దనుపఁగ న్నిర్మించె నాతిథ్యమున్. 29

అంత నాతండు దేహళీ ప్రాంతసీమ
వారువము డిగ్గి కనుఁ గ్రేవఁ బాఱఁ జూచెఁ
దన తెఱంగు నిరీక్షించు ననఘు వృద్ధు
సౌమ్యశీలు వేదానంద శస్త్రినాము. 30

కాంచె సుమేరువర్ణ శుభకారణ వాక్సముదీర్ణ సత్తపః
ప్రాంచిత శాంతవృత్తి, నిగమాధ్యయనస్ఫుట వక్త్రరేఖు, గా
వంచను దాల్చి పయ్యెరలవాఱె యెఱుంగని యోగలేపుఁ, బ్రా
క్సంచిత సత్త్వదీపు, నవసాంధ్య ఘనాభ జటాకలాపునిన్. 31

వేదానందుని సద్గురు
నాదర్శ గుణప్రధాను నంతర్ముఖుఁ దా
నాదర్శ మధుర హృదయుం
డై దర్శన మాచరించి యవనతుఁడైనన్. 32

అతని సవిషాద ముఖభంగి కాత్మ యురియఁ
జెందిరపుఁ బల్లు తెరపాయఁ జీల్చి, తారు
వంత నఱడాచి శిష్యడింభకులు నంత
సత్కృతిన్ దీర్ప క్షేమోక్తి జరిపె గురుఁడు. 33

ఉశనశ్శ్రీముషియయ్యు మంత్రి పృథు దుఃఖోద్వేగి డగ్గుత్తికన్
'భృశమున్ బ్రాజ్ఞుల బోధముల్ మఱచి, దుర్భేద ప్రహారక్రియా
వశులౌ మూర్ఖుల కేడ లభ్యము శుభప్రారంభ 'మబ్దాలి' శా
ర్యాశతారంబు మరాట సైన్యనివహాహార్యంబులన్ జీల్పఁగన్.' 34

అన నవ్వాననసీమ మాటుపడ వేదానంద యోగీంద్రుఁ 'డె
వ్వని కేనిన్ మది జంకినాఁడవొకో? గోవ్యాఘ్రముం బెవండేనిఁ బూ
ని నినున్ శౌర్యపరీతుఁడై వడగొనన్ నిర్జించినాఁడొక్కొ? నీ
కనయం బింద్రియము ల్వశంబులు హిరణ్యాగంబు నీస్థైర్యమున్. 35

శ్రీ శివాజి మరాట లక్ష్మీ గృహంబుఁ
గట్టఁగా బాజిరాయండు గట్టె మేడ
ప్రహరి నిర్మింపఁగా నీవు పాటుపడితి
వైన దేశీయు లైక్యముఁ గానరైరి. 36

ఏక లక్ష్యంబు దైవంబు నేక మెచట
నచట జయలక్ష్మి విహరించు; నది నిజంబు;
స్వాధికార వివృద్ధికై జగడమాడు
మోఁఱకుల దండ నీ కెట్లు మొనయు జయము? 37

పానిపట్టు యుద్ధ మదేల భంగమయ్యె?
నీవె వాహిని ముందఱ నిలిచినావె
నీ సుసామ్రాజ్యపాలన వాసికెక్కి
యున్న హోల్కరు గైక్వారు లున్నవారె?' 38

అని యోదార్చు యమీంద్రుని
ఘన వాణిని వినియు, దుఃఖహతి నా మంత్రీ
శుని తను వుత్సారిత శిఖి
ఘన గరుదత్యాయ నిపాతగతి నలఁగంగన్. 39

కొంతవడి గో డుడుగలేక, శాంతిఁదక్కి
యక్కటా! యని వాపోయి, యౌడు గఱచి
తెప్పిరిల్లిన పిదప నిత్తెఱఁగు సెప్పె
భావా విశ్వాసరావుల పతనచరిత. 40

"ఏమనంగ? మహారాష్ట్ర మింకి పోయె
పాని పట్టుభూమి కంపించి పగులువాఱ;
నల శివాజియు బాజీ మహాప్రభుండు
కదనమునఁ గన్న కలలెల్లఁ గల్లలయ్యె. 41

వీరవిలాసి తం|్రడిపనుపే మది నాటి మరాట రాట్పటీ
రోరు విశుద్ధ రాజ్యయశ మున్నతినంద, సమ|గ్రపాలనా
చార విచారమగ్నత నిజంబు నెఱుంగక భావొ నంపి దు
ర్వార విరోధివారములు |్రవయ్యఁ బరాజయమంది కృంగితిన్. 42

'వెనువెంటఁ దరలిన పెను కుటుంబములకు
'గ్వాలియర్' కోటలోఁ గాపువెట్టి
ఢిల్లీశు మణికనకోల్లాస సింహాస
నము నమ్మకటులె జనమ్ముఁ దన్ని
వానర వ్యూహ దుర్వారపద్ధతి శ|్రతు
సంభారములఁ బట్టి సగముచేసి
యమునానదీ |్రపవాహము రేవులన్ గాచి
యది యంగరక్షగా నడర నిల్చి

జయము గొను' మను శూరమల్ సాంత్వనముల
నుద్ధతుండగు హోల్కరు నుద్ధత మతిఁ
బెడచెవిం బెట్టి, విమతు 'నిస్త్రీము' మర ఫి
రంగులన్ నమ్మి, భావొ దుర్మరణమొందె. 43

విశ్వాసుఁ డొనరించు వివిధ సంధి |్రపకా
రములకు భావొ తా విముఖుఁడయ్యె
మహారాష్ట్ర జాతీయమతి మాని తనకేతు
భూమణావళికి నుపొంగిపోయె
నల వజీర్లావలి యనిలోన దిగినంత
సేవ వెన్నగలింపఁ జేయఁడయ్యె
నా కన్నకొడుకు ధన్యపరా|క్రమ స్ఫూర్తి
జూడఁ జూడక కరి ఫీడి జాత్తె.

బాలు దుర్భగమాభ్య మపారమయ్యెఁ
గటకటా ! విధి ! 'మల్హారి' గుటకవేసెఁ
గడకు 'తమ్మాజి' యాదారి నుసుగఁడయ్యె
నేలికల పాలు సైనికు లేమిలెక్క ?. 44

రతనము లట్టి శూరులు శిరశ్చ్యుత సూనము లట్లు వోయి, రు
న్నతులును మోహిరీలవలె నాశము నొందిరి, వెండి రాగులే
గతి; యురురాష్ట్రభూమి కిఁకఁ గాలుఁ డకాలమునందు వచ్చెనో
మతిచెడి యే ప్రమాదమున మా కిటు న్యూనతలయ్యెనో గదా" 45

అని కన్నీరిడు మంత్రిపుంగవుని మస్తాగ్రంబునన్ స్వీయ హ
స్తనియోజ్యమ్మగు నాత్మశాంతి వెలుఁగున్ సంధించి తద్రాజ్య క
ర్మ నిరాతంకము గామిఁ దెల్పి నిటులం రాత్రిం దివంబున్ మనో
న్మనిఁ దానున్ దివికేగు భావిఁ గని బ్రహ్మేంద్రుఁ డోదార్చుచున్.

" ఎందాక నుపనిష దిద్ధ దైవైక్యంబు
భారతీయుల నెల్ల వ్యాప్తిఁ జెంద
దెందాక నన్యమతేచ్ఛాపరుల్ మన
ధర్మంబుఁ జేబట్టు దారి గలుగ
దెందాక స్వమతార్థ మెఱుఁగని ప్రజ పర
పూజలఁ బాల్గొను నోజ విడువ
రెందాకఁ గులభాష లెట్లున్న నాదిష్ట
మాదిత్స లొండొంట నైక్యముండ

దెంతదాక సతీజన్మ మెట్టిదేని
పురుషు కులము దారాసుతు లోరయనేర
రంతదాక హిందూమతం బభ్యుదయము
నెనయదెటు భారతీయత వృద్ధిమనదు. 47

రామ రహీ మేసు బ్రహ్మ బుద్ధ గణార్క-
భంగిమ లొకటియా భావమందె
అష్టాదశ కులంబు లనులోమ వైవాహి
క విధాన మొకటియై కలియుటందె
ఏ తెగ యే పూజ నెటులఁ జేసిన మూల
మారాధన యొకండె యగుటయందె
సర్వాలు జగదీశు సన్నిధిఁ దామేగు
పథముల నిరసూయఁ బరగుటందె.

భ్రాతృవర్గానుబంధంబు ప్రబలి యనిశ
మొక్క- రొకరికి ధన మానములనె కాక
మరణమున మాటను సహాయపరత మనికి
నవ్యమార్గంబు మత సమున్నతికి స్థితికి. 48

అనవద్యలగు చెల్వ లందఱు వయసున
నుద్వాహవతు లొక్క- రొక్క- రగుట
స్వీయాత్మరక్షకై స్త్రీలును పురుషు లె
చ్చటనైన సన్నద్ధపటిమఁ గనుట
పరమాన పరవిత్త పరజీవ హరణంబు
స్వమతస్థులందేని వర్జ్యమగుట
అవకుంఠన శుచిత్వ మంగనల్ దార్ఢ్య వి
ద్యా సుశీలముల సంతతము గనుట
ఆది చరను సంధ్యావేళయందు దినముఁ
బ్రార్థనంబున దేశీయప్రజలు సుజన
నియతిఁ దప్పక వెలయింప నేర్చుటయును
భారతీయత నవ్యమై పరగు విధము. 49

పంగ్వంధ వికలాంగ బధిర మూకుల కెందు
జీవన లోపంబుఁ జేయకునికి
పూర్ణాంగజన సముదీర్ణవృత్తి నియోగ
పరత నెల్లెడ శాంతి ప్రబలుచునికి
పూర్వ సంస్కృతి కార్య నిర్వాహకుల యెడ
ననసూయులై నవ్య లరయుచునికి
పారుష్య రహితమౌ వైయక్తిక స్వేచ్ఛఁ
దనివి స్వీయాన్యు లందఱకు నునికి

వలసినంత కూడు నొడలి వలువ లాలయ
విద్యయును వ్యక్తిరక్షయు బీదకైనఁ
దప్ప కివి యన్ని విధిగాఁగఁ దనరు చునికి
భాసిలిన భారతీయత భవ్యమగును. 50

సంతతి, వివాహముల్, ధ్యాన, జన్మ, మృతి వి
వక్షలైదును, దత్కర్మశిక్షలైదు
హైందవావలి యంతయు నాచరింపఁ
బరిణతికి మార్గమౌ నొక్క ఫణితి మనికి. 51

వేద మంత్రాగమ విధి సుప్రతిష్ఠయు
సత్యార్చనంబును సంయమంబు
సాధక సాన్నిధ్య బాధా నివారణ
సేవా విశేషంబుఁ దావు లొలుకు
నిత్య విజ్ఞాన సుకృత్య సమాశ్రయ
నిరతి యే మూర్తిచే నెఱయ దట్టి
పంచకం బరయని పలుగాకి గుళ్లవి
ముక్కిడి సంకెళ్ల ముళ్లుగావె ?

విధి విశేషము దొఱఁగిన విగ్రహములఁ
గొలిచి ఫలమేమి? సర్వేశుఁగొంచపఱచి
యతని కోపమునకు గుఱియగుట కాదె?
మఱచిరే యాశ్రమ జ్ఞాన మందిరముల? 52

స్వీయ బంధువులకె 'ఖాయంబు'గా నధి
　　కార పదంబుల ధారవోసి
అధిగత ధర్మమై హాయనంబులు గొల్చు
　　ననుభవజ్ఞులఁ దగ్గులందుఁ ద్రోసి
పైన నీతులు లోన పాతకంబులఁ బేర్చి
　　'చాతు' ధనంబుల సగముఁజేసి
పదవుల కెగఁబాఱు మది డాచి జనతకు
　　వ్యర్థ వాగ్రచనల వన్నెఁ బూసి
ఘనుల మనుకొను గర్వ దుర్గంధు లెసఁగి
రాష్ట్రమున నిండి రింక స్వరాజ్యమేడ?
చెంబు బియ్యంబు పొరుగూరి సెట్టి కమ్మ
భిక్షువొ హరిదాసు ముముక్షు వగునె?" 53

అంచుఁ బూర్ణసమాధి మున్గు యతి నాత్మారూఢునిఁ ద్రొమొక్కి, 'జే' యంచుఁ స్వీయ హయంబు నెక్కి, పునహ హర్మ్యంబు దాక్షాయణీ ప్రాంచద్వాస సమీప ధాత్రియె నివేశార్హంబు మీరందు రం డంచుఁ వేమఱుఁ జెప్పి మంత్రి యరిగెన్ స్వాత్మన్ వితర్కించుచున్.

అంతం గతిపయ దినములఁ
జింతాజ్వర మింత యుడుగఁ జిత్తాబ్జమునన్
శాంతి సుషమ రేకెత్తిన
నంతేవాసియును బిల్వ యతి యట కరిగెన్. 55

బాజి బాలాజిరావుల పూజనీయ
చరమ సామ్రాజ్యకీర్తి సంస్మరణ ధరణి
పునహానగర నగ్రాగంబుఁ బొరసియున్న
పార్వతీశాల విశ్రాంతి భవనమయ్యె. 56

కల్యారంభ నృపాల భక్తచరితాంకంబుల్ ప్రజాస్వామ్య ధీ
పల్యంకంబులు గావె యంచు యతియుఁ భాషింప నుంకించి సా
ఫల్యం బొందు మదీయ వాక్ఫణితులుఁ బ్రాజ్య ప్రమేయోచ్చల
త్కల్యాణోద్వహనాశయాశ్వములపై వాహ్యాళులై పొల్చెనఁ. 57

వేదములె నిధులు ఋషులకు
వేదోపనిషద్వివేక విజ్ఞమునీంద్రుల్
పాదులుగ నృపోద్యానము
లాదట నభ్యుదయమందె నలరులు ప్రజలై. 58

మునుపంచని భూరి కథా
వినియోగ విధాన పూర్వ వీర కృతులకుఁ
వినుకలి మొదలఁ మంగళ
మును నాశాసింప గురుఁడు ముకుళితకరుఁడై. 59

## చతుర్థధార — అశోక కథాముఖము

'ఓం మణి పద్మేహుం' మ్మని
కామిత విజ్ఞానసిద్ధుఁ గడక భజింతుఁ
ప్రేమ సమృద్ధుఁ గపిలుఁ
కామాది నిషిద్ధ బుద్ధుఁ గైవల్యేద్ధుఁ. 60

'ఈశావాస్యమిద' మ్మను
ప్రాశస్త్యముఁ దాల్చు జగతిఁ బరమోదయజీ
వాశావధియగు విభునిఁ
నాశరహితుఁ గొల్తు నిత్య నవ్యుఁ బూర్ణుఁ. 61

న్యాయనందక దీప్తి డాయు సంశయముల
తమ మడంచి మనో ముదంబుఁ జేర్ప
పాంచజన్యమె తుష్టి పారమ్యమై శాంతి
ఘోషఁ దాపత్రయ శోషఁ దీర్ప
ధర్మోద్యమాఖ్య సుదర్శన చక్రంబు
మాలిన్యము హరించి జాలి నేర్ప
శార్ఙ్గ ధనుర్నామ సౌశీల్య సుమవృష్టి
యెంతేని చిత్తవిశ్రాంతిఁ గూర్ప.

నచల నిర్వాణ కౌస్తుభం బాత్మ సుగతిఁ
దేర్ప నానందవైజయంతియుఁ దనర్ప;
బౌద్ధ భక్తులఁ బ్రోచు సౌభాగ్యనిధివి
పరమ! బుద్ధదేవాయ! తుభ్యం నమోస్తు. 62

ప్రాచీ నాథుని శోభయ
సూచిత ఋషి సుగతమతులు శోభింపఁ గథా
గ్రాచిత మతియై యిట్టుల
వాచంయమి చెప్పె సచివ వరుఁడు వినంగన్. 63

వెలయు జగముల కెల్ల పవిత్రధాత్రి
విశ్వ విద్వత్కళామూర్తి, విమలకీర్తి,
విపుల హిమకూట వసుసేవ్య, వేదభావ్య
భరత భూమాత, దివ్యశోభాసమేత! 64

సింధునదియ పొలిమేరగ
సింధువు ముప్పరిగఁ జుట్టుఁ జెలఁగన్, బీయూ
షాంధసులకు నెలవు, యశో
బంధురగుణ జన్మసీమ, భారత మెన్నన్; 64

పుణ్యభూమి యార్యావర్తమును హిమాద్రి
సవ్యమేధాకరము దక్షిణాపథంబు
నిరుదెసల నుండ వింధ్యమహీధ్ర మొసఁగు
డంబు మీఱెడు మానదండంబు వోలె. 66

కృతయుగగత విధి లీలా
గతి నెఱుఁగ మనుష్యసృష్టి కలదో, లేదో?
పతి రాముఁడు ధర్మాస
క్తతఁ ద్రేత సమైక్య భారతముఁ గల్పించెన్. 67

ద్వాపరయుగమున రాట్కుల
దీపకు లెందఱో యశఃప్రదీపకులగుచున్
బ్రాపించి రంత్యమంతటఁ
బాపంబులు పర్వెఁ గౌరవక్రియ లెదుగన్. 68

సాత్యవతేయు పల్కుల నిజంబు నెఱుంగని రాజుచెంత, నా
దిత్యతనూజుఁడున్ శకుని తీర్చెడు దుష్కృతు లెన్నియేనియున్
వ్యత్యయమై దురంతమగు నాజికిఁ బూన్పఁగఁ గౌరవాలి త
ద్భృత్యులు నాశమొందిరి; సుధీరిత గీత వచించెఁ గృష్ణుఁడున్. 69

హరి లోకము వీడిన మఱి
యరి కలి విహరింపఁ దొడఁగె నది కలియుగమై
బరగెన్, గర్ణాకర్ణిగఁ
గరమున్ గల్యాది కథలు కమనీయంబుల్. 79

కలియుగాది నుండియు మూఁడు ఘనతరములు
రాజ్యము లయోధ్య, హస్తిన, రాజగృహము
కేంద్రములుగఁ బురాతను లింద్రనిభులు
క్షత్రియ నరేశు లేలి రార్షంపురీతి. 71

కల్యాది భారతమున న
మూల్యౌదార్యుల్ గుణ ప్రబుద్ధాత్ములు ని
స్తుల్యాచార విధానులు
కల్య స్మరణీయులైరి కలకాలంబున్. 72

ఋషభుం డాద్యుఁడు రాజశేఖరులలో నిక్ష్వాగతాధ్యాత్మ శే
ముషికిన్ బెన్నిధి; పిమ్మటన్ భరత రాణ్మూర్ధన్యుఁడున్ జెల్లె, మా
నుషమౌ జీవుని యాత్ర కంత్యమని నూత్నోన్మేష సౌశీల్య సం
కృషి నాత్మోన్నతుఁడై తృతీయుఁడయి సత్కీర్తిన్ గనెన్ శాక్యుఁడున్.

మాయాసూతి యతండు, రాజపదవీ మాన్యుండుగాఁ బుట్టి, సం
స్థాయద్దివ్య సుఖానుభూతిని సుతున్, సౌందర్య రాశిన్ సతిన్
బ్రాయంబందునె రిత్తగాఁ దలఁచి, యారణ్యావనిన్ జొచ్చి, ని
శ్శ్రేయో మార్గముఁ జూపె, బుద్ధుఁడయి నిర్నిద్రప్రభావంబునన్. 74

ముఖ్యప్రధానిమై ముదిసి పూజ్యత నొంది
పొదలు చైనా 'గణభూమి' కాఁడు
సంతాన కాంతా నిశాంతోష్ట్ర రాష్ట్రముల్
గల 'జొరాస్త్రుని' సౌఖ్యములఁ బోఁడు
స్వీయుల కెదురొడ్డె జే సాఖ్యుఁ డనుకీర్తి
సిలువ దండనఁ దారసింప రాఁడు
గురు 'ఖొరాను ప్రవక్త' వర రీతిలోవలె
రాణ్ణిలింపుండగు రమణఁ గనఁడు

నిస్పృహా, యహింస, సత్యంబు నిరతనియతి
నిరుపమాన నిర్లిప్తత నిండుకొనఁగఁ
బ్రభుఁడు శౌద్ధోధనియు పరిపంథి లేక
మోక్షరాజ్యంబుఁ గొనె శాంతిదక్షుఁ డగుచు. 75

ఆ మహనీయు దివ్యచరణాబ్జము మెట్టినతావు లెల్ల సు
త్రామముఖామరుల్ తలలఁదాల్చుట చోద్యమె? తైర్థిక వ్రజం
బా మహిఁ జేరఁగోరు టరుదా? మధురార్ద్ర దయామయోక్తులన్.
సీమల సీమలన్ బ్రజ భజించెను బుద్ధ వివేక సారమున్. 76

వందారు సమస్త సుధీ
బృందుండై బింబిసార పృథ్వీశుం డా
నందం బొనరించెన్ దై
నందిన సద్వృత్తి బుద్ధనాథు ననుజ్ఞన్. 77

శైశవ నాగాఖ్య ధరా
ధీశోద్ధృత పుణ్యమాగధీయాభ్ర ప్రా
గాశోదిత చంద్రుఁ డతం
డా శాక్యమునీంద్రు పదము లర్థిన్ గొలిచెన్. 78

ఆతని యనంతరమున న
జాతామిత్రుండు కొడుకు శ్రద్ధాయుతుఁడై
ప్రీతుని జేసెను బుద్ధుని
స్వాతత వనదాన వితతి ననవరతంబున్. 79

శోణానది యొడ్డున గల
వేణువన గిరివ్రజాంక విహారమ్మని వ
ర్ణైణీశ్రేణికి దవ్వన
నాణెపుఁ బాటలిని గట్టె నతఁ డబ్రముగన్. 80

శిశునాగకులులు ప్రకృతికి
వశులైనన్ దేశమున ప్రవాహములై, దు
ర్దశలకు హేత్వావహములు
భృశమున్ నృపులన్ జనించె వికలక్షోభల్. 81

సుక్షాత్ర వంశ లతికకుఁ
గౌక్షేయకమైన పద్మకప్రభు పాతకుం
డక్షీణ కుయుక్తిని మగ
ధక్షోణికి నపుడు రాడ్వతంసుం డయ్యెన్. 82

తన తనయులు నవనందులు
ననయంబును గొల్వ రాక్షసామాత్యుదయన్
గొనకొని యేలి యనంతర
మున వానప్రస్థ నియమమున్ గొని చనియెన్. 83

అవినీతి మహాపద్మజు
లవగాహన మార్యఫణితి నందనికతనన్
నవనాయకత నుపద్రవ
నివహంబులఁ జిక్కి లోకనిందితులగుచున్. 84

చణక మహర్షికి నౌరసు
నణిమాదిక యోగసిద్ధు నవమానింపన్
గణియింపక వారల మ
త్కుణములవలెఁ గాలరాచి కుపితాత్ముండై. 85

ఆ విష్ణుగుప్తుఁ డుజ్జ్వల
జీవితుఁడౌ పార్వతీయ సేవ్యోత్తమ వం
శావిర్భూత మురాసుతు
భూవిభుఁగాఁ జంద్రగుప్తుఁ బూన్చెన్ మగధన్. 86

మగధ జనపదం బమరెన్
సుగతాచారప్రమేయ సుందరమై, సౌ
ధ గణోల్లసితంబు, జన
స్థగితము పాటలియె రాజధానిగఁ దనరన్, 87

ప్రాప్తా జినముని మతమున
నే పొందిన చంద్రగుప్తుఁ డిలవీడఁ గులో
ద్దీపకుఁడు బిందుసారుఁడు
ప్రాపించెను బిదప సార్వభౌమ పదంబున్. 88

భూరి చాణక్య తంత్రోరు నీతి క్రియా
నియమానుసారి వినిర్జితారి
సౌహార్ద శౌర్య వశంగత యావన
కాంతానువర్తి ప్రశాంతమూర్తి
బ్రాహ్మణ నిర్గ్రంధి బౌద్ధాదిమత వేది
శ్రితరాజ్య సుప్రజాక్షేమవాది
మగధసామ్రాజ్యైక మహిత సంపద్భోక్త
మాన్య సమాజ ధర్మప్రవక్త

యగుచు బిందుసారుండు ధరాధినేత
నిత్యమును గొల్వుకూటంబు నెఱయఁగూర్చి
సంప్రదాయంబు కరణిఁ బ్రసన్నసరణిఁ
బాలిత జనౌఘు మరయుచు నేలి చనియె. 89

లలిత దయాప్రసారి విపుల ప్రతిభాకర దివ్యబోధనో
జ్జ్వలిత యశోవిశాలు ఘన సత్త్వనిరూఢ నివృత్తి హర్షితా
ఖిల నృపజాలు, బుద్ధునకుఁ గేల్మొగిడించి, యనంతరంబు భూ
తలమున శాంతినించెఁ బృథుధర్ముఁ డశోకుఁడు లోకవంద్యుఁడై. 90

ఆతం డెట్టిఁడో వార్ధి
వ్రాతాంచిత భూతలంబె ప్రపగాఁగ, దయో
పేత జ్ఞాన జలాంజలిఁ
జేతో హర్షంబు మిపులఁ జేర్చెన్ బ్రజకున్, 91

అని వాక్రుచ్చెడు సంయమిఁ
గని కడు జోద్యంబు పొడమఁగా మంత్రి 'సనా
తన వేదం బుడిగియు నా
తనవృత్తి నశోకుఁ డేల తత్పరుఁ డయ్యెన్ ? 92

చిత్రమ్ములు శ్రవణస్తుతి
పాత్రమ్ములు శాంతిబీజ పరివర్ధక సు
క్షేత్రమ్ములు, బహు పాపల
విత్రమ్ములు చూవె పుణ్యవీరచరిత్రల్. 93

వినిపింపు మశోకుని వ
ర్తన తత్పాలిత విశాల రాజ్యప్రగతిన్
వినియెదఁ 'జెవులకుఁ బండువు
గను నే' ననఁ గథకుఁ డిట్లు క్రన్నన నుడివెన్. 94

## పంచమధార — మౌర్య పాలనాక్రమము

అతుల పరాక్రమోన్నతి దయార్ద్ర మనస్థితి నచ్చువేసి సం
గతి నొనరన్ సృజించె విధి గా కిటు లొప్పునె యంచు శిష్ట సం
స్తుతిని 'నమిత్రఘాతుకుఁడు' జొప్పడె నాశ్రితపారిజాతమై
పతియయి బిందుసారుఁడు నుపాయ చతుష్టయ యుక్తి నేలుచున్. 95

మగధసామ్రాజ్య పూజ్య రమాధవుండు
స్వప్రజా చకోరప్రియ చంద్రమసుఁడు
భూరి రిపుయాతుధాన దంభోళి హస్తుఁ
డతఁడు నృపతి సామాన్యుఁడే? యంద్రు జనులు. 96

మనమేగాక విదేశ విజ్ఞులు మసల్మాన్ ముఖ్యుల్ గూడ ధీ
ధనుఁ డంచున్ గొనియాడ నే నృపతిమూర్ధన్యుండు నేలెన్ యశో
ఘనుఁ డా యగ్బరు పాలనక్రమ పరాకాష్ఠ స్థితిన్ గూడ వ
మ్మనిపించెన్ సరిపోల్చి చూచునెడ నా మౌర్యప్రభుత్వం బహో! 97

కడఁగి సామ్రాజ్యనౌకకుఁ గర్ణధారుఁ
డౌచుఁ జాణక్యుఁ డెట్టి రాజ్యాంగరీతి
గూర్చె నా త్రోవయే చంద్రగుప్తనృపతి
మొదలుకొని 'యక్షరాలుగఁ' బాదలుచుండె. 98

దక్షిణము వారుణోదక్ప్రదక్షిణముగఁ
దోసలి, యవంతి, తక్షశిలా సమాఖ్యఁ
దనరుఁ బురవరంబులు రాజధానులుగను
ఇంద్రపురిఁబోలు పాటలి కేంద్రముగను. 99

రాజ్యమంతయు నాలుగు రాష్ట్రములుగ
విభజనము గల్గి ప్రతినిధుల్ విభులు వెలసి
వారుఁ బౌరుల కుత్తరవాదు లగుచు
మొనయుచుండఁ బ్రజాస్వామ్యములు చెలంగె. 100

ఒక్కొక్క యెడ రాజసుతుల్
నిక్కియు రాజ్యాంగములను నిపుణత గనినన్
మక్కువ రాట్ప్రతినిధులుగ
నెక్కుదు రనుభూతి నేర్వ నేలికలగుచున్. 101

అష్టప్రధాని మండల
మష్ట భుజంబులుగ రాజు నాజ్ఞల నెపుడున్
శిష్ట విమర్శన వెలయఁగ
స్పష్టీకరణంబు చేసి పాల్గొనుచుండెన్. 102

విపణివీధులఁ గ్రయ విక్రయాదులఁ దీర్చు
శాసనావిష్కరసభ యొకండు
సైనిక చతురంగ సౌకర్యవిధుల వి
ఘారించు నధికారసభ యొకండు

నగములఁ దెగఁగొట్టి సుగమముల్ జేసి త
త్సరణిఁ గొత్తలఁ జూచు సభ యొకండు
పాడిపంటల కాల్వపాఱుదలల్ గూర్చు
సత్కర్ష కాఢ్యుల సభ యొకండు

పొలము విస్తీర్ణములు వెలల్ తెలుపు సభయు
నడవు లెదుగఁ బ్రోచుచుఁ బాటుపడెడి సభయుఁ
బన్నుల వసూలుచేయు సంపన్నసభయుఁ
గొదవ సభలును ముప్పది కూడుచుండె. 103

ఈ త్రింశత్సభలకు నే
మాత్రమ్మును జాగులేక మహితమనీషుల్
ధాత్రీజన సమ్మతికిన్
బాత్రతను వహించి కార్యవర్గీకృతులై. 104

ఆలోచన శాసనముల
నాలోకనఁ జేసి చేసి యాప్తతఁ బ్రజకున్
మేలొనరు జతనముల నే
వేళల సచివులకుఁ దెల్ప విధియై యుండెన్. 105

ద్విజులును సజ్జనులు బుధ
వ్రజములు నర్హాధికారపదముల నలరన్
బ్రజకున్ బతి హితుఁడయ్యెను
నిజముగ నరపతియుఁ బ్రజకు నెయ్యము చూపెన్. 106

మన ప్రజ మన దేశ మనని శుంఠలె లేరు
ఖలులు మచ్చునకైన గ్రాలరైరి
లంచాలు కొండెముల్ కొంచెంబునున్ లేవు
ధనికులు సత్రాన్నదాతలైరి

వైరముల్ వృత్తిలో వ్యాపారభిన్నతల్
గలవారు కలనైనఁ గానరారు
బహు తృప్తిఁ బేదలు బ్రతుకంగ నేర్చిరి
మదమున నధికృతుల్ పొదలరైరి
సంఘ నియమావళికి ననుల్లంఘనీయ
శాసనావళికిఁ బద్ధులై సమస్త
పౌర జానపద నివాసి వర్గములును
సుకర సహాకారశాంతులఁ సుఖముగనిరి. 107

శాస్త్రీయ ధర్మసంచయమున కెదురొడ్డి
పోర చట్టములకు మేరగాదు
వ్యక్తుల స్వేచ్ఛకు వైయక్తికాచార
ములకు నిరోధంబు పొసఁగఁబోదు
పరమవైదికులకు బౌద్ధభిక్షువులకు
వలయు మన్ననల లోపంబురాదు
పూర్వనిర్మిత కులాఖర్వవృత్తిక్రమం
బసదులై సంస్కారు లార్పలేదు
దీన ధనహీన సుజన సుధీప్రగతికి
సదవకాశంబు, పల్లెల జనులవృద్ధి,
రాజ్య సంరక్షణంబును, బ్రజకు సుఖము
రంజిలఁ మగధయు రామరాజ్యమయ్యె. 108

ఎక్కడ విడిచిన వక్కడ
నిక్కవముగ రథ్యలందు నెలవుల నుండుఁ;
జొక్కపు బుద్ధులఁ బౌరుల
నొక్కఁడుఁ బరు సొత్తు నంట నోర్వం డచటఁ. 109

ధర్మార్థము ఱేఁడు నస
త్కర్మల మరి కల్లబొల్లి కపటములగు నిం
దోర్మలకుం గారకులన్
జర్మం బొలిపించు సద్విచారపరుండై. 110

వేగులు నెల్లెడల మరు
ద్యోగుల దుస్తంత్ర కితవ దోషములను బా
గోగులు ప్రజ యనుకొనునవి
వేగమున రహస్యవృత్తి విభునకుఁ దెలుపన్. 111

ఏమూల నేమి జరిగిన
బామైనను జొరగరాని పరరాడ్దుర్గ
స్తోమంబులఁగూడ నెమకి
స్వామికడన్ వార్తలెల్లఁ జారులు వినుపన్. 112

ఎప్పటి కే యది పథ్యం
బొప్పు నటు చికిత్సఁ జేసి యోర్మిని క్రమముల్
జొప్పడ జనరంజనమున్
దప్పకయె భరించుచుండె ధరణిపుఁ డెపుడున్. 113

స్వామ్యముల్ ధన తారతమ్యమ్ము లెఱుఁగమి
నాస్తిపాస్తుల దోఁచు టచట లేవు
ధర్మసంస్థలఁ జేరు ద్రవ్యంబులను వేఱు
విధుల వెచ్చించు దుర్విధులు లేవు
పండక యెండినఁ బన్నుచ్చుకొనగ ను
ద్ధతి వట్టమడుగు పద్ధతులు లేవు
పుస్తెపూసల నమ్మి శిస్తు వసూల్ చేయు
కఠిన క్రమము లట గానరావు

పంట నాఱవవంతు, ను ప్పమ్ముదలయు,
గనుల లోహము లబ్ధి భాగములఁ దీయు
వహా క్తి కాద్యర్థముల్, ఖ్యాత మద్యశాల
లిచ్చు రుసుముల, బొక్కసం బెంతొ నిండ. 114

పట్టణము లూర్లు 'చౌతు' రాబట్టు కొఱకుఁ
గొల్లగొట్టుట మతముల గుల్లసేఁత
రేచు కుక్కలవోలె పైనేఁచి పైరు
రాచవారల దండులు దోఁచు టరయ
నా మగధమున మచ్చునకైన లేవు. 115

అప్పటి కరగ్రహణ విధానాతిశయము
దేశదేశములందు విస్తృత యశంబు
నంది సుకరాతి సుకరంబనఁ జాగ త్త
గనియె శాశ్వత ధర్మసంగ్రహము కతన. 116

1 సైనిక వివృద్ధి 2 విద్వత్ప్రి శాంతబోధ
3 వరతటాక విశ్రాంతి నివాస ధర్మ
కారకములు 4 రాడ్గృహ సుఖాకర సువస్తు
వితతి సంతరించునవియు 5 విపుల ధనద
ములును – నైదుగతుల గ్రామములు రహించు. 117

మొదటి మూఁడును గరవర్జ్యమొదవి రాజ్య
పాలన వ్యయభారంబె పాల్గొనంగఁ
గొదవ రెంటను బొక్కసం బెదుగ నిట్లు
గ్రామపంచకమున గరక్రమము గాలె 118

గురుని చాణక్యునాజ్ఞ దుష్కరము నడపి
ప్రజలఁగూడి యరాజకపదము దిద్ది
ప్రజల యభిమానధనమును బడసి ప్రజల
బలమువలన బలిష్ఠమౌ ప్రభుతనంది
ప్రజలకై మనెఁ జంద్రగుప్త ప్రభుండు. 119

ఆ మార్గం బాదర్శము
గా మహిమోపేతుఁడై మగధ సామ్రాజ్యం
బోముచు లోకుల రక్షణ
కై మాత్రమె నృపుఁడు సైన్య మావర్జించెన్. 120

పరుల రాజ్యంబు హరియించు పనులఁ జొరక
సుప్రజాస్వామ్యముల పెంపు సొంపు దప్ప
కనవరతముఁ బ్రజాసభ లెనసి నడువ
గ్రామపంచాయితీలు సక్రమత మెఱయ
బిందుసారుండు ప్రజకెల్లఁ బ్రీతిసేసె. 121

ధర్మశాసనములఁ దలఁదాల్చి ఱేఁడు
జనుల వాక్యంబు, మంత్రుల సాయమార్య
సన్నిదేశంబులున్ బ్రజాసంపదయును
ద్రోవఁ జూపఁగ మెలఁకువతోడ నేలె. 122

గ్రామముల 'గోపకులు' శిస్తు రాశిచేసి
గ్రామ కుల సంపదాగమ గౌరవజన
పశు ధరాభాగ వివరముల్ పట్టి వ్రాసి
'మాండలిక' 'స్థానికా'దుల యండనిడిన
వారు చూచి పంపుదురు భండారములకు. 123

శాంతిరక్షణ వాణిజ్య సౌష్ఠవంబు
ప్రబలు పొంటెను చక్కని బాట లునికి
నత్యవసరము లనుచు రాజ్యమున నెల్లఁ
బల్లెపల్లెలకు రస్తాలు పరిఢవిల్లు. 124

కోసు సగమేగ నరకోసు కొలతరాళ్లు
రెండు దెసలను నీడలు పండుచెట్లు
లలితమగు తేటనీటి బావులును నలర
పథిక విశ్రాంతిశాలలున్ బఱగుచుండె. 125

రాజపథములు శకటమార్గములు కాక
పీనుఁగులు పోవఁ ద్రోవలు వేఱుగలవు
వెలయు దుర్గములను బుటభేదనముల
జాతి చప్పటలు ఖరతురంగములకు. 126

వరుస ద్రవ్విన పొడువు కాల్వలును జెడవు,
కలవు యోగ్యము లుదకమార్గములగములు,
వర్తకుల కల్మి, నౌకల నర్తనంబు
లలరు రేవులు దర్శనీయంబు లయ్యె. 127

త్రాళ్లు, తెడ్లును, తెరచాప, తరణిగతికి
వలయు కొయ్యలు, పనిముట్లు గలిగి, రాజ
సేవ నధికృతు లొప్పిరి నావలకడ
నవితథ మనీష నౌకాశ్రయములఁ జేర్చి. 128

నిత్య నూతనోద్యములు, వణిక్ప్రవరులు
నోడలన్ గ్రొత్త సరకుల జోడుసేయ
రాకపోకల దొంగలమూఁక లణచి
రక్షణముసేయు రే బవల్ రాజునాజ్ఞ
గౌరవకృషిన్ రహించు నౌకాదళంబు. 129

## షష్ఠధార — పాటలీపుర రాజధాని — రాజచర్యాదికము

భోగాస్పదలై స్వర్ణవ
తీ గంగలు సంగమింపఁ దీర్థక్షేత్రా
భోగంబయి పావనసుఖ
రాగాకృతిఁ బాటలీపురంబు రహించెన్. 130

శృంగారములకు నెలవై
భంగించు సురేశపురము భవ్యత సుమన
స్సంగతి; దుర్గము వెలయున్
శృంగములన్; నీరు నిండఁ జెల్వగు నగడ్తల్. 131

పంచశతము సప్తతియు వప్రములు నెఱయఁ
'పాట్న'యును 'బంకిపురము'ను బరిసరములు
కూడి యందుండె వింశతిక్రోశ విపుల
పట్టణము చతుష్షష్టి సుద్వారయుతము. 132

షట్శతాంఘ్రి దీర్ఘమును త్రింశతియు లోఁతు
నై మహాభీలము నగాధ మగుచుఁ బరిఖ
యొసఁగెఁ దత్ప్రాకారా బహిఃప్రదేశ
మెనసి యొరులకు దాఁటగా ననువుగాక. 133

పురిమధ్యమమున నృపతికి
నరుదారెను దారుభవన మనుపమ భాగ్యో
త్తరము నసంఖ్య స్తంభో
త్కర సురుచిరమై సువర్ణ కలశోజ్జ్వలమై. 134

జక్కవలకు రాయంచల
కిక్కవలు సరోవర ప్రకీర్ణ విభవముల్
లెక్కకు మిక్కుట మచటన్
బెక్కులు మాక్తిక హిరణ్యపీఠము లలరెన్. 135

రాజ ప్రాసాదాంతర
నైజ ద్యుతిఁ బెంచుఁ గనక నగ లలిత లతాం
భోజ శకుంతాకృతుల, వి
రాజితమగు నగిషిపనియు రమ్యంబగుచున్. 136

లోహకారులు బ్రాహ్మణులును నుదీచిఁ,
బ్రాచి దిశ శిల్పినృప వణిగ్ద్విజముఁ, బశ్చి
మమ్మునఁ జతుర్థజాతులు మనుదు రెలమి
ధర కలంకారమైన యా పురమునందు, 137

ప్రామికులకయి సహకార సంఘములును
నగరి నల్వంక లంచుల నెగడుచుండు;
నగర పరిఖా బహిర్భూమి నెగడె వివిధ
కేళికా రామ విశ్రాంతి గృహములెల్ల. 138

పురపాలక జనసంఘము
పురమున నారోగ్యవిధులు పూరించు సుఖా
కర పథ వితతుల నేదు
శ్చరితములు ముఱికియులేని చాడ్పున నెపుడున్. 139

ప్రకట పరిశ్రమములు గర
నికరము వర్తకుల సరణి నిధన జననముల్
సకలాగత నవవస్తు
ప్రకరముల విదేశ జనులపైఁ బని చూడన్. 140

ప్రాయికముగ నప్పురి పం
చాయితి వర్గంబు లాఱు సతతశ్రద్ధన్
బాయక నేతద్విధ ర
తాయత కార్యములు సల్పగా చెలువారున్. 141

కృత్రిమవస్తు సంకీర్ణమై రేప్మయు
నల లోహవస్తువు లమరలేదు
అగడు రసీదుల నక్కిలి పడఁజేయు
సుంకముల వసూలు చొప్పలేదు
తప్పుడు తూకమ్ము లొప్పని కొలతలు
వీసమైన ఘటించు విధములేదు
చావుపుట్టుకల విచారంబు సుంత యే
మఱుపు పల్లెల్లఁగూడఁ జరుగలేదు,

విపణి వీధులఁ గ్రుళ్లిన వికలములగు
సరకె రాదు కాసంత యే జాడఁగాని
పరులు శత్రులు కుటిలత నొరసి చొరఁగఁ
బూనుటలు మౌర్యరాజ్యాన లేనెలేవు. 142

ధర యెక్కుడని ప్రాఁత సరకుల దాఁచి ప్ర
క్కల నమ్మ వణిజసంఘములు లేవు;
చెలువు తూములఁ దేరఁదెలిచి యుంచుటలును
దడు లెక్కువగఁ బాలుదలలు లేవు;
సాగును పోరుగు విచారింపక, పొలంబు
లితరుల కిడు నధికృతులు లేరు;
సర్కారుమొత్తంబు సగమైనఁ జేతికిఁ
గిట్టఁగాఁ గట్టు దుష్క్రియులు లేరు;
'ఇదియ నా జన్మభూమి; యెం దెదురులేని
పుణ్యయశము గడంచిన పూజ్యజనని'
యనుచు నెద ముదం బొదవఁగ మననియట్టి
మనిసి పీ న్గొకండును లేఁడు మౌర్యసీమ. 143

చతురంగబలము శ్రద్ధా
వితతంబయి రిపు విదార వీరయుతంబై
కృతక విభేదాపేతము
తత తరణికరప్రదీప్తిఁ దనరెఁ సీమన్. 144

ముప్పదివేలు రథంబులు,
ముప్పదివే లశ్వరాజములు, తొమ్మిదివేల్
గొప్ప గజము లార్లక్షలు
చొప్పడిరి పదాతు లహితసూదన నిపుణుల్. 145

వేలకు వేలు తటాకపుఁ
గూలములంటిన పొలాల కొనలకు నైనన్
హాలికులకు నష్టము రాఁ
జాలని యటు లా యుగంబు సమరము లొప్పెన్. 146

అరదంబు లవ్వాని పరికంబులు దాఁచు
మిన్నెత్తు మందువా లన్ని వేఱ
కాల్బలంబులు నిల్చు గ్రామంబులే వేఱ
మదగజాలాన ధామములు వేఱ
పారశీక హయాళి బంధించి పోషించు
శాలలు విలసిల్లు స్థలము వేఱ
నిత్యరక్షణఁ దిండి నెఱగూర్చి తూకంబు
లందించు నిలయంబు లవియ వేఱ

లక్షలు వ్యయించినట్టి జల ప్రపూర
లలితకుల్యా సరోవ్రజంబులకుఁ బంట
చేలకును బాటలకు సుంత సిలుగులేని
విధిని సైనికవారముల్ వెలయుచుండె. 147

జీవనోపాయ సదుపాధిఁ జేవనించి
బీదసాదలకుఁ జికిత్స పాదుకొల్పి
జైనమతశీలి సమకూర్చెఁ జంద్రగుప్తుఁ
డతని యదుగుజాడలఁ దప్పఁ డాత్మజుండు. 148

సర్వాంగ సౌష్ఠవంబుగ
నిర్వాహకుఁడౌచు దండ్రి నియమములఁ గ్రియా
ధూర్వహుఁడు బిందుసారుఁడు
నుర్విని నేటించి ధర్మయుక్తిఁ దలిర్చెన్. 149

పగటి నిద్రకై యెపుడేనిఁ బవ్వళింపఁ
బోని సత్క్రియావ్రతి యా ప్రబుద్ధమతికి
సోమరితనంబె లేదు; విశుద్ధరాజ్య
పాలనమునకె ప్రొద్దెల్లఁ జాలకుండె. 150

యవన యువతులు సాయుధలగుచుఁ దన్ను
వెంబడింప ముత్తెపుసరుల్ వ్రేలు పసిఁడి
పల్లకిని బాటలీపుత్ర పర్యటనముఁ
జేసి నిఱుపేద జనముల చేఁత లెఱుఁగు. 151

భద్ర దంతావళంబులు బలిసి నడువ
నుత్తమహయంబు లెక్కి కౌడుడిగినట్టి
యాశ్వికులు భటుల్ ప్రక్కల నమరి కొలువ
రాజు సైనికుల పరీక్ష లోజఁ జేయు. 152

దిగధిపతి పరివృతు నింద్రుఁ దెగడి పుడమి
ఱేఁడు స్వీయ జయంతు లరీణ వైభ
వములఁ గొమరార నభ్యంజనముల స్నాన
మొనరఁగ ననర్ఘ వసనంబులను దనర్చి
చేరు సభ మండలేశ్వరుల్ చేరి కొలువ. 153

నియతవిధులను దీర్చుచు నీతివిదులు
సచివులును భిషగ్జ్యోతిర్విశారదులును
సన్నిధి వసింప సభలలో జైన బౌద్ధ
బ్రాహ్మణాశీర్వచస్తుతిఁ బడయు రాజు. 154

అట్టివ మహోత్సవంబుల నద్భుతములు
ఖడ్గమృగ మేష వృషభేభరా డ్గరిష్ఠ
యుద్ధములును వినోదార్థ ముద్ధతులగు
వారి ఖడ్గవిహారముల్ ప్రబలుచుండె. 155

ఉచితౌషధ సమృద్ధి నొదవించు మూలికా
లలిత లతారామ కలితసీమ
లండఱును సకాలమందు నాడికలు తె
క్కిడ ఘటికాయంత్ర కేంద్ర వితతు
లలఘు పరిశ్రాంతి కరుదెంచు జనులకు
ఫల కుసుమాశ్రమతల విసరము
లవనిపు మృగయా విహారార్థ మడవులు
వన్యరక్షకములు బహుళసంఖ్య
లచల నద నదీ తటముల ననుపమాన
ప్రకృతి సౌందర్యసీమలఁ బండితయుత
వివిధ విద్యాలయంబులు విరివి గనఁగ
దేశమున నిండె ధర్మనివేశము లవి. 156

అమ్మహీంజానికిని బదునైదుగురు స
తీమతల్లులు గల రందు ధీరవర్ణ్య
పట్టపుందేవి వసుగాత్రి పరిఢవిల్లె
బౌద్ధు లామె సుధర్మగాఁ బ్రస్తుతింతు. 157

తొంబదెనమండ్రు కొడుకులఁ దొడ్డవాఁడు
సుముఖుఁడు 'సుషీముఁ' డలరెను సుమనసుఁడను
పేరు వే ఱది దాల్చిన చారుచరితుఁ
డతఁడు వసుగాత్రికిఁ బుత్రుఁడౌచు వఱలె. 158

బహు కుటుంబియు బహు ముఖ ప్రణయభావ
భరితుఁడగు బిందుసారుండు పద్మనేత్ర
నొకతెఁ గలగని యువ్విళు లూరుచుండు
నామెఁ గన; రాజ్ఞి యొక కంట నదియు నరయు. 159

చేత నొక కట్టుబూని నిశ్చింత బొసరి
తన వయస్యుఁడు కుశలి గదాధరుండు
తత్పరత భోగసౌకర్యతతిని గూర్పఁ
దనరి రిర్వురు ప్రాణముఁ దనువు ననగ. 160

ఒక్కనాఁడు వయస్యుతో నుబుసుపోక
కును నృపుఁడు తాను గల నొక్క కోమలాంగి
క్షత్రకన్యను వనిఁ గన్నసరణి దెలుప
నతఁడు మృగయకుఁ బురికొల్పె నధిపు నంత. 161

## సప్తమధార — కాండసమాప్తి

శ్రీ వేదాత్మ సుధాలయ !
శ్రీ వాణీసేవ్య ! భవ్య ! శేషాహి ఫణ
గ్రావాగ్ర విమానాశ్రయ !
దేవోత్తమ ! సార్వభౌమ ! తీర్థస్తోమా ! 162

సాధితమయ్యెఁ బ్రథమము
వేధస్సతి కురియు నర్థవృష్టిఁ బ్రథితమై
బోధార్థేందు విజృంభిత
గాథాంబుధి సంగమాభిగమ కాండ మిదే. 163



శ్రీరస్తు

# శ్రీ మ ద శో క చ రి త్ర ము

## ద్వితీయకాండము - సుభద్రాంగీపరిణయము

### ఆదిధార — కాండనాంది

ఆశావధిపూర్ణా! భ
క్తాశయ సఫలీకరణ! యనంత దయాంభో
రాశి! మహాపతితాఘ వి
నాశి! యనాద్యంతసృష్టి నాట్యవిలాసీ! 1

పొల్లు పదంబులు దొర్లక
సల్లలిత రసార్ద్రి సూక్తి సారార్థ మథూ
త్ఫుల్లత నా యుల్లమలర
నల్లింపుము కృతిని; వాణి! యబ్జజురాణీ! 2

### ద్వితీయధార — సుభద్రాంగీ ప్రథమ సమావేశము

ఒక శుక్లాష్టమి ప్రొద్దునన్ దినకరుం డుత్సేకర పంకేరుహో
త్సుకతన్ నించిన రక్తిఁ బూర్వగిరిపైఁ దోతేర, భూమీధవుం
డెకసక్కెంబులతో వడిన్ మృగయకై యేతేరు వీరవ్రజం
బాకటన్ గూడ నరణ్యభాగముల కత్యుత్సాహులై చేరగన్. 3

పిలపిల నొండొంటి నెలయించు బెలగాండ్ర
గఱుల క్రొమ్మొలమిలల్ గ్రాలఁ గ్రాలి
జువ్విమ్రాఁకుల నంటి కవ్వ జొంపములతోఁ
గ్రొవ్విరి గుత్తుల నవ్వ నవ్వి,
నింగికి నెగఁబ్రాకి చెంగు చెంగున దూఁకు
సొబగారు లేళుల చూపుఁ జూచి
వలపుల సమతాచు వరుసనేగెడు తెలి
పిట్టల కలకల పిలుపుఁ బిలిచి

కొమ్మ కొమ్మ లుయ్యెలలూఁపఁ గొసరి గొసరి
తలిరుఁ బాన్పులీరంబుల గులుకుఁ గులికి
విపినరమ రాజు డాసిన త్రపవహించెఁ
బొసఁగు వలిపెంపుటివము మే ల్ముసుగు దాల్చి. 4

కందరముల గాలించుచు
నందఱు చని వేఁటగాండ్రు నందంద మృగ
స్పందనముఁ బరీక్షించుచు
బృందములై తెల్లవాఱ బిరబిర నడువన్. 5

రాజు హయంబు డిగ్గి మృగరాజ నివాస కుడుంగరాజ వి
భ్రాజితమైన సాంద్రకుజ పర్వత సానువునందుఁ జొచ్చినన్
వాజుల దౌడుదీయుచు దవజ్వాలనావలి నార్పఁ బంచుచున్
రాజకుమారు లెల్లరుఁ ద్వరన్ విభుఁ జేరిరి ప్రోద్యదాయుధుల్. 6

అద నదె యని వే వేపులఁ
గొదమలఁ గొని, చల్లడములఁ గుచ్చులు ప్రేలన్
బ్రిదులని దట్టీల్ జుట్టియుఁ
గదలిరి వేఁటరులు నడవిఁ గార్ముక కరులై. 7

వారల డప్పులు నురుము ల
వారిత నాదంబులీన వన్యమృగంబుల్
బారెన్ దెసలకు రాజ కు
మారులు మృగయులు రచించు మార్గంబులలో. 8

పుంతలఁ గ్రంతలఁ జొచ్చుచు
భ్రాంతిన్ బొదరిండ్లఁ బాయు పారిముఖికముల్
జంతువుల నేల గూల్పఁగఁ
గాంతారముఁ గోనలెల్ల గాలించి వడిన్. 9

ముల్లీకలన్ సూటి మొనలు నిక్కఁగవిప్పి
దూఁటి కాల్సందులఁ దూఱు నేదు
లొడలి చాఱల జిగిజడియు వృకావలిఁ
బొంచి వెన్నంటి గోండ్రించు పులుల
సెలవుల నీడ్చి మోరలఁ జప్పరించుచుఁ
గోఱలు దూయు భూదార వితతి
బిళ్ల లుండఁగఁ జుట్టి బెదరుచుఁ బొదలలో
నాఁగుచు దాఁగెడు నాళ్వగముల
శశకతండముల సృగాలశతము రేఁచు
కుక్కలను నుడుముల గారుకోళ్ల లేళ్లఁ
జెట్టుపిల్లుల దుప్పుల బెట్టిగులయి
తఱిమి వేఁటాడి ప్రొద్దెక్కుతఱిని భటులు. 10

అటవిన్ ఝరి నొక్కటి గని
యటఁ గాసారంబుఁ జూచి రబ్జగభృంగ
స్ఫుట నటనాటన హంసో
త్కట కలనాదానుకారి ధారాకరమున్. 11

తఱుఁగనివి పూరముల్ కొండ చఱి మలకలఁ
బడుచు స్వర్గంబుఁ జేర్చు సోపనములయ్యె
నవియుఁ గమలాకరముఁ దూఱ నవనవోర్మి
కల నెగసె వాయు సంధిత్సువులుగఁ బొల్చి. 12

అత్తటినీ సమీపమున నద్భుత విక్రమ చారురూప సం
పత్తులతోడ నిందుముఖి మానిని నొక్కతెఁ జాపహస్త, ను
ద్యుత్తపనీయ పుంఖశరధారణ తత్పర, సుప్రయోగ దృ
గ్వృత్తి మనస్కఁ జూచి యధికంబుగ నచ్చెరువొంది రెల్లరున్. 13

పరిచర కలకలముల్ సెవిఁ
జొఱ భూజాని సూచె సుందర రమణిన్
వరవర్ణాలీఢ పదో
త్తర, శరసంధాన కార్యతన్మయఁ దరుణిన్. 14

వీఁపును నొకదెస కరమున్
దూపులఁ గన్గొనె సుదీర్ణదోర్బలము, రుచుల్
దాపిన గండముఁ జొక్కపు
మూఁపును నాతపము నంటు ముంగురుల పసల్. 15

అంతఁ బలుకు సవ్వడి చెవి
గుంతముగాన్, వెన్కఁజూచి క్రొక్కారు మెఱుం
గంతమగు తెఱంగున న
య్యింతియుఁ గ్రక్కునను దాఁటి యెటో మఱుఁగయ్యెన్. 16

ఆ క్షణమున నొక వ్యాఘ్రం
బీక్షితమగుచున్ శరంబు నెదఁగాఁడి క్షుధా
గ్నిక్షుభితాలోకనముల
నక్షీణ రయంబుతోడ నరుదెంచె వడిన్. 17

కర్ణాంత మీడ్చి నారిని
బూర్ణంబగు లక్ష్యయుక్తిఁ బోరనఁ దప్త
స్వర్ణస్ఫీతము బాణముఁ
దూర్ణంబుగ నేసె రాజు దోర్బల మెసఁగన్. 18

గొబ్బున దుమ్మును రేఁపుచు
బొబ్బలు గిరిగుహలనిండ ముఖరితమగు న
ట్లబ్బురముగ దూఁకెడు నా
బెబ్బులి యబ్బాణనిహతిఁ బృథివిన్ బడియెన్. 19

అపు డవనీశుని యనుచరు
లెపుడెపుడని వేచి యప్రమేయ దివ్యరుచుల్
విపులాంగ రక్షకులుగా
నృపు నిపుణతఁ గనుచుఁ జుట్టు నిల్చిన, వారల్. 29

అబ్బురంబు నంది, యా పులి డాసి, త
దంగమందు గాఁడినట్టి శరముఁ
దీసి చూడ, భూపుఁ డేసినట్టిదిగాక
వేఱొకండునుండ, వింతయనుచు. 21

నెరవుగఁ బరికించియుఁ ద
చ్ఛరమున నక్షరములున్న చాయల్ దోపన్
సరగునను రాజుతోఁ ద
త్సరణిని విజ్ఞప్తిసేసి దాని నొసంగన్. 22

తొలిదగు నక్షరం బదియుఁ దోరపు రాపిడి మాసియుండ, నిం
పులు దొలుకాడు 'భద్ర' యని పొల్చెడు పేరు పఠించి విస్మయో
చ్చలిత మనోంబుజుండగుచు క్ష్మాపతి చెచ్చెర రోయఁ బల్వురన్
బలియుర వీరులన్ బనిచె భామినికై బహు సంభ్రమంబునన్. 23

వా రేగిరి నల్దెస లా
భూరమణుఁడు చేతనున్న ములికిని మఱి త
త్క్రూరహతి కిరవు పులిఁ గని
ఘోరాటవిఁగన్న కన్నె బలిమి దలఁచుచున్. 24

'చాలుఁ బురే! బలే!' యనుచుఁ జచ్చిన బెబ్బులి బల్కుచున్ గడున్
గోలముఁజేయు వేఁటరుల గొబ్బున దత్పటవేశ్మరాజికిన్
జాలుగ వీడుకొల్పి, తన సన్నిధిఁ జేరు వయస్యుఁ జూచి "నీ
వీ లలితాహ్వయాక్షరము లీ శితమార్గణరీతిఁ జూచితే!" 25

చెలువం గలలోఁ గంటిని;
కలయును నిజమయ్యెఁ గొంత; కలికిన్ గంటిన్;
గల యర్థము సాకల్యము
ఫలియించునో లేదో ? యెఱుకపడ దిప్పుడునున్. 26

బుద్ధజనని కనియెన్ మును
పిద్ధర మాయాపురంధ్రి యిట్టిది కలయే
సిద్ధించె నదియు; నిదియు ని
బద్ధంబగు నొక్కొ నాదు భాగ్యము పండన్." 27

అని నుడువుచుఁ దను గను భూ
పుని తోడ గదాధరుండు 'పూర్తిగ నెమకన్
గనిపింప దతివయుం జనె
ననితర దృష్టంబు పెట్టె నణఁగు మణివలెన్. 28

ఆమెయు నిన్ను బాసి చన దాత్మ భవత్సుమనోజ్ఞరూపమున్
గోముగఁ దాల్చి యేచఱియకో తప మూనఁగఁ బోయెఁగాక నీ
వా మృగనేత్ర కేడుగడ వయ్యెద వింతయు నిక్కవంబు; స్వా
మీ ! మనసైన నన్ననుపుమీ వెస నీ ప్రియఁదెత్తు' నావుడున్. 29

విని దరస్మిత మూని యవ్విభుఁడు వేచె
వనిత యన్వేషణకుఁ జన్న భటులకొఱకు;
వారు జట్టును వెదకి యవ్వాలఁదిఁ గనక
వెనుదిరుగ విచారంబున మునిఁగె రాజు. 30

ఆ మధ్యాహ్నానంతర
మేమియొ యని పరిజనాళి యెన్నెడు నెడఁ, గు
గ్రామీణు భిల్లుమోరను
భూమిపు భటు లొక్కవార్త పొడగాంచి రిటుల్. 31

ఆ మానిని శిశునాగ కు
లామేయ నృపాలవంశమం దుదిత, వనిన్
భ్రామరమాదిగఁ గుడుచుచు
నేమంబుగ నుండు గుహలె నెలవుగ ననుచున్. 32

విని యది తనమది వెలికిన్
గననీయక పల్కెరాజు 'ఖడ్గకరుఁడనై
దునుమాడితి నని రిపులను
వని డాగిన యనద నేను వధియింతు నొకో ? 33

నైజంబే యిది ? చెల్లె నబ్దశతమానంబా కునందవ్రజం
బోజస్తేజములెల్ల లేనటులఁ బోవో ? చంద్రగుప్త ధ్వజం
బూర్జిన్ క్షేమముఁ దీర్చె శత్రువులె లేరై రేల శైశూన్వయల్
రాజన్యాంగన లుండఁగా నడవులన్ ? కార్యంబు లూహ్యంబులే ? 34

ఆత్రములేవి లేవు దుడుకౌ పను లొప్పవు మా కజస్రమున్
శత్రులుగారు కొంచెమును శైశకులాంకులు శత్రు శత్రులున్
మిత్రులు గారె, వారికిఁ బ్రమేయము లే దిఁక నిర్జనాటవిన్
గోత్రము గోల్కొనం దగని గోడున వాడుచు వర్తలాటకున్. 35

అంచు భిల్లుని బిలువంగ ననిచె నధిపుఁ
డతఁడు నంతకు మున్నె గెనంచుఁ దెలిసి
వీసముసఖుండు విశ్రాంతి కోసరిలిన
పుడికి; సాయంతన విహారమునకుఁ జనియె. 36

నెఱయ విశ్రాంతికని యేగి నేస్తకాఁడు
నంతకున్ ముందె భిల్లుని యాఖ్య నెఱిఁగి
మర్మముల, గుసగుసల్ గొన్ని మాటలాడి
హెచ్చరిక తోడ నడచె నరేశు కడకు. 37

సాయంసమయము! పర్వత
మా యంతికమందె పంకజాకర జలముల్!
దాయలు చలిగాలులు వా
లాయముగా వీచె రాజు వడఁకు గొనంగన్. 38

సామజముల నీడల ను
ద్దామము వెచ్చఁదనపుఁ బటధామ మమరియున్
హేమంతం బిసి రాజుల
నీ మాత్రము నొంప బీద లేగింతు రెటో? 39

చలి కాపులేని కాపుల
నిలయంబులఁ బూరిగుడిసె నెలకొను చోట్లన్
జలిగాడ్పుల మేన్ వణఁకఁగ
నలయింపఁగ నీని యున్ని యంబరము లిడన్. 40

పంచెను మంత్రి మదాజ్ఞను
నించెను మోదంబు సాధు నికరములకు మ
న్నించెను గృహ సహకారా
ర్థాంచద్దానములఁ బేద లర్థుల నెల్లన్. 41

అను భావంబులు వాహకావళిగఁ జిత్తాందోళికన్ మోయఁ, బం
చిన యాందోళనతో సరస్తటమునన్ వీతెంచు నిశ్శబ్ద సూ
న నికాయోద్గమ సౌరభంబులు వినూత్న ప్రీతియున్ మేళగిం
ప నరేశుండును బాదచారియుఁ గరాభ్యంచత్కృపాణుండునై. 42

## తృతీయధార - పరస్పరానురాగవృద్ధి

చనుచున్ గాంచె సుధాకరు
ననుపమ చంద్రార్ధవలయమను తబుకున నూ
తన శీత మరీచి గణో
ధనముల నుడుతతికి నిడెడి తారాపథమున్. 43

అద్దమరేయి నిద్దమగు నాప్త మనంబును బోలి రోచులన్
దద్దయుఁ జల్లనై వెలిఁగి తారలు తోఁడు రహస్యవార్త యొం
డెద్దియొ పల్కువాని వడువేడ్తెర మబ్బులఁ బ్రాఁకు నిందునిన్
సుద్దులు చెప్పలేని విను జోకను జూచుచుఁ బోవునయ్యెడన్. 44

దూరస్వర మొకఁ డంగజు
నారసమయి, చంద్రు చలువ నాని మధురిమన్
దోరంబై సార మధూ
దార సుధారగను దాకి, తత్స్మృతి నింపన్. 45

ఆపాత హిత సుధా తత
మాపోశనఁ బట్టెఁ జెవుల నవనీపతి యు
ద్దీపిత రాగము, రాగము
తాపగతిన్ బాపఁ బ్రణయ తరళిత మిటులన్. 46

## గేయము

మోహనరాగము — ఏకతాళము

రమ్ము రారమ్ము! తుమ్మెదా!

కమ్మని వలపులఁ గ్రుమ్మరించెడు తెలిదమ్మిఁ జూడఁగ నీవు తుమ్మెదా!

ఇమ్ము సువాసన కిరమ్మద మరులకు రమ్ముదయమ్ము తుమ్మెదా ॥ర॥
శ్రోత్ర నీరద మేది నీ గోత్ర జని యుత సుగాత్రి
బ్రహ్మసరసి దేలియాడెడుతమ్మి
మిత్రకిరణ బహు చిత్రిత మధురసము నేత్రసుపర్వము గాదే

రమ్ము రారమ్ము తుమ్మెదా! రమ్ముదయమ్ము తుమ్మెదా ॥ 47

గో గోపాలురు మోదమున్ బొరయ సాంగోపాంగమై మున్ను, రా
కా గాథాచ్యుత గానమున్ వెలసె రాసాంభోధిఁ దచ్ఛేషమే
మో, గీతం బఖిలావకాశము ననుస్యూతంబు విన్పింప నే
ఘో?, గాథాలహరుల్ హృదంతికము లుద్భూతంబులై పార్లినన్. 48

తన యవ్యక్త మధుర భా
వనల సరస్తటము పజ్జఁ బంటించుచు, నం
చున, దాపల విశ్రాంతిని
గని, భూపుఁడు మందిరాభిగమనుం డచటన్. 49

తనకు వయస్యుని బ్రియగుణు
ననలెత్తు వచోవిధాన నయ నిపుణతలన్
వినయము గల్గిన బ్రాహ్మణు
ననితర సులభున్ గదాధరాఖ్యున్ గనుచున్. 50

"నీవును బశ్చాద్గామిగ
నీవృత్తం బరసినాఁడ వెఱుఁగుదు కలయున్
ధీవరుఁడవు మిగిలిన పను
లేవైనమొ తీర్ప వలఁతి వీ"వని పలుకన్. 51

సందేహము వల దిఁక నా
సుందరియే నిన్ను జూచి సొగియించెఁ గృతిన్
బొందుపఱచెఁ దన యునికిని
కుందేమియు లేక నేను గోమలిఁ జూతున్. 52

భిల్లుఁ డామెకు భృత్యుండు; ప్రేమగీత
మువిదయే పాడెనని రాజు నూఱడించి
తాను భిల్ల నివేశ కాంతారమునకుఁ
బోయి యాతని తోడొంది పొలతిఁగూర్తుఁ
దప్ప కని గదాధరుఁడు వాగ్దాన మొసఁగ. 53

జనపతి యారేయిఁ గడపి
తన నగరికి మరుదినంబె తరలిన, స్వజనం
బును దోడన్ జనె, గతిపయ
దినములు నెలలున్ సతీదిదృక్షన్ జెల్లెన్. 54

## చతుర్థధార - సుభద్రాంగీ సమన్వేషణము

జేనిని వీడ్కొని భిల్లుని
కానఁ దరుణి కుందదంత కన్యామణి యెం
దేని వసించు ననుచు న
న్యానాన్వేషణ సమీక్షణుఁడు విప్రుండున్. 55

పోయి పరిచిత భిల్లుని డాయుకొఱకు
తన్నికేతన నామముల్ దఱచి యడిగి
మే మెఱుఁగమని కాననధాములెల్ల
నొక మొగిని జెప్పఁగ నిరాశ వెకలిగాక. 56

కాలి వాపులఁ బాపఁగఁజాలు లేప
నాలి, లో జ్వరమ్ములఁ గొట్టు తాలిమందు,
పులుల బంధింపఁగల యంత్రముల తెఱంగు
హైరికుల వాయిఁ గట్టుట లరయఁ జెప్పి. 57

భిల్లుల కుల్లాసంబుగ
నిల్లిలుకడఁ గూరుచుండి హితవచన రతిన్
మొల్లము గూర్చెను వేడుక
లుల్లంబులు పల్లవించి యుత్సుకత గనన్. 58

ఆ గిరి కారుకోనల నహర్నిశముం దిరుగాడు భిల్లులున్
బ్రోగయి వంతులన్ గొని పురోగమనంబుల జాఁడదీయఁ దా
నేగుచు నద్రిసల్ శిలల నెక్కుచు జాఱుచుఁ జేరి చూచె నా
నా గహనశ్వదంష్ట్ర విపిన ద్రుమవార నిరుద్ధముల్ గుహల్. 59

ద్వీపినఖ నికృత్త వికృత జంతు కరంక
కలుషిత కందరాంకహ్రదంబు
లిరుకు త్రోవలఁ గన్ను లిరులఁ గమ్మి భ్రమింప
దరి కానరాని లోఁతైన చఱుల

ఖదిర తాళ రసాల కందరాల వటద్రు
మామ్లిక కనక చ్ఛదాత్తవనుల
శిత కులిశాహతిఁ జీలి అంపపుఁగోత
రకములఁ జూపు నిట్రాయిగముల

ఘోర భూదార దంష్ట్రా కుఠార హతుల
ఝీరికల రసంబులు బంకధార లొలుకఁ
గంటక లతాప్రతానంబు లంటియుండు
నడవి తెన్నుల నెన్నుచు నడచి నడచి. 60

చని చని చూచి చూచి యిఁకఁ జాలుఁ గనుంగొనలేము లేమ దా
పున వసియింపదంచుఁ దన పూన్కికి భిల్లులు స్వస్తిచెప్పఁ, జ
ప్పన బడి, మిట్టపై గుడిని భక్తుల పెన్నిధియైన పార్వతిన్
గని, చనుదేరు టొప్పగునుగా యనుచున్ నెలమూఁడు ప్రొద్దునన్. 61

గోకరీషంబు బూడిద కొంత రాచి
దంతధావన మొనర గదాధరుండు
కోవెలను జెంచు పూజారి కుటికిఁ జొచ్చి
దేవి సన్నిధి వాకిలి తెఱవఁగోరె. 62

ముసలి యవ్వయు నొకరిత వెసనమింత
తీర్పఁగల మందు చెప్పితి దేవునివలె
నీవు నాదు కోడలికని నెనరు దోఁపఁ
బలికి తాళంబుచెవి నీయ బ్రాహ్మణుండు. 63

అల్ల సుషేణుం డనఁబడు
భిల్లుం డెవఁడేని కలఁడె? వినుపుము వే ఱొం
డిల్లున దుర్గార్చన యీ
పల్లెన్ గలదోక్కొ? నాకుఁ బనిగలదన్నన్. 64

అవ్వయు విని తల యూపుచు
నెవ్విధ మాపేరు నీకు నెఱుఁగఁగ నయ్యెన్
మవ్వంపు రహస్యము, దుర
గవ్వయు ! చివ్వకును దెరువుగాకన్ జెప్పుమా ! 65

అని యడుగ గదాధరుఁడును
మునుపొక భిల్లుఁడు, స్వనామమున్ దెల్పి ననున్
గన రమ్మనె దుర్గమ్మ స
దనమే తన యిల్లటంచుఁ దానై పల్కెన్. 66

భిల్లు లందఱ నడిగితిన్ బొల్లుగాదు
యెవ్వఁ డట్టిఁడు లేఁడని యెల్లరనిరి;
దుర్గ యిల్లెక్కడున్నదో మార్గమెఱుఁగు
వారె కానరా రీ భిల్లపల్లి యందు. 67

అనిన విని యింత నవ్వి యా యవ్వ "విబుధ !
తొలుత నడుగవదేల నే దెలిపియుందు
భిల్లుఁడు సుతుండు నాకు మా వేల్పు దుర్గ
అధిపు మది నెఱుంగమి వాఁడు నంతె పల్కె. 68

శైశ్యకులదేవి దుర్గను సాంపరాయ
సమయములనె యర్చింతు మా స్వర్ణమూర్తి
నిచటి బిలమున నుంచితి మెవరు నెఱుఁగ
రంబ పూజారిగా మాత్ర మతఁడు నెసఁగు
నా కొడుకు నామ మెఱుఁగఁ డెన్నఁడు నెవండు. 69

శైశ్యులు 'సుషేణు' లనుట, శాశ్వతపు బిరుదు,
వారి వంశాంకురముఁ, దన్ని గారవమున
బొరయుచున్నాఁడు, శంపాఖ్య పూజ్య విప్రుఁ
డక్కడకు రాచకూఁతురు నంపి కొడుకు
మరలి వేగిర మరుదెంచు మాపొ, రేపొ." 70

అనెడు నవ్వుచే కలవిధం బంత యెఱిఁగి
కటకటా! దుర్గ యడవిలోఁ గలదటంచుఁ
దిరిగి వేసరినాఁడ నిదే యొనర్తుఁ
బ్రణతు లని సొచ్చె గుడిని గర్భాలయంబు. 71

అవల గడియలోన నరుదెంచె గృహపతి
యతని విప్రుఁ డరసి యహము లిన్ని
యెచటి కేగినావొ యెదుఃరువచ్చితి వీవు
కడకు విజయ మొడిని గట్టి తనిన. 72

క్లిష్టతనుఁడగు నతని యింగితము నెఱిఁగి
'యరిగి యుంటిని జంపాపురాంతరమున'
కనుచు భిల్లుఁడు నుచితోక్తి నతని కుశల
మడిగె, విప్రుండు ముదమయ్యె ననుడుఁ జెంచు. 73

ధీశస్తుఁ డొక్క విప్రుడు
శ్రీ శంపాఖ్యుఁడు వసించు శ్రీల నెలవు న
ష్టాశల గల యేలికలకుఁ
ప్రాశస్త్యము నించు 'చంప' ప్రాఙ్మగధమునన్. 74

చంపన్ విప్రుల కనులకుఁ
దంపున్ సొంపొనరఁ దల్లి తల్లియుఁ బ్రేమన్
బొంపిరి వోవగఁ శంపుని
బెంపుడు కొమరిత 'సుభద్ర' పేరునఁ దనరున్. 75

శైశనాగవంశజనిత సకల బంధు
వితతి తలిదండ్రులున్ గాల గతిని జెందఁ
దల్లితల్లిని, దన్ను నితాంతకృపను
శంపుఁడున్ బ్రోచె; విలువిద్య సాంగమపుడ
చెంచు గూడెంబులో నేర్వఁజేరె ననియు. 76

మనవిం జేయుమఁ జెప్పు వేగమ మహాత్మా! కరమ్మేమొక్కో ? నే
నును జోటింగొని పెంపు దంద్రికడ మున్నున్నట్టులే చేర్చి, యా
మెను వీడ్కొంటి నిఁకేమి యాజ్ఞ యనఁగా మేలంచు విప్రుండు బే
రును నిక్కంబు నెఱుంగ కిట్లడవులన్ రోఁతన్ గడున్ దూలితిన్. 77

విభుని యనురక్తి దార్ఢ్యంబు వెలఁది యెఱుఁగు
దాఁక వలదేమిసేయ, గీతంబు విన్న
పిదప పతికి నే భావన ల్పొదలు వాని
నరయు మంటివి, కాని రావైతి వీవు. 78

రాజు కన్నెనుడువు రాగంబు విన్నంత
నధిక రాగయుక్తుఁడగుచుఁ బంచె
నామె యునికి మనికి నరసి కన్గొనుమంచు
నేను గంటిఁ గాన నెల్ల రోయ. 79

అనినన్ జెఱునగ వానన
మున నించుక తొంగిచూడఁ బూజారి నికే
తనమున్ జొచ్చి నిజాంగన
వినిపించిన వృత్తమరసి విప్రునితోడన్. 80

అరమరికలేక సత్యము
నిరవొందగఁ దెల్పె; నంబయెదుట నిరువురున్
గురు సఖ్య బద్ధులయి యు
త్తర కార్యాచరణ రక్తి తత్పరు లగుచున్. 81

దేవీపూజ ముగించి య
నావిలమతిఁ జర్చచేసి, యాపై జరుగం
గా వలయు పనుల నెల్లను
వావిరిగాఁ దీర్చి రచట వ్యవసితములుగన్. 82

అంత వావదూకుఁడైన గదాధరుం
డంబ భక్తుఁ డనుప నాస్థనేగి
కరువ త్రోవఁబట్టి గిరి పాదమును జేరె
విపిన సీమలెల్ల వెనుకఁబడఁగ.    83

బిర బిర నాతఁడున్ జని కవిప్రకరాస్తిక విప్రవాస సుం
దరమయి పొల్చు చంపపురి డగ్గఱి తీర్థవరంబుఁ జంపలో
నుఱికి నిమజ్జనం బొనర నూరికి వెల్వల నొప్పుకో వెలన్
బరువడిఁ జొచ్చి యచ్చటఁ గృపానిధి శంకరుఁ గొల్చి పిమ్మటన్.  84

శంపుఁడను విప్రవర్యు నిశాంత, మతని
వర్తన, చరిత్ర, నక్కడి బ్రహ్మబృంద
మెంతొ గారవంబునఁ దెల్ప నెఱిఁగి నృపతి
మిత్రుఁ డా కార్యవేది సంప్రీతుఁడయ్యె.    85

బ్రహ్మసభ జాతకంబున రవి తృతీయ
మున రిపుస్థితుఁడైన పట్టున ఫలంబు
జ్యోతిషమునుఁ బ్రస్తావించు సమయమొరిమఁ
దనకు నవకాశమనుచు గదాధరుండు.    86

పారాశర్య విధానం
బారూఢిన్ జెప్ప నచటి పండితులు జయో
ద్గారంబుల మెచ్చుచుఁ దన్
గోరుచు గృహములకుఁ బిల్వఁ గూర్మిన్ జనియెన్.    87

సారిది శంపుని పరిచితి కరుడుగట్టి
స్నేహమయ్యె; సుభద్రాంగి చెలువుదనమె
కాక సౌశీల్యమును గాంచి, యాకె రాజ
పత్ని కాఁదగునని యెంచి పాఱుఁ డంత.    88

ఒకనాఁ డింటికివచ్చి ప్రేళ్లతుదివం పొక్కింత యొయ్యారముఁ
ప్రకటింపన్ రహిమించు మ్రుగ్గిడిన శోభాంగిన్ సుభద్రాంగిఁ ద
న్నికట శ్రీ తులసీముఖం బలరు దొంతిన్ జేర్చి యర్చించు ను
త్సుకతం గన్గొని జాతకంబుఁ గొనె రాసుల్ శ్రద్ధ నీక్షింపఁగన్. 89

కర్మపతి కరిదృష్టివైకల్య మెట్లొ
స్వల్పముగ నున్కి నించుక జాగుగాని
సుదతి సమ్రాట్టుపత్నియై సొబగుఁగనును
నిక్కువం బిది యని మది నిశ్చయించి. 90

పుత్రారూఢవిభుండు పూర్ణబలుఁ డా పూర్ణేందుఁడున్ శుక్రుఁడున్
బుత్రాధీశునిగూడ షడ్బలము లింపున్ గూర్ప మిత్రస్థుఁడై
మిత్రుండున్ విలసిల్లె భాగ్యపతి జామిత్ర స్థితిన్ బొల్చె ని
శ్శత్రుండౌ సుతుఁడంచు రాజసఖుఁ డుత్సాహంబు దీపింపఁగన్. 91

తెలిపెన్ దండ్రికి నామె భావి ఫలరీతిన్ బ్రాతి నూహించి వే
కలుగంబోవు శుభంబు లిట్లనుచు నీ కన్యామతల్లిన్ నృపేం
ద్ర లలాముం డొకఁ డుద్వహించుఁ బడయున్ దత్సూతియున్ భూమినా
థుల మ్రొక్కుల్ నత శీర్షరత్నరుచి విద్యుత్తుల్ విడంబింపఁగన్. 92

దుహిత రాణి యీననుట యెంతో ముదంబుఁ
గూర్చిన, 'నశోక' యను ననుగున్ సుధాత్రిఁ
బిలిచి కలవృత్తమెల్లను బలికి విప్రుఁ
బరిచితునిఁ జేయ, నా యవ్వ, భావి కార్య
గతుల మంతనమాడి సత్కృతునిఁ జేసె. 93

వెనుదిరిగి గదాధరుఁడున్
జని చెంచుల పల్లెఁ జేరె, శైశాన్వయ భ
క్తుని భిల్లుని గాంచియు మం
తనమాడి యనంతరంబు తగు నెర వెఱుఁగన్, 94

భిల్లుం డాతని గని సుఖ
సల్లాపము లందినేర్చె జరిగిన వృత్తం
బుల్లములు కలఁక దేరిన
నుల్లాసము లుభయు లంది యీ మఱునాఁడే. 95

ఉసిరిక యూరుఁగాయ జవులూరెడు కాకరకాయ గొజ్జు పై
మిసమిస మీఁగడల్వోలయు మేల్దధి మాహిషముల్, సువాసనల్
గొసరని యావునేయి, ఘృథముల్ బదునేచు, పొగల్నిగుడ్చె పెం
పొసపెడు పుల్గమింత, తలకొక్కటి ముద్ద ననంటి యాకులన్
మెసవిరి, వేకువన్ వెస నమేయ రసానము వేఁడి బోనముల్. 96

మూఁడు నెలలకుఁ గృషికబ్బె మూలమనుచు
గుట్టుపు సవారులన్ వారు గోసముననె
పోవఁ దూర్పు గట్టెక్కె విభావసుండు
రమ్య కిసలయ పాళి తుఱంగలింప. 97

స్వాగతమని పేర్మి నుదయ
రాగము నేత్రింత నింగి రాయుచుఁ బలుకన్
వాఁగుఁ బసిడికంటి పులుఁగు
నోగించుక బాగు పిదప నొగినగు ననుచున్. 98

వర్షఋతువేగ వచ్చు నిష్కర్ష నవ్వ
యొరసె ననుచు సుషేణుని సరసఁ దడవి
వారి సౌకర్యములఁ గూర్పవలయుననుచు
భూభుజసఖుండు పాటలీపురముఁ జేరె
పదటు పయనంబులన్ భిల్లవరునితోడ. 99

"శిశిరం బుడివోయెను, నా
వశము భువన"మను వసంతు వారువములకున్
విశదము లయ్యెను ద్రుమాఁకుల
నశనంబులు నూత్న కుసుమ హరితఫలంబుల్. 100

రెండు నెలలు గాచుకొనుట గుండె చెదరి
కమలినీ వీచికలఁ దోఁగు విమలహంస
లలరుల మరందకణమూను నళులపిండు
ననమొనలుఁ, ద్రుళ్ళిపడ వసంతప్రభుండు
నిర్వ్యాజ గ్రీష్మధాటికి నిష్క్రమించె. 101

ఖరకరుఁ డినుఁ డుగ్రుండై
చరియింపఁగ, భరములగుచు సాగె నహస్సుల్;
విరులును బన్నీరముఁ గ
ప్పూరములు నసదులుగఁ దోఁచె భోగులకెందున్. 102

మృగతృష్ణలు దవవహ్నులు
తగు తెరువులలోఁ బ్రపావితానము, నెఱియల్
సెగవొగ లెగచెడు మంగల
ముగ మండు ధరన్, బరాగములు మెండుకొనెన్. 103

ఉదకము జ్లాలమి నుతుకు లావములకు
రజకులుఁ గుమ్మరుల్ రచ్చకెక్క
బురదఁ బొర్లెడు నెన్మపోతులుఁ బందులు
నీరువట్టని ప్రక్కయూరికేగ
జల మింకి యడుసైన నలినాకరాంబువుల్
గ్రుక్కుచు మోరల గువ్వలెత్త
వడగాడ్పులకు వాడి నీడఁ జిల్లులు వడ
నెండిన జొంపంబు లింకు వ్రేల

క్లాంత దిక్సఖంబులును, సమ్లానముఖము
లగు నిదాఘపురేలలో హోళి, బొమ్మ
లాటలాడించి రైతులు నంతగోరి
రావటము దుక్కిఁగొల్పి, వర్షాగమంబు. 104

శ్రావణకాలపాలుఁడు నిరంతరవృష్టి వితీర్ణవర్షుఁడో
దేవర జీవనంబుల నదీనద కూప సరోవరావళిన్
భూవలయంబు నించి ససిఁబోసిన కర్షకకోటి మెచ్చఁగాఁ
గోవిదుఁడై చరించెను విఘూర్ణ ఘనాఘన చారచక్షువై. 105

రాచకన్నెయె యాగాని, బ్రహ్మాణివలె
తాను కన్నబిడ్డగఁ బెంచెఁ గాన నాపె
మంచి యయ్యకుఁ గట్టగా నెంచు శంపుఁ
డెంతో చింతించు కటక సంక్రాంతి, కడచ
నగ, నభశ్శుక్రవారముల్ నాల్గువోవ. 106

## పంచమధార - సుభద్రాంగీ రాజాంతఃపుర ప్రవేశము

నోఁచెనె రాజ్ఞిగా మన ననూన ఫలోద్ఘటనానుషంగ, కా
ర్యాచరణం బవశ్య మనుయాయులు మెత్తురో వత్తురో మరే
యే చరితంబులన్ దడవ నేమిషాసంగునో యంచు నూర్చి, కా
నీ! చతురాస్యుఁడున్ మునుపు నిర్ణయ మెవ్విధిఁ జేసెనో యనున్.107

అనుఁగున్ గోమరిత యగుఁగా
కనయమ్మగ రాజుతోడ నగునే వియ్యం
బను, నారాటముఁ బడు,
పనుపడి శోభనము పండు పథమేది యనున్. 108

అయ్యెడ సమ్మహోమహుని యంగన నాథునిఁజూచి యిట్లనున్
"వెయ్యనునేల? రాచతగవేగద? పల్వురు భార్య లున్కి; యా
న్యాయ్యమె రాకుమారికి; జనంబులు మెట్టినదయ్యొ బాట, యీ
నెయ్యముఁ జేయఁగాఁ దగు ననిష్టములే దొక డిందు నందునన్."109

అను తన యర్ధాంగీ మణి
వినయ వచోర్థము మదిన్ ద్రవింపగఁజేయన్
గని, యే మందువు దీనికి
మనసు దిటంబుగ నశోక! మాటాడు మనన్. 110

వర్షఋతువు వేగునంతకు వత్తుమనమె ?
పాటలీపుత్ర నగరంబు ప్రాంతకాదె
మన గదాధరునకు ? నతం డనవరతము
బిడ్డ క్షేమంబుఁ గోరు; సుభిక్ష మిప్పుడు !
జనదె సార్వభౌమ పుటభేదనముఁ జేర. 111

మీర లిరువురుఁ బుత్రితోఁ జేరి రాజు
నగరి, విప్రులవాడలో నెగడి చేయుఁ
డధ్యయన వృత్తి మనుచు; సాధ్యప్రయత్న
మంతిపురి దాదినౌదు సుమ్మనె నశోక. 112

ఈమేర సుభద్రా మా
తామహి, ధాత్రి, యైన వృద్ధ, తద్ధితముగఁ బ్ర
జ్ఞామిత యగుచున్ నుడివిన
నామోదించిరి భవిష్య దర్థ నియుక్తిన్. 113

కొడుకు కోడలి యిలు చక్కనిడుచు నెసఁగ
సంతసించుచు పితృపక్ష మంత చెల్ల
సకల సంభారములఁ జేర్చి శంప దంప
తులు ననుంగుఁ బెంపుడు కూఁతుతోడఁ గూడి. 114

పోయి పల్లెల మజిలీలఁ బోయిని బెట్టి
నిత్య పారాయణాహ్నిక నియతి నిల్చి
కడకఁ గతిపయ వారముల్ గడచి, వారు
నడక నేగిరి పాటలీనగరిఁ జేర 115

అటనెయున్న భిల్లుఁ డాదృతి వారల
కిరవుఁ జూపెఁ; దనకుఁ దెలుఁగు గలప
నమిత బోధనిలయ యయ్యశోకయు వేగ
నరిగి దాదియయ్యె నంతిపురిని. 116

"పన్నె యుక్తిని విప్రుండు నున్న యర్థ
మును వచింపఁ డర్థించియు" ననుచు రాణి
సరవిని గదాధరుని చెఱసాల బెట్టు
టాకళించె భిల్లునిచే నశోక యపుడు. 117

ధరణిపునిచెవి కా వార్త దార్చుమునుపె
నంతిపురి నొక్కఁడు రహస్య హర్మ్యమందు
బద్ధుఁడయి గదాధరుఁడు వెల్పలికి రామి
నరసె నవ్వ బంధనపుఁ గృహంబు గుఱుతు. 118

వేదానుష్ఠాన విదుం
డై దైవాఱెడు మనీషియను సద్యశమే
ప్రోదిగ శంపునకున్ గడు
మోదం బిడె ఛాత్రరత్నములు గుమిగూడన్. 119

దినము మందాకినీ తీర్థమున మునింగి
నిత్య నైమిత్తికాదుల నెఱవహించి
భూతహిత భాసురాచార పూర్తి నెగడు
నాతఁ డచిరకాలమున విఖ్యాతిఁ బెంచి
పాటలీపుత్ర నగరాన బ్రాఁతపడియె. 120

అపుడపుడు నృపసదస్సుల
నిపుణుల, షడ్దర్శనములు నిగమంబులకున్
విపుల వ్యాఖ్యానములగు
లపితంబులఁ దృప్తిపఱచు లగ్గానగూడన్. 121

అంతం గొన్నినెల ల్గతింప మటుమాయంబై నిరీక్షించియున్
జెంతన్ రాఁడు గదాధరుం డకట! నిర్జీవుండొ? దోషంబు నా
వంతైనన్ జెఱలో నిబద్ధుఁ డొకో? ఏ వార్తన్ వినన్ లేదు రా
జాంతస్సౌధముఁ జేర్ప గూఁతు నెటులన్ సంధింతునో యంచు స్వ
స్వాంతంబం దురు సంశయంబు గదురన్ శంపుండు నిర్విణ్ణుఁడై. 122

కడుఁ గలంగుచు నేకాకిగాఁగ దాది
యున్న తఱి వేచి యామెయు నున్నరీతిఁ
దనకు నెఱిఁగింప నవలి కర్తవ్య మరసి
కుతిలపడక, కర్జముదీటుగతిని నెమకె. 123

శృంగారముఁ గై సేసిన
యంగజు ముంజేతి చిలుక యందమున సుభ
ద్రాంగీ లావణ్యాకృతి
ముంగొంగు పసిండి మాడ్కి మురియఁగఁ గనుచున్. 124

అరయ ననిర్వేదమె సిరి
కిరవుగదా! యడలు టుడిగి యే నియ్యెడలన్
సరియగు కార్యారంభము
నురుశక్తిన్ జేయు టొప్పు నూర్జితమనుచున్. 125

విప్రులును రాచవాడలఁ బేరుదీసి
మాటసందులఁ బొగడంగ మాన్యుఁ డతఁడు
రాజబంధువుల్ దన కనురక్తులగుడు
బుత్రికార్థంబు హిత యత్నపుష్టిఁ గనియె. 126

ఒక పూటన్ జను రాజసౌధమున కాత్మోద్దేశ మీడేఱ, నే
సుకరోపాయము చెల్లునంచు నట గోష్ఠుల్ గూర్చు భృత్యాలికు
త్సుకతం గొల్పుచు నొండు రోజున గుణజ్ఞుల్ పిల్వఁగా రాజ వా
చిక నిష్ణాతుల పల్కుఁదేనియల కాశించున్ స్వకార్యార్థియై. 127

తొలుత ద్వారపాలుర మైత్రి దొరయఁగూర్చి
పిదప నృపబంధువుల మదు లదుకనేర్చి
యవల శుద్ధాంతమునఁ బేర్మి నరయఁదార్చి
యతివ నటకుఁ గొంపోవ సమ్మతులఁ బేర్చి
కడఁగి కర్జంబు నొక దరికడకుఁ జేర్చె. 128

హర్షాతిశయాంచ స్మృతి
నార్షోచిత సుప్రతీతి నాగమసూక్తుల్
వర్షాగమ పర్జన్యో
త్కర్షధ్వనితోఁ బఠించి కమ్మఁగ నతఁడున్. 129

పయనంబై చూపఱకున్
దయనీయావస్థ వెలికిఁ దార్చక సుతతో
మయసభ మఱపించు నృపా
లయ గత మభ్యంతరస్థలంబును జేరెన్. 130

ఆకాశంబునఁ బ్రణయిని
రాకా కోకారి దృష్ట రజనియుఁ బతి న
స్తోకోడు సుమ స్తబక
స్వీకరణముఁ జేయఁగోరి వెన్నంటు నెడన్. 131

విశ్వశ్రేయోగతికి న
నశ్వర నిశ్రేణియైన నారాయణి కా
త్మేశ్వరికిన్ బ్రియతమమా
నాశ్వయుజం బందు నుత్సవాగతు నతనిన్. 132

సంకేతము రీతి నియో
గాంకుం డొకఁ డరుగుదెంచి, యనఘా ! సచివుం
డుంకించి రిపులఁ గలనన్
జంకించిన విధము వినుచు జనవిభుఁ డుండెన్. 133

ఇంచుక విళంబమగు మీ
రంచితముగ వేచియుండుఁ డనుచు వచింపన్
మంచిదని మీనమేషము
లెంచుచు విప్రుండు మది సహించెన్ దడవున్. 134

తన పితుఁడు గదాధరుఁడును
వెనుకబడన్ శుభముగూడ వెనుకయ్యె నటం
చనుమాన వ్యసనోదధి
మును కిడునంతన్ నరేశు ముదలయునయ్యెన్. 135

ఆ వసుధాధినాథ సవిధాంగణసీమ వివేక శీల సం
భావిత యౌవనోజ్జ్వలిత పార్థివముఖ్య విలోకనప్రభా
ప్లావనభీత పుష్పశరలాస్య విలాస తనూలతం బ్రియం
బావపిలన్ వెసన్ బడుగు బాపఁడు నిల్చె యుపాయనంబుగన్. 136

భూవలయనాథ! నీవున్
దేవిగ గ్రహియింపు మింతి దీనం బ్రాదు
ర్భావంబగు శుభమనుచున్
దీవెన వేదోక్తి జెప్పి తెఱవను జూపెన్. 137

రాజు వనమునఁ గన్న సరోజవదన
యును సుభద్రయు నొకటిగా నుగ్గడింపఁ
డెదుటనే మంత్రి పరిషదు లెసఁగుచుండ
దెసలఁ గను శ్రోత్రియుండు ఛాందసుఁ డతండు. 138

శాత్రవ విజయోత్కంఠయు
నేత్రములం దొలుక భూమినేతకు మదిలో
క్షాత్రమలము నా తరుణ మ
పాత్రమ! పూర్ణ వరణీయ భావంబులకున్. 139

మానిత రూపవల్లరియు మార్గ్యమె భూసుర నిష్కుటాంతరం
బైన నటంచు రాజు తన యాకృతి నించుక జూచుచెంచి, యా
మానిని లజ్జఁ గన్గొనుచు, మస్తక మించుక వంప గాంచి చం
ద్రానన నెన్ని యంతిపురి కామె సుమధ్యమ నోమఁ బంచినన్. 140

మరుసటి దినంబునన్ ద్వీపాంపతియు న స్త
మింపకయ రాణివాసంబు నెలతఁజేర్తు
నని వచించి శంపుఁడు రాజు నానతిఁ గొని
మగుడ నింటికి వచ్చె నమ్మగుడఁ గొనుచు. 141

రెండవనాఁడే పయనపు
బండుగ యొనరించి, కూఁతు భావిని సంప
న్మండితముసేయ, హిత వా
క్తండములన్ భార్య వల్క, గార్యోన్ముఖుఁడై. 142

అప్పనజేయుమన్ ముదల, యాదలఁ బాలనుబోసినట్టులై
యుప్పును మోయు శాబకుని యొప్పున నొప్పులకుప్పఁ గూఁతురున్
జప్పున వెంబడిన్ గొనుచు సంజె తరిన్ నరపాలవల్లభల్
జొప్పడి నిల్చు నుప్పరిగ సొంపుఁ గనుంగొని యాతఁడేగఁగన్. 143

అందెల రవళి మున్ముందె యన్పెడు శ్రుతి
కల నినాద మరాళగమన గరిమ
చను వ్రేకఁ గునియు నా తనుమధ్య నడి తూఁగు
కంఠీరవావలగ్నంబు కొమరు
మిలమిల మెఱుఁగుల మలయు చూపుల మీలు
పంకేజ సన్నిధి నుంకు చలువ
స్నిగ్ధ సుదీర్ఘ వినీలకుంతల రాశి
తమమూను జడిమబ్బుగముల పెంపు

దెలుపుచుండఁగఁ బ్రకృతియే కొలువుపీడి.
కొండ దిగివచ్చి నడయాడఁ గోరె నన
మెఱుపుఁ దొలఁకు సుభద్ర సామీప్యమొరయఁ
గాంచి రచ్చెరువున రాచగరితలెల్ల. 144

"ఇంతలు రేఖ లుట్టిపడు నింతిని దేర వివేకహీనలై
మంతనమందు బాసలిడమా ? మును భూసురుతోడ; నేఁ యీ
చింతలు ? వల్లభుం డెఱుఁగఁ జీరఁడె సుందరి నీమె చెంతఁ ? దా
నంతటఁ బుట్టు మా కథల కంత మిసీ !" యని కుంది రెల్లరున్. 145

"కానీ ! యఱుతం దాల్చిన
నే నాగము కఱవకుండు ? నెది యెట్లయినన్
బోనీ, నుడివిన యొడువున
మనమున్ నడుపుద"మటంచు మదవతులెల్లన్. 146

రా రమ్మని చేరఁగఁ జని
గారాబము మెయిని బిల్చి కన్నెఱికము సొం
పారఁగ రాజ పురంధ్రులు
సైరంధ్రిగ నామెఁ జేసి సరుసుకొనంగన్. 147

సంతసము వహించియు భూ
కాంతఃపుర మామెఁ బ్రోవ నర్థించియుఁ దా
నెంతే నాశీర్వితతిన్
సంతల సంగతిని జెప్పి శంపుం డరిగెన్. 148

షష్ఠధార : రాజు విచారము - సుభద్రాంగీ పునస్సమావేశము

పదియు నెలలును దరలె నప్పద్మనికథ
తెలియరాలేదు; విప్రుండు మరలఁగి రాఁడు;
మలల మలయిక నేమేని మఱకువ రుజఁ
బొరసి యుండెనో ? మఱియేమి సిలుగుఁ గనెనో ? 149

కన్నెరూపును బూర్తిగాఁ గనఁగనైతి
నతివఁ గని యరిగాపయి యడరలేనె ?
పొలఁకువయె కానరా దెటు పొలయువారొ ?
పురల కెచ్చోట వేగులు మసలి రారొ ? 150

శంపుఁ డీ కన్య స్వమాట్టుజనని గాఁగఁ
జెప్పె; నా వీరవనిత యీ చెలువ యగునె?
యనుచు వనరుచు రాజేంద్రుఁ డప్పుడపుడు
కన్యఁ జూడఁగఁ గాంక్షించుఁగాని రాణు
లామె నృపుకంటఁ బడకుండ యత్నపడిరి. 151

దాస దాసీజనంబులఁ దారతమ్య
మరయుచు సుభద్ర చల్లన మనసు దనియ
మంచిమాటల నాడుచు మాపు తేపు
నవుచు వారికిఁ దలలోని నాలుకయ్యె. 152

ఊడిగమ్ముల నెల్లప్పు డోర్పు నేర్పు
దనుక నొనరించు; నేమియుఁ దనకుఁ గోర;
దింతెయని, రాణులెల్ల నిశ్చింత నోరిమి
కల సుభద్రాంగి కుందక కొలువఁ గనిరి. 153

వలపించు నలుఁగుల నలఁదుచుఁ బన్నీటఁ
గడిగి జిల్గుల మేను దుడుచువేళ,
నీళ్ళోగిరములు నంజుళ్ళు ప్రభ్వీణులు, త
న్నడిగి, తర్ష ముమేరగుడుచువేళ,
నిడుదలౌ కుటిల వినీల కుంతలముల
జడలల్లి చొల్లెముల్ ముడుచువేళ,
తావుల వన్నెలఁ దనరు పూవుల సరుల్
మురిపించి తుఱుముల ముడుచువేళ,

మొనసి సొలసి, సుభద్రాంగి, వినయకలశి,
మలయు, లేచు, రాణులతోడఁ గలయుఁ దెలియు
నర్మమర్మమొఱపు; సిగ్గునఁ విభుండు
ధారసిల్లు సమయాన నంతంత దొలఁగు. 154

రాజముఖాంబుజాతము దిరంబుగఁ జూడ నుదాహృతుల్ పురం
ధ్రీ జనులొడ్డు చూపుగమి తేటగ నేర్పఁగ, నాఁడు నాఁటికిన్
మోజిగురింప ముగ్ధయు నమూనలు దిద్దుకొనెన్, గనీనికల్
తోజుగఁ జేర్ప నేత్ర లస దున్నయ మీలనమేళనమ్ములన్. 155

భవ్యపాణిగృహీతి కానున్న యామె
కడపె సుంతకాలము పొన్నకరుగువోలె
వలపు జివురించి కొమ్మయై తలముఁ దప్ప
కలఁగఁజొచ్చె నెలల్ జనుకొలఁది వెలఁది. 156

కాని పడిగము లొమ్మిచియు దీనయగుడుఁ
దెగడి తెవులని, విప్రుండు తేరఁదెచ్చె
ననియు, నమ్మలక్కలు హాస్యమాడఁ, జింత
చిచ్చునను దా దపించి కృశించుచుండ. 157

"తావినెలర్చు పుష్పమగు తన్ బరిణీతగ బ్రహ్మ యెప్పుడేన్
బూవిలుకాని కాజ్ఞనిడి భూపుని బూన్చునొ లేదొ యన్న శం
కావిలభావడోలిక లహర్నిశమున్ గలఁగింప గడ్డిమో
పై వగఁ బొక్కెఁ దన్వియు నపార సపర్యల" నంచు నెంచుచున్. 158

అల్కిడి చేయ కశోకయు
"నల్కన్ మరుఁడేయు పూవుటంపఱ పదునో
ముల్కుల వడుపున నాటిన
నుల్కె నవోఢయు వచింతు నూఱడ" ననియున్. 159

మొకరి యళియుఁ బరిచిత సుమ
నికటంబున నుండి దాని నెల వెఱుఁగక యూ
రక నెమకు, లతాపిహితము
నకటా ! మకు రసఁగఁదగునె యధినేత మతిన్, 160

అనుచున్ మెల్లనఁ జిబుకముఁ
గొనవేళ్ళన్ బుడుకు వృద్ధకోవిదకడ న
వ్వనిత కనుంగవ ముత్తెపు
సోనలను నశ్రువుల రాల్చె శోక ముబికినన్. 161

డెందము గుంద నశోకయుఁ
గందళిత కృపాంకురములు గడలుకొనంగన్
బందె మృగిన్ బోలు నతివ
దుందుడుకున్ సాంత్వనోక్తితోడఁ దుడుచుచున్. 162

ఇన్నెలఁత గతిన్ దామై
కన్నెఱికము చెఱను బాయఁగనిరే యిడుమల్
మున్నెవ్వరేని నీ కథ
యెన్నవయయ్యెన్ సుభద్ర! హితమగు నింకన్. 163

అని సూచించుచు బాల కన్గవను గ్రంతై యోడికల్ గట్టు నీ
టిని జేలంబున నొత్తి, 'ధైర్యమును బాటింపంగదే నీవు పం
డిన జోనాళముఁ జూచు రైతుబలె ఱేఁడే నిన్ను జూడన్ నిజం
బను రక్తుండయి యంక పీఠమున నిల్పుండొక్కొ ప్రేమంబునన్. 164

మూవయు నీయలేని పిత మూయునె నీ దగ దేవురింపు లీ
యోవరి నొక్కటన్ మనము నొమ్మిక యోచనఁబన్ని యారసున్
భావి నృపాలునిన్ గను నుపాయము వే గనుగొంద మంతె; చిం
తావికలాత్మతన్ నిలువ దారియు నెద్దడి నేల సాగునే? 165

ఒద్దిక దీమసమున మన
మిద్దరము బ్రయత్న మమర నే కోదక్కం
బుద్ధవిడి ప్రయోగింతము
నుద్దిష్టమ్మగు స్వయం సముద్ధర్తలకున్. 166

శోకింపకమ్మ, తములమ
నాకులమతి నీవు బతికి నందించు తఱిన్
వాకొనెద కాక వైళమ
దాకొను సిరు లలుగు లంబు తరగలు దొలఁగన్. 167

తెరమఱుగు లేక యవ్వాయు
తరి తీ పొలయన్ గరంబు దార్చి గుసగుసల్
కురిసిన విని మురియుచుఁ బె
న్నరగలియు నిరాశవీడి 'యానా' ననుచున్. 168

తత నిసర్గ విలాస దర్శనోత్పాదిత
సన్మనః ప్రీతులే శాశ్వతములు
ప్రేయసీ కృత కౌశలాయత వర్తనల్
ప్రభువుల ప్రీతికిఁ బరికరములు
సత్సంపదకు యదృచ్ఛాలాభసంతుష్టి
తో వేచి మనుటలే భావుకములు
సత్యసంకల్ప ప్రసన్నత లుడివోని
సమజీవితంబులే శాంతిదళము

లనుచు నిపుణతఁ బ్రాసాదమునఁ జరింప
నా ముఖము నవ్వ వర్ణించె నభిథవలన
యవనికయు జాఱ జ్ఞప్తియు గవియు నధిపు
సతికిఁ గర్జంబు పతిసేవ సంతరింప. 169

అని తన హృల్లతన్ దృఢతరాశయబద్ధమొనర్చి యింతియున్
గొనకొని వేకువన్ నదికి గొబ్బునఁబోయి సుతీర్థ మజ్జనం
బు నొనరఁజేసి భక్తిఁ దనివోవును గంధసుమాక్షతాంజలుల్
గొని తులసీ సమర్చనఁ జకోరము వెన్నెలఁ జొక్కుకైవడిన్. 170

స్వర్ణాతరంగిణీ సలిలధారల రాజ
మందిరమ్ముల సల్పు మార్జనమ్ము
అలికి బియ్యపుపిండి తెలిగీఁతలన్ దీర్చ
ముంగిట శృంగార రంగవల్లు
లల్లించి పూఁదీవ లలమి పార్శ్వంబుల
కై సేయు తెరువుల గంధవాడుల
నలతి బృందావనతలముఁ గై సేసియు
భూషణరాజితోఁ బొదువుఁ దులసి

నిట్టు లనుదినమ్మును శ్రద్ధ నిట్టలముగ
పరిసరంబులఁ గడు సొంపు పరిఢవిల్ల
నంతిపురమునఁ బరిచర్య సంతరించి
ప్రభువునకు రాణులకుఁ బ్రీతి పాత్రయయ్యె. 171

ఒకనాఁ డాపతి మేడనుండి కనెఁ బుష్పోత్తంస, స్వర్ణాపగో
దక కుంభాంక జిహాస, సూక్ష్మకటి బంధాలంబిసంవ్యానభా
స, కరేణూన్మద మందయాన సువిలాసన్, జారు బృందావనాం
తికవాసన్, వికసత్పయోరుహసుగంధిశ్వాసఁ, బ్రేమాలసన్. 172

అత్తఱిన్ బైకి క్రొత్తదై తత్తడి యొకఁ
డధిపున కవంతిపౌరు లుపాయనముగ
నిడిన దౌరసివచ్చిన దాని జఱపుఁ జఱచి
పఱవగాఁ జేసెఁ జూపఱు వెఱఁగు వడగ
నవ్వేల యథాస్థితిఁ దులసి యరుగుఁ జేరె. 173

పూర్వగాథను మఱచిన భూమిపతియు
నా సుభద్రవైఖరిఁ జూచి 'యౌర!' యనుచు
పాఱుతకు షాత్ర లావణ్య పరిణతులును
జెలఁగు టరుదని తలఁచి యచ్చెరువు వడియె. 174

ఆనుపూర్విఁ బ్రదక్షిణానతులఁ జూచు
హొంబట్టు నవకుంఠనంబు హొయలు
తడియంచులను హత్తి దాగుడుమూఁతలా
కొమిరె కడాని యంగముల సొబగు
కిన్నెర యెల రుతిఁ దన్ను సన్ననిపాట
పల్లవి నలరు నిస్వనపు సౌరు
జలకుంభముఖ గళల్లలిత ముక్తాసార
ముల తులసీపత్రముల హొరంగు

బాల మిత్రాంశు సంస్పర్శఁ బసిడి మిసిమిఁ
బర్వ పీతాంశుకము చిందు ప్రభల పెంపు
సొగసు చిఱునవ్వ పల్దెర సొంపుఁ గెంపుఁ
బెరసి విభు దృఙ్మనంబుల మెఱపు మెఱసె. 175

కాని విప్రాంగనల దెస నానుకూర్మి
యందరానట్టి పండ్లకై యఱ్ఱుఁజాచు
టకట ! మోహావాగుర వీడ నలవికాని
దని విచారించు; భావంబు లణఁచు రాజు. 176

తాను వనమునగన్న పద్మాస్యచాయ
లీ మహీసుర కన్యలో నెఱుఁగఁబడెడు;
కాని యా వీరవనిత యీ కాంత యొకతె
యౌనొ ! కాదొక్కొ ? యని సంశయంబు నెనయు. 177

కొండొకటివేళఁ దన వింటికొప్పు సడలి
యూడిపడ సవరించెను నురిది నవ్వ
యట్టివే పను లాదవఁగా గట్టిదనుచుఁ
ప్రభుఁ డశోకపైఁ గల గౌరవమున నెఱిఁగె
నామె రాజధాత్రిగఁ బూర్వ మలరె ననుచు. 178

రాజొకండె భద్రాంక శరమ్ము గరముఁ
జూచు నొక్కెడ నుదిరిరోచులు గతంబు
స్మృతికిఁ బూర్తిగాఁ గూర్పఁ దత్సవిధ వర్తి
యగు నశోకను బిల్చి 'యీ యమ్ముఁ గంటె ?' 179

అనుచుఁ బృచ్ఛింప నవ్వయు 'నౌర ! యిదియు
రాజపుత్రిక కేల్బాసి ప్రభునిచేత
నమరుటెట్లొకొ ?' యని విస్మితాస్యమైన
ధరణిపుఁడు రాచకూఁతు వృత్తాంత మడిగె. 180

వీరయువతి సుభద్రాంగి చారుశీల
తనకు బాంధువు, తన మాట ననుసరించు
శైశవంశనాఁ బల్కి ప్రసన్నుఁ జేసి
తన్ను భూమిపుఁ డర్థించు తఱిని నెమకె. 181

ఇటులన్ గొన్ని యహస్సులేగ నొకటన్ హీరోజ్జ్వలోష్ణీష కం
కటముల్ విప్పియు, నెమ్మిచెట్టు కడ నొక్కండే కొలారంబునన్
పటు నిద్రావశుఁడై, యుపాంత నవ పుష్పంబుల్ సువాసింపఁ, గం
కటిపైఁ జల్లని తెమ్మెర ల్వొలయగాఁ గన్మోసి పన్నుండగన్. 182

దాది యశోక యళిందం
బాదిగ గావలిని గాయు నయ్యెడ నదనొ
మోదితుఁ జేయఁగ నృపునని
పైదలిని సుభద్ర ప్రభునిపజ్జకు ననుపన్. 183

స్వామికడన్ సుభద్ర పదసారసయుగ్మము మెల్ల నొత్తుచున్
గోముగ తత్సపర్య మది కోరికలూపగఁ బెల్లు జాగ్రతన్
హోమియువోలె నుత్కలికహారి యొకండొగి నిల్వ, ఘంటికల్
యామికుచేత వ్రేటువడి యంతటమ్రోసె ఘనంఘణార్భటిన్. 184

ఒకదిశకొత్తి యోసరిలి, యుర్విపుఁడున్ గనుమూసియుండ, నం
జక కయివీవన్ విసరు సౌహృదపూర్ణ సుభద్ర, ప్రక్క కూ
ర్వోకకుఁ జూచుచో నొకటి భూరి భుజంగము రోఁజుచున్ నృపున్
సోఁకఁగ మంచపున్ దరికి జూతిని రాఁ గని కత్తి దూయుచున్. 185

తటుకున నా సుభద్ర యడిదంబున దాని శిరంబుఁ జీల్చి నా
త్రుటిఁ గనువిచ్చుచున్ నరవరుండు నికృత్తక శేరుకన్ పత
చ్చటుల విషాహిఁ గన్గొనుచుఁ జయ్యన గత్తిని నేలడించు న
క్కుటిల వినీలకుంతలను "కోమలి! రమ్మ"ని చేయివీచినన్. 186

అవనత శీర్షయై తడయ కంఘ్రి సరోజములంట వ్రాలినన్
సువిమల మానసంబున "వసుద్యుతిగాత్ర! పవిత్రవర్తనల్
దవిలిన నీకు నంతిపురిదారలు కొల్వఁగ నేల పంచి రే
మి. వలయునో వచింపు"మన మీను కనుంగవ నీటఁ దేలఁగన్. 187

కంధరమెత్తి యిత్థమని కాదని పల్కక మిన్నకున్న నా
గంధవతీ లలామ ముఖకంజము తెప్పల దింపకుండ పు
ష్పంధయ వృత్తిఁ జూడ గొనబై మదిఁ దట్టెను పూర్వగాథ; "ని
ర్బంధ విహారియౌచు నృపబాలిక బ్రాహ్మణునింటఁ జేరెనే?" 188

అంచును సంశయ క్లిశిత మాస్యము డించియు నూరకుండఁగా
నంచున నిల్చి తద్విధము నారయుచుండు నశోక "శంపుఁడున్
బెంచినదంతె నట్టడవిఁ బ్రేముడిఁ జూచితివీవు కన్యకన్
మించినదేమి? యీ తరుణి మేల్మి సువర్ణము రాచకొమ్మయే" 189

"అరవాయి చెప్పనోపదు
శరమదియే 'భద్ర' ముద్ర; శశిముఖి నీమేన్
వరవర్ణ వర్ణ నెఱుఁగవె
వరవర్యోన్ విరులఁగొట్ట వలఁతియగుఁ జుమీ!" 190

అనుచుఁ జెప్ప "గదాధరుం డరిగి రాఁడు
వెనుక కెటకేగెనో? వార్తవిన"నని నృప
చంద్రుఁ డనినంత "వంటింటి శశకమయ్యె
రాణి చెఱఁబట్టె"నా నబ్బురంబుపడుచు. 191

సందియ మంతయుఁ విడిచి స్వచ్ఛమనఃప్రథితానురాగుఁడై
"ముందునఁ దేఁక వాఁడు లిసి ముగ్ధను నిద్దనకుండ దాచి రీ
యందపురాశి కట్టెదుట నందఱు దివ్వెలువోలె సుందరుల్
కుందొకటే సతంబగుచుఁ గొందలవెట్టగ నింతకాలముఁ. 192

అందిన సిగ యందమి పద
మందురుగద తజ్ఞు లవని నామార్గంబే
సుందరు లంతఃపురమున
నిందాకఁ నడచి యేవగించిరి నిన్నుఁ" 193

అని బుజ్జగించుచుఁ దన
కనుకూలతఁ జూపు పతికి నామెయు "ముఁ శం
పునివలనఁ సుక్షత్రాం
గనగా న న్నతఁడు సెప్పఁగఁ వినఁగంటిఁ" 194

అని నొడివి యనామిక వ్రే
లున వజ్రోర్మికను దీసి లో చెయినిడ 'నా'
ననెఁ బతి; యమృతపు సోనగఁ
దను మధ్యకు నదియు దీయఁదన మొదవించెఁ. 195

భావి సముపపన్నంబుల
వావియు వరుసలు జెలంగఁ బతియు వనితయుఁ
'దేవీ', 'ప్రియ' సంబోధన
భావించుచు నొండొరులును భాషించునెడఁ. 196

చారుఁ డొకం డనుజ్ఞఁగొని సమ్ముఖముఁ గని యంత మ్రొక్కి "నీ
చారిగణంబు లీశదిశ సాగరతీరగదూర కానన
క్రూర జనంబులుఁ గెలసి కో ల్తలసేసియుఁ బోరసిద్ధము
న్నా"రని విన్నవింపఁ దన నాయిక కూఁకట వల్కి పిమ్మటన్. 197

తూర్ణమె గదాధరుఁ జెఱను దొలఁగఁజేసి
యతని దోడ్కొని సభకేగి హిత సచివుల
బుద్ధివాదంబు లాలించి యుద్ధమునకు
వెడలుటయె యుక్తమనుచు భావించి యంత. 198

వారక బిందుసారుఁ డురు వాజి గజేంద్రఘటల్ బోరిన్ దునే
దారులు మొగ్గరంబులకు దారులుసూప, నెకాయెకిన్ మహో
దారుణ భండనోర్వి రిపు తండముఁ దాకఁగ నేగినన్ బురిన్
ధారలువేచి రిద్ధ జయదాయము లల్లుచు రాజు రాకకై. 199

పిలుకార్చి బిందుసారుఁడు
పలుగాకి నృపాలవరులఁ బవరములన్ ద
న్నలఘుం డమిత్రఘాతుం
డలవోక జయించుననుచు నరు లగ్గింపన్.. 200

జితులౌ వైరులఁబట్టి భూపతియు వేంచేయన్, బనుల్వీడి రా
ట్సుతు లేతెంచి రెదుర్కొనన్ బతియుఁ బార్శ్వస్థానలన్ జేసె నా
గతు దీర్ఘాయువుగాగ దేవళములన్ గైసేసి రుత్సాహగన్
తత దీపోత్సవము ల్విరాజిలఁగ నంతన్ బాటలిన్ బౌరులున్. 201

వైణికులు పాడుచుండఁ గ
రేణు గణాన్విత మదేభరీతిన్ బ్రభుఁడున్
బోణిమిగ నంతిపురమును
ఠాణువఁ బుత్తెంచి చొచ్చె ఠాణులతోడన్. 202

రాణివాసపుఁ గొల్వున జాణలగుచు
నమరు పరిచారికాగణం బవ్వ యాజ్ఞ
భవ్యకీర్తిని విజయియై వచ్చి చొచ్చె
భూవిభుని సత్కరింపంగఁ బూని రంత. 203

అదనున సుభద్ర ప్రేమయు
గదుమగ యువతులను గూడి కర్పూరశిఖా
పాదన ద్యుతి నీరాజన
లదరగ నెదురేగి మంగళారతుల నిడెన్. 204

అందఱిలోనఁ బురందరు
సుందరి చందంబు మెఱయ, సురుచిర విజయా
నందముఁ బ్రేమయు నెడఁదన్
సందడిఁగొన గని, సుభద్ర సవ్యకరంబున్. 205

అప్రయత్నతఁ బట్టి ముం దరుగఁజూచి
"వేధ యిదు రాజవంశపయోధి లక్ష్మి
కల సుభద్రాంగికిన్ బతి కలఘు శుభము
లనిశ"మని గదాధరుఁడు జయంబుఁ బలికె. 206

రాజ విజయచిహ్నముగ నిర్మాణమైన
నవ విశాలకేళీ నిశాంతమున సార్వ
భౌముఁ డడుగిడునెడ జయధ్వనులు బోరు
కలఁగ దౌర్యత్రికోత్థంబు లులివు వొలసె. 207

ముదిత హారంగు మారు శరము ప్రసదుంతురితాంతరంగమున్
గుదిగొనఁ బ్రాణమోలములకున్ ముడివెట్టినయట్టులై ధృతిన్
జెదరి నృపావతంసుఁడు ప్రవేశగతిన్ గుడినైపు గన్నునే
నదరగ మేడమెట్లపయి నాదృతినేగె వధూసహాయుఁడై. 208

మానుల నీడలున్ నృపుల మానసముల్ బలుమాఱు మాఱు బొ
ద్దూనిక గాఁగ భావిగతు లూహల కందవు; పూవువిల్తుకై
పూనిన గ్రొత్తవింత! పదమొత్తిన నొవ్వదె ముల్లుత్రోవలన్?
మానునె బన్నముల్? చెడిప! మైదిడెనేమొ? యెఱుంగ మేమియున్.

ఆ సుధర్మకు వలదని యాడ, నోరు
రానిదొక కారణము - రెండు; రాష్ట్రపతియు
ముదిముదితమాట విస్రంభముననె వినుట;
కొండొకకతన దాసియే కొంపఁగూల్చె. 210

అనుచు వితాకు జూపు లననాదృతిఁ గ్రుంగిన యావతంబు, కం
దిన మొగమూఁదులున్ గలఁకఁదేఱని చిత్తము లార్తిఁదెల్పఁ దె
ప్పున విడిపోవ నవ్వయు నవోఢ సుభద్రకు ముద్రమాస్పద
ప్రణయ నిబంధనాలి వినుపన్ వెసఁదాఁటెఁ బురోంగణంబులన్. 211

తమ్ము సత్కన్యలను గులోద్ధారకుఁడగు
పుత్త్రుఁ బడయంగఁ దెచ్చెను పూర్వమందు
ఱేఁడు రాట్కన్య నారీతి నేఁడు గూడ
నని సుధర్మేతరలు నాండ్రు నంత శాంతిఁ
దనరిరి విభుండు సదయుఁ డుదారుఁ డగుట. 212

ఆర్తిహారంబులు పరశివ
కర్తృకములు సాంద్ర చంద్రికానంద కళా
నర్తకికి నాట్యశాలలు
కార్తిక రాత్రులు రహించెఁ గమనీయములై. 213

సౌహార్దార్ద్రివనాంత రమ్య సుమన స్సౌరభ్యసంపాదియై
యా హర్మ్యాంతర భూరి చందన గవాక్షాగ్రంబు మందాకినీ
వాహిన్యుత్థ తరంగ శైత్య విలసద్వాతాహతిన్ జల్లనా
నీహారాంశు నిసర్గభోగరుచు లందించున్ శరద్రాత్రులన్. 214

దాదియుఁ బెల్లు సంతసము దార్కొన శంపున క్షీ సువార్తనిం
పాదిగ నంపె, సొంపెసగ నాదిమదంపతులట్లు శ్రీ జీవశోషి
గాదిలి చూపు మేపుల సుకంపు కలల్గనువారికిఁ నెలల్తేచి...
బూదలపాల చందమయిపోయెను, పోవవు భోగవాసనల్.　　215

## సప్తమధార — కాండాంతము

ఓంకార ! వేంకటేశ్వర !
సంకటహార ! సత్త్వసార ! సకలాధారా !
శంకర శంసిత సుగుణా
లంకారా ! శేషశైల లోకాగారా !　　216

సాధితమయ్యె ద్వితీయము
వేధస్స్మృతి కురియు సర్వవృష్టిఁ బ్రచురమై
బోధార్ణేందు విజృంభిత
గాధాంబుధి సంగమాభిగమకాండ మిదే.　　217



శ్రీరస్తు

# శ్రీ మ ద శో క చ రి త్ర ము

## తృతీయకాండము - అశోకుని జనన బాల్యములు

### కాండనాంది— ప్రథమ ధార

అగణితగుణ గంభీరా!
ప్రగతి సహస్రార! కౌస్తుభాలంకారా!
యుగపద్వీరవిహారా!
విగళిత భవ దుఃఖభార! వివిధాకారా! 1

సభ్యములగు వర్ణనలన్
లభ్యములగు భావనావలంబనములచే
నభ్యుదయదాయివై నా
కభ్యర్చ్యవు కమ్ము వాణి! యబ్జజురాణీ! 2

### ద్వితీయధార — అశోక జననము

దాదిని బెద్దఁజేసి, వసుధాపతి సుప్రణయైకభావనో
త్పాదిత గౌరవంబున, సుభద్రయు జీవితమున్ విభూతితోఁ
బ్రోదివహింపఁజేసి, దనివోవుచు, కీర్తినిగాంచె సజ్జనా
మోదము బేర్చుచున్, సవతిముద్దియలన్ ముదమందఁజేయుచున్. 3

ఎంతయు దంపతులకు న
శ్రాంతసుఖంబులు, మనోజ సామ్రాజ్యమునన్
దొంతరలై, చూలుగొనెన్
కంతుని చేబంతియైన కాంతయు నంతన్. 4

అనయం బోకిలివేవి
ళ్లను దినమున్ గలఁతవెట్ట నంతంతకుఁ గ్రొ
న్ననదొడిగెడు రెమ్మకువలె
మినుకెక్కెన్, మన్ను మెక్క మిడుకు పొలఁతికిన్. 5

వ్రేఁగగు వేఁకటిబడలిక
సోగగ నయికంబమంటి సొక్కినయట్లై
యూఁగెడు గరితకు, మూఁగుచు
దాఁగుచు నగపడెను కాళ్ళఁదఱచై వాపుల్. 6

'స్వర్భువుఁడగు నొక దివ్యుం
డర్భకుఁడై యెదుగుచుండె' నని జనులాడన్
గర్భము నవమాసములున్
నిర్భర చేతోముదంబు నెఱయఁగనయ్యెన్. 7

దొంతుల్ బేర్చిన తోయదప్రకరముల్ తోదోఁపులన్ బర్వుచున్
బంతంబూనినరీతి నల్లనయి కుంభద్రోణవర్షంబుతే
ర్లంతన్ గుంతలు మిట్టలున్ గలయడాయన్ జిమ్మె; భిక్షాటకుల్
కంతల్ బొంతలఁ గప్పి చెట్లకడఁ బ్రోగై నిల్వగన్ వేకువన్. 8

మానినికిఁ దారసిల్లెను,
గానలసట దొడ్డదగుచు, కానుపుసమయమున్
వానమొయిళ్ళను గ్రమముగ
న్యూనములై వెల్లఁదనము నూబ్బొక్కనె వెలియన్. 9

ఘోర తమోవ్యాప్త నిశా
గారద్వారాంతమెనయ ఖరకరు నరుణో
దారరుచుల్, ప్రాగ్దిశకున్
జేరెడు సుముహూర్తమందె శిశు వుదయించెన్. 10

పద్మానన నీళ్ళాడఁగఁ
బద్మాప్తునిదీప్తి ప్రాచిఁబర్వె, సుజనహృ
త్పద్మమ్ములుపాంతసర
స్పద్మములు వికస్వరప్రసన్నతఁ బడయన్. 11

'కయ్యపుఁగాలముల్ గెల్వఁగాఁజనె, గమ్మని బోనమబ్బె నీ
యయ్య జనింప'నంచు, భటు లాదట నాడ, నశోకుఁ డుద్భవం
బయ్యె, విధిజ్ఞులున్ గ్రహముఖార్థము లెన్నుచుఁ జాటి రా రణా
జయ్యుఁ డఖండుఁడౌనని, విశంకట ధర్మవదాన్యతాదులన్. 12

ప్రకటముగన్ జెఱసాలల
వికలతఁ బడియున్న ఖలుల విడిపింపగ వా
రకలంకమతిన్ బూర్వపు
మకు రేదుచు వేశ్మములకు మరలిరి వేగన్. 13

మనికిత ముడుగుచు స్వేచ్ఛన్
మనుకువలకుఁ జని రశోకమహితజనియు, బెం
చెను పృథుశాంతియనుచు, మా
ర్కొని బందెన్బడియుఁ దిట్లరువ్వెడు రిపులున్. 14

నెట్టనఁ బ్రజ లాశింపని
పట్టిన్ నవయౌవనన్ సుభద్రాంగిన్ జే
పట్టెనో లేదో యనగా,
ఱట్టొక్కటి వ్యంగఫణితి, రణితంబైనన్. 15

మంత్రులు "వసుధేశుఁడె స
త్తంత్రణకారణుఁడు కాన ధర్మముగఁ బుర
స్తంత్రమెసంగన్ బరిణయ
తంత్రిపయిన్ నడుపు"మన్న దలకొనె రాజున్. 16

పావనలగు నైదువలున్
భావుకముగ శిశు వశోకవర్ధనుఁడని సం
భావింపన్ నామకరణ
మ్మై, వీరనిలింపదేశికార్చన లొనరెన్, 17

అలరి సురార్చన మదనుగ
నలివేణికిఁ దెలిపిఁజూపి యవనీశ్వరుఁడున్
గులహితముగ, మిాసరముగఁ
గలితోద్వాహ నొనర్చి గరితను బ్రోచెన్. 18

ఊరూరఁ గంతేరు లుపకారములఁబొంది
రుడుగర లన్నము ల్దొడువఁ గుడువ,
వీరనాదములు, గంభీరవాదనలు ర
చ్చలమిాఁద మెచ్చుగా జరిగెఁ బేరిగ
వాడలలోఁ బ్రజ ల్దొడుగూడి వహించి
రుత్సవోత్సాహంబు లొరసి బెరసి
పేటలనమ్మిరి చేటిక లంగళ్ల
నిండ్లలో సరకుల నేర్చి కూర్చి

సచివు లెల్లడ 'సప్రమాట్టు సంజనించె
నల సుభద్రాఖ్యరాజ్ఞికి'నంచుఁ జాటఁ
బాటలీపుత్రనగరాన; ప్రాజ్యమగధ,
రాజ్యమంతటఁ బండువు ల్బ్రబలె నపుడు. 19

అరుణాధర సరోరుహమ్ముపై నిముకుచో
చిఱునగ వొకవేళఁ జిందులాడ,
నిర్నిమిత్తంబుగా నిమిషంబులో బెద
రీడ్చినట్టులఁ గొన్నియెడల నేడ్వ,
మెలమెల్లఁ దొంగలిమెఱుఁగుక న్దెఱలార్చి
యేదేని యొకచక్కి నూఁదిచూడ,
వెల్లకిలఁబరుండి మొల్ల సుగంధులు
కిలకిల నవ్వగా నొలసి నవ్వ

బోర్లఁబడి గొంతు నెత్తుచు బొర్లబోయి
తేటి నిసుఁగును క్రమముగా దేఁకియాడ,
కొసకు తన తండ్రిమోమును గుర్తిడంగ
మాత కెనలేని మరులయ్యె, మమత విరిసె. 20

కరజానువులఁజేర్చి పరుగిడు తేకువ
ఋజుచతుశ్చరణ ధార్మికత నెఱపు,
జిలిబిలిముచ్చటల్ బలుకు పొల్తుకలకు
వదరుదాదుల, దానపరతఁ జెప్పు,
మునివ్రేళ్ళ నందించు పురుషులకే లూఁది
లేచుచు విక్రమలీలఁ జూపు,
మితతలన్యస్తముల్ మృదువుగ నజ్జల
నిలనూఁదుచో, కృపోజ్జ్వలతఁ దెల్పు

కనలి, చినబండ్లుకూల, డాకాలదన్ను
టరివిభంజన రీతికి, దెరువుసుమ్ము
తథ్యమని యవ్వియుఖ భవితవ్య మంబ
తోడనాడఁగ, శైశవక్రీడ లమరె. 21

అద్దమరేయికి సరిగా
నద్దికమున్నట్టి దాదు లాక్రోశింపన్
నిద్దుర లేచి యశోకుఁడు
తద్దయుఁ దన్నెత్తుకొనఁగఁ దల్లిని బుడుకున్ 22

'సాధువౌకో! పవ ల్పువులశయ్యాలఁగూర్చుచు మభ్యపెట్టి, క్షీ
రోధపయోధరంబు బరువెక్కఁగ రాత్రుల లేచుఁ ద్రావ, ను
త్సేధమువేధ! యీయమె పసిండిది, గిండిని మా కొసంగ, నే
బాధయులేక పయ్యెరలఁ బండెద'నంచు సుభద్ర పల్కినన్. 23

'ఆదిత్యనిభపరాక్రముఁ
డై దారకుఁ డెద్దు, తాతడంబుఁ, దెలివి నే
నే దేవుని జోకొట్టెద
నేదో క్రియ' ననుచు నవ్వ యెత్తు బుడుతనిన్. 24

అప్పుడప్పుడు సకృత్తుగ, విభుఁ డరుగుదెంచి
తను బరామర్శనముసేయు; తనయుతట్టు
తలపుఁబెట్టఁడు! కిముడు సంతసము బడఁడు!
దాన, తల్లికి నధిక సంతాపమయ్యె. 25

అతులభుజప్రతాప పిహితాహవ నిర్దళితారిపక్ష రా
ట్తతులగు మీ పదాబ్జసవిధంబున దాసిని! కూర్కొనుండి జో
ధితుని తనూజునిన్ దరణితేజుని జూడుఁడటన్న, తన్వి వా
క్తతికి జవాబు నివ్వకయ, కన్గొను నూరకయుండు భూపుఁడున్. 26

తన్ను దొలిచూలి బాలెంతఁ దడయకరయు
నృపవరుఁడు శుక్లపక్షంబు నెలయుఁబోలె
నెదుగు నిసుఁగును బ్రేమింపఁడేల? యనుచు
నంబ తర్కింప నవ్వయు నడలుచుండు. 27

'సీలివార్తల సవతులు నెఱపినారొ?
వికృతుఁడని మిత్రు లీకూనఁ బేరుకొనిరొ?
పొగిలెడు సుధర్మ యెది నూరిపోసినదియొ?'
యని వితాకున జింతింతు రంబ యవ్వ. 28

శ్లోకములల్లి గాయకు లశోకకుమారు నుతించి పాడ, న
స్తోకవిభుత్వభోగములు తోరమెసంగియు, గర్వవల్లరిన్
బ్రాఁకగనీ దొకించుక సుభద్ర, యెడంద నరిష్టవిఘ్నలుం
టాకవిధానతన్ సుతుని డాఁచుటయొండె, తలం పెలర్పగన్. 29

## తృతీయధార - సుధర్మాదేవి పన్నుగడలు

బాలుండెదిగె కుమారక
శూలిఁబోలియు, వినీలచూళిక లమరన్
కాలముగడవ సపత్నులు
కేళిఁగొన, సుధర్మ యొకతె కీలించెఁ బగన్. 30

అది యటు లగుటయు సహజము!
మదవతులగు సవతు లొక్క మనసున లేమిన్
బాదివి కుమారుల సమ్రా
ట్పదమునను బ్రతిష్ఠఁజేయఁ బాటువడు నెడన్. 31

తన కొడుకౌ సుషీముఁడు తథాగత భిక్షుకదత్తమైన దీ
వన జనియించి, జ్యేష్ఠుఁడయి, భావి ధరాపరిపాలకుం డితం
డను నుడికాస్పదుండయిన యట్టి తఱిన్ సచివోక్తివశ్యుఁడై
పనివినె భర్తవే అనిన, బల్లెపుఁ బోటయి పుండు పేర్చెదే. 32

రాజున్ బూర్వము, భాగ్య
భ్రాజితగాఁ, దన్నునోమఁ, బ్రాభవసంప
ద్రాజితమైన సుధర్మయు
నోజ సుభద్రాభ్యుదయము నోర్వక కినిసెన్. 33

పుట్టుపేరున వసుగాత్రి, పట్టపుసతి
బౌద్ధధార్మికు లామె తత్పరత నరసి
తఱుచుఁ బిల్చిరి రాజ్ఞి సుధర్మ యనుచు
నామెయు నశోకుజనికిఁ బెల్లార్తినొంది. 34

నట్టా! శ్రితులును రాణులు
సుట్టియుఁ గొలువంగనుంటిఁ, జుట్టలు వాగడన్
నెట్టన సుభద్ర నన్నున్
నెట్టెన్ మహిషీపదంబు నిర్యాతముగన్. 35

ఈ సుభద్రయు కానలో నెదురువడిన
యింతి, యొకరిని యెఱుఁగమి నింత పుట్టె!
అటు గదాధరుఁ, జెఱనుంచి యకట! ఫలిత
మొందనైతిని నీలాపనింద యొదవె. 36

వక్షస్థలాంకగంధవ
శక్షద్యుతి వసనభోగలాలసుఁడు నృపుం
డక్షీణస్మరవశతన్
దాక్షిణ్యారూఢుఁ డనెడి తథ్యము దెలిసెన్. 37

నమ్మగరా దీయదనున
నమ్మిక విడువంగరాదు నానాథుఁ గదన్
వమ్ముగ భావినొనర్పని
నమ్మకమే, కార్యవిజయనాంది యటంచున్. 38

మదిఁ దలపోసి నవ్యసుమమాల సుభద్రను రోసి, యేతెఱం
గది యొడికంబుతో గుదిరికౌ నటులే, సుతు యౌవరాజ్య సం
పద నెఱనిల్పుయుక్తిఁ బొలుపారు, శరం బరివోసి యేయఁగా
గదురు, సుషీముఁదల్లి, వసుగాత్రియు గాదిలిపుత్రు నోమఁగన్. 39

శాంతుని, విశ్రాంతుని, ని
శ్చింతున్, బ్రసవాస్త్ర సుభగశృంగారభరా
క్రాంతున్, ముదిత రహస్య
స్వాంతంబెలయంగ గొల్చుఁ బతిని విధేయున్. 40

తన పతిమందిరంబున కదాటున నెయ్యెడ నెట్లు వచ్చెనన్
దనుపు ఘనాదరోదయ నిదాన పురస్సరయౌచుఁ దానె, కాం
తుని కెదురేగి, కాళ్ళఁబడి దువ్వలువన్ దడియొత్తి తెమ్మెరల్
ఘుమ్ముక్కొన ఘీవనన్ ఘిసరి, ముచ్చటఁబల్కు సుఖాసనస్థితున్. 41

“ఈ తగవింతయున్ గృతకమిట్టిది సైచితివేల? బ్రాహ్మణుం
డాతఁడ తెచ్చెఁగాక తన యాత్మజ నిచ్చుటి కంతమాత్ర, ఖి
ల్లాతకమంత్రి యీసున, జలంబొనరన్ యువరాజమాతగా
శ్రోతలఁగూర్చి చెప్పుటయు జోద్యముకాదె! సుషీముశైశవం
బాతఁడ నిందపాల్తగవుమారిగఁ జేయఁడె మున్న శత్రువై. 42

కులమును వాక్యనిష్ఠయు, నకుంఠిత బాహుబలంబు, తేజ మ
గ్గలమగు క్షాత్రవీర్యమున క్షత్రియభార్యల కుద్భవించు, వా
రలె నృపవంశవర్ధనులు! రాచరింకబులు వారివండ్రు! నీ
వలపది పొల్చెఁగాక! పెరవారలచే నను రచ్చకీడ్చెదే? 43

రాజకులోత్పన్నత, తన
నైజంబని యెన్నునట్లు నటియించుచు, నిన్
గోజాడ నెఱుంగవా కో
వాజను? మడిగట్టుకొనెడు బాపనదానిన్.” 44

అనునెడ బాష్పము లురులన్
గొనఱెప్పల పయిఁటపై దుకూలముతో నా
య్యనఁదుడిచి, నిజాంగన కిం
పొనరన్ బలియను నయోక్తి నూఱట గొలిపెన్. 45

“అంతటఁ బోకదాఁ గనుట నౌరసునంట! సురాంశుఁడంట! యీ
వింతయు నమ్మినాఁడవె? కవిత్వము నల్లిరి వందులెల్ల! శ్రీ
మంతుల పొట్టఁ బుట్టుదురె, మానిసు లట్టి వికారరూపులే
చింతయులేదు, చూపకును జెల్లునె స్వైరిణి కెందు ధర్మముల్. 46

నిజమాడిన నిష్ఠురమగు!
గుజగుంపులు కూడ దండ్రు! గుదెగట్టిన గో
పజమగునే? పాఱుత భూ
భుజునకు నిల్లాలె? మోసపోయితి వకటా! 47

కుత్కీలతనుజ పార్వతి
తత్కూటనివాసి భిల్లతనయకు సరియే ?
యుత్కటయశంబుఁ జిక్కెనె ?
ఫూత్కారపుఁ బురుగు ద్రాఁచు బోలఁగఁగలదే ? 48

తాన్నై వలచినఁ బోని
మ్మానాతిని గూడియుంటి వది యుచితంబే !
ఏనుఁగు నంకుశమేనని
కూనకు యువరాజుపదవిఁ గోరఁగఁ దగవే ?" 49

మర్మోద్ఘాటనముగ వే
నర్మోక్తుల నిట్టులాడి నరపతికి "నస
ద్ధర్మమని యశోకుండు, కు
కర్మజుఁడు నికృష్టుఁడనియు" గరకరి రొంపెన్. 50

పదనగసి పదింబదిగా
నుదుటున బిబ్బోకవతియు నుపదేశింపన్
మదిగల గౌరవధవళిమ
ప్రిదులగ, సుతు నెడలమాసె ప్రీతియునంతన్. 51

## చతుర్థధార - రాజుచేసిన నిర్ణయము

దుడు కెదలేని భూపతియుఁ దొల్లిఁటి నిక్కలసంశయింపఁ "డ
ప్పుడఁతి నకుంఠితంబగుచుఁ బాయనికీవియు నాభిజాత్యమున్
దడయకయే బయల్పడు; సుధర్మయు క్షత్రకుల ప్రభూత నం
చుడుగకఁ గూయు! దా నృపకులోదితమాత్రయె" యంచు నెన్నుచున్.

"మొనసురియాడు భావముల ముట్టడి నేవిధి మూదలింప దీ
మసము; జలూకరీతి ననుమానము నీఁగును, సత్య మూఁతగా
గొనియు; యథార్థవిజ్ఞుఁడగు కోవిదుఁడంచు; మనీషిశంపు డిం
ధున నిజమెల్లఁ దెల్పు"నని దూరపుదృష్టినిఁ బిల్వఁబంచినన్. 53

శంపాచార్యుఁడు వెదకెడు
సంపెఁగతీఁగయును గాల్లసంమున జిక్కన్
జొంపిరివోవు భిషగ్వరు
సొంపున గుర్తులను గొనుచు చోద్యమతిఁ జనెన్. 54

ఏగుదెంచిన సోమాసి కెదురువోయి
యర్ఘ్యపాద్యముల్ పతియిడి, యౌపచారి
కోక్తిఁ దన్పి, "సుభద్రాంగి యుత్తమాభి
జాత్యమును నిరూపింపఁగజాలు సాక్ష్య
మున్నదే ?" యని పృచ్ఛింప, విన్ననువున. 55

కృపసేసితివని విప్రుఁడు
"నిపుడే చేకొనుము పితృనిహిత సాక్ష్యంబుల్.
నృప ! సొన్నపుహారం బిది
యె; పదకముఁ బచ్చపాదివి రిమ్ముగ" ననిన్. 56

పదకపు వజ్రదీధితులు, బంగరముఁ గిరికొన్న కోపులో
చెదరక శైశనాగకులసింధు శశాంకుని నామముద్రయుఁ
గుదిరికగాంచి భూవిభుఁడు గోళివలెఁ గని "యింతిపోషణం
బాదవగ నేలమీ" కనిన నుత్తరవాదిగ శంపుఁడు మ్రొడిన్. 57

పులివాఁతఁబడిన పతిసొద
నలివేణియుఁ జొచ్చె నామె నంతేవాసిన్
దలఁచుచు నా తండ్రికృపన్
"నిలుపవలెఁ బిడ్డయిల్లు నెలకొనువఱకున్." 58

అనఁ బిత్రాజ్ఞఁగొని, పురా
తనములు, మడిమాన్యములు నితాంతము పండన్
మనుగడగ, కూఁతుఁ గన్నియఁ
గనురెప్పగఁ గాచి నీధు కరముల నిడితిన్, 59

ప్రథితవైడూర్యమయము పాపనపుబిళ్ళ
భృతముగ, కులపరంపరాగతము; పౌన్న
మందసంబునగల మణిమకుటము; భుజ
కీర్తియుగము; దేవచ్ఛందకృత్స్న కాంతిఁ
గెరలు వంశవృక్షము, గెంపులురలు కుదురు. 60

బుడుతని కిడఁదగు నివియని
నుడువునెడన్ జంకనిడి తనూజుని కురులన్
బుడుకుచు నట కరుదెంచిన
పడఁతి సుభద్రయును మగని పదముల కెరగెన్. 61

సారిది గురుచరణద్వయి సోకి, పిదప
కొడుకుఁ బతికెత్తనిచ్చియుఁ బాడవడు నగ
లడుగగా స్వర్ణమంజూష నధిపుఁ డొసఁగె;
విడెముసేయుచు వివరము ల్వినిచె నవ్వ. 62

రతనపు కిరీట మంబ, కరంబునూపు
శిశువు తలమీద నిడగఁ గాంచిన నరేశు
నంత మును కలగ్గన్న రమ్యప్రసన్న
భావ సంస్మృతి రోమాంచభరితుఁ జేసె. 63

నీల తనువును నెలఁబోలు ఫాలతలము
మిడుగుఱుల్ జిమ్ము కన్నులు మెఱయ, నొడిని
మొనరు సుతుని మూర్ధంబును, మూరుకొనెడి
భూపుఁగని శంపుఁడు నతృప్తిఁ జోపుకొనుచు. 64

పగపుడిగి, మచ్చలేని నభంబు వోలె
మొగము సుస్మేరరుచి, నిగనిగల నీన
"జయ జయాశోక ! జయ బిందుసార !" యనుచు
సిగను ముడివైచి లేచి యాశీర్వదించె. 65

"నీ తనుజుం డురుకరుణను
నాతత మోదాకరుండ నఖిల సుశీలో
పేతుం డఖండకీర్తి
స్ఫీతుండై విశ్వమునకె ప్రియుండౌ" ననుచున్. 66

నగుమొగమూని నరేంద్రుఁడు
నగణిత విద్యాధనంబు లమరిన మీకే
తగురీతిఁ జిన్నవానిని
సుగుణ కళాకౌశలముల జొక్కింపుఁ డనన్. 67

వల్లెయనుచు, ధరణీపునకు
నుల్లాసము బాదుకొల్పియున్, గృతకృత్యుం
డల్లన శంపుఁడు, వీడ్కొనె
నుల్ల ముదధిదరినిఁ జేరు నుడుపము వోలన్. 68

## పంచమధార - శంపుఁడు పాటలివీడి యేగుట

శంపుఁడుఁ బాటలినిఁ దప
స్సంపదతో స్వరతురంగ చంక్రమణ సుబు
గ్ఘంపల బ్రాజదువుల వ
ల్లింపుల బూరించె శిష్యలిప్సలఁ బెంపున్. 69

పాటలిఁ, బదునేడేఁడుల
పాటుండియు సంస్మరించు బంధుత కల బ్రా
గ్వాటిక జంపాపురి నఘ
పాటచ్చరభంగ కంపఁ బావన చంపన్. 70

ఇంటియాతండు నెపుడేని, యొంటినుండ
నరసి యిల్లాలు సొగటాల నాడువేళ
"సొగలయ్యో దివానిశల్; సొంత గూఁడు
చేరుకొందము శుభము జేకూరు" ననుచు. 71

చంపాపుణ్య తరంగిణి
సొంపును బెంపును మనంబు, జొచ్చినఁదన బా
ల్యంపున్ గాథలనెన్నుచు
శంపుండును నుగ్గడించె సాధ్విని గనుచున్. 72

"చంపనుపీడి వచ్చితిమి జంపతులొక్కటగూడి, పాటలిన్
జంపకగంధి భూవిభుని సన్నిధి బొల్చెను చంద్రమఃకళా
సంపదతో నెలర్చి, గుణసాంద్రుఁ డశోకుఁడు విద్వదీడితుం
డింపువహింప శ్రేయముల హీనతమే కొనె గోర్కులూరగన్. 73

నవనీలమణికి దీప్తై
యువరాజాంగరుచి, బహుశుభోదర్కంబై
మివులెడు; నైనను జెఱచిరి
నవులాటకు దూలనాడి నవలలు నాథున్. 74

దైవము నెవ్వఁడోపు జవదాటఁగ ? నెవ్వనిచేజనించి యీ
భూవితతుల్, చరాచర విభూతు లెసంగెడు ? నే యనంతు ను
జ్జీవన యోగశక్తియు నశేషధరాంబర విశ్వవృత్తికిన్
దావల మా పరాత్పరకృతంబెకదా వివిధప్రమేయముల్ ! 75

బాలునివన్నె నీలమని బాలిశుఁడంద్రె, సపత్నులీర్ష్యకున్ .
బాలయి, శ్వేతమై చలువబడ్డని చోలముగప్పి బాలిశం
బోలి శిరంబుక్రిందనిడ నొందునె తెల్పు రుచుల్ శిరోజముల్ ?
పోలునె నిందఁజేయబరపుష్టవిశిష్ట కనిష్ఠవర్ణముల్. 76

కటకట సన్నికర్షయయి, కారమునూఱి సుధర్మవల్లభున్
డిటవుగ దిద్ది పుత్రునెడఁ దీపది చుక్రమువోలె కందగాఁ
గుటిలముబన్నె; బౌద్ధమత కోవిదులామెను, ధర్మయుక్తగా
నెటుల వచించి రద్దియు సహించిరె, భూపతియున్, సుభద్రయున్? 77

గాత్రంబందముగాదు, కృష్ణుఁడని, యుద్ఘాటించి, ధీసాంద్రుఁ డీ
పుత్రుం బాత్రుని దవ్వుగాననుచు భూపుండున్; సుభద్రాంగి దా
నాత్రంపున్ బనియొండు సేయదు, భవిష్యత్కాలవృత్తంబులన్
సూత్రింపన్ దొరకొన్నఁ గీడగునొ యంచున్ భవ్యమర్యాదయై. 78

ఇదియు బురస్కరించుకొని యీ సదుపాయము లొడ్డినన్ గదా
యొదవె సమస్య, దుస్త్యజము నొగ్గమగొక్కటిదానఁగల్గు నా
పద తుదిముట్ట, యుక్తి యుపపాదితమయ్యె నమాత్యుచేత; త్వం
పదరవిగాన లేరకట తార్కిక పేచక కోటులెందునన్. 79

తొలి సూనుండు సుషీముఁడేల నృపచంద్రుడెన్నె, దౌహిత్రు హ
కుక్కల బౌద్ధాఢ్యులు, లంపతాసరవి, టక్కుల్ సెప్పి దోఁపింప; వీ
రులకున్ రాజ్యము భోజ్యమౌననుచు మంత్రుల్ తోడుగా, శాస్త్రవా
దులు, తంత్రంబును బన్నరొండు, విపులద్యుమ్నంబులన్ బేర్చుచున్.

బౌద్ధమతానుయాయులకు, బ్రాహ్మణమంత్రులకున్ బొసంగకే
బుద్ధులమాటలన్ వెగటుఁబూనిరి; వెగ్గలముల్ పగల్ మదిన్
బద్ధములయ్యె; కక్షలు, నపాత్రపథనింతురు మంచిచేఁతలన్ !
యుద్ధము తథ్యమేల మనకుల్మకమెత్తి శిరంబుగోకఁగన్ ? 81

ధర్మనిష్ఠాతుఁడై తనరి జీవులగట్టి
యాతనల విధించు యముఁడు నలుపు
దళితదానవదైత్యదంభ సంరంభ, వి
శ్వాలంబనికురుంబ యంబ నలుపు
వేదవాక్య కదంబమాది నట్టములుగా
నెఱదిద్దు వ్యాసమనీషి నలుపు
నిగమ గోక్షీరదోగ్ధగ, జాల్చి గీతాఖ్య
సుధను వర్షించు కృష్ణుండునలుపు

అవనిపున కేల విశ్వాస మరుణ మిహిరు
మిసిమియందు ? – ఏల యుల్లఅంబసితరుచియు ?
ప్రేయసిఁ బేర్మిఁజూచు ! నుపేక్ష సేయు,
సుతునిఁగట ! నీ యెడరునకున్, గతమదేమొ ? 82

ముంచెడు వాసనల్ కరడముల్ వెనుకైన, ముముక్షుహృన్మణి
ప్రాంచిత జీవపద్మము నహంకృతినీఁగ, రసప్రఫుల్లమై
మించు ! ప్రశాంతినించుక, రమించినజాలు ! ప్రసన్నచిత్తతన్
డించిన తత్త్వసారమొక టేకద, బుద్ధపదంబు, ముక్తియున్ ? 83

తుషితుఁ డశోకుఁడున్ బెనుచు దోరము బౌద్ధమునంచు నార్యులా
ఋషుల నిరిద్ధభాషులు, గతేషణ ఘోషులు ! సత్తపోనలా
ధ్యుషిత నికృష్టజన్మమల దోషులు; వారి భవిష్యదర్థవా
క్పృషతలుతత్సరిన్ముకురబింబితవృత్త పురాణగాథలన్. 84

స్వల్పపుబుద్ధి ఛద్మముల సంవృతుఁడయ్యె ఖిలాతకుండు, సం
కల్పమశుద్ధమయ్యెడ ! వికల్పఫలంబు వ్యతిక్రమాంతమా !
గెల్పు నశోకుఁడేకొనియు, గీడగు విప్రులకున్ ! కుభృద్ఘురుల్
పల్వలమల్కలైన, తదభంగ తరంగములన్ మరల్తుమే. 85

రక్తమయ ప్రథనములవి
విక్తుండగుటెంత ? విప్రవృత్తముచే సం
పృక్త మశోకుని చిత్తము !
సక్తుఁడగు నహింసయందె శాంతుఁడతండున్. 86

చాలును, పాటలీనగరి జారుతరంబగు కాఁపురంబు, స్వ
ర్ణాలలితార్ద్రిగాంగ జలనవ్య విగాహనవాసరంబు, లా
భీలతరాహవంబుల నభీరుఘల ప్రబలోగ్రవాహినుల్
కూలముగూల్ప, రుండములు క్రుళ్ళగొనున్, రుధిరస్రవంతులన్. 87

త్వరగ సహస్రముఖంబుల నథర్వణవేదము నేర్పితిఁ బర
స్వరముగ తత్త్వభాగుపనిషత్తతి బూర్తిగ జెప్పలేదు, త
ద్వరమతియార్త రక్షణవిధాన కృపాప్లుతమెక్కొ! యెట్లొ! మా
కిరువురకిద్యోడఁ ముదిమిగీల్కొనె, నూరకనుక్కి లగ్గగుఁ. 88

కొడుకుఁ గోడలి, గూడఁ
సుడివడుదువు నీవు చంద్రచుళికిత చూడుఁ ?
మృదునడుగు దమ్ములుడుగక
మడియకముఁ గొల్వదలతుమానిని"యనియెఁ. 89

హితమిటు తెట్టియగట్టిన
మతితో, మనుమనికిఁ దత్త్వమయమగు గీతఁ
మతి కెక్క వచించి, సమా
హితమతి జంపకు, సభార్యుఁడేగె, నతండుఁ. 90

## షష్ఠధార - భావిని నిర్ణయించుటకై రాజప్రయత్నము

ప్రథిత సర్వాతిశాయియా ప్రణయమధువు
పెద్ద పెండ్లము గడగొట్టు ప్రియతమయును
చవులుఁజూడ నన్యలను దక్కవలు లేక
యరయు షోడశభార్యలమరగి నృపుఁడు. 91

తరతమరీతి నందఱకుఁ దానుఁ బ్రియుండయి సార్వభౌముఁడుఁ
దరుణిమ డిల్లగా సుతులఁ దార్కొను భూరివివేకశౌర్య వి
స్ఫురదరి భంగ భంగిమల సూక్తులయుక్తి చతుష్టయంబు నా
చరణవిహారయోగ్యతల జాణతనంబులనెన్ను నాత్మలో. 92

"పదునాఱగు పూపవయ
స్సాదవఁగదఱుసలి యశోకుఁడొనరె సుషీముం
డెదిగె వినూతన యౌవన
షధ్యుఁ డిర్వది యేండ్లు నిండ స్వచ్ఛందగతిఁ. 93

సరిగ సుషీముఁ డశోకుఁడు
పరగుదురుద్ధుల నిరూఢ బాహుబలములన్
సురుచిర విద్యాపరిణతి
పరభేదనరాజతంత్ర పారీణతలన్. 94

ఒక కొడుకు సుందరాకృతి
యొకఁ డసితచ్ఛవి’’యటంచు నుర్విభరింపన్
సుకృతియెవఁడో నృపుఁడెఱుఁగ
డకృతకములు వామదక్షిణాక్షులు వారల్. 95

జనపదవిహితాచార
మ్మని ‘‘శ్రుత’’మన్ బ్రశ్నవిధి విమర్శింపగ, రా
జును మాఱువేషమునఁ జని
వినియెన్ బురి జనతనోట వెల్వడుమాటల్. 96

‘‘వరపుత్రు గోరియె ధరా
మర దుహితన్ బట్టెరాజు, మాన్యుఁడశోకుం
డురు రిపుకుత్కీలాశని !
సురుచిర సమ్రాట్పదంబుఁ జూఱఁగొనండే.’’ 97

‘‘అవివాహితమదవతి కు
ద్భవుఁడయ్యె నశోకుఁడతని భ్రాత మహీంద్రుం
డ వినయశీలుఁ డనర్ఘుఁడు
సువివాహితకుద్భవించి సూనుండయ్యెన్.’’ 98

‘‘ధర్మంబగు నధ్యూఢ, హ
విర్ముఖ దీప్తాగ్నిసాక్ష్యవిధిఁ బరిణీతన్
భర్మాంగి; పట్టమహిషి సు
ధర్మయె నృపమాతయయ్యె విధంబది ఋతమా,’’ 99

అనియు ననేకవిధంబుల
జనులాడుట విన్న నృపతిస్వాంతముఁ గుదుటన్
బూనరక దవిష్ఠమగు యో
జనఁ జేసెన్ బూర్వరాజ సందానితమున్. 100

వాద నియుద్ధకళాసుజ
నాదరణ పరాక్రమాదులందు పరీక్షన్
మీఁదా వానిని యువరా
ట్ఛ్రీ దయితునిగాఁగ చేయఁ జెల్లునటంచున్. 101

ఒకనాఁడు బిందుసారుఁడు
ప్రకటింపఁగ నాజ్ఞనిడియె స్వాత్మభవులకున్
సకలజన సమక్షమునన్
నికరము కళలన్ బరీక్ష నెఱయునటంచున్. 102

ఆ దేశాచారము బు
ద్ధాదేశానుగులు సౌగతమతుల్ పౌరుల్
తాదృశ పరీక్షఁగౌతుక
మే దురమతి రంగమునకు మేకొనిరాఁగన్. 103

క్రీడారంగ మలంకృతి
తోడాలునడాపలింపఁ దోడయ్యె, లతా
క్రోడిత తోరణములు, దల
లాడించి జగాజిగుల్వెలార్చు పతాకల్. 104

సచివాగ్రణిరాధా గు
ప్తచిరంతనరాజ్యభార ధౌరేయునిచే
రచితంబదియున్ మృదుతృణ
నిచితోన్నత సాంద్రసికతనిహ్నుతతలమై. 105

వర్తుల తారామణిగణ
నర్తన సువిశాలశాల నభము తెఱంగై
వర్తిలె వితానమున్ న
ర్వర్తు ప్రసవాంక చిత్రవల్లీయుతమై. 106

చెలఁగె నిష్పక్షపాతి, సౌశీల్యఖనియు
విశ్రుతుఁడు, వీరుఁడును, బౌద్ధభిక్షుకుండు
వృద్ధతత్త్వార్థవేదియై పింగళార్యుఁ
డయ్యుగంబున నందఱికయ్యెఁ బూజ్యుఁ
డతని మధ్యవర్తిగఁ గోరి రవనిజనులు. 107

పింగళవత్స జీవుని నవీనపురాణ కళావిదగ్ధతల్
జంగమరూప మెత్తెనన జాలిన విద్వదనూనభావు, ను
త్తుంగగుణాశయార్ణవుని దోడ్కొనివచ్చెను మంత్రి యుల్లస
ద్రంగ తలంబునన్ దొడరు దారకులన్ సుపరీక్ష సేయగన్. 108

ఆస్థవిరాగమజ్ఞుఁడు మహామతి - పండితరాజు - పింగళుం
డాస్థగృహంబుఁ జేరిన ఘనంబగు స్వాగతమున్ సుధర్మయున్
స్వస్థమనంబుతోడ నిడి పాదములంటి వసింపఁ జేసె ను
చ్చైస్థితహేమపీఠిపయిఁ జందనవాసిత పాద్యమిచ్చుచున్. 109

ప్రాచి ప్రతీచి, నీడయిన ప్రాజ్ఞులు లేరిల మీకుఁ గొల్వగా
నోఁచితిఁ ద్వత్పదంబుల, ననూనవిభూతికదంబము ల్దయా
వీచుల దేల్పుమయ్య మము మేకొన మేలెపుడల్ల జల్లగా
వీచెద విశ్రమింపు మలపింఛపు వీవన, తాత! నేఁటికిన్. 110

అని యాహ్లాదతరంగితాత్మయయి, సౌహార్దార్ద్ర శుశ్రూషఁ జే
యు నెలంతగన్, సంతసంపడితి లోకోద్ధార సమ్రాడ్గురుం
డనఘా నీస్నుషకున్ జనించునని సత్యార్థంబు వాక్రుచ్చునా
స్వనితాంభోధరునిన్ గురున్ గని కడున్ వందించుచున్ రాజ్ఞియున్.

"మోమును దెల్లబాఱె సుకముల్ మఱుఁగయ్యె నికేమిదిక్కు, సౌ
దామినిబోలె సందియము దళ్కనె చిత్తవియత్స్థలిన్ కదున్
బామది యెట్టులోర్తునని వందురఁ గల్లము నీరుఁ జార్చె న
న్నోమినయట్లు శోకముల కూఱుటఁ బల్కదె? సాధుసత్తమా! 112

రాజరికము లేమినిఁ బరివ్రాట్పదంబు
వచ్చుగద! సూనుఁడున్ రాజపదవిలేని
నాఁడె మనుమండు నగును సన్యాసి! కాన
మత్సుతుండు సమ్రాట్టుగా మనఁడె? తాత! 113

కూరిమిఁ జక్రవర్తిఁగొడుకున్ గనవచ్చిన రాజకోటి కో
టీరతటీపమౌక్తిక కుటీస్ఫుట హీరమణిచ్ఛటాగళ
చ్చారు రుచిన్ మదీయ పదసారస సన్నిధికిన్ నివాళి, చే
కూరగఁ గూబరంబు, సిరి కూటువుఁగూడని బొందె యేటికిన్? 114

అండఁ జిల్లులువోయిన కుండలోన
కూరనగునె ధాన్యంబు? నిగారమైన
నారికేళపు మొల్కను వేరుపురుగు
కొట్టినట్లు వ్యర్థము బ్రతుకున్ గదయ్య!?" 115

అని, సౌవిదల్లకులకున్
గనులున్ జెమ్మగిల నేడ్చు కాంతకు నుప్పొం
గెను వార్ధిగ దుఃఖము స
న్మని పింగళుఁ డనునయించె ముద్దియ నంతన్. 116

మాన్యుఁ డశోకుఁ డొక్కరుని మాని రచించెను, ముఖ్యమంత్రి, రా
జన్యజులెల్ల పాల్గొనగఁ జయ్యనరండనిబిల్చు లేఖ ల
న్యోన్యము సంప్రదించుకొనిరయ్యెడ నూర్వురు రాజపుత్రులా
జన్యతలంబునన్ జయముచాల్గన యోగ్యములైన తెన్నులన్. 117

ధన్యులమని మహార్యాన్వయ
మాన్యులు తారుణ్యశక్తి మహితులను గొనన్
గన్యాత్మజాతుఁడొకఁడె జ
ఘన్యుండనఁబడె, సుధర్మ కలవరముడిగెన్. 118

రేఁపగ సంగడీఁడులు, నవీనపరాక్రమధుర్యులైన యు
ర్వీపతినందనుల్, యువకవీరులు శూరత నొందువారుల్ జయో
ద్దీపితచిత్తవృత్తులఁ బడింబడి పోరితముల్ పరీక్షలన్
జూపుదురన్న వార్తలును జొప్పడె పట్టణ మన్నిమూలలన్. 119

రాధాగుప్తుఁడు సర్వమున్ దెలిసి నిర్వ్యాజప్రజారాజభ
వ్యాధీనోజ్జ్వల భక్తిచే మెలఁగ; బాహాటంబులో యుక్తులన్
సాధింపన్ తఱికామి నెన్ని, "సచివస్వామీ! యశోకుండు మీ
మేధన్ దట్టఁడో లేక వీడితిరో తామే" యంచు ఖల్లాతుఁడున్. 120

చని ప్రశ్నించెడు వైఖరిన్ గని "నృపాస్థానంబునం దెవ్వరున్
గిచుకన్ బూన రశోకవర్తనలు యత్కించిద్విరుద్ధార్థముల్
గనవైనన్, క్షితినాథు నిచ్ఛకిది తాఁ గారణంబు, రాట్సూనుఁడే
తనకై తాన పరీక్షశాలగదియన్ దప్పేమియున్ లే" దనెన్. 121

త్రుటిత సుమాఘవృంతవృత ధూళిమయంబు వితర్దికన్ సర
స్తట సుమగంధ గంధవహతాడిత వీచుల, సంబుకుక్కుటా
ర్భటులనువించు పూర్వకృత భాష్యవివక్షఁ బఠించుచున్న రా
డ్వటువు నశోకునిన్ దెలుపఁబంచె ఖలాతకుఁ డెల్లసంగతుల్. 122

అల్ల దూతయు, రయమున నరిగి వనముఁ
జొచ్చి యట నర్థశాస్త్రంబు సూత్రవివృతి
వల్లెవేయు నశోకుని ప్రక్క నిల్చి
కల విధంబెల్ల సాంగంబుగా వచించి. 123

''ఘనసాహసేజయమ్మ''న
విని సందేశోక్తకార్యవినతుఁ డశోకుం
డునుఁ గిమ్మనకయచేరెను
స్వనియుక్తి గిరివ్రజోపవన భవనములన్. 124

''రాజగృహంబు''కంటె నభిరామముగా మునుభవ్యభాగ్య వి
భ్రాజితమైన ''పాటలినిఁ'' బార్థివుఁ డా శిశునాగనందనుం
డాజి వినిర్జితారి వసుధాధిప భూరిధనుం డదంధన
శ్రీ జయదివ్య పట్టణ సిసృక్షను నిర్మితిఁజేసె నర్మిలిన్. 125

ఎప్పటినుండియో ప్రణుతికెక్కి, జరాసుతముఖ్య భూభుజుల్
గొప్పగనన్ ''గిరివ్రజ''పుఁ గోటల, ''రాజగృహంబు,'' పేటగా
నొప్పెను; వాటికాప్సరసలున్నత శృంగపుటీవిటంకముల్
కొప్పులుగా పురేందిరకుఁ గొల్వులుదీర్చిరి క్రుంగుమేడలన్. 126

ప్రాఁతగిలెన్ బురంబు, నరపాలకులున్, బొరివోవులాంఛన
వ్రాతముఁ బేర్చియుంచిరి, నివాతగుహావళిఁ జూర్ణఘూకముల్
మ్రోఁతలజీర్ణ శీర్ణగృహముల్ తమము ల్దమవేయనన్ స్వని
ష్ఠ్యూత విషార్చికావలిగఁ జూపఱ నివ్వెఱఁగొల్పె సర్పముల్. 127

కాని ధరానేతలు స
మ్మానితగిరి దుర్గభాగ్యమానవనంబుల్
దీనని వేశ్మపురాణ
స్థానములను భద్రపఱచి, తనిపిరి జనతన్. 128

కస్తురిఁ గట్టుపుట్టములఁ గ్రాలవెతావులు? చాలకాల, మా
శిస్తువహించు ''రాజగృహ'' సీమఁ బురాతనకీర్తివాసనా
ప్రస్త సువృద్ధభద్ర గజరాజహయావళి, గట్టుమందువాల్
మస్తుగనిండె, నుండె, సుషమాకలితాయుధజాలశాలలున్. 129

ఆ రాత్రిఁ శిశునాగరాట్ప్రభృతి శౌర్యాఢ్యుల్మహీనాథులే
యారామంబున విశ్రమించి రట సౌధాగ్రంబునన్ నిద్రచే
కూరన్ నిల్చి యథేచ్ఛ, శీతమరుదంకూరార్భకుల్ వేకువన్
పాటాడన్ గని లేచి వైశమ కుశాంభః పూరసుస్నాతుఁడై. 130

గిరిదుర్గాపాదంబుల
కెరఁగి బృహద్వృద్ధ దంతి నెక్కి యశోకుం
డురుగతిఁ గ్రీడారంగపుఁ
దెరువును లక్షించి విజయశీవిన్ జనినన్. 131

## సప్తమధార - కాండ సమాప్తి

శ్రీ గజవక్త్ర! సాధుజనచిత్త వశీకర భక్తిసూత్ర! ఉ
ద్యోగ తపః పవిత్ర! నిరతోద్యతకాంచనవేత్ర! వేదసూ
క్తాగమ తంత్రభాగ నిచితాయతనేత్ర! ముముక్షుమిత్ర! శ్రీ
ప్రాగుదితార్క కోటిరుచి బంధుర! పన్నగగోత్ర! మ్రొక్కెదన్. 132

సాధితమయ్యెఁ దృతీయము
వేధస్సతి కురియు నర్థవృష్టిఁ బ్రచురమై
బోధార్ణోందు విజృంభిత
గాథాంబుధి సంగమాభిగమకాండమిదే. 133

శ్రీరస్తు

# శ్రీ మ ద శో క చ రి త్ర ము

## చ తు ర్థ కాం డ ము

## సుషీమాశోకుల భిన్నవృత్త పరిణామములు

### ప్రథమధార - కాండనాంది

సునవద్వార పురీహ
ర్మ్య నివాసాత్మాంశుమాల! రవి శశి తారా
ధ్వ నిఖిల దిగ్విశ్వ నికే
తనమాల! విపన్న భక్త తారకలీలా! 1

అన్నుల మిన్నవు! నీవా
పన్న శరణ్యవు! – మదీయ పద్యసుమంబుల్
మున్నెసఁగు విశ్వకవితల
తెన్నున, సురభిళముగా, విధింపుము వాణీ. 2

### ద్వితీయధార - కుమారవిద్యా పాటవపరీక్ష

భల్లున దెల్లవారిన నభస్థ్సుఁడనూరుఁడు పిల్వ, నయ్యుషా
వేల్లిత బాహువల్లరులు వీఁగగ, విశ్లథ తారకాత్త ధ
మ్మిల్లము నొత్తి, వీడ్కొని సమిద్ధ కుసుంభరుచిప్రకీర్ణమా
నొల్లెను దాల్చియెక్కెను, మహోదయుఁ డర్కుఁడు ప్రాఙ్నగాగ్రమున్.

అంత సమీర మాణవకుఁడల్లన గూఁకటిద్రోయ, వచ్చిర
త్యంత సువర్ణరంజితము లంచు జరీలెమ్ములుగార, వన్నెలన్
గాంతముతో, దుకూలములఁ గ్రమ్మఱ నెట్టుచుఁ గట్టియున్, జయ
భ్రాంతి మనంబుల న్నిగిడిపైకొన రంగముఁజేర రాట్సుతుల్. 4

ఓడని యశ్వము ల్గొని, తదూర్జిత పృష్ఠతలంబు లెక్కి పెన్
దౌడులఁ దీప్చువారలును, దమ్మడలించెడు వారువంబులన్
బీడుల ద్రేవఁ దోలుచు జపేటలఁ దట్టుచు దూఁటిపోవఁగా
నూడనిఁబాడు వారలును నుక్కరులై చౌరువారునై రటన్. 5

ఆ జానేయ చతుర్విభాసము ఖురోద్యద్వేగ నేమిక్రమం
బై, జాళ్వా విరిపోహణం బరదమున్ భాసిల్ల పారీంద్రరూ
పా జిహ్మాంబగు మండపంబున, నవభ్రాజభ్రంకషస్వాంక వి
భ్రాజత్కేతన రాజితో, మగధ సమ్రా ట్టంత నారూఢుఁడై. 6

క్రీడాస్థానముఁ జేరన్
బ్రోడలు రక్షకభటుల్ చమూపారీణుల్
వీడక పగ్గము లిరుగడఁ
గూడన్ బిగఁబట్టి, జనుల గుమి నెడనిల్పన్. 7

మినుకుల వెదజల్లెడు స్వాం
దన మవరోహించె, యావతక్షి ప్తవిలో
కన కరముల్గురిసెను, క్ర
న్నన స్వాగత కుసుమ విసరణాసారంబుల్. 8

యౌవన యావనకాంతలు
త్రోవలఁగాప్పుండి జనత తోఁదోపుల విం
తై వీఁగఁగ, ఝళిపించిరి
శివిగఁ గరవాలములు బటిష్ఠత మెఱయన్. 9

నృపుఁ డాసనమున్ మెట్టిన
నపరంజినిఁ దాపినట్టి యుసుగునఁ బచ్చల్
విస్ఫులనుల్లై మెఱసెను, ని
ద్దపు దీపమ్ములపోనలు సుధాద్యుతులీనన్. 10

తూర్యంబు లుల్లసిల్లగ
మర్యాదలు చెల్ల, నమితమస్తులు, సచివుల్
పర్యాయము లేని క్రీడా
చర్యలకుఁ బ్రణాళికల నొసంగిరి పతికిన్. 11

నయ విదు లర్థ మిత్తుమని నాలుకదప్పరు; ముగ్ధలన్యలన్
వయసుననుండి రొప్పరు; నివర్తనఁ ద్రిప్పరు, కాలునెవ్వఁడ
మ్మొయిదినవారి కొప్పఁగొన రెబ్బెపు చెయ్దము లెందు శత్రు దు
ర్జయులని రాకుమారులఁగరంబు నుతించిరి వంది మాగధుల్. 12

ఫుల్లతులును, భల్లములును
నల్లియత్రాళ్ళడిదములును నమ్ములదొనలున్
పెల్లెల్లరుగొన నానిరి
మల్లురు ఖురలిన్ బ్రసూనమైరేయములన్. 13

తలకొకమాట యాడెడు సదస్యుల సద్దణఁగన్, ఘటిల్లె ఘం
టల నినదంబులున్, బటుకుఠారహతిన్ దుములంబు, మన్నిలా
దుల నగలించి వ్రేల్చుటలు, దోడ్తనెకొమ్ముల నూఁదుటల్, ముదా
కలితములయ్యె బింగళుఁడు కాంచనవేదిక నెక్కినంతటన్. 14

తారపుఁ బూజెల ఘటముల
కారతి ఘనసారమిళితమంకింపగఁ బెం
పారె మొదలు, నిస్సాణో
ద్గార ధ్వను లిమ్ముగన్ బ్రదర్శనములకున్ 15

మేరు శరాసను నుగ్రత
సారేక్షు శరాసనాంగ సౌందర్యకళన్
నీరేజ బంధు రుచులఁ జ
కోరాప్తుని చేయి చలువఁగొదకొన్న కొమరుల్. 16

వలసిన వాలులమ్ములును వంటుగఁ దాల్చి ఘనాటవిన్ జర
త్కలభములట్లు నుద్దుల నెకాయెకి రంగము జొచ్చినన్ నిరా
కుల మతులైన ప్రేక్షకుల కోటులు, తట్టిరి చప్పటల్, వడిన్
దలపడి రొండొరుల్ నిపుణతల్ వెలయించుచు నా కుమారులున్. 17

ఒక్కఁ డొకనికి నెదురుగా మొక్కవోని
ధృతియు నుద్ధతి మొనరంగ గొతుకులేక
దాఁకు వారి మొగంబు లశోకురాకఁ
బాండురము లయ్యెఁ బగటి దీపములువోలె. 18

ద్విరదముపైఁ బ్రవేణి కొన వేడెముగా డిగి యయ్యశోకుఁడున్
ద్వరగతి వచ్చి నిల్చెనొకవంక దనున్ బరికించి యుత్సవం
బురువడె నీదురాక నిఁక నూఁకుము నీవను ప్రేక్షకావళిన్
మరలుప నేరఁడుర్విపతి; మానితుఁడాతడు సొచ్చె రంగమున్. 19

చిచ్చఱ ముల్కులఁ జిమ్మ ధనుర్ధర
లక్ష్యంబులగు లక్కలప్పములును
చక్రఘర్షణ భిన్నశర్కరాంతర శిలా
శకలంబులౌ, రథనికరములును
ఘీంకృతులఁ గరాళకృకమెత్తి నింగికి
దొండముల్ సాచువేదండములును
ఖురఖురఘట్టన క్షుభితసైకత తృణ
క్రమ రయవిచలత్తురంగములును

చేరి వేఱగు చక్కనిండార నొక్క
మయిలు చదరాన, వలయితమయి ముఖంబు
జెట్టిపెనకువ కిక్కయై చెలఁగు రంగ
భూమి నలయక యూరాజపుత్రవితతి. 20

వర శరధార లంబుకణ వారముగాఁగ ఘనాఘనాఘను దు
ర్ధరరవము ల్ధనుర్నికర దారితటంకృతులీన, లోహమే
దుర కవచాళిఁ బోరునెడ దూఁకెడు దీప్తులు గ్రొమ్మెఱుంగులై
వఱలఁగ నారసంబులను వార్చి యెదుర్కొని రొక్కరొక్కనిన్. 21

నాణెపు వన్నెచెక్కడములు నైకసముచ్ఛ్రిత శృంగమాల, కం
ఖాణతతుల్ ప్రమోత్కరముగాఁ బరువెత్తు సహస్రసంఖ్యలౌ
స్థూణచతుష్టయాంతర పసుప్రతిమానవజంతుజాల ము
గ్రాణము సూతరాజికనఁ గ్రాలె నికొక్కెడసన్ శతాంగముల్. 22

నీల వలాహకప్రకర నిహ్నుతమంబర మొక్కెడన్ గేవలన్
చేలిన యట్టులొప్పఁ గరటివ్రజముల్, విగళన్మదాంబుధా
రాలసితంబులై గదుమ, నాస్ఫుటి నొంటికచో, ఘుణంఘణో
ద్వేలనినాద ఘంటికలు మ్రోయగ సూవటుఁలుగాఁదఁ, దాకుచున్. 23

మానసవేగగాములు, తమాల విభాపల విద్రుమప్రభా
నూనము లంకిణీ లహితనోదక దేవమణి ప్రతిష్ఠ, హే
షానయము ల్నిచోళములు, సముద్ముఖఫేనమకేసరాట్టులు
డ్డీనగతుల్విరాజిలఁగ, తీవి హరుల్వెఱ గొల్పఁ బర్వెలన్. 24

హయహేషల్ గజబృంహితంబులు సమాయాతప్రయాతప్రజా
చయ సంచారవిచార వాజినదముల్ జ్యాటంకృతుల్ జప్పటల్
జయఘంటాఘటితోరు ఘోషణములున్ చక్రక్రమోద్ఘన్నినా
త్యయ పాతధ్వను లొక్కటన్ మలసె శ్రోత్రస్పందసంపాదియై. 25

వినుతాశ్వికులును, రథికులు
ఘన నారాచప్రయోగకౌతుకమతులున్
స్తనిత భుజాస్ఫాలన మ
ల్లనియుద్ధపరాయణు ల్బలంతులు పోరన్. 26

చూపిరి కౌశలములు; వివి
ధోపాధుల నాశ్రయించి యువకులు శూరుల్
చూపఱు లచ్చెరువొందగఁ
దాపసి పింగళుఁడు తారతమ్య మరయఁగన్. 26

బాహా బాహి, కచాకచి,
బాహుల్యము శివముపట్టు పట్టుల, గని రు
త్సాహముఁ గొక్కిస మాదుల
మోహమ్ములు వీడి మిన్నుమ్రోయఁగఁ జెట్టుల్. 27

అర విచ్చిన కరవీరపు
విరులవలెన్ యువకులెల్ల వెలయుచుఁ గడు దు
ర్ధరులై యొండొరు లెదురుచు
పొరలూడ్చిన దుంపలగుచు పోట్లాడి రనిన్. 28

అనియాడుచు గొనియాడుచుఁ
గనిమూగెడు జనులు చుట్టుగవియఁగఁ గ్రీడల్
మొనసెను రెండవ యామపుఁ
గొనగని రవి నభము నడిమికోపున జేరన్. 29

ఒకదిక్కశోకుఁడును, నిం
కొకదిక్కు సుషీముఁ డిర్వు రుద్ధతబలులై
సకలక్రీడల విజయం
బకలంకముగా వరించి, యార్భటిఁగదియన్. 30

యువరాట్పదుఁడు సుషీముని
నవులాటకుఁగాని పిల్పు నల్వగఁ గనమిన్
గవియన్ దగదు దురంబున
భవితవ్యముఁ బౌరసభలె ప్రతిపాదించున్. 31

అని వాక్రుచ్చెడు నృపు నే
మనసేరక సభ్యసమితి మౌనమును భజిం
చిన, నయ్యెడఁ బింగళుఁడును
"గనెమొనఁ గ్రీడాప్రణాళిక క్రియల" నినన్. 32

ఆటలు నిల్చెనయ్యెడ సమాగతలౌకిక లోకమెల్ల సా
పాటునకై నివేశముల వైపునకేఁగఁ గుమారులెల్లఁ బో
రాటపు జందము ల్దడవి రక్కొనుగెల్పుల నోటముల రట్టడుల్
కూటములన్ని యెన్ని, కౌతుకుల్వాడి రుత్తరకార్య చింతనన్. 33

మేళములఁగూడి చని, వాః
క్షాళనములఁ జెమట లూడ్చి చలువఁదనపుఁబెన్
గేళకుళి నిమజ్జనముల
నాళీకప్రసవపాళి నలుగుల గనుచున్. 34

ఆయా శిబిరములను నా
యాయా యౌవన యోధగణము లలమి యలసటల్
వాయఁగఁగుడిచిరి వేఁచిరి
ప్రాయికముగ ఫలితమెలుగఁ బ్రదస్నువులగుచున్. 35

ఆహూతులైన వారు, న
నీహారకరోష్ణతార్తి నీఁగెడు పటు సం
దోహగృహంబులఁ గనిరి ప్ర
తీహారుల సేవనొరులు తిరిగిరి బయలన్ 36

ఓజ వసింపఁ దానొకటియున్ శిబిరమ్మట లేమినెంచి రా
రాజు "మకాము" చెంగటఁ విరాజిలు దొడ్డపటంబు సీడ వ్యా
ఘ్రాజినవర్తి సాధు వొకఁ డంబురుహాసనగతిన్ సాగునిన్
బూజలు సల్పుచున్నఁగని పోయి యశోకుఁడు నిల్చె నచ్చటన్. 37

దూర్వా శ్యామల శాద్వల
మూర్విన్, వ్యాఘ్రాజినాగ్రమున్ ద్రొక్కుచుఁ ద
న్నుర్వీపతి సూడ, వింటన్
మౌర్విన్, సడలించి మ్రొక్కె మౌనీశునకున్. 38

పూజావసానముఁ బరి
వ్రాజక దేవప్రసాద భాజనమగు స
ద్భోజన మశోకుఁ డేర్చ, స
రోజాకర తటమునన్ బరుండెఁ గుశలపై. 39

ఆ పై యోజన కించుక
సేపతఁడున్ మేను వ్రాల్చి సేదయుఁ దీరన్
ప్రాపగు, కొలనున, మున్కిడి
దాపుల దృశ్యములఁ జూచు తలఁపునఁ దెరలన్. 40

## తృతీయధార - అశోకుని యాలోచన

ఆ వటశాఖికోటరమునందలి శారిక, మింటికేగుచున్
ద్రోవ నొకండు వేసడముత్రోసి యదల్చినఁ గ్రిందవ్రాలి, యా
ఠావునఁ బాదమూలమున డస్సి, గసన్ గడునోడి, యూర్చినన్
దా విహగంబు మేనివిరి తన్నుచు దోలఁగనేగె సాళ్వమున్. 41

అప్పు డశోకుఁ డెత్తి కరుణార్ద్రితఁ బక్షిని బుచ్చివైచి, చి
న్నప్పటి దాదిమాటల యథార్థములెన్నుచు వృద్ధ దంతికిన్
దప్పికఁదీర్చి క్రొంజెఱకుదంటుల లేతయనంటి యంటలన్
గుప్పిట దొండమందిడియె, గోమున నామముగోధిఁ దిద్దుచున్. 42

మూఁడవ యామాంత మివము
సూ డించుక వేఁడి వీడె సురవర్త్మమునన్
దాడులనుడిగిన ముదుసలి
ఱేఁడున్ దలపించి రెచ్చె రెట్టిన్ నీడల్, 43

లలితరసాల పల్లవములన్ మెసవన్ బరువెత్తు పిల్లకో
కిలల కలధ్వనిన్ సరసఁ గేళకుళిన్ జిగి వ్రోలలైన యు
త్కలికల బాతుకూనల కుదారసమీరుఁడు పాడె, సందె, పా
టల నవి వించు, నర్కుఁడు హుటాహుటిఁ బశ్చిమదిక్కు ముట్టినన్. 44

సాయంసమయాత్త సభా
ఖ్యాయిక మొదలయ్యె, మంగళాధ్యాయముతో
న్యాయం బెద్దియొ తేలున్
వ్యాయామాచార్య పింగళార్యుని వలనన్. 45

కాశ్యపి సఫలద్రుమ, స
స్యశ్యామల, వీరభోజ్య యనిరి మనీషుల్
ఐశ్యమ్మెవరిదగుటయు, న
వశ్యమ్ముగ నేఁడు మాకు బయలుగఁ దెలియున్. 46

తర్ణక మేవిలువ యగునో
నిర్ణయ మొనరించువాఁడె నిజముగ రైతౌ
వర్ణము నల్లగ ముసరిన
నిర్ణేజకుఁ డొకఁడె తెల్పు నెఱుపున్ వలువన్. 47

అని జను లూహించుచు నట
వినుచుండగ బింగళుండు విహసితముఖుఁడై
యొనరిక, గినుమాడక గరి
కొను సత్యార్థము వచించెఁ గోవిద సరణిన్. 48

హార్యక్షమో భద్రహస్తియో, సమ్రాట్టు
లకు, భవ్యవాహన లక్ష్మిగనిరి
వ్యాఘ్రాజినమ్మొ కుశాస్తరణమ్మొ పై
ళగియుంఛుటాసన లక్ష్మి యనిరి

ఏణ గో మహిష ఖేంఖాణపక్ష్యాద్యసు
లాలనకారుణ్య లక్ష్మియనిరి
వెలిఁ బోక చతురంగముల మొనఁదాఁకి ని
ల్వరుచుట సాహసలక్ష్మియనిరి
క్షాత్రలక్ష్మి యైదవదని, క్ష్మావిభుండు
సర్వదా సర్వథా స్వయం సజ్జితుండు
సత్య గుణధర్మ శౌర్య నిస్తంద్రదీక్షఁ
డగుననియు మున్ను భాషించి రార్యమునులు. 49

ఈ యైదు తెఱంగులలో
నే యిద్ధ మృగేంద్ర దర్పుఁ డీనాఁడు జగీ
షాయత్తత వర్తించె ను
దాయుధు లెల్లరనుగెల్చి యతఁ డుత్తముఁడౌ. 50

చాపపరీక్ష ధనుష్కేళి
నేపారు మహారథులె వహింపంగలరీ
భూపతి మాళి యొకండే
యోపెడు నది నిశ్చయింప నొరులకుఁ దరమే ? 51

అని తీర్మానించి మహా
ముని పింగళుఁ డా మహీశు మొదలుగఁగొని వే
చన, గొల్లెసలను గొల్లుగ
నినుచుచుఁ బ్రజయిట్టులనియె నిష్కర్షలకై. 52

"తన నీడఁ దానె చూడఁడు
మనుజుఁ డిసీ యెటుల ధర్మమర్మ మెఱుంగుఁగ
మునియు యథాస్థితి నోడువఁడు
మన రాజేశ్వరుని మదికిమంచి దదేదో ? 53

యువరా జశోకుఁడే తగు
నవభాషాకోవిదుండు నవ్యాయుధ వే
ది, వరపరాక్రముఁ డండఱ
యువకులను, నియుద్ధమందు నోడించెఁగదా." 54

అని కొందఱు వాక్రుచ్చిన
విని యితరులు నవ్వి, "యట్టి విక్రమమేనా
పనుపడు ? పరులకు లేవా
యనితర సులభములు, రూప మౌదార్యంబుల్. 55

విలసిల్లు సుషీముఁడు, ని
శ్చల ధైర్యాగ్రియ వదాన్యసౌశీల్య సము
జ్జ్వలతన్, సద్బోధగుణో
ల్లలితుఁడుగద, తగఁడె వాఁ డిలాపతిగ ?" నన్. 56

ఈరీతిఁ బలువిధంబులఁ
బౌరులు భాషించుచుండు పలు పలుకుల నా
భూరమణుఁ డెఱిఁగి యెటు ని
ర్ధారణసేయంగరాకఁదా మదిలోనన్. 57

రూపు నుదారత సుజనుల
ప్రాపును గాంభీర్యవృత్తిఁ బడసియు నెంతే
యోపిక దయ సమయజ్ఞత
జూపండు సుషీముఁ డాజి శూరత నెఱయన్. 58

అకట ! కురూపి యశోకుం
డొకఁడే, యుద్ధతుఁడు పట్టయోగ్యుఁడు శూరుం
డిఁక నేక్రియ యుక్తము, పూ
నికఁ దేలునటంచు ధారుణీంద్రుఁడును జనన్, 59

ఘోరపదాతి శూర రథికోత్తమ పంక్తికిఁ బ్రీతిపాత్రుఁడు
గ్రారి మదేభయూధ చటులాటవికిన్ దవవీతిహోత్రుఁడా
చారపవిత్రుఁడాఘ్యుఁ డురుసారసనేత్రుఁ డశోకపుత్రుఁ డిం
పారెడు రూపు చొప్పడమిఁ బాత్రత కెక్కఁడు తండ్రి ప్రేముడిన్. 60

వినయంబున సనయంబున
ననుగుం దండ్రికిఁ బ్రియంబులగు కార్యములన్
బొనరించు నశోకుండును
దన యభ్యుదయమునుగూర్చి తలపోసెఁ గడున్. 61

తన చెయ్దంబుల నొక్కటొక్కటియు నాత్మన్దూఁచి, యాచార్య జీ
వుని, వాక్యానుగుణంబులై తనరె, మెప్పంగంటిఁ గ్రీడోత్సవం
బునఁ గాంచెంగద తారతమ్య! మరసెన్ భూపుండు వాత్స్యాయనా
గ్ర నిగూఢాక్షులతో గుడారము వెలిన్గన్పట్టు దృశ్యంబులన్. 62

రాజనివాస మున్నతధరాస్థలి నున్కిబిరుందు ముందు న
వ్యాజిని బాలుఁగొన్న తనయావలి చర్యలనెల్లఁ జూచెఁ దా
నై, జవరాండ్రు గొల్వఁగ యథార్థమెఱింగియె మిన్నకుండె నే
మో! జయపెట్టి పత్తులు నమోయని నన్నినుతించు నయ్యెడన్. 63

ప్రోవఁడె చెక్కులు మీటిన
చేవసఁగార్చెడు ననాథ శిశువులఁగృప నా
దైవమె, మద్ధితుఁడై, పని
యావంతయుఁ బొల్లువోని యట్లమరించున్. 64

అంతయు జక్రవర్తికిఁ గరామలకంబు, జిగీషఁబొల్చి ని
శ్చింత, మదాజ్ఞఁ గార్యముల జేయఁ బతాకిని సిద్ధమయ్యెనే
వంతయు లేక, తల్లి యనివార్యము లెల్లను దీర్చుచుండె; ధీ
మంతు లమాత్యులెల్లరు, ప్రమాదము నేది సహాయు లియ్యెడన్. 65

అని మదిఁ దర్కించుచుఁ దన
ఘనశస్త్రాస్త్రప్రయోగగరిమ క్రమంబై
యనువయ్యెన్, విజయశ్రీ
యనుమోదంబని, యశోకుఁ డనుకొనుచుండన్. 66

## చతుర్థధార - రాజపుత్రులను పరీక్షించుట

ఉన్నంతలోన నిర్వురె
యున్నతగుణులని పరీక్షనుర్వీధవుఁడున్
గన్నన సామంతజనుల్
గన్నవియే నిజముగాఁగఁగనియుఁ గడంకన్. 67

"ఒక్కఁడు జ్యేష్ఠుఁడు సౌమ్యుఁడు
నక్కఱలన్ గార్యదక్షుఁడగునో కాఁడో
యుక్కలుఁడగు కానీనుని
చక్కదనము మొక్కవోని సమరమునందే. 68

ఉత్తముడెవ్వడిందు పని నోపికఁ బ్రాపయి నిర్వహించు, సం
పత్తటి నాపదుద్ధతి నుపాయముతో వెసఁదాటి, యుజ్జ్వలో
దాత్త సువర్తనన్ మెఱసి, తత్ఫలమున్ గ్రహియించు, వాఁడె పో
సత్తముఁడిద్ధబుద్ధి నయసారధరాభరణ క్షమాదులన్." 69

అని మెదనెంచు చిందున్నపుఁ డయ్యెడ దక్షశిలాధి నాయకుల్
పనిగొన రేమియున్ బ్రభుని పన్ను నొసంగరటన్న వార్త గొం
పున గను జేవురింప విని "పోటరులెవ్వరుపోయి తత్ప్రజల్
గెనయఁగ దీనిఁ దీర్తు రనికిన్ జనకన్ బ్రతిభాసహాయులై?" 70

అని యానతిచ్చు నృపునిన్
గనుచున్ జ్యేష్ఠుఁడు కుమారకంఠీరవుఁ డా
పని వినియెద నన్నన్, వెం
టనె చంద్రాయుధము బుత్రుడా కేల నిడెన్. 71

తపనీయ పుంఖశరములు
నృపునాజ్ఞాపత్రమంది, నెమ్మిపదాతుల్
నిపుణులు వెన్నంటి నడువ,
సపటాటోపుం డనిల దిశాసుముఖుండై. 72

పయనింప సిద్ధుఁడైన, త
నయుని కిటు సుధర్మ చెప్పె; నయగతియు వచో
నియతి యవశ్యములని, ని
ర్భయులగు నధికృతులఁ బిల్చి రాజీచేయన్. 73

"నియమింపుడు, వ్యవహార ము
భయుల క్షేమార్థమని విపక్షకుజనులన్
బ్రియవాక్కుల లోఁగొనుచున్
దయఁజూపుము శ్లాఘనీయ తర తంత్రుఁడవై. 74

గోటన్ మీటిన నయ్యెడు
సూటికిన్ బని; దానికొఱకు సూరిజనంబుల్
గాటంబగు గొడ్డలిగొన
నేటికి? వ్యర్థము శ్రమింప రెఱిఁగిన ప్రాజ్ఞుల్." 75

అను తల్లిబుద్ధివాదము
విని యామె పదంబులొత్తి వినమితుఁడై వేఁ
గన నా సుషీముఁడున్ జనె
ఘనముగఁ బ్రతిపక్షశిక్షఁ గల్పించుమతిన్. 76

''ఆల మరల్చినట్టి ఘనుఁ డగ్రజుఁ డంద్రదు సుషీముఁ డేగి పే
రోలగమందు నాయకుల కూఱట మాటలఁ బల్కి, విశ్వవి
ద్యాలయ నేతలన్ మనసు దువ్వి వినూత్న కళావిదగ్ధులు
ద్వేల మనీషులున్ దను నుతింపఁగ, దక్షశిలన్ యశస్వియై. 77

జనులకు హాయి సేకురఁగఁ జయ్యన నాటవికాళిగెల్చి, ని
ల్చిన ఋణము ల్వసూలుగొని; చెచ్చెఱ వచ్చెనచో, గిరీటిగాఁ
గొని పురవాసులందఱు నకుంఠితభక్తిని గారవింప గ
క్కునఁ బృథివీశుఁ డౌత్తుకొను, గోరకవల్చు భవిష్యదర్థముల్." 78

అని మిత్రులు, తమలో నను
కొనఁగ సుషీముండు మధ్యగొంజక, మడలన్
గొనకొనియు, గొండత్రోవల
నెనసి, సొలసి, తక్షశిలకు నేగెఁ ద్వరగన్. 79

రాజకుమారుఁ డార్ద్రమతి, రాజితధైర్య వివేకశాలి, యా
యాజక భిక్షువర్గముల యానతులన్ శిరసావహింపఁడే
యోజన ధిక్కరింపఁడు, ప్రయోజనమయ్యెడు మాకు గాన నే
గో జొనరింపకుండుదము గొల్తముగాకని పౌరులెల్లరున్. 80

వడి నడతెంచి మంగళరవంబులతోడ, నెదుర్కొనంగ ను
క్కడగిరి వీరు నా యనుగకాండము సైనిక వారమెంచి, నా
నెడఁద మదంబు హత్తగ, సమీహితవాగ్గతి, సాంత్వనంబులన్
బెడఁగగు చూపులంబఱపి, బెట్టుగ నశ్వము వీపు దట్టుచున్. 81

తన విడిదికడకుఁ జనియెన్
ఘన గౌరవ వాద్యఘోషకైంకర్యములున్
మొనయగ; సుషీముఁ డెల్లెడ
మొనసరులన్ జీమలట్లు మొల్లమి గొలువన్. 82

చేరు ప్రజానాయకులన్
"దీరిక నెల్లుండిరండు, తీర్తును మీ మీ
కోరిక"లని లోఁజన; గా
పూరుషు లారసిరి పొందుపోరు జతనముల్. 83

ఆ మీఁదట వినియెను భృ
త్యామాత్యులు సెప్పఁ బ్రజలయాగడముల బ
న్నె మాన్ప ప్రతీకారము,
పామరులకు బోధసేయు పలుగాకి పనుల్. 84

అరిజను లుత్సహింప నిటులన్నెము పున్నె మెఱుంగనట్టిరై,
నరులు తిరస్కరించి రధినాథుని యాజ్ఞలనన్న నాయకుల్
దురితము సేసిరంచు నతిదుర్భర కర్కశపాలనన్ నిరం
తర ముడుకెత్తి లోకులును దాల్మిని వీడుటలన్ గ్రహింపకే. 85

కర్ణేజపు లాడినవియు
కర్ణాకర్ణికగ వినంగఁ గల్గెనని జనా
కీర్ణస్థలముల కరుగక
తూర్ణంబ, సుషీముఁడుండె దుర్ణయరీతిన్. 86

ఆ మరునాఁడే లోకులు
స్తోమంబై వచ్చి రాజసుతుఁగని ప్రోలన్
దా మధికార కృతంబుల
భాముల ననుభూతు లిట్లు పల్కిరి వనటన్. 87

"పౌరులు, బల్లెవారలకు, బాపపు రీతుల రాజభృత్యు లు
ద్దార కటూక్తి యుక్తి, నిశితాయుధ భీషణ దుష్ప్రయోగముల్
తేరకుఁ జేయఁ బ్రైషణికధిక్కృతికి న్నరికట్టి రంతెకా
కూరక కల్గునే కఱత కుట్రలు! మానవులేకదా ప్రజల్? 88

దీనత నిట్లు గుయ్యిడు నదృష్టవిహీనుల నాలఁబోలెఁ గా
రానిలయాలికిన్ గఱటి రౌతులు ద్రాళ్ళబిగించి యీడ్చుచున్,
బోనుల జంతువర్గములఁ బోలిక పెట్టిరి కొంతకాల మా
హైనము బాగుకాదని, ప్రవాసము వేగమ పంచిరుద్ధతిన్. 89

కొందఱినిట్లు, నట్లు మఱికొందఱి, నెందఱినో మహాత్ముల౯
బందెలవేసి దుస్సహనిబంధనల౯ ముఖముద్ర వేయ, బ
ల్పందడి గొంచు జానపదసంభ్రమ మంతటఁ బర్వఁ గష్ట సం
స్పందితులై జను లుక్కిమిలి బాటలకెక్కిరి తిర్గుబాటుల౯. 90

ఇదియు ననర్థమం చెఱిగియే ప్రజలెల్లరు గొల్లువెట్టి రీ
యదనున వారికి౯ హితము నాదటఁ జేయుఁడు ! రాజభక్తికి౯
గుదురగు వారు శిక్షలను గోడుపడ౯ దగవెట్లు ? రాజ్యసం
పద మదమెక్కి మంత్రులు విపత్తులఁ దామయి పిల్చిరో ప్రభూ!" 91

అనిసారము దేటపడ౯
వినిచిన "మీ తిరుగుబాటు వెస నిల్పుఁడు, మే
మును బిదప విచారింతుము
కనుకట్టుల" నన్న జనము కాతరులగుట౯. 92

"ఉద్యమము నిల్పనగునే
సద్యోరక్షణము గూర్చుసరణియు లేదే
అద్యతనమిదియుఁ దగ దన
వద్యము శాసన నిరోధవర్తన" మనుమ౯. 93

జనములు జతనము లొనరగఁ
గొనసాగింపకయు నిలుప కూరకయుండ౯
జనపాలకుమారుఁడు, సం
జనితామర్షమున రాజశాసనము లొగి౯. 94

కటువుగఁ జేసి, యుద్ధతుల గట్టడల౯ గుదియించి, పన్నుల౯
బటుతర తర్జనంబులను బల్మిగొంచు క్షమాపణంబుల౯
దిటముగ గోర నక్కఱలఁ దీర్తుమటంచునుఁ జాటఁ బంచిన౯
కుటిలత మర్మిదగ్గు నృపపుత్రు వ్వెడలింపఁగ బ్రోద్యముల్ ప్రజల్. 95

ఒక్కుమ్మడి నెదు రొడ్డుచు
నక్కసమేలేని పాలకాగ్రణులను జే
రక్కసు వెల్లివిరియఁగా
నుక్కడఁచిరి దురధికృతులు నుమ్మలికింపన్. 96

దినదిన వార్తలన్ దెలిసి త్రెంపఁడు విప్లవమగ్రజుండు నే
యనువున నెప్పుడో పొలియు నార్తులు రేఁగివధింపఁ గుందుపో
జననియు నంచు "వెన్దిరిగి చయ్యన ర"మ్మని బిందుసారుఁడున్
దనయునికంపె లేఖను; వృథాగతుఁ డాతఁడుఁ జేరెఁ బాటలిన్. 97

అంత నశోకుఁ బిల్చి యరుణాయతకోపవిఘూర్ణలోచనుం
డంతకులీల రౌద్రనిబిడాకృతి యా జనకుండు "వత్స! నీ
వంతయు విన్నవాఁడవు జవంబునఁ దక్షశిలాప్రజామదం
బంతయు రూపుమాపు మిఁకఁ బంతముతో"నని యాజ్ఞఁబుచ్చినన్. 98

సంతసమింతె చాలునని సైన్యముఁ గొంచును నయ్యశోకుఁ డ
త్యంతమలీమసక్రియుల దబ్బఱభృత్యుల డుల్చి దాడిచే
తంతులఁ బన్నువారల నుదగ్రత బట్టియడంచి విప్లవా
త్యంత నికృంతనంబమరఁ దథ్యము వార్తికు లందఁజేయగన్. 99

ఒరసి యశోకుండును, ను
ద్ధుర రాజ్యోద్ధరణ దీక్షతోడఁ బగతురై
పరగు మహాత్ముల ధీరుల
నొరవెట్టుచు గౌరవించె నోర్మి నొరిమికన్. 100

ప్రాజితులై ప్రజావళిఁ దుపానును రేఁపి, సహేతుకంబులౌ
యోజనలెన్ని తామసువు నొడ్డినవారి ఋజుప్రవర్తనల్
సాజములైన, సట్టిరుల సత్పురుషావలి నాదరించి, య
వ్యాజనె ఘృష్ణవంచకుల నుక్కివులన్ గడదేర్చెఁ బెక్కుఱన్. 101

పాపులకుఁ గప్పుత్రోవరి
తాపవిదారితుల పాలితారకుఁడై, లో
కోపద్రవ వారకుఁడై
దీపించె ప్రజాహృదబ్జ దినకరుఁ డగుచున్. 102

ఉల్లము చల్లనైనఁ బ్రజలూఱటఁ జెంది రనంతరంబు తా
మెల్లరు రొల్లుడుల్ విడిచి, యేత్తరదేశహితైక కార్యముల్
వెల్లుగఁ దీర్చి శాంతికయి పెత్తనముఁ గొనిరా యుదంతమున్.
దెల్ల మెఱింగి తండ్రియు నతిప్రమదంబున జాలెఁ బాటలిన్. 103

'శ్వాశా'ఖ్యము వాయుదిశన్
దేశమశోకుండు గెల్వ దీర్పఁబడెఁ నృపో
ద్దేశములన్నియు నభ్యుద
యాశయపూర్ణుం డశోకుఁ డని జనులాడన్. 104

జనకునాజ్ఞ దీర్చి జయదుందుభులు మ్రోఁగ
పౌర సచివబుధులు ప్రస్తుతింపఁ
బ్రముదితుండు సపరివారంబుగ నశోకుఁ
డేగుదెంచెఁ బురికి నెసక మెసగ. 105

సమగ్ర జయముఁ దెచ్చిన
యసమాంబక శౌర్యసుతు ననర్ఘ మణిన్ బ
ద్మసుమ బహూకృతి జందన
మొసఁగి, నరేంద్రుండు పంచె నుజ్జయినిఁ జనన్. 106

శాంతించిన ప్రజసేల న
నంతాధీశుండు పంచెసంత సుఖీమున్
శాంతనవనీతిగఱపి ని
రంతర జాగృతిని రక్తినరయు మటంచున్, 107

## పంచమధార - ఉజ్జయినీపాలన దేవీసమాగమము

ఒకరుఁడు రాజ్యపాలనము నుజ్జయినీపురమధ్యదేశమం
జక నెఱవేర్చ; నింకొకఁడు సంస్తవనీయులు ''సెల్యుక స్సమా
జికులు'' నశేషులండగ నిజేచ్ఛను దక్షశిలాప్రజాధిప
త్యకమున నుల్లసిల్లఁగ; ముదంబునుదాల్చెను బిందుసారుఁడున్. 108

శాసనవృత్త నిర్వహణ శౌండుఁడు దర్శనపండితుం డనా
శ్వాసిత విద్వదార్తజనచాతక రక్షణ వృష్టికాండుఁ డు
ద్భాసిత సజ్జనాత్మకుముదప్రమదావహచంద్రుఁ డాహహో
ల్లాసకిరీటి మానవు లిలన్ సరియెవ్వ రశోకుఁబోల్పఁగన్ ? 109

నాణ్యముగదనరెఁ బుణ్యా
గణ్యమవంతియు వణిక్ప్రకరమాన్యము లా
వణ్యవతీ ప్రీణన సా
ద్గుణ్యము విజ్ఞానధనులకు శరణ్యంబై. 110

ధాన్యంబు శ్రితులిండ్ల దండిగ నిండించి
వర్షాగమము నెన్ను కర్షకాలి;
వివిధదేశాగత నవవస్తురింఛోళి
వెలలతోఁ జేర్చెను విశులవితతి;
యన్యోన్య వరశౌర్య మాధారముగ సము
త్సాహము ల్గను రాట్సుతవ్రజంబు
సిద్ధమోక్ష క్షేత్రశేఖరమనుకీర్తి
నెరపు వైదికధరామరులగుంపు

తెదిగె నారామములు పురి కిరుగెలఁకుల;
విపుల రథ్యలను విపణివీధులందు
జనత, త్రోఁదోపులాడ నిచ్చలు జెలంగు;
పరమసుఖవారనికర మవంతిపురము. 111

కవులును గాయకుల్ బ్రొగడ; గాంచన కంచుకానీకంభ స్ఫుటఖచితాల్
సువిమలకాంతులన్ జరత సూర్యమణీచూళికలం విభుస్యముల్
తవిలి వియత్తలంబున వితానములంటఁగఁ గట్టె; నట్టిపురం
బవుర ! విహాయసీమ భవుపట్టపుదేవికిఁ గాంచితాంగబిసుల్. 112

ఉజ్జయినీపురంబనఁగ నున్నతవిద్యల కాపురంబు సం
పజ్జయకీర్తి ధుర్యనరపాల వధూవిదుషీమణుల్, చెలుల్
గొజ్జగతేట నీళ్ళకయి క్రోవులఁ జిమ్ముచు సంస్కృతోక్తులన్
మజ్జన మాడి రచ్చొటలు! నిమగ్నలు సాహితియందు సంతతున్. 113

వరధాళధళ్యరుచులన్
విరజిమ్మెడు రాజసౌధవీథిన్, రత్నో
త్కరము ల్దాపిన, గోపుర
మురు హారియుత వజ్రపీఠ మొనరె నృపునకున్. 114

ఆ నగరాగ్రగణ్యము సమాదరదృష్టిని బ్రోచె నిత్యమున్
జానుగ పౌరముఖ్య గణశాసన సభ్యులు తీర్చు తీర్పులన్
బూనిక నిర్వహించుచు విభూతిగుణంబుల బ్రోత్సహించుచున్
మానితుఁడై సదస్యులకు మాపతిచింతనుఁ డయ్యశోకుఁడున్. 115

అనితరసులభ మేధానవధి ప్రజా
సుఖసుధార్జనజయోన్ముఖ సుపర్ణుఁ
డనఘ ధర్మజ్యోత్స్నఁ దనరించు శాంతిపా
లనమున రాకాకలాప్రపూర్ణుఁ
డాజానుబాహు యుగ్మాంతరాళ ధృతావ
నీ శ్రీ ముఖాబ్జఘృణి ప్రకీర్ణుఁ
డనుపమాన వితీర్ణగుణదీప్తశీల ధా
రంధర్య కార్యనిరస్త కర్ణు

డానతాశ్రిత దీనజనావనైక
దీక్షు దుర్జనశిక్షునుదీర్ణుఁడఖిల
వైరి నృపవనదవధూమవర్ణుఁ డలఘుఁ
డై యశోకకుమార హార్యక్షుఁడేలె. 116

భద్ర దంతి నారోహించి పార్శ్వచరులు
బలిసి కొల్వంగ నడివీథి బయలుదేరు
వీరు నున్నత దేహగంభీరు నతని
బ్రజలు వొగడుచుందురు చెవిపండువుగను. 117

ఇతఁడటే ! శంపు దౌహిత్రుండు, సురస
మారాధ్య సద్గుణ సుభద్రాంగి కొడుకు!
ఇతఁడటే ! శ్రమణ విప్రేంద్ర దీనౌఘ మం
దారుఁడై వెలయు వదాన్యవరుఁడు !
ఇతఁడటే ! వాయవ్య లెన్ను తక్షశిలాప
కర్షకయోధ సంక్రందనుండు !
ఇతఁడటే ! శస్త్ర శాస్త్రాది పారీణుఁడై
రెండు చేతులఁబోరు నిండు శూరుఁ

డితఁడటే ! భావి సామ్రాజ్య మెదురులేక
సంతరించు దిగంత విశ్రాంతకాంత
కీర్తి లక్ష్మివిలోలుండు ! మూర్తి మత్సు
ధర్ముఁ డితఁడటే ! యంద్రు సంతతము జనులు. 118

వేళ కమాత్యకూటమున, విజ్ఞుల వాక్కుల నాలకించు; ధా
రాళముగాఁగ, పంగు బధిరవ్రజ దీనజనావనంబు హ్రా
న్నాళములంట జేయు; కవినాయక గాయనులన్ భరించు; వా
హ్యాళికి సంజెలన్ జనుచు నారయు లోకుల చిత్తవృత్తముల్. 119

అకుటిల వర్తనుం డితఁ డనార్య పథంబుల పొంతఁబోఁడు, దా
రకుఁడయినన్ సమర్థుఁడని రాజ్యజనుల్ పొగడంగ, సత్క్రియా
ప్రకటిత శేముషీ విభవ భవ్యుఁడు, ప్రొద్దులఁ బుచ్చుచుండు, న
న్నికట సరస్తటాంక నవనిష్కుటవీథి విరామ కాలముల్. 120

ఒక వైశాఖ దినంబున
వికిరములై సెగలెగయఁగ, వెచ్చనిగాడ్పుల్
వికలత నొదవింపఁగ, రా
జకుమారుఁడు నుపవనంబుఁ జూడఁజని, యటన్. 121

నట దిందీవరవార వందిగణముల్, నవ్యాంబుజాతేందిరన్
పటు ఝుంఝూ నినదంబులన్ బొగడఁగా, భాగ్యవ్యవస్థాసుసంస్థితిన్, సర
స్తట సంచార మరాళయుగ్మముల వాచాలత్వసక్తిన్, లస
త్కుట జ్యోత్స్నీషు, వసంతుఁ బిల్చు నట వైకుంఠున్; సమీక్షించుచున్.

ముందునకుం బోవుచు, నం
దందున నీరములలో సహస్కరు వేఁడిన్
బొందని తావుల నిల్చుచు,
నందిన ప్రసవములఁ జిదిమి యందముఁ గనుచున్. 123

ఒకదూర్వాంకుర వేదికాంతరము, పుష్పౌఘ ప్రకీర్ణంబు దీ
ర్ణ కదంబ ద్రుమశాఖ నీడను, మహానందంబుగా నుండెఁ; 'నిం
చుక సే పిందుఁ బరుండనో' యనుచు నచ్చోఁ గూరుచుండంగ నా
ర్త కఠోరధ్వను లొక్కటన్ బెరసి, దూరంబందు వీతెంచినన్. 124

అచ్చెరు వంది ఖడ్గమొఱయంచు, పిరిండికిఁ జారకుండఁగన్
గ్రచ్చర నెత్తి సవ్వడి దిశన్ జని కాంచె వనాంత భూమిలోఁ
జొచ్చిన కన్య నొక్కరిత స్రుక్కుచుఁ బర్విడుచుండ వెంబడిన్
ముచ్చుఁగరాసు నొక్కని; విభుండును వ్రేసెను వానిఁ గత్తిచే. 125

మదహారి గోళులన్ జితికి మార్గ్మగమైన శశంబనన్, భుజం
బదరి పడంగ ప్రేటువడి యార్చుచు జోరుఁడు పారిపోవ, న
మ్మదవతి భీతఁజూచి, పతి మానిని! యెవ్వతె వీవు వీఁడెవం
డెదియును జాటు లేక వచియింపుము" నావుడు; సుంత తేరుచున్.126

జోట జోటఁ గన్ని రోదుచుఁ
గుటిలాలక యొక్క కొమ్మకొన రాయుచు, ను
త్కటమగు లజ్జన్ వత్తు
స్తట కీలితముఖ, కుడుంగసవిధమునఁ జనన్. 127

"దవులన్ భీతియుఁ బోవఁ దస్కరుఁ డెటో దాగెన్ గదా త్రస్తుఁడై,
లవలీకుంజ సుశీతలానిలుఁడు బాలా! నీశ్రమం దీర్పఁగన్
భవదీయాహ్వాయ బంధువాసపురముల్ బల్కంగ దే! ధూర్తులున్
గవయన్ రారు, పరాయివాఁడ నోకో! భూకాంతుండ నేనే సుమీ!

అన్యాయము బోకార్పఁగఁ
గన్యాజనరక్షఁ జేయఁగాఁదగు బతికిన్
అన్యము దలఁపకు" మని, రా
జన్యుం డాదర సుధావచస్తతిఁ దనిపెన్. 129

ఎద నదురింత యొత్తిగిల, నింతియునున్ ధృతినొంది, మోమునన్
గదుర నపాంగ రోచుల వికాసము; వెన్నెల వెల్లికాంతి కా
స్పదమగుచున్ దరస్మితము పద్దెరసందులఁ జిందులాడ, ను
న్మద కరిణీవితీర్ణగమనంబున, వచ్చినదారిఁ ద్రొక్కుచున్. 130

తొంగలి రెప్పలన్ ముదముదోఁగ, గనుంగవనెత్తి చూచు నా
యంగన హృత్పటాగ్రమున నార్తజనావనశీలుఁ డా సుభ
ద్రాంగి తనూజు రూపము విరాజిలె, మన్మథకోటి తుల్య ము
త్తుంగ గుణాభిరామమయి, తోరము ప్రేమ మెలర్ప నయ్యెడన్. 131

జడిమన్ బడతియు నడుగిడు,
నుడుగఁడు ప్రియతమను జూచు నుత్కంఠఁ బ్రియుం
డెడమయ్యెన్ ప్రణయమునకు
నడుమంత్రపు సిగ్గ దాత్యనటన మొనర్పన్. 132

ననవిల్తుం డెగఁజిమ్మ రాగమకరందస్రోతమున్, నిల్చె సు
స్తని, యబ్జాస్య; తదంగనాకృతి లతాంతాచ్ఛన్న దృక్చంచరీ
కనికాయంబు మరల్పనేరని యశోక స్థాణురూపంబు మా
స్తుకరాలంబి శశాంకమౌళి వలపై, చూపట్టె నప్పట్టునన్. 133

కామవికారదూరము లకారణ తన్మయతానురాగ సం
క్రామిత చిత్త భూముల వికార పరస్పర సానుభూతికిన్
ధామము లవ్వి! కల్పిత కథానికలౌనె? విరించి బద్ధముల్
ప్రేమ నిరూఢ జీవితపుఁ బీఠికలైన వధూవరార్థముల్! 134

భాషింపఁగ నోడుచు, న
న్వేషించుచు బంధుజనుల వెఱగందిన; య
య్యోషయు నాక్రోశంబున
ఘోషించుచు, మ్రోలవచ్చు కోమలిఁ జెలినిన్. 135

కని యుత్సాహము ముప్పిరిగొనఁగ, "సుంకంబిచ్చితో చెల్మికై!
వనవాసంబని వచ్చి యిందిటుల దావజ్వాలలోఁ జిక్కి యీ
ఘనుపుణ్యాన, మనోరమా! యుసురు దక్కెన్ గంటి" యంచున్ సఖిన్
దన కౌగింటను జేర్చె బాష్పముల గన్దమ్ముల్ వెలిన్ జల్లగన్. 136

చెలియు నుదంతమున్ దెలిసి, చేరెడుకన్నుల కాంతులెల్ల రా
ట్కులపతి సూతిపైఁ జెరిగి, కోమల మంజలిఁ జేర్చి మ్రొక్కుచున్
"లలనకుఁ బ్రాణభిక్షయిడి లాలనఁ జేసితివీర! యీ సతీ
తిలకముఁ జెట్టవట్టు పతి దేవశిఖామణి యంచు నెంచెదన్." 137

అని సారాంశమ్మును దే
ల్చిన యా హరిణాక్షి మాట లెంతయుఁ దన కో
ర్కెను గొనలున్ ననలుఁ గొన
బెనిచిన, నారక యశోక పృథ్వీపుఁడుండన్. 138

"విదిశాహ్వాయ పుటభేదన
సదన శ్రీమంతురాలు! సకలకళా కో
విద! కోటికిఁ బడగెత్తిన
బదరీపతి ముద్దుబిడ్డ! ప్రవిమల మతితోన్. 139

సౌగతమతీయులము నా
నా గురువుల, సాధుసిద్ధ నాథుల, సుకృతుల్
యోగుల, దీర్ఘములన్, బు
ణ్యాగారము లెల్లఁ జూచు నౌత్సుక్యమునన్. 140

బయలుదేరగ ననుగంత్రి నయితి నామె
కును జెలిని! పరివారంబు వెనుక నిలువ
నిర్వారము మనోహర వనంబిదియుఁ జేర
వచ్చుచుండఁగ నింతలో వనిత యొకతె. 141

వృశ్చికప్రదష్ట వృద్ధ యేడ్చినఁ గాంచి
మందు దెచ్చు పొంటె మరలియేఁగ
నాకు ముందెవోయి, నన్ గికురించెడు
వేడ్కతోడ బాల వేగవచ్చె. 142

వృద్ధకుమారుఁడు గాఁబో
లుద్ధర రయగామి యగుచు, నుక్కవుఁ డతఁడున్
తద్ధేమాంగి నగ లొలువ
సిద్ధుండయి, భుజము తెగిన, జెచ్చెలుఁ బారెన్. 143

వివరమిదియంచుఁ జెలి యన
నవవధు వావిగ్నహృదయ నమలఁ గనుచు, భూ
ధవుఁ డీమె నామ మే మన
"ధవళాక్షిని దేవి యంద్రు ధరణిప!" యనుచున్. 144

తెలిపి మనోరమ; యవ్వలఁ
గులిశధర ప్రతిముఁ డతఁ డకుంఠితప్రేమన్
బిలుకుచు, నూర్వాశి నవ్వేడు
నలివేణిని జెలినిఁ, గొని గృహంబున కరిగెన్. 145

అలఘు దివాగ్నిగోళమన నయ్యెడ, రాళము జల్లి హేమకాం
తుల నెలయించి, యస్తగిరిదుర్గభటుం డిడు తాటి దివ్వె నా
వెలి నొక మాటు వెల్గుచు రవిప్రభ మాటువడెన్, దనంత న
త్యలస నిసర్గసుందరతరాకృతి నుజ్వలితాంబరంబునన్. 146

అది సమయంబుగా వెస నహర్పతి గద్దె, నుపాయవేది, రా
జదయత నెక్కెఁ బద్మినుల యాస్యతతుల్ ముకుళించెఁ గైరవా
న్మద సువికాసహాస సుషమ ల్దిశలెల్లనుగ్రమ్మెఁ జంద్రికల్
గదలె బడాతివాహినుల కాల్నడకన్ జగమాక్రమించుచున్. 147

మరుసటివేకువన్ దనకుమారికజాడల వెంబడించి యా
తురమున దీవరంపు సతి, దోనరు దేరఁగవచ్చు తండ్రి సం
బరము పడంగ, రాజుపనుపన్ జనుచుండిన వేఁగువారు నే
ర్పెర నడిత్రోవలోఁ గతముఁ దెల్పిన, దేర్కొను దేవితండ్రియన్. 148

చని రాజసౌధతలమునఁ
దనయన్ గని, సంతసించి, తన్వీహృదయం
బున గల యభిలాష మెయిన్
ఘనున కశోకునకు బిడ్డఁ గాన్కగ నొసఁగెన్. 149

ప్రజ లుత్సవములు జరుపఁగ
నజరాజున్ బలె నశోకుఁ డంతట గృహమే
ధి జగంబున, సుమధన్వుని
విజయమునకు శీఘ్రమొగ్గి వేడుకఁ బడసెన్. 150

దేవి, యశోకుండును, తమ
దీవనలన్ గొన్నినాళ్లు తేర్పగ, మమతల్
సేవించి, తల్లిదండ్రులు
వే విదిశాగిరిని జేర వెడలిన పిదపన్. 151

"ఒరగాలు నోర మోరయుఁ
గరకరియును జానులంబి కరములు కరుసుల్
పరగినపతి యే తెఱగున
తెఱవా! యీ వికృతి నీదు దృష్టికి నచ్చెన్." 152

అని యాగడమున నపుడపు
డనుచు సఖిన్ ప్రస్తరించు ననుఁగుఁ జెలియు, దే
వి, నశోకున కర్పించి హి
తనయోక్తులఁ జెప్పి, యంతఁ దానున్ జనినన్. 153

దంపతులు, మనోజ జయం
బింపున్ సొంపులను బెంప, నిర్వారు గడుగా
ధంపున్ బ్రేమను గడపిరి
సంపత్సౌజన్య సౌఖ్యసఖహాయనముల్. 154

వారికిఁ గలిగిరి కొడుకున్
గూరిమి కూతురు నొకర్తె గుణనిధులనగన్;
వారె "మహేంద్ర" "ప్రియంవద"
లారాధ్యులు బౌద్ధసింహళావాసులకున్. 155

## షష్ఠధార - అశోక సుషీముల విధివిధాన పరిణామములు

కాలముఁ జెల్లె నైహిక సుఖంబులలో క్షణమాత్రమై, మహీ
పాలుఁడు బిందుసారుఁడును వార్ధకముంగనె; రోగపాళికిం
బాలయి తూలె దేహము; సమాత్యచయ స్వజనాలి ధైర్యముల్
వ్రీలఁగఁబౌరవక్త్రముల వ్రేలె విషాదపయోదకాళికల్. 156

తన యెద భీతి బెన్నగల ధాత్రిపుఁడున్ సుతునిన్ సుషీము, నిం
ట నరయఁ జేరరమ్మని, హుటాహుటి వేఁగుల బంపె, నవ్విధం
బును దనవారిచే విని, సపుత్రకుఁడైన యశోకుఁ డంతటన్
వనితను బుట్టినింటనిడి, వారక యేగెను రాజధానికిన్. 157

ఆతత మేధాన్విత ఖ
ల్లాతక ముఖ మంత్రివర్గ లాలిత సుగుణుం
డాతఁడు రాజ్యాక్రమణో
పేతములగు యత్నముల నుపేక్షన్ జేయన్. 158

ధీరోద్ధతుఁడు, కుమారుఁడు
సారాసారముల వస్తు సరణిన్ దజ్ఞుం
డూరక ధర్మము దప్పఁడు
వీరుఁడు సామ్రాజ్యపట్ట విహితుఁడటంచున్. 159

మంతనముల దృఢముగ దమ
స్వాంతములన్ భావిగతిని జర్చించి కడున్
జింతించి రమాత్యులు, ధీ
మంతుఁ డశోకుఁడ, ప్రభుత్వ మహితుఁడు గాఁగన్. 160

వేఁగుల వార్తలందఁగ ద్రవీకృత మానసుఁడౌ సుషీముఁ డు
ద్వేగముతోడఁ దక్షశిల వీడి ససైన్యుఁడు వచ్చుచుండ, నా
లో గురు రుగ్మతన్ నలిగి, లోకము బాసెను, బిందుసారుఁ డు
ద్యోగులు వేచి రుత్కటపుఁ ద్రొక్కట నందిఁ సుషీమురాకకై. 161

అరయఁగ తండ్రిపన్పు, కడుపార్తియు బెగ్గవడిగొంచు నీడ్వ, స
త్వర గమనంబునన్ జనుచుఁ దారినె చీకఁటి గ్రమ్మ, నిల్వ కే
సరగునఁ గోట గుమ్మము దెసన్ జని, యద్దమ రేయి నాఁక తాఁ
బరుగుల బోవఁ, గందకము పల్కులు చీలె సుషీముఁడున్ బడన్. 162

అదియున్ గృత్రిమమో యెటో తెలియదన్యాయంబు రాట్సూనుఁడున్
దుది నొందెన్ బడినంత నాయగడితన్ దుర్వార హేతిద్యుతుల్
కుదురై కాల్చె శరీరమున్ మసిగ; నేక్రుద్ధుండు విద్వేషి యే
యదయుం డావల బన్నెనో? చెలఁగె సైన్యంబందు హాహాకృతుల్.163

దివి టీలన్ గొని సైనికుల్ గదలి మిద్దెన్ బోలు పల్కుల్ వడిన్
గవకున్ జేర్చియు నిచ్చెన ల్దిగువకు న్గట్టించి రాట్పుత్రు బొం
ది వెలిన్ దీయఁగ నేర కగ్గలపు నార్తిన్ గ్రుంగి యారార! క్రూ
రవిధానంబిది గర్హ్యమా! జనకు కార్యార్థంబసుత్యాగమీ
దివిషత్తుల్యుఁడు చేసె జ్యేష్ఠుఁడని రద్దిన్ జేసి రొక్కుమ్మడిన్. 164

పాపపు రాజ్యతంత్రము లపారమనీషులనైన మంచికిన్
బాపి దురంతరహంతకులఁ బాపపరీతులఁ జేయుఁగాదె? యా
పాపమె పూర్వపుణ్యమను భావ్యము తీరిన వెంటనంటి రా
జ్యాపహమై తుదన్ విషరుజాకృతి బార్థివులన్ దహింపదే? 165

నిజమది దేవుఁడే యెఱుఁగు నిక్క మశోకుని ముందుద్రోవ య
క్కజముగఁ జాల్చెనయ్యెడ నకంటకమై! ప్రజయున్ వదంతులన్
గుజగుజ వోవుచుండి రురుకూటగతిన్ వధఁగాంచె జ్యేష్ఠుఁడం
చు జగము మాయనోనొకో? యశోకుఁడు దుఃఖితుఁడయ్యె దత్కృతిన్

ఇదియు నశోకుఁ డొల్లఁడు హితేషణుఁడైన యమాత్యఖిల్లుఁడే
యదను నెఱింగి కృత్రిమము నక్కట పన్నెనటంచు లోకులున్
బదపడి నిందచేయ విని పాల్పడె నయ్యెడ నాసుధర్మ యా
పదలకు నగ్గమాచు గడుపారట పాటునకు న్నిరాశకున్. 167

బెడిదపు నాపద నొప్పఁగ
జడిసియుఁ దన కోడలిని భిక్షుణి నాశ్రమమునకుఁ
దడయక చేరఁగ బొమ్మని
కడువడిని రహస్యరీతిగన్ వెడలించెన్. 168

అంతటఁ బట్టపుఁ గరితయైన సుధర్మయశోకు నుచ్ఛ్రియుం
బెంతయు, వంత చిచ్చునకు నేర్చెడు నింధనమై యగల్చ నొ
క్కింతయు దక్కఁగానక హృదీశుని మృగ్ధకుమారుఁ గూర్చి య
త్యంత విషాదవేదన లహర్నిశమున్ మదిఁ బట్టి కొట్టఁగన్. 169

దిగధీశవినతుఁడై తేజరిల్లిన పతి
బోధిసత్వుని దివ్యభూమిఁ గూర్చె
రాజ సతీ శిరోరత్ననీరాజిత
పద నాదు బ్రదుకు సంపదయుఁ జారె
తక్షశిలా రాజ్యధవుఁడైన యువరాజు
పాక్కిమంటలలోనఁ బొడవడంగె
నేకైక తనయుని యిల్లాలు గర్భిణి
తిష్యకుటీరమన్ దెప్పఁబడియె

కటకటా ! ధర్మమడవికి గాఫ్పురంబు
హోయె ! దుష్టుఁ డశోకుండు నొందకున్న
వార్ధకమునసైన నఘుంబుఁబండినప్పా
డింత దుఃఖంబు ననియని యేడ్చి యేడ్చి. 170

కూడున్ నీరును లేనివస్తు లసువుల్ గొంపోవ నారాజ్ఞి యున్
గూడెన్ వల్లభు దివ్యసమ్ముఖము; సంకోచింపకే మంత్రులున్
జేఁడింకన్ మహితుం డశోకుఁడని వేర్వేఱన్ వెసన్ లేఖలున్
బ్రోడల్ వ్రాయఁగఁ బంపి రశ్వగులవారున్ సీమలన్ జాటఁగన్. 171

లోకులు భేకభాషలను లోఁగొనె మంత్రులు; దుష్టుఁడీతఁడ
స్తోకమనీషు, జ్యేష్ఠత వసుంధర నేలు సుషీము హక్కనె
ట్లో కితవుండుఁ జేకొనె గులోత్తరు డెవ్వఁడు డెక్క మోసమున్
జోఁకనటంచు దూఱఁగ నశోకుఁడు యోగ్యపథాంతరంగుఁడై. 172

'జనవాక్యం కర్తవ్యం'బను
నానుడికిన్ దలంకి యభిషేకవిధుల్
గొనసాగనీక ప్రజలకు
మనికితముడుగుట కవశ్యమవధియను నెడన్. 173

ఓర్వని యంతఃపురజను
లర్వాచీనానురక్తుఁ డాచారములన్
పూర్వములను మాన్పించెను
గర్వి యశోకుండనెడు నకారణనిందన్. 174

దేశద్రోహులు గూఢా
దేశంబులఁ బర్వఁజేయ దెలియని ప్రజ ని
ర్దేశింపఁగ నపనిందల
రాశియు దోయంబువారిరట్టును హెచ్చెన్. 175

తోసలి రాజకన్య రణపూర్వహఁ గోరిన మిత్రపక్షము
ల్లాసములేని తండ్రిని బలాత్కృతిఁ జేయు సుషీముఁ డుర్వికిన్
శాసిచనంగ నక్కసును శాయని మూర్ఖకళింగవల్లభుం
డాసుర వృత్తితోఁ దదనుజావలి నెంతయుఁ బ్రోత్సహించినన్. 176

కొందఱు సుషీముతమ్ములు
మందమతుల్దుర మొనర్చి మడిసిరి మఱియున్
గొందఱు గళింగరాజ్యము
నందు వసించుచు రహస్య మనికిన్ దొడఁగన్. 177

దండధరద్యుమ్నుఁడు ను
ద్దండాజ్ఞాదక్షుఁడై కుతంత్ర నిపుణతన్
మెండొడ్డి ఖిల్లుఁ డనుపన్
ఖండించిరి దూతఁ గ్రూరకర్ములు వారల్. 178

విమతానల శేషంబులు
క్రమముగ సర్వంబుఁ గూల్చుఁ గాల్చునని ఖిలా
తమనీషియుఁ దెగటార్చె స
దమదముగఁ గళింగరాడ్వతంసాశ్రితులన్. 179

దుష్టాశోకుండిలను ని
కృష్టుండను నగ్ధ సూచకేహ్యాకృతి నశో
కాష్టద్రుమ నాశనము న
పష్టంభపురాణి యొకతె పచరింపగన్. 180

ఖిల్లుం డదియు నశోకుని
యుల్లం బెరియించు టెరిగి యువిదలఁ బె
ల్లుల్లసనూడెడువారల
నెల్లరను నిగూఢవృత్తి నెటుఁగొ పొలియించెన్. 181

దాయాదులు పొనుగువడిన
బోయలవలె సమరభూమిఁ బోయిరి కాలున్
డాయఁగ; మేదినియు, బ్రశాం
త్యాయతమై; శత్రు నిస్త్రమాంకమునయ్యెన్. 182

పతి దివంగతుఁడను శోకవహ్ని బడలు
మాతృదేవి సుభద్రాంగి మనసుసుంత
తన సుతుఁడె సార్వభౌమపదంబు నందు
నొప్పునను సువార్తాశ్రుతిఁ దెప్పరిల్లె. 188

## సప్తమధార — కాండ సమాప్తి

సోమార్కాక్ష విలాసా !
కామాదిక వర్గరహిత కరోన్మేల్లాసా !
ధీమజ్జనివిన్యాసా !
ప్రేమానందాత్మ భూతి పీయూషరసా ! 184

సాధితమయ్యె జతుర్థము
వేధస్స్తుతి కురియు నర్థవృష్టి నమలమా
బోధార్కేందు విజృంభిత
గాధాంబుధి సంగమాభిగమ కాండమిదే. 185

—o—

శ్రీరస్తు

# శ్రీ మ ద శో క చ రి త్ర ము

## పంచమకాండము - వీరాశోక చరిత్రము

### ప్రథమధార — కాండనాంది

పరమ ప్రియదాతా ! శ్రీ
తరుణీ దుర్గాసమేత ! ధన్యధరిత్రీ
వర సజ్జన గోదీనా
మరగణ సంత్రాత ! దివ్యమహిమోపేతా ! 1

ధీయుత భావాలయ; శ్రే
మాయత శీలమయ ! ఆగమార్థకళాసు
ధ్యేయ ! పరాదిక భాషా
మేయామృతకాయ ! మది రమింపుము వాణీ ! 2

### ద్వితీయధార — అశోకుని పట్టాభిషేకము

రాధా గుప్తామాత్యుఁడు
బోధోదీర్ణుండు రాజ్యముఁ బరికింపన్
వేధవలెన్ ఖల్లాటుఁడు
బాధ లపనయించి పురము పరిరక్షింపన్. 3

తక్షశిలావంత్యాది ధ
రాక్షుల్లకు లెల్లరున్ బరాజితులుగ ధ
ర్మాక్షీణాభ్యుదయమును జ
నక్షేమ ప్రక్రియలు ననారత మొసఁగెన్. 4

ప్రతి రాజ్యాంగమునన్ ప్రజా సమితులున్ ప్రఖ్యాత వైదుష్య శా
శ్వత ధర్మజ్ఞసభాంతరంబుల మహేష్వాసుం డశోకుండు భూ
పతి గానర్హుఁడు బుద్ధిమంతుఁ డనుచున్ బ్రహ్మణ్యుడంచున్ బ్రజా
హితులై పల్కి సునిశ్చితాత్ములయి తన్నెలంగ నర్థింపఁగన్. 5

శుభసమయంబునన్ సుగత సూరులు వైదికవిజ్ఞు లుత్తమ
ప్రభుపద సత్క్రియావిధిని భావనుజేసి యహర్ముఖార్క స
న్నిభుని నశోకు మౌర్యధరణీప్రియవంశ విభూషణున్ గళా
విభు ఘను సార్వభౌమపదవీస్థితుగా నభిషిక్తుఁ జేసినన్. 6

ఆ కాళింగనృపుండుదక్క పరరాజ్యాధీశు లెల్లన్ సము
త్సేక ద్రవ్య సువస్త్ర లాంఛనము లుద్వేలంబుగాఁ దెచ్చి రా
డ్రాకాచంద్రు నశోకు మన్ననలకున్ రంజిల్లి కైవారముల్
వీఁకన్ జేసిరి వంది పాఠములు సంప్రీతిన్ దెసల్ నిండఁగన్. 7

చణకసూను నిబంధనల్ ప్రణుతి గనియె
రాజ్యసింహాసనమున వర్షములు మూట
నండలేదు ప్రజాక్షోభ మొండు కలుగ
దనియు నవ్వ సుభద్ర కేకాంతమందు. 8

కృష్ణాంగుఁడు నా మనుమఁడె
జిష్ణుండై రాజ్యమేలు చెలువుం గన వ
క్షోష్ణీషము తల మిన్నున
నుష్ణాంశుని బింబమట్టు లుజ్జ్వలమయ్యెన్. 9

అనిన హర్షాతిశయమున నా సుభద్రఁ
గంటికిన్ రెప్పవలెఁ గాచుకొంటి నీవు
సలరె జతనంబులెల్ల సత్ఫలము లొరసి
కైరళి శుభమని యవ్వ సగ్గించె నంత. 10

చల్లని యుల్లముఁ దివిజసైన్యపతి ప్రతిభా మహత్త్వ సం
ఫుల్ల నిజప్రతాపమునఁ బొల్చి నశోకుఁడు రాజదాన సం
వేల్లితధార లా సురగవిం దలపింపఁగ నెల్లవారలను ము
న్నుల్లస మాడినట్టి జను లుక్కిరిబిక్కిరి గ్రుంగి తేల్గఁగన్. 11

ఒక్క యర్ధాంగిదేవి మహోత్సవమునఁ
బాలుగొనదయ్యె బుద్ధుని పథముఁ జేరి
భిక్షుకియునై నకతన సద్విబుధుఁ డాయ
శోకు నభిషేక మఖిల సంస్తుత్యమయ్యె. 12

బద్ధుఁడు కాక శాస్త్రచయపారగ బోధసుధాంబు నిమ్నగా
సిద్ధ నిమజ్జనార్జిత విశిష్ట శుచిస్థిర శాంతిభాముఁడై
శుద్ధమనస్వి బిందు నృపసూనుఁడు దుర్ధినసేను ముస్తుఁడై
నిద్ధ దినాధినాథుబలె నేచె శుభాశయ భాసురాంశుఁడై. 13

గగన మునస్సమాగతి నఖర్వరుచిన్ వెలుగొందుచాడ్పునన్
మగధము శాంతి సౌఖ్యసుషమాన్వితమై నుతిఁగాంచె; నుద్యమ
ప్రగతులఁ దత్ప్రజాలికి శుభంబులు తామనతంపరై యొసం
గఁగ నధికారులున్ బాగడికల్ గని రిద్ధపరోపకారులై. 14

## తృతీయధార - అశోక సామ్రాజ్యపాలనము - హృదయపరివేదనము

ఒకదినం బుడివోని యుపకారపరతతోఁ
బృథు వివేకులఁ దత్త్వపృచ్ఛ సేయు
ఒకనాఁడు రాజకీయోద్యోగులను బిల్చి
ప్రజల హితంబు లేర్పడఁగ నడుగు
ఒకరోజు తన రాక ప్రకటించి గుమిగూర్చి
లోక జీవితముల పోక లరయు
ఒక వాసరంబున నోర్పునై తానేగి
చెఱకాపరులఁ బరీక్షించి చూచు

పరమ కరుణాపథంబునఁ బడసినట్టి
లోని చూపున పశుపక్షిలోకమునకుఁ
దగు చికిత్సలఁ దజ్ఞులఁ దడవి వ్రాయు
సూనృతాచార సుకృతి యశోక నృపతి. 15

ఇటు లశ్రాంతము తన ప్రజ
కెటుల హితం బబ్బు నను మనీష యొసంగన్
పటుధర్మ నిరాఘాటో
త్కట దీక్షన్ భూతవితతిఁ దనుపం గడఁగెన్. 16

అతిథిపూజా ధురంధరుఁ డతఁడు నిత్య
మర్థులకుఁ గామధేను వజ్ఞాంధకార
వారకోష్ణాంశుఁ డార్తమయూరములకు
ప్రావృడంబుదఘోషుఁడై పరిఢవిల్లె. 17

భారత సత్యధర్మపరిపాలన సస్యములెల్లఁ బండు కే
దారపు క్షేత్రమై ప్రకృతి తాత్త్వికబోధ మణిప్రవాళముల్
కూరెడు రత్నభాండమయి కూర్చె నశోకుఁడు సద్వదాన్యతా
సార పయోముచంబయి ప్రశాంతి జగత్పరిణామ కార్యముల్. 18

తన తనయ ప్రియంవదయును
తనయుండు మహేంద్రుఁడు గడుఁ దనియింపఁగ స
జ్జనగణ తాపాపహుఁడై
జనక నిభుఁ డశోకుఁ డుర్విజనులను బ్రోచెన్. 19

ప్రాజ్యము రాజ్యమున్ విభుఁడు పాలనసేయఁగఁ జొచ్చె నిట్టి సం
పూజ్య నిసర్గ ధర్మరతి పూర్వపు రాజులయందుఁ గానమం
చాజ్య హవిఃక్రియాపర ధరామరులున్ గొనియాడ బౌద్ధ ప్ర
వ్రజ్యలఁ బొల్చువారు ప్రజ బాగును పండినయట్లు లెన్నఁగన్. 20

ఖల్లాతక రాధా గు
ప్రోల్లసిత సుధీబలంబు తోడుగ సభలన్
దెల్లమగు నీతిఁగొని సం
పల్లాభములెల్ల నతఁడు ప్రజకున్ బంచెన్. 21

పశ్చిమము శోణ, తూర్పున బరగెఁ జంప
దక్షిణమున వింజ, ముదీచిఁ దనరె గంగ
యష్టసాహస్ర నివసథం బాది మగధ
తరుణి తారుణ్యగతిని విస్తారమయ్యె. 22

బుద్ధు కాలాన శౌర్యసమృద్ధులైన
మగధ కోసలరాజు లున్మదులు పోర
సన్నగిల్లెను ప్రథనామిషంబు; కాశి
రాజ్యము; పిదపఁ బొల్చె మౌర్యప్రభుత్వ
మపుడ కోసల స్వాతంత్ర్య మంతరించె. 23

రాడ్రహిత 'శాక్య' మది 'మహారణ్య' మగుచు
వంగ పాంచాల కౌరవావంతి మత్స్య
శూరసేనాశ్వకములు, గాంధార మంగ
చేది కాంభోజ రాజ్యముల్ చేరి యొక్క
ప్రగతిఁగని మనె మగధ సామ్రాట్టుక్రింద. 24

ఆ యయోధ్య గిరివ్రజ లంతరింప
శస్త వారణాశియును, కౌశాంబి, మధుర,
మిథిల, శ్రావస్తి, చంప, కాంపిల్య, రోరు
కంబు రేవు, వైశాలి, సాగలియు, నుజ్జ
యినియు, సాకేతము ననంగ ఘన పురములు. 25

పాటలికిఁ దోడుగా వైభవముల నలరి
వెలసె; నన్నిదిక్కులను నంచులను, విమత
భేదములు రంధిలేకుండ బెట్టుగాఁగ
భద్రపఱచె నశోకుఁడు పగఱనొత్తి. 26

దక్షిణపు చేరపాండ్యాఖ్యధరలు, చోళ
సీమ, సింహళము, కళింగభూమి విడిచి
విపుల భరతఖండమ్ము టిబెట్టుతోడ
నాదిలో న య్యశోకు సామ్రాజ్యమయ్యె. 27

ప్రజఁ దనియించు నా విభుని బాడబముఖ్యులు, బౌద్ధ భిక్షులున్
సుజనులు, బీదలున్ బొగడుచో ముదమందఁడు; పూర్వ సంస్మృతుల్
గజిబిజిగా హృదంబరము గాఁడి యనంత విషాద వారిద
వ్రజములు కప్పి పైకొనిన రాత్రి పవల్ నెమకున్ బ్రతిక్రియల్. 28

తాను చక్రవర్తిపదంబుఁ బూను పొంటె
కోపవశుఁడయి యేనూఱు కుటిల మంత్రు
లను వధింపఁగఁ బంచిన యనయమంత
హృదిని దట్టిన నులుకు దుఃఖేషు హతికి. 29

తొల్లి చాపల్యమునఁ గాలితొడవు విసరి
క్రిందికిన్ ద్రోయఁ దలపాగఁ గ్రించుఁదనము
దోఁపఁ గింకనంది సుషీముఁ ద్రుంచె నదయఁ
దక్షిలాతక మంత్రిచేఁతలకుఁ దలఁకు. 30

రూక్షవర్తనులు దిగంబరులు వికారు
లైనవారలు నిల్చి యల్లంత సరకు
గొనక వచ్చు సుషీము నుగ్గుగను మంటఁ
ద్రోయఁ దెలిసియుఁ గిమ్మనఁ డీ యశోకుఁ
డనుచు జను లాడుమాటలకై యడలి పొగులు. 31

కృత్రిమమైన మార్గమున రేయికి రేయి నిగూఢవృత్తి స
త్క్షత్రియులైన జ్ఞాతులను జంపెను భృత్యుఁడు చండుఁడైన ద
చ్చిత్ర మశోకుఁడే యెఱుఁగు 'ఛీ'యని కొందఱు నాడు నిందకున్
బాత్రుఁడు దానెగా యని యపార మనోరుజఁ బొక్కు నిచ్చలున్. 32

తనపయి నసూయఁ దనపేరఁ దనరుచుండు
విమల పుష్పితాశోక వృక్షముల నొకతె
మూలముట్టుగ నఱికింప మొనసి యామె
యసువుఁగొనె ఖిలాతుఁడు దాన్నికై కోపించు. 33

శిష్టసంరక్ష రిపులకు శిక్ష లేని
సాధుమార్గానఁబోవ నశక్తుఁ డంద్రు
గడుసు కుమతుల నయగతి నడుపు టరయ
దుర్ఘటంబని మదిని నెంతో తపించు. 34

ఒకటి సుఖమిచ్చు; నశాంతి నొకటి యిచ్చు
రాష్ట్రమేలి ద్రోహియగు సమ్రాట్టు మేలొ ?
పాపములఁబాసి మను పరివ్రాట్టు మేలొ ?
రెంటఁ గర్తవ్య మెయ్యదో తేఁడు తూఁచు. 35

కన్యాసంభవుఁ డన్న నిందఁబడి యాక్రందించి కొన్నాళ్ళు, నా
జన్యానాకృతి యన్న దూషణమునన్ సంతప్తుఁడై కొన్నినా
ళ్ళన్యాయం బొనరించె బంధుతతికిన్ స్వార్థప్రియుం డీతఁడా
నా న్యక్కారము నెంతొ పొందె, యతఁడున్ నైరాయికున్ బోలుచున్.

కటకటా ! రాదు నా యనర్ఘాంకరత్న
మనుప మాతృలక్ష్మి న్నను 'దేవి' చెనటినగుచు
రాజసద మేలఁబూనితి ? రమ్యమగు నె
చంద్రుఁ డుదయింప సంఘుని చక్షువులకు ? 37

అట్టి యర్థాంగి దూరమై యరుగ లోకు
లెల్ల రాజ్యముకొఱకు వర్ణింపరాని
క్రూరకార్యము లీ యశోకుండు సేసె
ననెడు నింద మనశ్శల్యమై కలంచు. 38

దేవివలె సౌమ్య; కాని నిర్దిష్టకార్య
తోసలీశాత్మజయుఁ బితన్ గాసివెట్టు
క్రూరుని గళింగపతిఁ ద్రుంపఁగోరుగాని
ధర్మమే ? జనహితమును దారసిలునె ? 39

తండ్రి దివికేగి మూఁడు వత్సరములైన
పిదప రాజ్యాభిషేకంబు వొదవె, రెండు
హాయనములేలితిన్ భూమి నార్ష పథము
దప్పకైన ధర్మార్తి స్వాంతమును బాయ
దేటి కసుఖ సామ్రాజ్య వనాటనంబు ? 40

ఇదమిత్థం బనరాక సంకటపడన్ హేయంబు లీ రాజ్య సం
పద లంచున్ దలపోయుఁ; గర్మతతులున్ వాంఛానుహారంబు లు
న్మద రాజ్యాశ లవేలొకో ? యయిన సన్యస్తక్రియుం డేమి పెం
పొదవింపంగలఁ ? డేది పథ్యమనుచున్ భూమీశ్వరుం డారయున్. 41

రాజుచేతస్సుఁ దఱుఁగు విరాగమూల
కిల్బిషస్మృతి పశ్చాద్వికీర్ణ తాప
రూప మూహించి శోక నిరోధమార్గ
ములఁ దలంచె రాధాగుప్తుఁ డలఘుబుద్ధి. 42

జయమున్ మోదముఁబెంచు నీ మగధరాజ్యంబున్ విశాలంబు నా
నయమార్గం బెదియంచు యుక్తమగు విన్యాసంబు నూహించి, ని
ర్ణయముం జేసె నమాత్యపుంగవుఁడు, భార్యాసన్నిధానాప్తిఁ బ్ర
శ్రయమై క్షాత్రగుణంబు రేఁప యశమున్ సంధింప సువ్యూహమున్.

లీల రహస్యరీతిఁ ద్రికళింగ ధరిత్రికిఁ బంపి నౌచితిన్
గోలు పడంగనీక తన కోర్కె ఫలించెడు పోక లెన్ని య
య్యేలిక లొండొరుల్ పగ వహించుచు బోరెడునట్లు తంత్రమున్
జాలగ బోధచేసి సువిచారులఁ జారుల బుద్ధిసారులన్. 44

వారలఁ బంచి శూరుఁడు నపారమనీషియు నా గదాధరున్
పేరుగలట్టివాఁ డనుచు విన్ననువొప్ప ఖలాగ్రుఁడైన బృ
థ్వీరమణాంతరంగముఁ దదీయ భుజావిసిహారదాధ్వాయమున్
జారుతరంబు గన్గొనఁగఁ జయ్యన బిల్వఁగ, వచ్చె నాతఁడున్. 45

ఎదురు చనియుఁ బాద్యాదుల నిచ్చి సేదఁ
దీర్చి యంత రాధాగుప్త ధీపయోధి
తండ్రికిన్ బూర్ణమైత్రిని దనరఁగందు
వల్ల తల్లికి సంత్రాతవగుదు వీవు. 46

నీవు సామ్రాజ్యహితయత్నబావుకుఁడవు
చింత నుర్లు సమ్రాట్టు నిశ్చింతుఁగాఁగ
నెట్టు లొనరింతు వా భార మీవ యోగ్యు
వనుచు నగ్గింప మంత్రీశ్వరాస్య మసరి. 47

బిందుసారుండు సౌమ్యుండు వందనీయుఁ
డనుఁగు నెచ్చెలి నాకు బాల్యంబునుండి
పచ్చిప్రాయ మశోకుఁ డభ్యస్తశాస్త్రుఁ
డతని నెయ్యంబు నే నెట్టు లదుక నేర్తు ? 48

అని సంశయఘణితి వచిం
చిన యా బాడబుని జూచి చిఱున వ్వొలయన్
ఘనులరు మిము నమ్మియె యీ
పని గోరితిఁ బూజ్యపాద ! ప్రజ్ఞాధిమణీ ! 49

వృద్ధుల రుపవేతన ధన
సిద్ధ సుసౌఖ్యప్రశాంతి సేవన మను మి
మ్ముద్ధురతర కార్యాంతర
బద్ధులఁ జేసితిని క్షమకుఁ బాత్రుఁడ ననుచున్. 50

రాధాగుప్తుఁడు నాదృతి
తో ధర్మము సెప్పి కార్యధూర్వహుని సము
ద్బోధితుఁ బ్రార్థించిన నా
వేధోన్వయుఁ డియ్యకొనియె విధి నెఱవేర్పన్. 51

## చతుర్థధార - ప్రథమ బిందుపాతము

### సుభద్రాంగి యశోకుని కర్తవ్య మాదేశించుట

ఇటుల నమాత్యపుంగవుఁడు నెవ్విధినైనఁ బ్రజానురంజక
స్ఫుట పరిపాలనాక్రమము చొప్పడ రాజునకున్ యశంబు సం
ఘటితముగాఁ బ్రయోజనముఖంబు నుపాయము నెత్తుచుండగాఁ
దటుకునవచ్చి రాణికడ దాసి గదాధరుఁ జేరి మ్రొక్కుచున్. 52

'దేవ ! మిమ్ము సుభద్రాంగి తేరఁబంచె'
ననిన విస్మయపడి వృద్ధుఁ డవనిసురుఁడు
'చిట్టితల్లి సుభద్రకు నెట్టి పనియొ ?
నన్ను బిలిపింపఁ గతముఁ గానంగనేర ? 53

అని తలపోయుచున్ జనుచు నంత గదాధరుఁడున్ రయంబునన్
గనియె సుభద్ర క్షీణశశికైవడి చాల కృశించి దేహళిన్
దనకయి వేచియుండ, మదిఁ దత్తఱపాటొనరంగఁ బాద్యమున్
గొని, 'సుకుమారిబిడ్డ ! యిటు కుందుచునుంటి వదేలకో'యనన్. 54

బుడబుడ కన్నీ రొలుకఁగ,
"నడలెడు నన్నూఱడింప నరుదేరరు; మీ
రుడిగితి రొక్కొ నన్నున్
బుడమిని నొడయండు పాయఁ బూర్వపు కరుణన్. 55

అకటా !" యని వాపోయెడు
నకలంకం గాంచి విప్రుఁ డామె విషణ్ణన్
నికట నిషణ్ణగఁ జేయుచు
సుకృతా ! నీ విట్టు లార్తి సుడివడఁ దగునే ? 56

ఎల్లరు మృత్యువందు టది యెంతయు సత్యమెఱుంగవే? యిలా
వల్లభుఁ డయ్యె నీ కొడుకు; వందుర కింక; జగద్ధితుండునున్
జల్లనివాఁడుగా నతని స్వాంతము దిద్దుము భర్తృసేవగా
నుల్లమునం దలంపు మది యోగ్యవిచారవు గమ్ము పుత్రికా! 57

సంపాదించెను సద్గతి
శంపుండును వేదయజ్ఞ సాతత్యమునన్
శంపుని కూఁతుర వీవును
అంపును బతిచింతయును దొఱంగఁగ లేవే? 58

అని మెల్లన పల్కిన వె
న్కనె యూర్ధ్వాస్యగ సుభద్ర కరములు మొగిచెన్
ఘనుఁ డాతని యాశీస్సులె
నను నా సుతుఁ బ్రోచుఁబో యనారత మంచున్. 59

ఇంచుక యార్తి పోనణఁచి యెప్పుడు దీనవె కాన? తండ్రినిన్
దించి దివంబుచేరిన, ధృతిన్ దన మేనును బాసెఁ దల్లి, స
న్మించిన శంపుఁడున్ జనెఁ గుబేరసఖాంఘ్రిపదం, బసంశ్రద్ధు
నించిన శాంతి నవ్వయును నిర్జరలోకముఁ జేరఁగాఁ జనన్. 60

వెలసితిరి వంశభృత్యుఁడో భిల్లుఁడొ కేఁడు
రాణిఁ జేసిన మీరు, నుర్వరను హితులు
మీరు మత్కుమారుని నిర్విచారుఁ జేయ
వలతు లని సుభద్రాంగియు, వలగొను నెడ. 61

అంబను బల్కరింప నపు డాగతుఁడైన యశోకభూపుఁడున్
బంబిన భక్తి మాతృపద పల్లవముల్ స్పృశియించి వాగ్ఘనం
బింబును గూర్ప శీర్షమున కెక్కె నెఱుల్ నెరయంగ శాంతి రూ
షంబయి, వెల్లువిడ్రు పదపద్మపరాగము పజ్జ్రవాలిసన్. 62

"స్వస్తి జగత్త్రయైక పరివస్యవిశస్త శివాంఘ్రి పంకజ
న్యస్త మనీష ! బుభుక్షకమనాస్యకళాపరివేష ! సమ్యగ
భ్యస్త శరప్రయోగ ఘటితోరు ధనుర్గుణ ఘోష ! శాత్రవ
గ్రస్త వసుంధరాక్రమణ కార్యవిశేష ! యశోక రాణ్మణీ!" 63

అని దీవించు గదాధరు
జనపతి కూర్చుండఁబెట్టి సన్మని విభు నా
తని కుశలమడిగి 'జననిఁ
మనసున గల వేధఁ దీర్చి మన్నింపఁదగున్.' 64

అని యర్థింప గదాధరుఁ
డును నామెం జూచి, 'బిడ్డ ! టూకిగ నీవున్
వినుపంగదె' యన నాతని
కనియె సుభద్రయును బుత్రుఁ డాలింపంగన్. 65

నాకున్ భర్తకుఁ గూర్తు వీవు వినఁగా న్యాయ్యంబు వైశాఖపున్
రాకన్ నేను నశోకుఁడున్ గలసి, వారాణాసిఁ బంచాపగా
స్తోకోత్తుంగ తరంగ సంగమము, బిందుద్యోతమా మాధవ
ప్రాకారాంక విలోల సైకత రజఃప్రాలంబ పుణ్యప్రభా
నీకాంగంబగు గంగలోన దిగి తన్నీరంబులన్ గ్రుంకగన్. 66

విప్రుఁ డొక్కండు సంకల్పవిధిని నెఱపి
దక్షిణయును దాంబూల ముక్తాఫలాళి
సొరిదిగొని యఘమర్షణ సూక్త మచట
నొడ్డునన యుండి పఠియించుచుండె నంత. 67

భక్తిస్ఫీతము మతి యను
రక్తి విగాహనము, గిరిశ రమ్య స్మరణా
సక్తము కంఠధ్వనియును
ముక్త్యనుగతిఁ ద్రికరణైక్యమున్ సంధించెన్. 68

ఆ సమయాన వచ్చిరట కంతటఁ జారువినూత్న యౌవనో
ద్భాసి లతాంగి, యచ్చెలువ తండ్రియు నిమ్ముగ నిట్టి వాసముల్
జేసి తటంబుచెంత నివసించిరి; మజ్జనమూడి గొబ్బునన్
డాసితి మేము; నమ్మదిత నన్గని పాదములంటి మ్రొక్కెనన్. 69

పరికించి చూచి నేనా
తరుణిన్ గుర్తించునెడను విస్మయదృష్టిన్
దెఱవం గనుఁగొను నా సుతు
తెఱఁగున్ మది నాటఁ బ్రీతిఁ దెల్పితి నిట్టుల్. 70

"కనవో సుమాంగిఁ దోసలిని గ్రాలు మహేంద్రుని సుందరుని నీమణిన్
గనినదె చెందెఁ దల్లియును గాలగతిన్; బిత కీము ప్రాణిష్టు
మను; బెదతండ్రి యయ్యెదె రమాపతి; జోడగు సంబంధించు సు
మ్మన మనముల్ హరిన్ గొలువఁ బోదము గమ్మ"ని సుస్రుఁ జీరినన్.

కొడుకున్ గోమలి ముదుసలి
వడివడిగా ననుగమింప వైకుంఠుని య
య్యెడుగుందమ్ముల కెఱఁగియుఁ
దడసితి నీరాజనమ్ము దర్శించుమతిన్. 72

ఆవేళఁ గప్పురపు వెలుఁ
గా వంచిన కాగడాలు నచ్చటి దివ్వెల్
ప్రోవై తాటంకములన్
సేవింపఁ బరస్పరమ్ము సేర్చిరి చూడ్కుల్. 73

ప్రణయ ప్రవణుల వారిన్
మునిగించె రసాబ్ధి, నమ్మనము లపాంగరుచుల్
సృణులై మరు కైదోయిని,
ప్రణుతప్రేమమునకుఁ జదరంగ పణములై. 74

అడుగఁగ నేల యిర్వురకు నాత్మలలో ననురాగవల్లరుల్
వడిగొన నైక్యభావరుచి వారి ముఖంబులఁ బ్రోపుఁగాంచె; నా
కొడుకు కది విస్మరించి, కడు కోవిదులైన యమాత్యపుంగవుల్
దుడుకులఁ జేసిరంచు మదిఁ దోరపు యాతన బెగ్గడిల్లెదున్. 75

మా శిశునాగవంశజులు మాఱట రుద్రులు రాజ్యమేలఁ, బూ
ర్వాశ మహార్ణవంబు నలలూగె; సముద్ర వణిక్కృతార్థముల్
రాశినిబోసి; రాహిత మురంబునఁ దట్టఁ గళింగమేమి ద
వ్వో? శమితారి వీఁడు; మొదవున్ బలె గట్టఁడొకో సమిద్ధరన్. 76

కరుణావతి యా తోసలి
నరవర దుహితయును బంచె నాకున్ జెలిచే
వర సందేశ మొకం డది
యిరవుగ నది యాలకింప నెడఁద కలంగున్. 77

ఆ కళింగవిభుండు దన్నాలతాంగి
పరిణయం బాష సమ్మతింపమిని బలిమి
నైనఁ గొనిపోవ సైన్యసహాయుఁడగుచుఁ
దోసలిని గెల్వ జతనంబుసేసె నిపుడు. 78

ఆ కళింగ నృపాధము నని జయించి
తోసలీ రాజ్యరమఁ దనతోడఁ గూడఁ
గైకొనుం డని యా కొమ్మ కమ్మవ్రాసె
స్వాంతమున దురంతంబుగ జాలి పొడమ. 79

అనెడు సుభద్రన్ గని క్ర
న్నన నా వృద్ధుండు పల్కె నవ్వుచు 'నమ్మా!
తనయుని దూషింపకు; తా
ననయముఁ బ్రణయంబు బయటి కాడంగలఁడే? 80

ఆఁపుది కయ్యెడ విన నను
నాఁడే నీ కొడుకు? బిడ్డ! వంచుర కింకన్
బోడిగను గళింగావని
పూఁడఁగఁ జూచెద వరాతి మర్దను బుత్రున్. 81

వీనుఁ డుదారవర్తనుఁడు విశ్రుతధర్మపరాయణుండు నీ
కొరసుఁ డీ మహాత్ముఁడు జగద్వలయైక శుభ ప్రవర్తకుం
డై రవి వెల్గుదాఁకఁ జరితార్థత నందెడు నా విసంగ లే
దే? రణమం దజయ్యుఁడు సుధీస్తుత శాంతిని గోరు నీతఁడున్. 82

పాపి పరాంగనారతికిఁ బాల్పడఁ జూచుఁ గళింగనాథుఁడున్
గాపథవర్తి, వైరమునఁ గాలియవెట్టినఁ దోసలేంద్రుఁడున్
బ్రాఘ్నుగోరె; లేఖయిదె రాజ్యము మిన్నక కోలుపోవ నీ
భూపతి యుత్సహించెడు? రిపుల్ గణియింతురె దీని నోర్పుగన్. 83

గురు కాళింగ రుజాపహా
మురుతర శౌర్యంబుఁ జూపి యుద్ధంబున స
త్వర ముదధిని బ్రాక్కేళీ
సరసుగ మార్పంగలండు సత్యం బనాగ్మ! 84

అనుచు గదాధరుఁడు నుడివి
విని చేరువ నూరకుండు విభుఁగని నీవుం
జననికి మోదం బొదవగ
వినిపింపుము నీకు నదియు విధ్యుక్తమనన్. 85

వినతుఁ డశోకుఁ డంబచెవివిం గొనరించుచు నీకుఁ బ్రీతిగా
పని విని గెల్చి, తోసలి విపన్నజనావలిఁ బ్రోచి [illegible]వం
శను సుదతిన్ వివాహమున జక్కన నేను గ్రహింతు; నిక్కవం
బన విని తల్లి పొల్చెను నిరంతర నిర్భర హర్షచిత్తయై. 86

అంతట లేచి మంతనములాడఁగ మంత్రులచెంత కేఁగు భూ
కాంతుఁడు విప్రు యాష్టికుని గన్గొని "మీరలు వచ్చుచుండుఁ డే
కాంతమునన్ వచింపగల కారణకార్యము లుండె, శాంతికై
స్వాంతము తల్లడిల్లుఁ దనువామెదె; తల్లికి నేమి సెప్పుదున్ ? 87

రాజగువానికిన్ సమరరంగము నాటకరంగమంతె యం
దోజ నటించు టొప్పియగు, నుత్తమ లోకహితక్రియాచణుం
డై జయశీలి శాంతిపథమందు నతండె బుధేంద్రవంద్య రా
ట్తేజుఁడు నోగితంబెఱిగి దెప్పరమైనఁ బొనర్చు నంచనన్. 88

పల్లెయని గదాధరుఁడు స
ముల్లాసముతోడ నరుగ నుర్వీపతియున్
దల్లిని వీడ్కొని ప్రెగ్గడ
లెల్ల రళిందమునఁ గూడు నెడ కేగె, సభన్. 89

ప్రణిధులు తెచ్చిన వార్తా
గణములను నృపేంద్ర సమ్ముఖంబున నిడి దు
ర్గుణులగు విమతుల దుర్ణయ
ఫణితిన్ వివరంబుగాఁగఁ బల్కిరి మంత్రుల్. 90

ఇష్టగృహాలిఁ బాసి యెడ రేర్పడఁ బిల్లలు దల్లులుం జనం
బిష్టుల బంధుతన్ విడిచి యేగతి మాకిఁక నంచుఁ బాఱఁగా
శిష్టసతుల్ గలంగగ నశేష కళింగబలంబు దేశమున్
దుష్టతఁ గొల్లకొట్టెనఁ దోరపు టల్క నశోకుఁ డుగ్రుఁడై. 91

కొనకొని స్వీయనందనను గూర్చ మహేంద్రుని వేఁడవచ్చు నా
తని గడతేర్చవచ్చు జనతా ఘనతాపకృ దక్రమ క్రియా
వినిమయము ల్దురంతముల వెక్కసపాటునఁ జేయుచుండు క్రూ
ధుని కటు విప్రకారమును రూపఱఁ జేయుట యొప్పు నెవ్విధిన్. 92

రాజగు విప్రుఁడు నగుఁగా
కోజ నసత్కర్మపరత నుక్కివుఁడును ను
ద్వేజితుఁ డయ్యెడువాని బ
రాజితుఁ జేసి యనుపనగుఁ బ్రగ్రహమునకున్. 93

అని యాడు నశోకుని గని
"పనుపం దగు వేగ సుభట పటలంబుల నిం
కను జా గొనరింపఁ దగదు
జనపాల! త్వదాజ్ఞ వేచి సైన్యము లుండెన్. 94

సేనాకాండ మనుజ్ఞన్
బూను కళింగావనీ విభున్ బోరిగొనఁగన్
ధీనిధి మహేంద్రమల్లుఁ డ
ధీనానీకినిని బంచెఁ దెరువులఁ గట్టన్. 95

ప్రభువుల చిత్తం"బన విని
విభుఁడున్ "దుముదారుఁ గలస విప్పకుఁ జరిన
ల్లభుఁడే రానిండిల రణ
రభస బుభూర్షువు కళింగరాజేయనఁగన్. 96

మన భటులే తలంపడి ప్రమాదము పాల్పడరాదు; ధోసలిన్
జెనకఁగనీక సైన్యముల సిద్ధముఁజేయుఁడు, పంపుఁ డుగ్ర వ
హ్నిఁ నిబిడముల్ రిపుఘ్నుల నసీకినిఁ గోడ శిలాంత కాగ్ర్యుఁడున్
జని మొన నిల్చుగాత పరుసంబులుఁ బగ్గలుఁ బల్కకుండుఁడీ." 97

అనఁ జేతుల తీటలు వో
ననువై సేనానులుక్కటంగులు మొదలౌ
పనిము ట్లాయుధములు న
స్త్రనికాయంబులను గూర్పఁ దరలిరి వేగన్. 98

వెనుదిరిగి యశోకుఁడుఁ దన
మనికికిన్ జింతించె రణ మమానుషరీతిన్
దనరినఁ దామసవృత్తిన్
దనుకఁగ, విశ్రాంతినుండఁ దఱిగా దనుచున్. 99

కనుమూయఁగ నిద్దుర పై
కొనదయ్యెన్, గాఢమగుచుఁ గొలువై కలలున్
మనసున దట్టినఁ, గలఁతన్
గని లేచెను గూఁతలిడఁగఁ గాలజ్ఞానుల్. 100

ఉదయోచిత కృత్యంబుల
నదనబదనసేసి తల్లి యంఘ్రుల శిరమున్
బొదలఁగ దీవనగొని, హరి
కొదమవలె నృపుండెసంగి కుదుటం బడుచున్. 101

వృద్ధుఁ గళింగాహవ స
న్నద్ధుఁడు బలె యష్టిఁదాల్చి నడతెంచిన సం
సిద్ధు గదాధరునిన్ గని
'శ్రద్ధన్ వినిపింపు 'గీత' సంగ్రహ సరణిన్. 102

విందు మదియు నొక నిశ్చిత
మొందఁగ' నన నవ్వి యతఁడు పుత్రా! నీవున్
గందువు శంపుని వ్యాఖ్యను
బొందిక నా కంతకంటెఁ గోలును తెలియన్. 103

పలుకను మాఱు నీ వడుగఁ భ్రాంత పథంబున నే వచింతుఁ గో
యిలవలె; నూతనార్థముల నేవియు వెల్వఱుపంగనేర, ను
జ్జ్వలశితపండ నండఁగొని చాలుదుమీవె; యెఱుంగనేల వృ
ద్ధుల మతి సందియంబుల విదుర్పుమటంచును బల్కెనివ్విధిన్. 104

సృష్టి యొనరించు నలువయై; శివుఁడనంగ
సృష్టిని హరించు; విష్ణువై సృష్టిఁ బ్రోచు;
నామరూపంబు లన్నిఁటఁ స్వామి యగుచుఁ
దానె విశ్వైక కేళిలోఁ దాండవించు. 105

అల పురాణంబు లన్నియు నతని కధలె
వేద నివహంబు లన్ని యవ్విభు మహిమలె
బోధధను లెంద ఱీయిల బుద్ధులైరో ?
ఈశు నవతారములను లెక్కిడగరాదు. 106

ఉపనిషత్సారములఁ గృష్ణుఁ డుద్ధరింపఁ
బూనరె నష్టాద శాధ్యాయములను గీత;
ఏర్చి యధ్యాయమునకు రెండేసి శ్లోక
ములను నున్నవున్నట్లుగా బలుకువాఁడ. 107

## చతుర్థధార - ద్వితీయ బిందుపాతము

## భగవద్గీతాసారము కర్తవ్యాలోచనము

శ్రీ కమనీయోపనిష
ద్రాకాశశి; యోగశైల రణిత జ్ఞానా
స్తోక తరంగిణి గీతఁ
జేకూర్చిన కృష్ణుఁ డెసఁగెఁ జిద్భాస్కరుఁడై. 108

ఆహవమున స్వజనవధం
బీ హితమా ? లేదు; శ్రేయ మెదురీఁత మనో
వాహిని కశుభ నిమిత్తము
లాహా ! విపరీతరీతి నగపడుచుండెఁ. 109

సాంపరాయ జయంబుఁ గాంక్షింపఁజాల
సౌఖ్య సామ్రాజ్యములును కృష్ణా ! హితాళి
చన్న వెనుక భోగములు రాజ్యంబు లేల ?
తుదకు జీవించుటలు దేని దొరయు కొఱకు ? 110

అనిన యర్జును బరికించి యనియె హరియు
మృత్యువశకాయగతమయ్యు మృతియు లేని
యది పురాణంబు శాశ్వత మజము నిత్య
మాత్మ; జనియు హానువులేని యాత్మ పుట్ట
లేదు; పుట్టుక లేని దనాది యగుట. 111

సిద్ధ్యసిద్ధుల సమబుద్ధి చెల్ల, సమత
నుచిత కార్యాచరణనిష్ఠ యోగ మరయ;
నట్టి యోగంబు లోఁగొని యఖిల విషయ
సంగము త్యజించియె కిరీటి! సల్పు కర్మ. 112

అఖిల కర్మేంద్రియముల సంయమము సేసి
మనసులోనఁ దదర్థ సంభ్రాంతి విడువ
కుండునట్టి విమూఢాత్ముఁ, గోవిదతతి
యజ్ఞుఁడనియు, మిథ్యాచారి యనియు నండ్రు. 113

వివిధ గుణకర్మ సువిభాగ విదుఁ డసంగి
తత్త్వవిజ్ఞాని యర్జునా! తత్త దింద్రి
యాత్మక గుణంబు విషయ వనాటనంబె
యనుచు మది నెన్ని వాని చాయలకుఁ బోఁడు. 114

బ్రహ్మకర్మ సమాధిని బడయువాని
యజ్ఞపాత్రంబు బ్రహ్మ, తదగ్ని బ్రహ్మ
బ్రహ్మయే హుతంబు హవిస్సు బ్రహ్మమగుఁ
డతనికిఁ గమ్యమగును బ్రహ్మంబె వత్స! 115

సంయతేంద్రియ సుజ్ఞాన శ్రద్ధ లెనయు
నరుఁడె పూజ్యుఁడై చూచు జ్ఞానప్రభాత
మది ఘటిల్లిన నచిరకాలాంతరమున
నాత్మవిదుఁ డనుత్తమశాంతి నధిగమించు. 116

వినయ విద్యాసుసంపన్న విప్రులందు
గోవులందు గజంబులఁ గుర్కురములఁ
గుక్కమాంసంబుఁ దిను నీచకులజులందుఁ
బరగ సమదర్శనులు వారె పండితాలి. 117

మునియు మోక్షకారణశీల ఖనియు, నియత
బుద్ధిమానసేంద్రియుఁడునై పొల్చునెవఁడు
వాఁడెపో ముక్తుఁ డెవ్వేళ, వాఁడు నిచ్ఛ
భయము క్రోధంబులున్ లేని పథముఁ జొచ్చు. 118

యుక్తాహార విహారా
సక్తుఁడు, స్వప్నావబోధ సముఁడు, హితములౌ
నుక్తి క్రియ లరయుఁ దపో
యుక్తత, దుఃఖాపనోద యోగనియుక్తిన్. 119

మనసు నాత్మస్థితముగాఁగ మలపి యనిశ
మించుకైనను జింత గానీయకుండ
ధృతిగృహీతబుద్ధి సదా సుధీప్రయుక్తి
మెల్లమెల్ల మనశ్శాంతి మెదుపవలయు. 120

మన మహంకారమును, బుద్ధి, యనలుఁ డనిలుఁ
డంబువులు, భూమి, యాకాశ మనఁగ వెలయు
ప్రకృతి యష్టవిభాగ్యమై ప్రాజ్యమగుచు
భిన్నగుణముల నామాయ బెరసియుండు. 121

దైవీయము గుణమయ మా
యా విలసన మది, దురత్యయం బగు; నైనన్
భావ ప్రపత్తి ననుసం
భావించునతండె నాదు మాయఁ దర్శించున్. 122

హృదిని మనమూని, మూర్ధాన నీశు నక్ష
రోంకృతినిధాను నేకు నిశ్శంకఁ జేర్చి
యనిశము స్మరించువాఁడు దేహంబు నీఁగి
పరమమగు దివ్యపదమందుఁ బరమునందు. 123

అగ్ని తేజంబు శుక్లపక్షాహములును
నుత్తరాయణము హితంబు నుత్తమంబు
గతికి నర్చిరాదికి; దానఁ గడచి యేగు
బ్రహ్మవేత్తలె బ్రహ్మంబుఁ బడయువారు. 124

అన్యచింతలు మాని నాయందె చిక్కి
నన్నె పర్యుపాసించు సుజ్ఞాని జనులు
నియత నిత్యాభియుక్తులు; నెఱయ వారి
యోగమును క్షేమమును నేనె యోర్తునెందు. 125

ఏను భజియించు భక్తులలోన నుందు
వా రనన్య భాక్కులయి యాచారదూరు
లేని సాధువులం డ్రిది యేల యనినఁ
బూర్తి నాయందె వ్యవసిత బుద్ధిగలరు. 126

ఆదియే లేని లోకేశు నజుని నన్ను
విశ్వవిభుఁడంచు నెవ్వఁ డెవ్వేళ నెచటఁ
బొందు మర్త్యులయం దసమ్మోహుఁ డగుచు
సర్వపాప విముక్తుండు నుర్వి నతఁడె. 127

శ్రీమ దూర్జిత మది యెల్ల నామయంబె
మద్బహు విభూతులను జూప మాట లగునె ?
కృత్స్న మీ విశ్వమంతయుఁ గేవల మొక
యంశ నిండియుండు నిజంబు నరయు మయ్య ! 128

అనిన విభుఁ బ్రస్తుతించె నిట్లర్జునుండు
"నీవె పరమాక్షరుండవు; నీవె వేది
తవ్యుఁడవు; నీవె శాశ్వత ధర్మగోప్త
వీవె యవ్యయ పురుషుండ వీవె విశ్వ
పర నిధానంబ వచ్యుతా! పరముఁ డీవె. 129

అంత హరి తథ్య మిది సంగ మఖిల ముడిగి
చేరి నను భూతములకు నిర్వైరుఁ డగుచు
మత్పరముఁ డయి మద్భక్తి మహిమ నందు
నస్మ దవిరతక్రియ భక్తుఁ డనుచుఁ జెప్పె. 130

పరముఁ గేంద్రీకరించు నభ్యాసయోగ
ధారణను మించు జ్ఞానంబు; ధ్యాన మంత
కన్నను విశేష; మవల నిష్కర్తృకముగ
ఫలము నెన్నఁడు తా నొందుఁ బరమశాంతి. 131

భీతిలేఁడు తుష్టుం డనపేక్షుఁడు శుచి
దక్షుఁడు తటస్థుఁడున్ విగతవ్యథుండు
త్యక్త సర్వక్రియారంభి భక్తి యుక్తి
మలయు నాయందె వాఁడెపో మత్ప్రియుండు. 132

పాప పుణ్యాది ఫలద ప్రపంచ రూప
నిఖిలజీవిత సుక్షేత్ర నిరతవర్తిఁ
దెలియుమీ నన్ను క్షేత్రజ్ఞుఁ దేటపడఁగ
క్షేత్ర తద్జ్ఞుల నెఱిఁగెడు స్థితియె యెఱుక. 133

సకల వ్యాప్తము సూక్ష్మ
ప్రకటితము నలిప్త మా నభం బెటు లటులే
సకల తనుస్థిత మాత్మయు
నకలంకము నోపలిప్త మగుణము గుణముక్. 134

సత్త్వగుణ సంప్రకాశ రజఃప్రవృత్తి
తామస జఘన్యతల్ వీడి యే ముముక్షు
విష్టపడఁడో నివృత్తముల్, ద్విష్ట మనఁడో
ప్రాప్తములను గుణాతీత భవ్యుఁ డతఁడె. 135

తుల్య పక్షారి మిత్రుఁడై దొరయు జ్ఞాని;
భక్తుఁ డనఘ గుణాతీత పథము నొరసి
యస్మ దవ్యభిచార రక్త్యాప్తసేవ
బ్రహ్మపదమున కర్హుఁడై పరిఢవించు. 136

ఏనె వైశ్వానరుండనై యెపుడు ప్రాణి
దేహముల నాశ్రయించి యుదీర్ణ గతిని
బక్వమొనరింతుఁ బ్రాణ మపానమెనసి
మొనయ భోజ్య చతుర్విధ భోక్తవగుచు. 137

త్యక్త మాధ్యుండు సంగసంతాపదూరుఁ
డఖిల సుఖదుఃఖముక్తుండు నస్తకాముఁ
డలరు నిర్మానమోహుఁ డధ్యాత్మనిత్యుఁ
డతఁడు ప్రాపించు నవ్యయ మాత్మపదము. 138

కామ లోభ ప్రయుక్త భోగప్రసక్తు
లై, యపరిశుద్ధి నరకంబు నధిగమింతు
రమిత చిత్త విభ్రాంతి నహర్నిశంబు
మోహజాల సమావృతుల్ మూర్ఖులెల్ల. 139

అక్షరక్షర పరముల నరయకుండ
శాస్త్రవిధిఁ బాసియు యథేచ్ఛ సంచరించు
నట్టివాఁ డాత్మసిద్ధి కనర్హుఁడగుట
వాని కెట్లబ్బు సుఖమును బరమగతియు ? 140

దేవ గుర్వర్చన లహింస దేహతపము;
విహితవాక్కు బుతం బనుద్వేగ మధ్య
యనవిధియు వాక్తపంబు; సౌమ్యత్వ మౌన
నవ్యత ప్రసాదములు మనస్తపంబు. 141

శ్రద్ధనూని తపత్త్రయ వ్రతముఁ బూని
తృప్తుఁడై శుద్ధ సాత్త్విక జ్ఞప్తి నొనరి
తత్ఫలము వీడి 'ఓం తత్స' దనుచు నీశు
నందె విశ్రాంతుఁడగు సతం బాత్మవేది. 142

శ్రేయము స్వధర్మ; మితరంబు సేయఁబోకు:
భక్తి కర్మాదులఁ హరిపరముగాని
ధర్మముఁ ద్యజించి శరణపద్ధతిని నన్నె
పొందఁ బాపంబులను బాపి మోక్ష మిత్తు. 143

ఎచట బార్థుండు కృష్ణు యోగీశు డాసి
గొను ననన్యశరణ్యంబు ధనువుఁ బూని
చెలఁగు నాచోట భూతియు శ్రీయు విజయ
నీతిమతులు ధ్రువంబు సంథిల్లు నెపుడు. 144

కావున సర్వము దానయి
యే విను ముల్లోకముల నహీనుండును స
ర్వావృతుఁడు కరాంఘ్రినయన
భావాస్య శిరోమయుండు పరమాణుగుఁడై. 145

వేదవిదుఁడు వేదాంత కృ
దాది సమాఖ్యుం డనంతుఁ డవ్యయుఁడు ప్రషీ
కాదుల కీశుఁడు వేద్యుం
డాదిత్యాకృతి తమోపహర్త యతనికిన్. 146

ప్రీతిగఁ దత్ప్రేరితుఁడయి
యాతప శైత్యాదు లిట్టి వనకయ ధర్మం
బూఁతగఁ బరమశ్రద్ధన్
భౌతిక జీవితము నెఱపఁ బరము ఫలించున్. 147

ఎప్పు డెపుడు ధర్మగతికిన్
జపలురచే గ్లాని కలుగు సర్వేశుండున్
కృప నవతారిగఁ బ్రాపగు
నప్పు డపుడే ధర్మరక్షకై యుగయుగమున్. 148

గీతాసారం బీగతి
నాతఁడు వల్లింప విని యథార్థస్ఫూర్తిన్
భూత కటూదంత చకిత
చేతోబ్ధికిఁ బోతమైన చేవయు దొరయున్. 149

నృపలలాముఁ డశోకుఁడు నెంజిలి తెగ
నద్భుతాచింత్యమహిముఁ డవ్యయుఁడు విభుఁడు
బుద్ధుఁ డవ్వాని నెఱిఁగి కాఁబోలు ఫలముఁ
జీరఁడు సుకర్మయే చేయ సారె కోరి
ప్రాజ్య ధర్మసంఘములె శరణ్య మనియె. 150

అని నొడివి భవిష్యత్తు నుద్యమయుతంబు
గాఁగ యోజించునెడ "జాలకంబుఁ బన్ని
మించి కరుణావతిని దస్కరించి చేర్చెఁ
జెఱను గాళింగుఁ" డని వేగు చెప్ప, లేచి. 151

తనకు ముఖ్యమిత్రుఁ డగు శంతనుని బిలిచి
రాజనందన యునికి విగ్రహము మొదలు
గాఁగలట్టి పథకములఁ గల్గు ఫలము
లన్నియు న శేషముగ వేగ నరసివచ్చి. 152

'నన్నుఁ దోసలిఁ గలియుము
మున్నుగ నీ వేగు'మని విభుం డాజ్ఞ నిడెన్;
జెన్నుగ గదాధరుండును
'ఖిన్నతయును నొలఁగెఁ బోదు గృహమున' కనెన్. 153

ముది గదాధరు మాతృసమ్ముఖముఁ జేర్చి
తల్లికిఁ బురాణనీతి స్వాంతమునఁ గూర్పఁ
గోరి సంగ్రామరంగమ్ముఁ గూడఁ జనెద
నాన తిమ్మని మ్రొక్కె తా నంబ కప్పుడు. 164

తల్లికిని గదాధరునకు
నుల్లము చల్లనగు నాదు నుద్వాహముచేఁ
దెల్లంబని "కోడలిఁ గని
యుల్లాసము నీవు నొరయ నొల్లవె" యన్నన్. 155

"పగఱు గొనిపోవ నీ చెట్టఁబట్టు కొమ్మ
చెఱను విడిపింపఁ బోవంగఁ జెల్లు; నామె
సాంపరాయ మర్థించె 'నసంధిమిత్ర'
యాలసింపక రమ్ము జయమ్ము గొనుము." 156

అని యాశీస్సిడి కొడుకున్
గొనబుగ వీడ్కొల్పెఁ బురిని గొబ్బున భేరుల్
గొనకొని మ్రోగెఁ గళింగర
మను దోడ్కొని వచ్చు ఱేఁడు మగధకు సనుచున్. 157

## పంచమధార - కరుణావతీరక్షణము

ఆజికి నరుగు మహారథు
రాజేంద్రుని వృద్ధ విప్రరాజీవాక్షుల్
తోజున గ్రీవము నెత్తి స
రోజారుణ కుంకుమంబుఁ బ్రోదిగ నొసటన్. 158

శ్రద్ధఁ బెట్టియు "విజయ స
మృద్ధిఁ సతిఁ గొను" మనుచు నమిత్రులఁ గారా
విద్ధులఁ జేయును శూరుని
పద్ధతి యిది నిజమటంచుఁ బాడిరి పాటల్. 159

తత్తద్దివ్య శిలాకృతి
నుత్తేజితులగ బితామహుల బితఁ బూవుం
గుత్తుల నర్చించి సమా
యత్త శిరస్త్రాణ బాణుఁడై యనిదిక్కై. 160

గాఢసన్నాహముల హయారూఢుఁ డగుచుఁ
దోసలిగ రాజుఁ జేరఁగా నా సమీప
గిరివరాగ్ర దుర్గస్థిత గృహ నిబద్ధ
యతివ యని తెల్పి శంతనుఁ డతనితోడ. 161

వినయపులేఖ నే శరముతోంబడిఁ బంపిన దానినెత్తి వెం
టనె ప్రతివ్రాసి రత్నముఁ గడానికిఁ దాపిన యంగుళీయకం
బొనరిక నంటఁగట్టి కరమూఁపి శరం బరివోసి యేయ, నే
నును గని యూపె యుత్తర మనూనతఁ దెచ్చితిఁ గొన్మిదే నృపా! 162

అన విని ప్రియలేఖం గొని
కనె ముత్తెపు సరులువోలెఁ గ్రందు గొలుపు న
వ్వనితాక్షర పంక్తులఁ, జి
వ్వున లేఖార్థము మదిం దవులొక్కన జేఁదుగ. 163

అచలితచిత్తుఁడు సేనా
నిచయములు నిశీథమందె నేరుగఁ జన, చే
ర్చుచు వ్యూహముల నకస్మా
ద్రచనముఁ జేయింపుఁ డీరు రణబీభత్సుగ. 164

నేనును జేరెద మిము న
న్న్యానత మున్ జెప్పినట్లు నూల్కొని వేగన్
కోనిం డిభయూథము; సే
నా నివహము మధ్యఁ జీల్చి నఱకుం డరులన్. 165

అని యాదేశం బిడి, తన
ఘనకర్కము వీపుఁ దట్టి ఘన గిరిదుర్గం
బును జేరఁగ శంతనుతో
ననిలోత్కట రంహుఁ డగుచు నరిగెను రాజున్. 166

కటికి చీఁకటి యనక యుత్కట రయమున
నిర్వురు నుపత్యకము జేరి యూర్ధ్వముఖము
గా నగాగ్ర మారోహించి కాంచి రచట
తుంగవప్రము నుత్సేధ దుర్గగృహము. 167

దూదిఁ జెకుముకి రాచి వెల్తురును జేసి
తన్వియు లిఖించినట్టి విధంబుఁ దెలిసి
యంధ తమసంబులోఁ మూఁతయైన రాతి
తలుపుఁదీసి వెసన్ బిలద్వార మొనసి
రహటు దొలఁగింపఁ జే దివ్వె రగులు గొల్పి. 168

ఇరువురు నేగి యేగి యొక యీరము చెంగట వెల్వడన్, దృగు
త్కరముల జోపి శంతనుఁడు గాంచె సమీపమునందు నెవ్వరే
నొరులు చరింపకున్కి, తలుపోసరి దిడ్డియు నుండ, నంతయున్
సరగున జెప్పి శోఁడు సునసన్ నడువన్ జని గేహమున్ గహ
స్సనణిని జొచ్చి యచ్చటి నిజస్థితి గన్గొన డాగి రిర్వురున్. 169

దాపున నందెల సవ్వడి
ప్రాపింపన్ జెలువ పువ్వుల పాన్పున లేదో?
దూపిలి పాఱఁగఁ దలఁచెనో
పాపంబని చేతఁబట్టెఁ బట్టాకత్తిన్. 170

రాజును దొంగి వాకిటను రల్లకమించుక యొంకీడ్చి యు
ద్వేజిత వృత్తిఁ జూచునెడ ధీనిధి శంతనుఁ డా యశోకుఁడే
యోజఁ గడంగునో యనుచు నోవరినుండఁగ వేఁడి కాంచెఁ బె
న్వాజులు తీర్చుచూపుల నపాయమెదుర్చు భుజంగబాలనా
రోఁజుచు బాహునాళము లురోజతటంబున గట్టి కన్యకన్. 171

ద్వారతలంబుఁ దాఁటుచుఁ గుతస్త్వములాడు కళింగమేదినీ
దారుఁడు నర్ధయామిక నదాటునరాగ మహేంద్రు కూఁతురీ
తీరు రుషోరుకీలలగు తీక్ష్ణపు దృక్ఛరముల్ విదుర్చు నేఁ
జేరువఁ జూతు నాగడ మిసీ యని శంతనుఁ డుండె నయ్యెడన్. 172

వాసనల్ గుబాళింపంగఁ, బట్టువలువ
దివ్వెకాంతులఁ గ్రొంజిగుల్ దిశల నెఱప,
నంగముల గంధ మలఁది కళింగవిభుఁడు
విమల ఘనసార ఘుమ ఘుమ వీటికొనుచు. 173

మసృణ ఘుసృణ వర్ణంబు లంబకము లంచు
లెక్కఁగన్ మైకమున నరచొక్కు చూపు
లొలయ మెలమెల్ల డాయుచు వెలఁదిచోటి
కలఁతి దవ్వున బల్కె నొయ్యారముగను. 174

వలపుల నొలికించు పలుకు సోనల మాని
యేల పల్దెర మూయఁ జేలమెత్తి?
తళుకొత్తు నీ గండ లలిత దర్పణముల
నేల త్రిప్పెదు కాంతి డీలుపడఁగ?
తీపు పెంపారు నీ చూపుల నా పైన
నేల చల్లవు సుధాశ్రీలు గురియ?
కులుకు నెడందపై వలిపెంబు జాఱింప
కేల కప్పెదవు కెంగేలు కొనల?

ఆస్య చంద్రుని చేనీడ లలమఁజేయు
దానె! సైకతశ్రోణి రంభోరు యుగళి
చారువులు గావె? నీకు విచారమేల?
అల్పుఁ డందునె నను గళింగావనిపుని. 175

చెలఁగుం వార్ధిపరీత భూతటమునన్ జెల్వొందు సామ్రాజ్యంబు రా
జ్యలలామంబు కళింగసీమ, సురపూజ్యంబౌ జగన్నాథు, డిం
పులఁ గూర్చుం గులదైవమై హరియు, నా పుణ్యుండే నేను, మీ తాతయుం
గలనన్ నీల్గెను మత్పితామహుఁడు నవక్రంబైన శౌర్యంబుచే,
నలుగన్ జెల్లునె దానికై కలికి మిన్నా! విప్పవే నోరిటన్. 176

లావణ్యరాశి? రోలంబాలకా! నీకుఁ
బెన్నెఱుల్ సవరింపఁ బ్రీతి లేదె!
అంభోజ సుమగంధి! అరుణ బింబాధర!
చందనాదు లలందు సరవి లేదె?
గగనావలగ్న! శృంగార జాను విలాస!
జిలుఁగు పుట్టము గట్టఁ దలఁపు లేదె?
సర్వాంగసుందరి! సౌరు బంగరుబొమ్మ!
యంగముల్ గై సేయు నాస లేదె?

మజ్జనంబను మాటకే మనసురాదె?
వార మొక్కటి గడచె నీ వారగింప
వకట! పస్తులఁ దనువల్లి యధికకార్శ్య
మొనయ వందురనేల? నే నెఱుఁగఁ దగనె? 177

విరజాజులను మాలకరి పత్తైఱంగులఁ
గూర్చి మెత్తుల సమకూర్చినాఁడు;
తైలికుఁడును దావు లొలుకు నానాసూన
సార ధృతుల్ వార్చి జార్చినాఁడు;

ఘనసార కస్తూరికా ఘుసృణముల గం
    ధకరియుఁ గలపముల్ దార్చినాఁడు;
కమసాలి మాణిక్య ఖచిత సౌవర్ణ భా
    సితములౌ సొమ్ములఁ జేర్చినాఁడు;
నీటుగు గజేంద్ర దంత కరోటకమున
నెలమి నానిని దెచ్చితి నివియ కనుము
కలికి! నా బహిఃప్రాణంబు గాగ నీవు
సకల కాళింగలక్ష్మికి సవతివౌదు. 178

సరసఁ గస్తూరి శ్రీఖండ చర్చనొలయ
సరవిఁ గౌసుమ మధువు వాసనలఁ గలయ
నెటుల సొగియించు నట్టులె యీవు నాదు
హృదయనాళేక్షణంబులఁ గుదురుకొంటి
వరయఁగదె నీ వదురు మదిఁ జొరగనీక. 179

అని యెదఁ జేయివెట్టి కుడిహస్తము నామె కుచంబులన్ స్ఫుట
స్వనమున 'హే ప్రియా!' యనుచుఁ జాపిన నోపిక నే వికారమున్
జొనుపక కన్యకామణియు "సూకరవృత్తి మహాపచారతన్
జెనకఁగనేల నీకుఁ గడుఁ జెప్పఁగనేల? ప్రియంబు గావు నీ
వను నుడులేవి; ప్రేమ హృదయంబునఁ బుట్టదు, చాలు చాలిఁకన్. 180

ఏన యొకర్తునే నిను వరింపఁగ యోగ్యలు కన్యలెందఱో;
పూని పరాఙ్ముఖిన్ గొసరఁ బోలునె?" యంచు నసహ్యభావమున్
దీనతఁ జెప్పి పొమ్మనిన దీర్ఘము నూర్పు నిగుడ్చి "బేల! నీ
వే నను తెచ్చగొట్టెదవు; హీను నశోకుని గోరె దేలొకో
జేనెఁడు పొట్టకై కులము చేడ్వడఁ దమ్ములఁ బంపెఁ గాటికిన్. 181

వంశము సంకరంబు; పెరవాఁడు; కురూపి; ప్రచండకోపి; ని
ర్వంశలగా ననాథల నెపంబులు లేకయె చేసె పాపి; ధీ
భ్రంశు నశోకు మోరఁగనఁ బొల్పెడదే పువుఁబోడి ఫుల్లకై
యంశులమైన భోజనము నాఱడి పుత్తువె? భ్రాంతవే? చెలీ! 182

కలశసంభవుఁ గని కలసెఁ బురూరవు
నూర్వశి యగునె నీ శుద్ధి? సులతా!
చిలుక తత్తడి గొల్వ జికిలి నవ్వులఁ గడు
సరి రతి యగునె నీ సాటి? సువిని!
తెలివెల్లి జాబిల్లి పలుకు సుందరతకై
ధరియించు నగజ నీ సరియె? శాంతా!
అంచ తేజీ నెక్కి యక్షరాస్యుల గుంపు
గూడు శారద నీకు నీడె? కళికా!

చెక్కు తళుక్కులు కమ్మల జిగులు గుల్కఁ
గొసను దిగజార్చు నీ నీలిముసుఁగు నెలఁత!
శోక ముడిగి నమ్ము నను; నశోకు మఱచి
చేర్పు మింక లే నవ్వువీచిని మిటారి!" 183

అనుచు సర్థించి యూరక యవని గూలి
ప్రక్కకు మొగంబు ద్రిప్పిన పడఁతి చెంత
నొక్క మోఁకాలు ముందుకు నూఁది, యెడమ
చేయి దో ర్మూలమును జుట్టి చెలువ యెదకు
మలపు కోడిగము కళింగమల్లుఁ డొగయ. 184

మనకొప్పుఁ బాము మాడ్కి బుస మాటికి నెల్వడ బాహుదండముః
విసరుగఁ దట్టి మర్థరయు విక్రమతాడితుఁ జేసి క్రిందికిన్
'దొసఁగు తొలంగు మీ' వనుచు నొర్లగఁ ద్రోసిన రోషభీషణుం
డౌసఁగి విఘూర్ణదృష్టి రతిహిండకుఁ డింకొకసారి డగ్గఱన్. 185

"చాలుఁ గాళింగభవుల కీ చాలు సహజ
మనున దొక్కటి చేయు టన్యాయ మన్య
మలఁతి దూరమ్ము నం దుంపవలయు మీరు"
ననుచు జంకించి నిగ్గడిఁ గినిసి ముందు
వ్రేళ్ళ నెత్తుచుఁ గరమూఁచు నెలఁదిఁ గనుచు. 186

బలిమిఁ బ్రక్కవాటుగ డాసి పట్టు కాంక్ష
నాపె రోషకషాయితాస్యంబు నెగయు
శ్వాసముల మిట్టకెదుగు వక్షంబు పయట
జెఱఁగు ప్రేల వెన్నున జాఱు కురులఁ గాంచి. 187

కొప్పు గుప్పిటఁ బట్టి చిక్రోడ మొడియు
నడవి బావురుఁబిల్లియై పుడమిపతియుఁ
గామవశుఁ డామెఁ గౌఁగిటఁ గ్రమ్మఁగోర
"ననద నెనరున గావుఁడీ" యన నశోకుఁ
డొక నిమేషాన లేచి పాటకముఁ దాల్చి. 188

తలుపు గభీలునన్ దొలఁగఁ దన్నియుఁ బెబ్బులి వాతఁ జిక్కి పె
న్నలయు మృగిన్ విభీత కరుణావతి నార్తను దొల్త నావలన్
దొలఁగఁగఁ దట్టి నెట్టె నయదూరుఁ గళింగుని నైనతేయుఁ డ
గ్గలముగ దూఁకి పన్నగ ముఖం బుడివోవఁగఁ గొట్టుచాడ్పునన్. 189

అమిత బలాహతిన్ జెదరి యక్కితవుండు కృపాణమెత్తఁ దు
త్తుమురుగ దాని వ్రచ్చి కడు దోర్బల మొప్ప గరేకరంబునన్
భ్రమయఁ గరోటిపై బొడువ బ్రల్లున గూలు కళింగమల్లు ను
న్నమితుగఁ జేసి 'చూడు మిదె నన్ను నశోకు' నటంచు గర్జిలెన్. 190

భ్రమయుతు మత్తు నశక్తుని
సమరమునం జెనకరాదు క్షత్రియులకు; నీ
వమరుచుకొను మాయుధముల
దమియు దణియు నెవ్వరో ప్రతాపమె తేల్చున్. 191

అని వికృతిన్ బొరయక, మన
మునఁ గల సంగ్రామ రభసము బయల్వడనీ
క, నిరూపింపక, నరి భా
వన భావజవశతలేక, వర్తిల నంతన్, 192

ఖలుఁడైన కళింగవిభుం
డులుకుచుఁ దన లావు నెదురు నుద్ధతియుఁ గలం
కులును బిఱింది దెసల్ గని
కెలయఁగ రాదనియుఁ గలనికిన్ దగదనియున్. 193

వగచి కడు మొగుడుఁదమ్మిన్
నగు హృదయము స్తిమితమున్ గనన్ మానినికిన్
వెగటొనగూర్పక తడయక
నగరి కరుగ నిశ్చయించి 'నా కార్ముకమున్. 194

వెదకియుఁ దెత్తునిల్వు' మని వేఁడి యశోకుని గన్గొఱంగి నే
బ్రదుకుము జీవుఁడా యనుచుఁ బ్రక్కఁగదిన్ గల గుప్తమార్గమున్
గాదుకక చొచ్చి తన్నరియు గోహరి నెక్కొన వెన్నడింపఁ డ
య్యాది పదివేలుగాఁ జనె విహంగమరీతిఁ బలాయనాప్తుఁడై. 195

"ఏల కళింగుఁడున్ మరలఁ డింకను నేమి యొనర్చు? మిన్నుపై
వ్రాలిన యట్టులై చనెనువ్యర్థ వికత్థనవాగ్మి! వేచుటల్
చా''లని శంతనుండు 'నృపజాత యిటన్ దడవున్కి సత్రబ; యీ
యోలమునున్ బయల్ రిపుల కూఁదఁగఁ బ'ట్లని విన్నవించినన్. 196

పడఁతి, "పచ్చ నా కను నాశఁ బడుగుటొద్దు
నాఁక బైకొన బర్వరీణముగ నూడఁ
గనెదవే" యని కాకలీ స్వన విలీన
శారికాకుల స్వరయయి, సంకటపడ. 197

"ముదియురాజు వెంగలియెసూ ముగ్ధ!" యనుచు
కాంత ననునయోక్తుల నిసుమంత దేర్చి
ముదిత చుబుకంబు పుడుకుచు ముదముగూర్చి
విక్రమార్కుఁ డశోకుండు వేగ నావెఁ
దోసలికి నంపి తాను యుద్ధోర్వి కేగె. 198

వీరుఁ డశోకుఁ డశ్వమును వీపున దట్టుచు దౌఁడుదీయుచున్
జేరెను విగ్రహాభిరతిఁ జెచ్చెర నాయితమై హయేభముల్
భూరి పదాతివర్గము రిపుప్రకరంబులఁ జుట్టుముట్టి చే
రీరసముల్ విజృంభణము లేర్చు రణస్థలికిన్ రయంబునన్. 199

## షష్ఠధార - కళింగయుద్ధము

తుముల కాహళ శంఖ డమరుకధ్వని మేళ
నములె కల్లోల నినాదభరము
చెండిన రుండముల్ ఛిన్నాంగతండముల్
నక్రపాఠీనాది వక్రగతులు
రక్తకుల్యాంతర్వివిక్త భూములె పచ్చ
గడ్డి మొల్వని దీవి గడ్డగములు
నాస్కందితాది విహారాశ్వముల నోటి
నురు గూర్మిమాలలఁ బెరుగు ఫేన

మిసుకతిప్పలు ఖండిత ప్రసృత జాను
పీవరాంత్రాలి; శౌర్యగభీర సాగ
రమయి, గృధ్రాది విహగ విభ్రమణ మమరఁ
బొంగె ననియు భయోత్తుంగ భంగమగుచు. 200

కసి మసంగుచు వీరు లుగ్రాహవమున
విలయ రుద్రులై పరులను వీకఁదాకి
తుండు పడనేయఁ దత్తను హిండనముల
దండధరు ప్రోలుఁగనె మృత్యుతాండవముల. 201

ఎగిరిపోవు ప్రాణముల లెక్కిడఁగఁగాదు
క్రుళ్లు పలలంబు ప్రోవుల కొలఁతలేదు
ధనికులు దరిద్రులెవరో కన్గొనగరాదు
మొన గలంచు టంతయు మృత్యువునకె పాదు. 202

ఆలానంబులు శృంఖలల్ సడలి స్వేచ్ఛాసంగముల్ పేర్చినన్
లీలోద్రిక్తపద ప్రఘట్టనములన్ లీనంబులై పోవఁగాఁ
గ్రాలెన్ హస్త వికర్షణోత్సవ రణ ద్ఘంటా నినాదంబులన్
గాలాంభోధర సన్నిభంబులయి యుగ్రంబుల్ ద్విపోత్తంసముల్. 203

పృథు చక్ర రథతతుల్ భీషణంబుగఁ దాఁటిఁ
దత్పరాగంబు లబ్దములఁ బఱుపఁ
బటు శస్త్ర శితశర పంక్తుల ఘర్షణ
ములు ఘోర నిర్ఘాతములను నెఱప
నొండొరు వచ్చుచో ముండముల్ తెగఁ గెంపు
సరు లసృగ్ఝరివర్షంబు గురియ
ఛిన్నరత్నాంబర జీర్ణముక్తాహార
తతు లటఁ దారావిధంబు నెఱయ

సంగర క్ష్మాతలము రేయి నింగివోలె
భిన్న శుండాల గండము ల్వెక్కు లచట
దొరలుచున్న మేదఃఖండ కరక లొరసి
కొరవులై శరార్చుల గఱకుట్టు లయ్యె. 204

ఇటు లప్రతిహతమై యు
త్కట సంగ్రామంబు జరుగు కాలము నెల గొ
క్కటి పోవ నశోకుం డ
క్కటిక మ్మొనరన్ ఖిలాంతకామాత్యునితో. 205

పోరిది దీర్ఘమై జయము పొందుద మంతియ! యీ ప్రజాక్షయం
బేరికిఁ జెందు? నిర్జిత మహిన్ మన మేల్బడి యుత్తరోత్తరం
బూరక యాపదార్తులకు నూఱటఁ గొల్పెడు శ్లాఘ్యతన్ గడున్
భారము దుర్వహం బగు; శుభం బొనగూర్చు నుపాయవేదివై. 206

చాలును యుద్ధ మీ చటుల సంహారణక్రియ; యన్న చింతకున్
బాలయి పాలలోఁ బడిన బల్లివిధంబున మంత్రి, భూపు ను
ద్వేల విమర్శకున్ దలఁకి, తెల్పె విలక్షణ యుక్తి యొండు, నా
యాలము నిల్పఁగా నృపుఁడు నాదటఁ దత్కృతి సమ్మతించినన్. 207

దశకంఠుఁ బొరిగొన్న తరుణంబున విభీష
ణావనుం డెగిచి యీ యస్త్రమేసె;
జాంబూనదాగంబు చాపంబుగాఁ ద్రిపు
రాసుర హంత యీ యస్త్రమేసె;
బవరాన మఘవు దుర్బలుని జేయ బలీంద్రుఁ
డనవద్య మనుచు నీ యస్త్రమేసె;
చివ్వలో నిరువాగుఁ జెదరఁ జిచ్చగు కర్ణు
నలయింపఁ బార్థుఁ డీ యస్త్రమేసె
ననుచుఁ జూపఱ యగ్గింప ననల గోళ
మార్య చాణక్య కల్పితం బస్త్రరాజ
మును ప్రయోగించెను ఖిలాతుఁ డప్రమదియుఁ
జక్రగతి దేర్చి, రోదసీ చక్ర మదర. 208

బిట్టుగఁ జొచ్చి భూతలము బీటిలగన్ బడబాగ్ని కీలలన్
దొట్టె నుపర్యుపాగత తదుత్థ సముచ్చ్రయ దీప్తి పర్వెఁ దా
మిట్టి యుగాంత కాలశిఖి యెందును గానమటంచు విద్విష
ద్ఘట్టము మట్టమయ్యె నవికారత సంధి కరుల్ దొడంగఁగన్. 209

ఒకఁడె కళింగమల్లుఁ డది యోర్వక సంధకి నిచ్చగింపకే
వికటగుణుండు వెల్వడిన, వెంబడి నేగి యొకండ యోధుఁ "డీ
వొక మగవాఁడవైన నను నోర్తువుగా కసిఁ గో" మ్మటన్న మా
రక విధిలేక యాతఁడు నరాతిని మార్కొనె నంత నిర్వరున్. 210

పెనఁగఁగఁ గయ్యము బిరు స
య్యెను గొంతవడికిఁ గళింగుఁ డెగదిగఁబడి నొ
చ్చిన గా లెదనిడి యతనిని
ఘనమగు పగ్గమున జోదు గట్టిగ కట్టెన్. 211

అరసి, మగధేశుఁడు, రణ
పారీణుండైన జోదు, వారణ పిహితున్
జేరి, నవాగతు గుర్తిడఁ
గోరి, యయస్త్రాణ మదుకు కోఱు వెడలించెన్. 212

అరుణాయత లోచన యగు
కరుణావతి యాననంబు గన్పట్టిన న
చ్చెరు వందె నశోకుఁడు చె
న్నలరె అచ్చవడెన్ గళింగుఁ డవమానమునన్. 213

దయ దైవార నశోకుఁ డ
భయ మిచ్చియుఁ గొంతసీమ బ్రదుకుమనికిగా
దయచేసి, సముత్సుకతన్
బయనించెన్ బ్రియను గూడి పాటలి దిక్కై. 214

విజయరమ, కళింగధరా
గజఘటలును, రాజదుహిత కరుణావతియున్,
నిజ విక్రమమున్ బాడెడు
నజరామర కీర్తికాంత, యనుయాయులుగా. 215

ఇలుసేరిన కొమరుని గని
యలరె నదితివలె సుభద్ర యఖిలార్థాప్తిన్
విలసిల్లు సురేంద్రుఁడు తన
కెలనన్ నిల్చిన క్రియన్ సుఖిత్వ కలితయై. 216

కరుణావతికి జనించిరి
సురుచిర సౌజన్యనిధులు శుద్ధగుణులు ధీ
వరుఁ డను సత్యవ్రతుఁడు, గూఁ
తురు చారుమతియును మతియుతుల్ ప్రేమధనుల్. 217

## సప్తమధార - కాండాంతము

దుర్జన హరణా ! సౌజ
న్యార్జిత సత్కీర్తి కిరణ ! ఆత్మోద్ధరణా !
నిర్జిత దైత్యావరణా !
నిర్జర గంగాప్రవాహ నిర్గమ చరణా ! 218

సాధితము పంచమంబును
వేధస్తుతి కురియు నర్థవృష్టిఁ బ్రచురమై
బోధార్ణేందు విజృంభిత
గాథాంబుధి సంగమాభిగమ కాండ మిదే. 219



శ్రీరస్తు

# శ్రీమదశోకచరిత్రము

## షష్ఠకాండము

## శాంతిసమ్రాట్టు, బౌద్ధాశోకుని జీవితము

### ప్రథమధార - కాండనాంది

సుగుణా ! నిర్గుణ ! విశ్వా
ద్యగణిత విజ్ఞానవీణ ! యజ్ఞవిలీనా !
నిగమాగమసంధానా !
సుగతోదిత మతవిశేష సూక్తినిధానా ! 1

కరుణాపారీణా ! వా
గ్గిరిదళిత సువర్ణమేఘకృత భావార్ద్రా
కరవర్షప్లుత చరణా !
దురితాపహ బుధజన ప్రతోషక సుగుణా ! 2

### ద్వితీయధార - త్రికళింగ విప్లవము

గోవువలెన్ నైజసుగుణ
సేవితుఁడు, గుణాళుఁ డనుచు శిష్టులు వొగడన్,
'ధీవరుఁడు,' సుధీవర సం
భావిత సౌశీల్యగరిమ భాసిలుచుండన్. 3

మనుమండు, మనుమరాలును
దన తొడలను జేరియుండ, దాఁగుడు మూఁతల్
గొనబుగ నేర్పు సుభద్రయుఁ
దన బ్రతుకు గృతార్థమనుచుఁ దలఁచి మెలర్చెన్. 4

తల్లి సుభద్రయుఁ బదపడిఁ
జల్లగఁ గైవల్యమంద, సత్త్వావేశం
బుల్లమునఁ దనర నరపతి
యల్లన సుజ్ఞాన మాత్మ నన్వేషించెన్. 5

అల కళింగమల్లుని దయ ననిపెఁగాని
యాకృతఘ్నుఁడు, విప్లవమడరఁ జేసె
సుమననుఁ డగత్తనిల్లుట, ప్రముఖహేతు
వయ్యసంధిమిత్రయు గారణాంతరముగ. 6

ముదియుచుండియు, మోహంబు ముదిరినట్టి
కపటి; కాళింగుఁ డవమాన విఫులవహ్ని
రవులగటకటన్బడి, జనక్రాంతి బాదు
కొల్పె – కౌశాలికంబులఁ గుజనులైన
యాటవికుల నొక్కటఁ గలయంగఁ గూర్చి. 7

అలఁతి కుట్రలఁ బఱివోవనార్పె సైన్య
మంత బెడమఱక కళింగు నలఁచి చంపె
నైన వేఱిమి తీరని యాటవికు ల
శోకుఁడున్ ద్రికళింగంబుఁ జొరకయుండ; 8

విప్లవంబు ఘోరముగ నావేళఁ బెంచి
రేడునూర్లు గజంబులు, నేఫు సూఫు
దశసహస్రాశ్వదళము; పదాతిబలము
నర్వదియువేలు ప్రథనాగ్రమందు నిలిచె. 9

జరభిగతి దూఁకు సేనఁబెల్చిన ఖిలాతుఁ
డలిగి నిశ్శేషముఁ బొకార్చి యణచివైచె
వహ్నిగోళము ల్జటులాస్త్రవారవితతి
నశ్వగజపదాతిబలంబు లలయఁబఱిచి. 10

అవనియెల్ల సంక్షోభసింధువున మునుఁగ
విప్లవం బురు విక్లబప్రపక్షితతతి
కాకరం బతిక్లేశ రోగప్రఘోర
మై జనావళికయ్యె దుఃఖావహంబు. 11

తనయు లురుల వగ చెడు మాతల విలాప
మన్న లేగిన దిక్కులేకున్న యిండ్ల
'నన్న మోరామ' యను కుటుంబార్తకథలు
పతులఁ గోల్పోయి, వందురు సతుల వనట
రాజు నెదఁ జీల్చెఁ బెక్కు లారాటములును. 12

బహుళమై, త్రికళింగ విప్లవ రణంబు
సాంతమయ్యెనుగాని యశాంతి ప్రబలె;
కొల్కుగల పూసలనుబోలి కోటిలింగ
మోరుగ ల్లమరావతుల్ జేరియున్న
యాటవిక జనపదమాంధ్రమంత గలసె. 13

ఆంధ్రము కళింగమును, రెండునందు బెరసి
యుండి, త్రికళింగమను పేర నొనరుకతన
నుత్తర పినాకినీతీర మొరసికొనుచు
నడరె సామ్రాజ్యము రణంబంతుముట్ట. 14

అలఘు మహానది మొదలుగ
పులికాటు సరస్సునంటి పొల్చు కళింగం
బల యాంధ్రాటవులు, మగధ
బల నిర్జితమయ్యె ననుచుఁ బల్కిరి జనులున్. 15

ఖిల్లాతకుఁడున్ బిల్వఁగఁ
దల్లడపా టెగచి తనకుఁ దక్కిన ధరణిన్
జల్లని శాంతియుఁ బ్రజలకు
నుల్లాసముగొల్పఁ బూనికె నుర్వీధవుఁడున్. 16

కదనావసానమై, రెం
డు దినంబుల్ గడవనప్పుడు, ఘనమ్ముజయం
బదనుగ నరిగె జితజన
పదమునకుఁ వేగిరంపుఁ బయనంబులతో. 17

నొచ్చిన పతిగనె; దురమున
జచ్చిన పీన్గులను మెక్కి సారెకు దిశలఁ
ద్రచ్చెడు నూళలతో గుమిఁ
జొచ్చెడు నక్కలను; - మొఱుఁగు శునకవితతులఁ. 18

'కొఱునాశిగండు' లొక్కట
నొరగిన విడిశవములె త్తియుఁ మూపులపై
మురిగినకంపుల కింపుగఁ
దెఱచిననోళ్ళను నిగిల్చి తిరుగు తెఱఁగులఁ. 19

నల్లని పొంతలు, నెఱచికి
దెల్లని గద్దలును ముసరి, తెఱముక్కులతో
బెల్లయిన యసృగ్ధారల
జల్లుచుఁ గండలను వెలికి జార్చుచుఁ బీకఁ. 20

ఎక్కడ చూపులు పర్వెన
నక్కడనే పీన్గు పెంటలరుగులవలె నై
లెక్కకు మిక్కుటమై, కడు
వెక్కసమై మొగమునందు వ్రేలఁ జుగుప్సఁ. 21

వెనుదిరుగునెడఁ, గొందఱు
మనుజులు, దనుజులనుబోలి, మలినపాడళులఁ
గనియలు, వస్తువు లొల్చుచు
దనుగని యవ్వలకుఁ బాఱఁ దలఁకొన నఘటఁ. 22

కగ్లైను, ''ఉఊ'' యనునొక
మూల్గెక్కుడు; వినినరాజు మూలకుఁ జూడన్
నిల్గుచు, మనొన్నెరసికొనుచు,
నీల్గిన కాయములనఘుమ నిల బొర్లు నరున్. 23

అసువులఁబాయని వీనిన్
వెస నూత్న చికిత్సశాల, వికలము 'గుణమా'
పసగల మిందిడి, పుండ్లకు
పసరులఁ బట్టింపుఁడనుచుఁ బ్రభుఁ డాజ్ఞనిడెన్. 24

భటుని యూరుఁబేరును మదిఁ బదిలపఱచి
యొక్క యోజనమారీతి పెక్కు గతుల
ఘోర వికృతాంగదృశ్య విస్తార దారి
తము; భయానకరుండ కదంబసాంద్ర
మైన దుస్సహారణసీమ – యధిపుఁగలచె. 25

ఉఱలిన యరిహారికరులను;
గొఱవోర్వన్గూయు ఖచరకోటి యఱపులన్;
భక్షికించెడు పతికన్నులు
దిరిగెన్ – చెవి, చిల్లిపడెను – దెల్వియు మాసెన్. 26

ఒక మూఢభూ భుజునుద్ధతియే చాలెఁ
గల్లోలముల ప్రజ దల్లడిల్ల
నొక యరిభంగమే యూఁచెనా చేతమ్ము
దొలికళింగుఁడు నని దొలఁగిపాఱ
నొక తనూజను గాచుటకు యత్నపడిన మా
మ, మహేంద్రుఁడును గూట మరణమందె
నొక యగ్నిగోళమే వికలత బెకలించి
నికట వసుంధర నెఱియఁజేసె;

నిప్పు డరివర్గమెందరో ? ముప్పుగూర్చి
యిలను జెఱచిన దుండగీండ్రెందరైరో ?
యాత్మజుల దండ్రు లెడబాయ నార్తిగాంచి
రెందరో ? వహ్నిఘాతంబు లెన్ని వడెనో ?
యకట ! యని సార్వభౌముండు నడలె; బడలె. 27

తరలి, యటనుండి రారాజు దురగమెక్కి-
వెలవెలం బాఱు వీథుల - నెలమిలేని
యరిపురంబును జొరునెడ, సరసములగు
కలకలంబులె లేవు ! - శోకములగుములు
చూపఱ మొగాల, రక్తఁపుజుక్క లేదు ! 28

బలితపు యుద్ధ మంతుగానబాయని శాఖలు, బాహువు ల్దెగన్
దలఁకుచు, నీడలేని కుజతండము, దైన్యకుటుంబులౌ భటుల్;
పలుకఁగ నోరురాని యటు పల్వురుస ల్బడ, ముక్కుచెక్కులన్
గలఁగెడు విగ్రులున్; బదయుగం బుడివోయిన పంగువుల్; గడున్
గలయఁగ వీటిఁబోయె సిరి, క్రమ్మె బురిన్ వగకారుమబ్బులున్. 29

ఆ సంజయె, తత్పట్టణ
వాసుల సభ యొకటి గూర్చి; "పట్టి నుడువులన్
గాసియు దెగునే ? క్లేశము,
వీసంబంజికయు లేక, వివరింపదగున్." 30

అని రారాజున్ నొడివిన,
విని, యాటవికాలి, పౌరవిబుధులు, తమవం
తను, లోఁతుపాతులను, వి
న్పినఁ; దద్వినివారణైక విధ్యుక్త కృతుల్. 31

మునుకొని, తన యుద్యోగుల దెసఁ
గని, కరుణామృతరసంబు - కనులన్ దొలకన్
"జనులను మీ యుసురులుగా
గని యరయుం"డనుచు గట్టిగా ముదల లిడెన్. 32

"ఇహపరశుభాలినా సంతు నెద్దుకొనఁగ
వాంఛ మదినిండె; ప్రేమడివఱల నెల్ల
ప్రజయు నా బిడ్డలే, కాన, పనవగూడ
దెందు; దరియాకొలంది తద్ధితము నెఱపుఁ
డసువులెత్తుఁదూచి, సపర్యఁబూసఁగ బూన్చి. 33

కంటికిఁ ఱెప్పవోలె, రక్షణము దనర
ప్రజలు నిక్షేదులై మనఁ బాటుపడుఁడు
వారి కేవ్యాకులంబులుఁ జేరకుండ
నరసి పొరయుట యొకటె లక్ష్యంబునాకు!
ననుచు నచ్చఁజెప్పడు వారి కనవరతము. 34

అధికృతుల్! చాటఁబంపుఁ డీ రధిపుఁడాత్మ!
ప్రజశరీరంబు; పతి తండ్రిభాతిఁ బోల్చు!
నిదియ వాగ్దానమును బ్రజ కిడితి నేను,
సన్మతినెఱపుఁడు జను లాచరణమందు! 35

పదపడియు నాదు నుత్తర్వులాదవు నిటులె
వేనియందును వ్యత్యయం బూనదగదు
రాజకీయులుద్యోగులు, బూజనీయు
లగుచు, విశ్వాసముల వెలినాడవలయు! 36

నాదునాజ్ఞలఁ దుదముట్ట నాచరించి
కొసకుఁ బ్రజ నమ్మకముఁ జూఱకొనగవలయు!
దిక్కఱిన జనావలి ముదబ్ధిదేలఁ జేయు
కొఱవడని పట్టుదలల నూల్కొనగవలయు! 37

రాజభృత్యులు, నృపుబుణం బోజదీర్చి
పరముఁ బ్రాపింపగలరు - సచ్చరితులైన!
జనత, సంతసంపడి, హితసారధర్మ
నిష్ఠమనుట, పాలన పరాకాష్ఠగాదె! 38

పుష్య మీతార యెప్పుడెప్పుడు రహించు
మఱియు నుచితదినంబు లేమరక మీరు
దెలియ బోధింపుఁడీ మదుద్దేశమెల్ల
నిదియ "కాళింగశాసనం బెసఁగు" ననుచు. 39

సాధ్య సౌకర్యవితతి, యౌషధచికిత్స,
వసతి విసరంబు, నాహార వసనములును
దీనజనతకు నొసఁగి, భూజాని యపుడు
జనియె నేపథ్యమున కంత జనిరి జనులు. 40

రేతిరి బోనముం గుడిచి, ఱేడొక భిక్షుకవేషమూని, త
న్నాతత దీక్షవెన్దవిలి యాత్మ సుహృత్తగు శంతనుండుఁ దో
డై తెరువొయ్యనం దెలుపనావళిఁజూచెను వీధికాపురం
బూఁతగనుండు బీదల, దృషోపలశయ్యలవేఁగు దీనులన్. 41

ఓహటింపక సందుల నొసరిలుచు
వినెను పరిదేవనంబుల విభుఁడునొకట
"ఉడుకుర క్తపుదుందుడు కడర ననికిఁ
బోయి, వృద్ధులౌ మాకు ని ప్పుడమి నడవి
గాఁగ మార్చితే కట! కొడుకా!" యనంగ 42

చని యటన్ మిన్కుమిన్కను చమురుదివ్వె
వెలుగులో జిఱుచాపపై వెలికిలబడి
యేడ్చు శిశువును జోకొట్టునెడల నడలి,
ముడుము జాచియు దడఁబడు ముదుక నొకతె
నరసి రదియుఁ బర్ణాచ్ఛాదితావసథము! 43

వనర, గత మేమియనఁగ నవ్వయును, వెక్కి
వెక్కి యేడ్చుచు, "మీకేమి వినుచుదాన?
రానివాఁడొక్క సుతుఁ డనిలేనివాఁడొ?
కెలనివృద్ధుని బిన్నకోడలినిగనుఁడు! 44

కన్న నిసుంగును గన భర్తరాజని
కులకాంత యెదవంత కోటివిడుముల
తుదకుఁ జేదోడువాదోడుగా సుతుం
డలరింపఁడని పితకిడలు నింప
నందుఁ జౌపతితోడ ననద కోడలితోడ
బడలెడు నాతల్లి ప్రాణపంట
దివ్యలోనుండి వచ్చిరి యోధవరులెల్ల
మా పుత్రుడింకను మరల కుండ

చిట్టిచేతుల జూపు నీ చిన్నవాని
బుగ్గనిముర వాఁ డే ప్రొద్దు వాలుచునను చు
దెసలఁ బరికింతు – నీవగ పెసరు మసలు
నిపము దించెదరెవరు, నా నెత్తినుండి ? 45

అనవిని, రాజచంద్రుఁడు, మహామతి, వారల కన్నపాసముల్
దనరగఁ గూర్చి "వేగవిగదస్థితి నొంది సుసుంఖు వచ్చెడుం
బోనరుగ"నంచు హృచ్ఛరముపుచ్చిన, దిగ్గునలేచి కోడలుం
గనుల ముదశ్రుమాత్రిక వికాసము బర్వ నమస్కరించె; నా
మె నుదయమే భటుల్ పతిసమేతనుఁ జేయగ నానతిచ్చెయుం. 46

భూపుఁడు ననుతాపముతో
నేపగిదినో ముందునడచి, యీ విధ నెడగుల్
జోపుచు, నచటచటన్ దా
దాఁపు నగను నడలుఁదీడి, దక్షత నొనరన్. 47

ఈ తెఱఁగుననె, ఘస్రంబు లెన్నియేని
యెందరికి, గోడులూడగ, నేడుగడగ
నెనరు నెలయించి తన్నె గణింపరాదు !
తాను బరికించు దృశ్యవితాన, వృత్త
కష్టనిష్ఠురంబులు మది గరుడుగట్టె ! 48

నెత్తిగమి యెఱ్ఱ బంతిపూవెత్తు లెత్తి
కత్తుకన్దాల్చి; మరణాంతకోపవహ్ని
గనలి - కనుగీలలన్రాల్చి, క్రౌర్యపూతి
గంధకంకాళములనేర్చి; కదనకాళి,
లేబరపు నృత్య మధిపుని లెస్స నలఁచె. 49

ఊరక పెన్గుటుంబముల కూఱట మాపును యుద్ధమెంతయున్
ఘోరము! దుష్ఫలంబులనె పూఁచు; నమేయ జగద్భయావహం
కారని చింతచిచ్చునకు నాకరమక్కట! మానుషత్వమే
పోరుల వీసరంబగు! విభు ల్దగదన్వలె సంగరంబులన్. 50

అనిపతి యురియ, దినంబులుఁ
జనె; నొకవాసరముసంజఁ జక్షుఃప్రియమై
చినలేడి యొకటి దూఁకుచు
వనిమొగమై పాఱజూచి వాహ్యాళిజనన్. 51

దానిని వెంబడించిచన, దాఁపునఁ బ్రాపయి చూపుమేరలోఁ
గానఁగనయ్యె నాశ్రమమొకండును; మఱ్ఱితోఁపుః వే
రూనిన శాంతిహర్షముల కూడల కూడలిపట్టు, బట్టుకో
మ్మైన విధంబుగా నొనరె; నచ్చోటుఁజేరును మేదినీశుఁడున్. 52

ఒక మహామహుఁడో మౌని, నికటచరులు
వటువు లెలుగెత్తి ప్రార్థనల్ పాడుచుండ
శంతనుండును, రాజరాజప్రముఖుఁడు -
వరుస నొకయెడనిల్చి, శ్రావ్యముగ వినిరి. 53

దశ దిశాంతర మహర్నిశము జీవులతోడఁ
దనచుట్టుఁ దిరిగి వందనముసేయ
అవని మేరలధాట కబ్ధీశుఁడంఘ్రుల
ఘాత్తరఁగల నీరుఘంచికడుగ

కన్న నిసుంగునుఁ గన భర్తరాఁడని
కులకాంత యెదవంటి కోటవిమంచె
తుదకుఁ జేదోడువాదోడుగా సుతుం
డలరింపఁడని పితకపలు సింపె
నంధుఁ జ్ఞాపతితోడ ననద కోడలితోడ
బడలెడు నాతల వ్రాతపంచె
దివ్యలోనుండి వచ్చిరి యోధవరులెల్ల
మా పుత్రుడింకను మరల కుండె

చిట్టిచేతుల జూపు నీ చిన్నవాని
బుగ్గనిమురఁ వాఁడే ప్రొద్దు వోలుచునుచు
దెసలఁ బరికింతు – నీవగపెసరు మసలు
విషము దించెదరెవరు, నా నెత్తినుండి ? 45

అనవిని, రాజచంద్రుఁడు, మహామతి, వారల కన్నపానముల్
దనరగఁగూర్చి "వేగవిగదస్థితి నొంది సుపుండు వచ్చెడుఁ
బొనరుగ"నంచు హృచ్ఛరముష్పచ్చిన, దిగ్గునలేచి కోడలుఁ
గనుల ముదశ్రుమహా క్తిక వికాసము బర్వ నమస్కరించె; నా
మె నుదయమే భటుల్ పతిసమేతనుఁ జేయఁగ నానతిచ్చెయుఁ. 46

భూపుఁడు ననుతాపముతో
నేపగిదినో ముందునడచి, యీ విధి నెడగుల్
జోపుచు, నచటచటఁ దా
దాఁపు నగను నడలుఁదీడి, దళిత నొనరెఁ. 47

ఈ తెఱఁగుననె, ఘస్రంబు లెన్నియేని
యెందరికి, గోడులూడగ, నేడుగడగ
నెనరు నెలయించి తన్నె గణింపరాదు !
తాను బరికించు దృశ్యవితాన, వృత్త
కష్టనిష్ఠురంబులు మది గరుడుగట్టె ! 48

నెత్తిగమి యెఱ్ఱ బంతిపూవెత్తు లెత్తి
కుత్తుకన్ దాల్చి; మరణాంతకోపవహ్ని
గనలి - కనుగీలలన్ రాల్చి, క్రౌర్యపూతి
గంధకంకాళములనేర్చు; కదనకాళి,
లేబరపు నృత్య మథిపుని లెస్స నలఁచె. 49

ఊరక పెన్గుటుంబముల కూలుట మాపును యుద్ధమెంతయున్
ఘోరము! దుష్ఫలంబులనె పూఁచు; నమేయ జగద్భయావహం
బౌరని చింతచిచ్చునకు నాకరమక్కట! మానుషత్వమే
పోరుల వీసరంబగు! విభు ల్దెగడన్ వలె సంగరంబులన్. 50

అనిపతి యురియ, దినంబులుఁ
జనె; నొకవాసరముసంజఁ జక్షుఃప్రియమై
చినలేడి యొకటి దూఁకుచు
వనిమొగమై పాఱజూచి వాహ్యాళిజనెన్. 51

దానిని వెంబడించిచన, దాఁపునఁ బ్రాపయి చూపుమేరలోఁ
గానఁగనయ్యె నాశ్రమమొకండును; మఱ్ఱితోఁపు: వే
రూనిన శాంతిహర్షముల కూడల కూడలిపట్టు, బట్టుకో
మ్మైనన విధంబుగా నొనరె; నచ్చోఁటుఁజేరును మేదినీశుఁడున్. 52

ఒక మహామహుఁడౌ మౌని, నికటచరులు
వటువు లెలుగెత్తి ప్రార్థనల్ పాడుచుండ
శంతనుండును, రాజరాజప్రముఖుఁడు -
వరుస నొకయెడనిల్చి, శ్రావ్యముగ వినిరి. 53

దశ దిశాంతర మహర్నిశము జీవులతోడఁ
దనచుట్టుఁ దిరిగి వందనము సేయ
అవని మేరలఁదాట కబ్ధీశుఁడంఘ్రుల
ఫ్లాత్తరఁగల నీరువంచికడుగ

అగణిత సురవర్త్మమందు సంధ్యాజ్యోతి
విततులు తారలారతులనెత్త
వినువీధిఁగీలు త్రిప్పనిముండ్లు. రవియుఁ జం
ద్రుఁడు గడియారంబుత్రోవమెలఁగ
నిత్య – నిజకర్మకైంకర్యనిరతభూత
కోటి కొల్వున – విశ్రాంతిఁ గోరకుండ
నఁలపులేకుండ – నిలనిండి – వెలుఁగు దేవ!
దేవ! రావోయి! రా! నీ కిదే నమస్సు! 54

మధుశరద్ధిమమాస మధుచంద్రికాశైత్య
ముల నదనులభూమిఁ బొదివిపొదదివి,
రసరూపగంధాది రంగాల నింద్రియ
హాయములపై స్వారు లరసియరసి,
తెలిమలసిగలపై మలపులఁ గొలఁకుల
మంచువెల్లువ గంగ నించి నించి,
నేలజారిన చంటినిసుఁగులపై మరు
లెదఁజేర్చుచు బయస్సు జిదిమి చిమ్మి,
జీవితార్ధ్యంబుపై గూర్మిగూర్చి; పైరు
చేలకయి నదీనదముల జేరవేసి
ప్రకృతికళదిద్దు నిర్వ్యాజరంగవర్తి!
దేవ! రావోయి! రా! నీకిదే నమస్సు! ౫౫

అండగోపనమున కల గిజిగానికిఁ
గూడు నేయ మనీషగొల్పినావు
విసపు నాగాంగన మొసరేగి పెనఁగొనఁ
మగపాము మసగొల్పమఱపినావు

తమిఁగూనలకు లేళ్లగమి గోళ్లకొనఁగూల్చు
వ్యాఘ్రిక్రొవ్వేదఁ బాఁడి వడిచినావు
నేలవ్రాలుననంటి చూలిచాలున నవ్య
కదళీకుమారికఁ బొదివినావు

అంతునాదియు లేనట్టి వింతసంతఁ
దొలుకు దీవపార ప్రేమ దోహదాబ్ధి
సంబరము రేఁపి, విశ్వకుటుంబి! - దేవ
దేవ! రావోయి! రా! నీకిదే నమస్సు! 56

ఈ విధి మధురాలాపము
లేవో, బౌద్ధత్రిపేటి కోద్గాధతతిన్
భూవిభుఁడుఁ దనియశాబకు
లావేళన్ నుడువ మునియు నర్భకగణమున్. 57

పనులకుఁబంపి - యాగతులఁ బజ్జవసింపఁగ గోరి, వారికిన్
మనములబెట్టుదట్టు ననుమానములెల్లనుఁ బుచ్చి, తిష్యుఁడన్
ఘనముని కిష్టశిష్యుఁడు నకల్మషుఁడౌ నుపగుప్తయోగియున్
వినుచుఁ దథాగతోక్తి సువివేక పథం బదితీర్చెశేషమున్. 58

అఖిలుఁ డప్రమేయుఁడు బుద్ధుఁడధిపుఁడనుచు,
నేనొకఁడ మహాయానవినీత పథము
నెఱపుదును, గాని పెక్కురు నీతిదప్పి
శాక్తముఖ్యదురాచార సక్తులైరి
శుద్ధయానమునొకఁడె; తిష్యుండె పల్కె. 59

బ్రహ్మమెవ్వండు ; జీవుఁడువడయుఁదేని ?
ననుచు బృచ్ఛింపగ విభుండు, "మనకు నేల
వాదు ? వాగతీతములు నిర్వాణలభ్య
ము లవి ! ధర్మాచరణ సిద్ధిమూల"మనియె !
బుద్ధుఁడె పరుండు ! సత్యంబు బుద్ధలీల ! 60

అనెడు ఘోషుని వీడ్కొని యడలు టడఁచి
య య్యశోకుండుఁ బాటలి కరుగుమున్న
పానుకొల్పె కళింగాంధ్రపదములందు
శాంతి నురురాజభక్తి నప్రశాంతరీతి. 61

లపకగొన నొంటి నరుగు ఖల్లాతకార్యుఁ
గ్రూరుఁడొకఁ డేమఱించియు గొంతు నులిమి
చంపెనన విని తానేగి సంస్క్రియలును
ముగియగని శంతనుని సైన్యముఖ్యుఁ జేసి
పాటలిని జేరె సద్యశఃప్రభలఁ బ్రభుఁడు. 62

ఆజిముఖమున నగ్నదృశ్యములు పెక్కు
లతి విషాదఘట్టములును, నయ్యశోకు
డెందమున రూపుగొని; దుఃఖబృందగాన
వికృతనృత్యప్రదర్శ నాన్వితములగుచు;
భవము నస్థిరంబను ననుభవము నాటె! 63

లో లోఁ జింతించుచుఁ, బతి
వాలాయము ముక్తిమార్గపరుఁడై యాచా
ర్యాలోకన నుత్కంఠయుఁ
గూలంకష శాంతిఁగోర్కె కొనగన నలఁగెన్. 64

రాజు నాహ్వానమందిన వ్రతులు, యతులుఁ
కడఁగి వేదాంతసారంబు నుడువ దానఁ
దృప్తిపడఁడయ్యెఁ బతియు; వెన్దిరిగిపోయి
రంతవారును నిరాకశోపహతమనీష. 65

తామసు లుపదేశులు కనుఁ
బ్రామిన్నృపసభాంతరంబు బయటఁబడునెడన్
జీమూతపు మకిల, కృశం
మేదినిఁబాసెఁ బతి తథాగతుఁ దలఁచెన్. 66

కనె నృపుఁడాఘుస్రమునన్
ద్యునదీస్రోతోప్రహదంబునొడ్డున, నుద్యా
ననికాయ్య నికుంజముకడ;
జననిచయములేనియొక్క చక్కటి కెదుటన్. 67

ప్రకృతము శ్రావణమని, మం
డుకముల్, “త్రుఙుఙుట్ క్రుఙుఙుట్రు”! ఙ్ఞను శ్రుతితో
వికృతిని బాడుటయును, నం
తిక కుండలినిగని, నీటి తెరఁజొచ్చుటయున్. 68

ఆ నాగేశుఁడు, స్వస్ఫుట
మానతమును బైకినెత్తి యాడించుచు, స
మ్మానేక్షణుఁడగు నృపునకు
నానందోత్కలికగూర్చు నా తరుణమునన్. 69

వినఁబడియె నొక్క మధుర
స్వనము! తపశ్శృంగదళిత సత్యాబ్దగళ
ద్ఘనశాంత్యమృతనిధానము
ననునయ తత్త్వోక్తి యానమన్యాన మిటుల్. 70

“అరరే! మేల్కొనుమింక! మూఢమతివై యల్లాడ కీసంసృతిన్;
స్థిరమే భార్యయు బిడ్డలున్? వికల మీ శ్రీయెల్ల; సర్వంసహా
వరుఁడైనన్ మృతిపాలె కావలయు; నేవారంబొ! యెందో! కరం
బెరియన్నేటికి? జీవ! తీరనిది భోగేచ్ఛన్ వృథాబద్ధవై. 71

అరరే! న్యాయము గూర్తు నేననుచు నీ వజ్ఞానివై గర్వివై
యొరులన్ ద్రెంచితి పెట్టి యాగడమిసీ! యోలంబునన్ బాహిరం
బరయన్ లేవె యఖర్వవిశ్వమని బ్రహ్మాండంబు నీ వీఁగ నా
కొఱంతన్ వెల్తియునౌనె? జీవగతియే కోదర్కమై భాసిలున్! 72

అరశే! సంపద గొప్పగాఁగనెదవే? యాద్యంతముఁ శోకసం
కర మీ లోకము! విఱ్ఱవీగెదవె రాగాంధుండవై? పోరిలోఁ
బారయఁ జాలితివే యమర్త్యపదముఁ? బోనాడితే భేదముల్?
సరవిఁగూర్చెను తేనె నెల్ల సరఘుల్! సమ్మానమే తేటికిఁ? 73

ఉరవౌ హింస నహింసచే, కృపణతఁ సౌదారతఁ మాన్పి; దు
ర్భరముఁ గూల్పు మసత్యముఁ నిజముచే! ప్రత్నంబె నూత్నంబె, యీ
తెరువంచుఁ దలపోయ కెల్లయెడలఁ, దీప్తంబుగా సద్దయా
భిరతిఁ గొల్పుము! జీవ! శాశ్వతమునే ప్రేమింపు మశ్రాంతముఁ.74

పూనిక నాత్మలో నమృతముఁ జొనుపఁ దగు! సద్వివేక మిం
పూనుము! సత్యవృత్తమున నూర్ధ్వపదోద్గతి నైజ మీవు ను
క్కీని పథానఁ జొప్పడక, కీడును మానుము! భూతరాశి క
న్యూనదయాపరుండవయి యొప్పొనరింపుము! జీవ! యెప్పుడుఁ!75

తల్లి దండ్రుల గురువుల, దైవములుగ,
సేవ సేయుము – నీకాయచిత్తములకు
వారె పరిణామకారులు! పంచభూత
తత్త్వగతులె బ్రతుకున కాధారసమితి! 76

జన్మమునఁ గలదొక్కటే సౌఖ్యవిధము,
భవజ దుఃఖతారకము నిర్వాణపథము!
ప్రణుతధర్మమూలంబు నిర్వాణపథము!
భద్రభాగ్యావసథము నిర్వాణపథము!
పరమ మవ్యయ మజము నిర్వాణపథము!” 77

గీతమీరీతిని ద్రవించి యూఁతగొనియె
వీనులఁ బానకంబుల సోనలగుచు;
వీతశోకుఁడు, సంభ్రమోపేతుఁ డవని
విభుఁడు మోమెత్తి యాగీతి వినగనచట, 78

అధ్వగుని, ద్వాదశాబ్దవయస్కు విమలు
నమలు కాషాయపరిధాను, నంబరమున
శ్రోతలు వినంగఁ బాడుచుఁ జాగియుచరుగు
నరుణతుల్యు, శ్రమణుఁగని యంతలోన. 79

వననివేశము నెల్లాడి, బవిరిగడ్డ
ముఱిదియగు నోడల్ నెరిసిన నెఱిక లమర
నుర్విపతి మాఱువేసపు నుడుపులఁగొని
వెడలి, యొకముదుకండన, వెన్నడించె. 80

బాలయతియట నొక్కింతకాలమట్టె
నింగిఁజూచుచుఁ బాడుచు నిల్చెఁ; బులక
లొడలిపై నిక్క, నిశ్చేష్ట నొలసి మూయుఁ
గనుల "నోమ్మణిపద్మేతి"మనువు నుడువు. 81

సకల వనాంత వాసంతోదిత లతాంత
కలిత కోకిల కుహూ కలకలమ్ము
ఘనఘోషపోషణక్రమలయ లాస్యోల్ల
సిత కేకిబృంద విజృంభణంబు,
భావజభోగవ్యవస్థిత నిర్వృతిఁ
గన్నుమోడ్చునవోఢ విన్నను వును,
హరితశాద్వల కులుద్ధాంకురభూచర
ద్విఘభరాజస్వైరవిహృతిగరిమ,

సరవిఁ బాడకట్టఁ దన్మయస్థాయిభావ
భూతి యతిఁ గని, చోద్యంబువొంగ, రాజు
నొకటొకటిగ బహిర్దృశ్య శకలము లవి;
హృత్తటిఁ దరంగితంబైన నెలమిఁ బొనర, 82

భవఘనక్లేశ దురితసంపర్క మెడల
భూరి సంతోష భావానుభూతిఁ దేలు
నీ కుమారు సుయోగ ప్రణీతపదము
నిరుపమాన మహానని ధరావరుఁడు నెఱిఁగె. 83

వింతలేవేని పుట్టెడు నింతకనుచు
రాజు, వెంబడిఁజనె; యతిరాజుఁ గదిసె
చండగిరికుండు గావలియుండు చెఱలఁ
దరినిగల, మేడితోపుమైదానముకడ; 84

నేటుకొని పెనఁగొను జువ్వినీడ నొరయు
నరుగుపయి నల్కి మ్రుగ్గుల నరిదిరూపు
వ్రాసి ధూపంబు నిడుచుండువాని జూచె -
విప్రభిక్షుకునొకని శక్తిప్రసక్తు. 85

"కోరమీసాలు, మిడిగ్రుడ్లు చేరెఁడేసి
పలుచెవులు, సిగ నెలవంక, బారెడంత
నోరుగల్గిన మీ యమ్మ పే రదేమి?
కుంకుమార్చన ఫలసమిత్కుశలహోమ
మీవు పూరింతు వద్దాన నేమిఫలము? 86

తెలుపు మర్థింతును మహాత్మ! - తెల్ల" మనుచుఁ
బువ్వరయ విచ్చినటు చిరునవ్వుఁ బెదవిఁ
జిందు ద్రొక్క, గుమార యతీంద్రుఁడంత
నటనె నిల్చిన, శాక్తేయ యతియుఁ జెప్పె. 87

"నేను నీవలె బుద్ధునహీనభక్తిఁ
బ్రణుతిజేసిన భిక్షుకాగ్రణి నెసుమ్ము!
నిగమధర్మముపీడిలి; సుగతశిష్యు
లాశ్రితునకు నీ 'తారా' విహారమిడిరి, 88

వారి యానతి దలఁదాల్చి, తారఁగొల్తు
నడుగో! యటనుండె! కారాగృహాధినేత,
చండగిరికుండె, కాంక్షించె సంతుకొఱకు!
నిచట నా తారరూపె యజించుచుంటి!" 89

అనుచు విన్పింప; నౌర యహర్నిశంబు,
నుద్ధుర దురాశలను, పాశబద్ధులగుచు,
జననమరణ ప్రవాహాన మునుకలిడుచు,
బుద్బుదప్రాయులైన కాపురుషుల కివి
చెల్లు! సన్యాసి కేల యీచెనఁటిపూజ? 90

శాక్యమునిపాదముల వ్రాలి; సంతతంబు
శుభదనిర్వాణలోకంబుఁజొచ్చి, హెచ్చి
వెలయుదువుగాక! రమ్మి నావెంట - ధిషణ
మానివసథంబునకు - దీన మమతమాని. 91

అని యాడిన, నౌఁగా కని
ముని సద్యోవిధిని దొఱఁగి, మునుకొని భిక్షున్
వెనుగొని నడచెను; గిరికుం
డును వారిర్వురఁ గళన్ దటుక్కునఁ గొట్టెన్. 92

కోపమురాదు! చండగిరికున్ బెదవిన్ గొసవిప్పియాడఁడే
తాపములేదు! నిశ్చలనిదానపరుండయి గొంతునెత్తి "యా
టోపులు రాజ్యభృత్యులు! కటూక్తియుసాజమ! తప్పులేవి? యే
పాపము నంటఁగట్టెదొ! నెపం బొడిఁబెట్టియె శిక్షవేయుమీ!" 93

అని దరహాసచంద్రికలు నాస్యముఁ గ్రమ్మఁగఁబల్కు బాలునిన్
గని, గిరికుండు మండిపడి, "కౌసృతికుండవు! తెల్విలేదె? బు
ద్ధినిఁ గనఁగూర్తు ముండితులు ధిత్సువులై చరియింతురంచుఁ జే
యిని పయికెత్త నూఁకుతటి నేద్చుచుఁ దత్సతి యడ్డగించుచున్. 94

చాలుఁజాలును! ఖల్లాతుఁడేలె నిన్ను,
నతఁడు దివిఁజేరెను! సుసీమునన్వయంబు
నెల్లఱును బాకాలఁ దత్పుత్రు నితనిఁగూల్ప
నుత్సహించెదు; కటా! పాప మురక నేల? 95

చాలుఁజాలును? జ్ఞప్తికినేలరాదు?
విమతుఁడని తప్తతైల భాండమున నైవ
మాణవకుఁడు సుఖాసనమహితుఁడయ్యె
ననివచింపవె మున్నితఁ డతఁడెసుమ్ము! 96

చాలుఁ జాలును! పోకుమీ పాలుజోలి
కడరి బోధిసత్త్వుండయి యాఢ్యుఁడితఁడు
వాసిఁ గూర్చుండు మగధసింహాసనమున –
తారసిల్లెను కాలంబుదారశాంతి
నిలయమిదె శ్రావణమ్ము! పూర్ణిమయువచ్చె." 97

అనిన నార్చుచు గిరికుండు "నట్టి వార్తఁ
బరులు పుట్టించి కాళింగమురుతరంబు
యుద్ధమొదవించి రది యంత్యమొందె! బోధి
సత్త్వుఁడునశోకుఁడే! యవశ్యముగ సుదతి!" 98

అంచు గిరికుండు నిర్వారి కాయసమయ
శృంఖలలఁబెట్టి చెఱసాలఁ జేర్చువేళ
"సూనృతవతిసతి!" యని యశోకనృపతి
సౌంతరూపు బయల్పడఁజెంత కరిగి. 99

ఉచిత సత్కారవేతనమొనరఁ జండ
గిరికు, గౌరవసరణి నగ్గించి, మాన్పి,
విప్రయతిని గారాగారవిభునిఁ జేసి,
మహితసిద్ధుని పాదపద్మముల కెఱఁగి
"నూతనాశ్రితుఁగనుము – ధన్యోఽస్మి" యనియె. 100

శమదమవిభాసి యతిఁ గాని, సార్వభౌముఁ
డరిగె నపుడె, ప్రాసాదసభాంతరమున
కందు స్వాగతంబొసరఁ బాద్యంబు నొసఁగి;
"శ్రమణ! కూర్చుండు మిష్టపీఠమున" ననియె. 101

ఆ చిఱుతయతి, చామీకరాచితంబు
రాజసింహాసనమున విరాజమానుఁ
డైనఁగని, బోధిసత్త్వుఁ డీయనఘుఁ డనుచు
పూర్ణమోదాశ్రు నయనుఁడై పొదలె రాజు. 102

బుద్ధునంతటివాఁడు, ప్రపూర్ణుఁ డొకఁడు,
వఱలుననన్న వార్తయును నిబద్ధియయ్యె;
తన్ను సమ్రాట్టుఁ జేసిన తరుణమదియు
బుద్ధవిభుకృతంబని నృపుబుద్ధిఁ దోఁచె. 103

లోని తమమంతవిచ్చె; విలోమమెందు
నెనయలేదను సంతృప్తి హెచ్చె; మెచ్చె
నొచ్చెమేలేని యతివరు నుత్తమేచ్ఛ!
నుచ్చుఁ దొలగింపు మనుచుఁ జేయొగ్గి వేడె. 104

పట్టమాదిగ నవమంబు వర్షమపుడుఁ
బరగెను కళింగవిజయోత్సవంబు! – నూత
నోద్యమాంకురార్పణ సుముహూర్తమైన
యాదినమె, పూర్ణసుదినంబు! నమృతఘటిక!! 105

భరత సర్వాంసహాప్రజాప్రముఖు లరయ
శమితషడ్వర్గుఁడగు, బోధిసత్త్వమూర్తి
హర్షబాష్పంబు లురులు, దయార్ద్రనృపతి
కొలువుదీర్పంగ, పృథుశాంతి కుదురుకొనియె. 106

సంగరవార్తలుఁ ముగిసె; శాంతియె యెందును జర్చఁబేర్చె; కా
ళింగము ప్రోదినొందె; నవలీలఁ బ్రజాహితకార్యసంగరా
జ్యాంగము లొంగె ధర్మవిజయంబులకుఁ; గడుణాప్రసంగ ము
త్తుంగ శుభక్రియాంగములఁ దోరముఁగాఁగ నెసంగె నెల్లెడన్. 107

మందాకినీధార లిందుశేఖరజటా
వాటిక నిబిడమై మీటినట్లు,
గోదావరీమాత గొదకొని వట్టొడ్డి
కొండగొందుల గుమ్మిగునిసినట్లు,
పున్నమజాబిల్లి గన్న పాథోరాశి
తరఁగ లొడ్డునుదాఁటి పఱచినట్లు,
ప్రత్యూషపవనసంపదగొంచు, భానువె
ల్తు రుపత్యకముమేర దూఁటినట్లు,
శ్రమణయోగి ప్రసన్నవక్త్రాంబరంబు
వెలికి నెగఁబర్వె – సుశ్రావ్య వివిధ సత్య
వాగమృతమయములు – కలస్వనము లులిసె
రాజునుచ్చిసోఁకి, జనాంతరంగములను. 108

## తృతీయ ధార - ధర్మబోధ; తత్పరిణామములు, బౌద్ధరాజకుమారునితోఁ జారుమతీ స్వయంవరము

బోధమొదలిట్లు పల్కెఁ బ్రబుద్ధుఁడతఁడు :–
గురుని శుశ్రూష లబ్ధ మకుంఠితంబు
బుద్ధతత్త్వవివృతి, చెప్ప మునుపె కొలుతు
తనువునకు మూలమంబ పదద్వయంబు ! 109

వఱలె నా తల్లి యువరాణి; వాసుదేవు
నవ్యయానందమయభక్తి నాత్మఁజొక్కి–
సమ్మతంబని చిననాడు జనని గఱపె;
వాసుదేవుండు బుద్ధులఁ బ్రథమగణ్యుఁ
డాద్యుఁడని; యాపెసూక్తంబు లనువదింతు. 110

"విహిత శివచింతనోపేత, పిన్నయత్త!
బౌద్ధసువిచార; పెద్దత్త పట్టమహిషి!
చంద్రగుప్తుండు సజ్జనజైనయోగి!
బిందుసారుండు పితరులే పెద్దలనియె!
కానఁ దత్తత్వరీతులఁ గాన" ననియె.   111

"విశ్వ మీ దృశ్యమంతయు విభునిలీల
సుఖముదుఃఖంబు రెంటి నీశుండె చేసె
జీవుఁ డెవ్వేళ ద్వంద్వంబు చెనకకుండ
సహజముగ నాత్మకాత్మ్యఁ డక్షరరుచీద్ధుఁ
డగు పరముని శరణ్యంబు నందవలయు!   112

జీవకృత మేమిలే దిల! స్థిరములేదు!
పుణ్యశక్తులు దేవవిభూతులెల్ల!
నఘవిపరిణామము ల్గల్గు సహితకృతుల;
విభువశంబులె రెండు! నీ వెరవు నరసి
తృష్ణనీఁగి జీవుఁడు దేవుఁ దెలియు" ననియె.   113

అమ్మ "న్యగ్రోధుఁ"డనిపిల్చె; నామె జనఁగ
పితృసఖుఁడు గంధకరి గోప్యవిధిని బెంచి
నన్ను నుపగుప్తుఁడనుపేర నరసె; నామ
ముండె నేదో! నే దిష్యు శిష్యుండ నిజము!   114

ధీమణుల్ దిష్యుల్ గొలుతుల్
ఋషినందుల్ సత్యధీవిరించిల్ గతదు
ర్విషయుల్ షడ్దర్శన స
ద్విషమోదంచితుని వేదవేదిల్ గురువుల్.   115

తిష్యముని కథావత్తుఁ దెలియఁజెప్పె
నతని జనిచేత రవిచే నహర్ముఖమన
నార్యుఁ డభిధర్మపేటికాచార్యుఁడైన
మౌద్గలాయను వంశంబు మాన్యమయ్యె.   116

వివిధ మతసారములఁదోర్త, వినుచువాఁడ !
"ఆర్షము"న "జీవకముల' నిష్కర్ష లేదు !
ఆద్యుఁడౌ దైవమొకఁడుండె ననుచు నూహ
నాడుదురెకాని, చూచినవాఁడెవండు ? 117

అఖిలమునకాద్యమే హేతువనును "గోస
లోక్తి!" యత్నశూన్యుఁడెనరుం డుర్వివిూఁద ?
"సంజయభిలాధిపుత్రుండు" సంశయాత్త
మఖిల మాత్మవిచారణ మంచు నుడివె. 118

వ్యర్థ విచికిత్సవలననే ఫలము గలుగ
దేదొ యొక నిశ్చితాచారమే యొనర్చు
బాపఁ డనుదినమును సంధ్యవార్చుగాన
మహితుఁడుగాఁ డొకొ విచారరహితుకంటె ? 119

"వాయ్వనలధరావారి నిర్వాహమొదలు –
వాని నెడఁబాసెనేని నిర్వాణమగును
జ్ఞాన మలవడదు విచారణంబువలన"
ననె "నజితకేశకంబళుఁ"డల విమర్శ
మానవతఁబేర్చు – పశువుల కూన మదియె. 120

సర్వ సమదృష్టినాదృతి చాలుననుచు
నొడివెను, పురాణకశ్యపుం డెడరులందు
వివిధములు వ్యక్తి ధర్మముల్ వీలుపడని
లోకమున్న ? భిన్నరుచు లీలోకు లరయ ! 121

కర్మ మొనరని క్షణమొండు గలదె ? జీవి
కాత్మహత్యయు, నైష్కర్మ్య; మతితపమ్ము;
సాధనల, మహావీరుండుఁజాటె ! మనుజ
సత్కృతి కసువు తీపయ్యె ! సాధ్యమె తపంబు ! 122

పరులు కర్మందులును పరాశరజు లితర
ముండితులు – జటిలురును – త్రిదండికులును
మఖముఖార్చకుల్ – కులపతుల్ – మానిజనులు,
నెందఱో వైదికుల్ – భేదమెన్నఁదరమె ? 123

అయ్యాజీవక నిర్గ్రంథులంద ఱారసి,
"దేవధార్మికులము" మే ముదీర్ణులమని
బాహ్యామూరాధనము సేఁత పరమధర్మ
మంద్రు ! నొక కర్తయేయున్న నతనిప్రీతి
కే యస్పృష్టవస్తువుఁ బూజ కెయ్యువారొ ! 124

దేవదత్త గౌతమికు లుత్తీర్ణత గన
కఠినతప మవశ్యంబు నిక్కం బటంద్రు
విషయలౌల్యంబు దెగకున్న విపినరోద
నంబుగాదె ! తపఃక్లేశ మింబుగాదు ! 125

జీవునిక్ శాశ్వతుం డని చెప్పరాదు
మృతియనంతర మా జీవు మెలపు దెలియఁ
గలమె ? ప్రత్యక్షమనుమానములను రెంట ?
వైదికమతాకరం బిది వాసిఁగనదు; 126

ఆమ్రబీజంబు మొదటిదే యవలిచూత
కుజఫలంబున నమరుట నిజముకాదు !
ఆది, విత్తది కుళ్లుట లరయుచుంటి
మటులొకే జీవుఁడున్నె జన్మాంతరమున ? 127

కర్మమో; ధర్మమో సాంఘికంబుకాయ
మదియ జన్మాంతరంబొందు ! – నంబుపూర
మెడతెగదు నవ్యనీరంబు లెందు వోలయు
నైనను ప్రవాహ మొకటియై యడరుగాదె ? 128

అనుభవింతుము భోగభాగ్యముల నిపుడె
భవము మఱియుండ దనెడు; చార్వాకమతము,
సత్యమన లేము ! సుఖకష్టసంగమముల
సంఘమును, వ్యక్తిబాధ్యతల్ సరదుగాన. 129

ఆతథాగతునొద్ద 'వాచాగత' యతి
ప్రశ్న సేయఁగ, మౌనముఁ బ్రభుఁడు దాల్చె !
అవల నానందుఁ డాతని నడుగ నెట్లు
చెప్పఁగలము నిర్వాణ నిశ్చితపథంబు,
నాత్మ ? సహజధర్మ ప్రకాశాప్తి దెలియు. 130

శాశ్వతుం డాత్మయను విప్రచర్చ లేల ?
తనువె నిజమను నజ్ఞాన మొనర నేల ?
ఉత్తమాష్టాంగమార్గంబు నొరసి యజము
నవ్యయంబు నిర్వాణంబు నరయు" మనియె. 131

ఇలను, మొలకకు బీజమే హేతువగును
గాలిప్రభృతులు సముదాయకారణములు
కార్యహేతుపరంపరగల్గు, ప్రత్య
యముల, తీక్ష్ణంబుగ వివేకమమరవలయు. 131

వెలయు సంయోజనము, రూపవేదనములు,
సంస్కృతియు, జ్ఞానముననఁగ, "స్కంధపంచ
కంబు," వానివలన నహంకార మొదవు;
ఆ "యహంకృతి," పరిణామ, వ్యాపకగుణ
కలితమై యాత్ర సాగించు విలయమొందు. 133

కాష్ఠయుగ్మమును మథింపఁగల్గు వహ్ని
కాష్ఠములు కాలిపోయినఁ గనము వహ్ని
స్కంధపంచక మెడలిన సమయమంచె
మరణము ఘటిల్లు, నహమ్మును మాయమగును. 134

ఐన వ్రాఁతముగియని లేఖాంక మెట్లు
లేఖకుఁడు వోయినను, శేష రేఖఁబోల్చు
నట్లె యయ్యహంస త్త, సంఘాంతరమునఁ
బర్వు; కర్మనిల్చెడు, నహం బంత్యమైనయ. 135

మఱల జన్మమెత్త దహంబు మాన్యకర్మ
శాశ్వతము మానుషత్వంబు సంగమించు;
నహితకర్మానఁ జూవె జన్మాంతరమగు
నందరే జీవులును జననాంతరముల ! 136

సత్యవచన చతుష్టయసరణి వినుఁడు !
లోకమంతట నిబిడముల్, శోకము, మృతి,
రోగవార్థక్యములును, విరుద్ధఫలము
లననుకూల కుటుంబ బాధానుగతులు ! 137

లేమి నాశయొనరు – నెనలేని శ్రమముఁ
గల్గు – తద్వస్తులాభముగ్రముగవాంఛఁ
బెంచు ! – విరతివాంఛకు లేదు కొంచమైన !
నకు నిరాశయె పరమ సుఖాకరంబు ! 138

నిస్పృహుండైన నవ్వల నిజము నరసి
మనుజుఁ డష్టాంగపథమున మనుట లెస్స !
విమలములు 'శీల' ప్రజ్ఞాపరిమితు లవని
నిత్యనిర్వాణ సుఖలబ్ధి నెగడఁ జేయు. 139

హేయములు మనోవిభ్రాంతులెల్లఁ దొలఁగ
సర్వ శారీరవికృతులు సమసిపోవ
నఖిలమూల మనాద్యంతమై యెసంగు
భద్ర మానంద మదియ నిర్వాణభూతి. 140

వఱలు విశ్వప్రకృతియు నిర్వాణలీల !
పరమమేలుకయు, శాంతి, నిర్వాణకాంతి !
ప్రథిత ధర్మానుగతియె నిర్వాణదీక్ష !
పావనపు మానుషతయె నిర్వాణఫలము ! 141

దండకము :— (1) అమరించుకొను మీవు సమ్యగ్గన దృష్టి-నీ కద్ది చేదివ్వె; సంశుద్ధవిశ్వాసమే దాని మూలంబుగా నెన్ని (2) సమ్యక్కృతాపేక్ష నీకుఁ బురోగామిగాఁ ద్రోవయుఁ జూప నాశింపకే సౌఖ్యముఁ నీవు (3) సమ్యక్సువా క్కయ్యదే, నీ శ్రమం బంతయుఁ బాపు; విశ్రాంతియిల్లౌ, నబద్ధంబులుఁ, గొండెముల్, తుచ్ఛమైనట్టి ప్రాసంగికంబెల్ల, పారుష్యముల్, వీడు మెవ్వేళ (4) సమ్య క్సుకర్మల్ భవన్మార్గము ల్జక్కఁగాఁ బేర్చు; నిస్స్వార్థ మాడంబరా పేతముల్ దానముల్ సేయ సౌశీల్యముఁ బూఁచు; దుష్కార్యముల్ వాయుఁటే లెస్స-హోమంబులుఁ మంత్రపాఠంబు; క్లేశోత్కరంబుల్ తపశ్చర్యలుఁ జేయ నీకౌ ఫలంబెద్ది? యుత్కృష్టమౌ మధ్యమార్గంబు! (5) సమ్యగాజీవముఁ శుద్ధ సజ్జీవనోపాయమే; సజ్జకట్టౌ నుపాహారమై నీకు సద్వ్రశమఁ బాఁచి, పెల్లుద్ధరించుఁ జుమీ !; - యంత్రతంత్రంబులుఁ నింద్యముల్ నైచ్యదైన్యంబులఁ గూర్చుఁ బో ! యాచనం బిష్టులఁ గూడ వంచించు ! వ్యాపారముల్ సేయకే సాత్త్వికంబో, సువృత్తిఁ మనఁ మేలు ! (6) సమ్యక్ప్రియత్నంబు, నీకుఁ మన స్సాధనంబైన వ్యాయామమై యొప్పెడుఁ వస్తు విజ్ఞాన సంప్రాప్త వైరాగ్యభావంబునుఁ బూని, నీ విద్విషత్కోటితో మైత్రిభావంబు వాటించి, దీనార్తులందెల్ల కారుణ్యముఁ జూపి, సభ్యాలి క్షేమోద్గతిఁ బొందగా మోదభావంబు వర్తించి, స్వీయంబులౌ యావనార్థంబులఁ విద్యలఁ నీ వుపేక్షానుభావంబుఁ బ్రాపించి, నిష్కర్మమౌ జీవనంబొల్ల కెక్కైన, సర్వేంద్రియోన్మాదముఁ గూల్చి వేగఁ దితీక్షాను రక్తుండవై యుండి, (7) సమ్యక్స్మృతిన్ దాల్పుమా ! శుద్ధ సంచింతనంబెందునఁ బ్రాణతుల్యంబు ! స్మృత్యర్థముఁ బొద్ధ వేదుల్ సుసంకల్పమూలంబుగాఁ జెప్పి రెక్కాలముఁ జిత్తమాధారమై

ధర్మకర్మమ్ములింపారు; నశ్రాంతబోధస్థితిఁ దీప్తముద్యత్సమాధిఁ గనఁ మూలమే ధర్మమా! సృష్టియుఁ గార్యహేతుప్రసంగ ప్రభూతంబు లెల్లఁ బదార్థంబు లాత్మఁ విచారింప బ్రజ్ఞాన మేవస్తువుఁ గాదు, నీ చిత్తకాయంబులఁ వేదనంబుఁ భవద్ధర్మముఁ శోధనఁ జేయగాఁ గల్గు సుస్వానుభూతిఁ గదా కోరి సాధించు జీవుండు (8) సమ్యక్సమాధిఁ; తదాప్తిఁ మనుఁ బూర్ణశాంతుండె; పూర్వోక్త సప్తాంగనిష్ఠఁ గ్రమప్రాప్తినొందుఁ దుదఁ ధ్యానపీయూష ముద్విగ్నతఁ బోక, సందేహముల్ లేక, సేవించి, నిర్వాణముఁ నమ్మి, సత్త్వాయవిశ్రాంతి వాంఛింప కాశీలవ్రతాంతంబె దుఃఖాపనోదంబుగా నమ్మ కాయాధ్యసమ్మానముక్తిస్వరూపాదులఁ రాగముఁ వీడి, కామంబు ద్వేషంబుఁ బోనాడి, సద్దానశీలంబులఁ క్షాంతియుఁ వీర్యముఁ బ్రజ్ఞయుఁ ధ్యానమార్జించినఁ బుద్ధుఁడౌ.

జీవ! సర్వాఘ దుఃఖౌఘముల్ దుల్చుచుఁ జిత్త వాక్కాయ దోషంబులఁ జించి, సారజ్ఞ బుద్ధోక్తులఁ శుద్ధవాక్యమ్ములఁ జింతనఁ జేసి; లోకంబు గన్పట్టుగాఁబట్టి మిథ్యాస్వరూపంబుగా దెన్నఁడుఁ మార్పులఁ జెందు గాఁబట్టి నిత్యంబునుఁ గాదు; సచ్ఛీలవర్గంబు బ్రజ్ఞానుభావంబు బ్రాప్తింప నాపైన సత్యస్థితిఁ శాంత సమ్యక్సమాధిఁ బ్రవేశించి భాసింపుమీ! బీదలుఁ ద్రవ్యవంతుల్ ఘనుల్ బూరుషుల్ స్త్రీలు నాభేదమేలేని నిర్వాణసామ్రాజ్య సమ్రాట్టువై నీవు దీపింపుమీ భద్రమా. 142

ఆత్మపదమె నిర్వాణం
బాత్మక్లేశాపహారి యష్టాంగపథం
బాత్మహితౌషధ మిది; – లే
దాత్మానుభవంబుకంటె నధికం బొండుఁ! 143

అల్ల! తల్లియు; పరముని స్వాత్మయందుఁ
గాంచి, లాభనష్టభ్రాంతిఁ గడకుఁ ద్రోసి
సాత్త్వికుఁడు ఋతంభరుఁడొందు శాశ్వతగతి!
జగతిని, స్వధర్మరతియొండె, చాలునన్న"
వాసుదేవాధ్వమును, బౌద్ధపదము నొకటె! 144

తల్లి నుడివెను భిన్నాభిధానములను
బుద్ధుఁడు వచించు దివ్య ప్రబోధములనె;
సంతతసమాధిఁ బొడకట్టు సత్యమనుచు
శిష్యుఁడుర్ నాకుఁ దద్ధ్యానదృష్టి నొసఁగె. 145

నిత్యమును, మిథ్యయునుగాని నేల నలరు
జనులు మీరు, ధర్మక్రియాస్థపతు లగుచు;
వెలయుఁ డధికదుఃఖద, కర్మవృక్ష వితతి
వేగ నఱుకుఁడు, తృష్ణ యర్ వేరు ద్రెంచి. 146

అనుపమానంబు నిర్వాణమాత్మగనుఁడు
నీక్షణంబున నుండియే యీరు నృపుఁడు,
దక్షులయి శ్రద్ధతో, ధర్మతత్పరులయి !
మలినదృష్టాంతముల నది తెలియఁబడదు !'' 147

అనెడు శ్రమణుని వాగ్ధాటి సాంతమయ్యెఁ
బెన్నయురవడి, కృష్ణాగభీరతయునుఁ
దుంగభద్రాతరంగ మాధుర్యగతియు
నడర నవిరతధారయై యమరి యపుడు. 148

వినినంత, మునివచోరుచి
ననుమానతమంబు విడువ నవనిపుఁడును దాఁ
గనినవి, సాత్త్వికభావన
లును మలదూషితములంచు లోనఁ దలంచెర్. 149

తలఁచినదే తడవుగ, ను
జ్జ్వలమతి, పతిదీక్షఁబూని, శ్రద్ధర్ వర్షం
బులు రెండున్నర గడపెను,
సలలిత మష్టాంగసరణి, సత్యరతుండై. 150

పాదగుగురుసేవ నని
ర్వేదస్థితి యొలసె; నంత విహితకృతులకున్
యాదఃపతియై, గుణమ
ర్యాదలు రూపెత్తె ననఁగ రాజు రహించెన్. 151

ఉపగుప్తాచార్యుని కృప
నుపలబ్ధంబయ్యె శాంతియున్ సిద్ధులు, రా
జపగతశోకుఁడు, బ్రమనుఁడు
సుపవిత్రప్రేమధనుఁడు, శుద్ధుండయ్యెన్. 152

ఆచార్యాస్థులకున్ సమాధు లుపగుప్తాజ్ఞానుసారంబుగన్
వైచిత్రిన్ ఘటియించి కట్టినవి స్తూపంబుల్; తదగ్రంబులన్
బ్రాచీనాచలశైలభాగముల; నిత్రైపొల్చు కంబంబులం
దాచంద్రార్కయశుం డశోక నృపమార్తాండుండు చెక్కించెఁ దా
బ్రాచుర్యంబుల శాసనాకృతుల శుంభద్ధర్మముల్ బోధనల్. 153

జీవపావనత్వము మొదల్ సెప్పి - యవల
బౌద్ధధర్మములును గ్రమంబై రహింప
శాసనంబుల శిలలపైఁ జక్కనిల్పి
పదియునాల్గు నశోకుండు భద్రపఱచె. 134

ఇట్టుల నబ్దద్వయమున
నిట్టలమగు శ్రద్ధతో, సునీతివిధులకున్
బట్టముఁగట్టె నశోకుఁడు
పట్టానంతరము గడచెఁ బదునాల్గేడుల్. 155

షోడశవర్షన్ గూఁతును,
వాఁడిమగఁడు నల్లుఁడైన, వందిసుజనవ
ర్గేడితుఁ డగ్నిబ్రహ్మకు
వేడుకను, బ్రియంవదాఖ్య వెలది నొసంగెన్. 156

దేవికిఁ బుట్టి, తనయుండఁ దేజరిల్లు
శీలమణి, 'ప్రియంవద,' ధర్మరుచిత్తయగుచు
సాధుహితసేవ బొగడొందె 'సంఘమిత్ర'
యనఁగ; నాకన్య గృహిణీపదాప్తిఁ దనిసె. 157

తన మేనల్లున కీ విధిఁ
దనయను బరిణీతఁ జేసి, తత్సమయమునన్
గొనబుగ నరణంబిచ్చెను
వినుతుఁడు, వితరణి యశోకవిభుఁ డుత్కర్షన్. 158

కొడుకు మహేంద్రుని; దనకడ
నడఁకువతో బుద్ధదేవు నంఘ్రివనజముల్
విడువక గొల్చెడు మృదుగుణుఁ,
బుడమిపతి, యవంతిరాజ్యమునకున్ బంపెన్. 159

అతఁడు, తథాగతభిక్షుక
తతితోడన్ శ్రమణియైన తల్లికి, సేవల్
వితతముగ నొనర్చుచు, దన
మతిలో వైరాగ్యవృత్తి మరులు కొనంగన్. 160

సంతత సుధ్యానసుధా
క్రాంతస్వాంతుండు, సిద్ధిఁ గాలిన, రాజ్యం
బంత నరాజకమని తన
యంతటి ఘను నల్లు బంపె నగ్నిబ్రహ్మన్. 161

నియమించెను, దిష్యాఖ్యన్
ప్రియమగు 'సంఘము,' సమాజవృద్ధియుఁ దనరన్
నయగుణసాంద్రు మహేంద్రుని
భయవిరహితు దేశికేంద్ర భవ్యపదవికిన్. 162

చారుమతి రాణియు సదా
చార తథాగత సుధర్మసాతత్యలుగాఁ
సారె, గుణాళుని దిద్దుచు
ధీరత, సంసారభోగ తృప్తిఁ బొనరుచుఁ. 163

"ప్రియదర్శి" యశోకుఁడనఁ
దయివాఱుచు, శాంతికామి, ధరణీశుఁడు, స
త్క్రియలఁ నిరుపమ గృహామే
ధియు భిక్షుకవసనధారి; ధీనిధి యగుచుఁ. 164

క్రమముగ నుపగుప్తుని కృప
నమలిన మష్టాంగపథమునందు సుసిద్ధిఁ
గొమరుదనంబున గనియెను
గొమరాలుఁగూడియుండఁ గోవిదుఁ డతఁడై. 165

హారిపీఠిని న్యగ్రోధుం
డరుదై వసియించుచుండ, హరి! హరి! రారా
జురుభక్తిఁ గురుబోధము
హారువుగ వినుచుండు నేల నాసీనుండై. 166

గురు రామదాసుపదముల
నురవౌ భక్తిప్రపత్తినొనరు శివాజీ
శ్వరుఁ డొక్కఁ డశోకునకుఁ.
సరియౌనే? చరిత నెవరు సము లాతనికిఁ? 167

ఆదటఁ బలి, గురుకృప, యసి
వాదరగా, జన నశోకపాశములు దెగఁ
బ్రోదియొనర్చెను ధర్మని
నాదాశ్వత్థంబు, లోకనైరుజ్యతకై. 168

కుండలీంద్రుండు మతి నుపగుప్తయోగి
రాజు వీడ్కొని చని మధురానగరము
చెంత నురుమందకొండలోఁ జేరి యందు
స్థావిరాఖ్యంబు యోగప్రపన్నసరణి
నమల షడ్భక్తులను జరితార్థుఁ జేసెన్. 169

అది యటులుండగ యౌవన
పదమూఁదియు దేహవల్లి పరువెక్కెఁ గళా
స్పదమయి చారుమతికి మరుఁ
డెదఁజొచ్చెన్ దండ్రి వరుని నీడును వెదకెన్. 170

త్రైలోక్య వినుత సుందర చంద్రశాలలో
సచివసామంతులు సరసఁగొల్వ
ఆంటియోకస్యాదు లవనిపు లెదురుగా
భద్రాసనంబులఁ బరిఢవిల్ల
అర్ధాంగి 'కరుణ' రత్నాసనాసీనగా,
కుసుమగంధములు దిక్పూరితముగ
సీమంతినీజనశ్రేణి ప్రక్కల నిల్వ
విద్వత్కవీంద్రులు వెనుకనలర
రాజపుత్రులు యువకులు దేజరిలఁగ
వఱలె జారుమతీస్వయంవరము; రుచిర
మమల వైశాఖమాసమం దవనివిభుఁడు
ముందుముందుగ నుచితము ల్మొదలలిడఁగ. 171

హిమకిరణకుంద మాణిక్య విమలరుచులు
కుసుమపల్లవ బిసలతా కోమలతలు
వరఘుసృణగంధ మృగమదవాసనలును
మధురపరవాదినీ శుకప్రభృతిరవము
లెల్ల నొక్కెడ ప్రోవయి వెల్లిగొనఁగ. 172

తెల్వి - హావభావములు మూర్తీభవించి
వెలయు చారుమతియును; గన్యలనుగూడి
సభకు సౌదామినియనంగఁ జని, సరసత
నినుచుచుఁ బౌద్ధు దేవపాలుని వరించె. 173

శీలి యశోకుఁడు, విక్రమ
శాలిఁ, దరుణివలపుఁగొన్న సౌజన్యనిధిన్
మేలని, సుక్షత్రియునకు
బాలను జారుమతి దేవపాలుని కొసఁగెన్. 174

చారుమతి దేవపాలు రు
దారప్రేమానుబంధ తన్మయులగుచున్
చారుతర బౌద్ధధర్మా
చారంబుల నొనరి రాత్మసాధనపరులై. 175

తరుణుఁడని రాజు సుగుణున్
దురితాపహ సత్యశీల తుష్టిధురీణున్
వరసుతు ధీవరునిన్, దు
ర్ధర తక్షశిలాధిపత్యధారిగఁ జేసెన్. 176

తోసలిఁ గరుణావతికి బందుగులె రాజు
లల యవంతి నగ్ని బ్రహ్మయవనిపుండు
పాటలిని డానెవెలయ, సువర్ణగిరికి
నాప్తమిత్రుండు శంతనుం డధిపుఁడయ్యె. 177

చతుర్థధార - అశోకుని పరిపాలనము, ధర్మయాత్రలు

అమరె నిభవృష ప్రభృతి జీవావనంబు;
లలరె సర్వాంగసౌష్ఠవ న్యాయనిష్ఠ;
దనరె ధర్మప్రచార శాసన నిచయము;
ప్రబలె సర్వప్రజాసౌఖ్య పాటవంబు;
"నర్ఘాత్మా"శోక నృపపాలనాంతరమున. 178

ఇంద్రదది గుదధినంటియు, సాంద్రవిపిన
మయమునై నట్టి త్రికళింగమహియుఁ జేర
విస్తృతమయి, సామ్రాజ్యంబు వృద్ధిగనియె !
నధిపు నఖిలాజ్ఞలప్రతిహతములయ్యె ! 179

చండశాసనుండగు నశోకుండు, దండ
నాత్మకముల జట్టంబుల నాఁపఁడయ్యె -
కాని, తద్విధానము ధర్మమానునట్లు
వివిధ శిక్షాస్మృతివిధుల, వేఱుసేసె ! 180

అంత్యశిక్షకు మున్ మూఁడహంబు లొసఁగె
నవధి నాత్మవిచారంబు దవులుపొంచె;
కిల్బిషపుకార్యములఁ బరికించి వృద్ధ
దీనులన్ గృపగను మంచితెరువు లరసె. 181

చెఱవసించెడువారు దుశ్చింతనములఁ
బొరయకుండ సౌకర్యముల్ బూన్చె; ధర్మ
బోధకుల నియమించె; కారాధికృతుల
కలవిగాఁ జేసె శిక్షల సులువుఁ జేయ. 182

అగ్నిమాపక కుంభాలు లధ్వవితతిఁ
జెలఁగ నింటింట నీరు, నిచ్చెనలనుంచి
రఖిలవృత్తి వాణిజ్యంబు లండగొనగ
వేఱు వేఱ్వడ్డి-చొప్పున విత్తములను
రాష్ట్రకోశంబు లప్పుల ప్రజకు నిచ్చె. 183

నవనీత స్ఫటికకపో
త విమలక ప్రముఖరుచులఁ గాల్చిన రజతం
బవదాతద్యుతి దేల్పగ
గవియుఁ గ్రియాగారముల పొగల్ గాల్చునెడన్. 184

తక్షణము, ర్ణాణ్డియు క్తులు, తజ్ఞు లరసి
చక్కనిడ ని త్తడియును, గాంస్యముఁ, దగరము,
సత్తు, తామ్రంబు, సీసంబు, స్వర్ణ మినుము,
ఖనులు ద్రవ్వించి కూర్చి యక్రమతఁ జాపి. 185

సిద్ధలోహంబు లధికృతుల్ చేర్చి, వాని
మార్చి, కవచాయుధాది సామగ్రి జేయఁ
బంచి, కర్మాలయములు వెల్వఱుచు వెలల;
వస్తువులనంప నవి జనవ్యాప్తిఁ గాంచు. 186

రాజ్యమందు శుద్ధపయస్సు నాజ్యమమరె
ప్రస్థఘృత మొక ద్రోణంబు పాలఁబుట్టె;
భిన్నమగునెడ నాహారభేద మరసి
ప్రజములను లెస్స బోషింపవలయు; మిశ్ర
మమ్మ, క్షీరమ్మ లెటనేని యమ్మరాదు! 187

దేశభేదములగు మూఁడుతెగల నడరె
నిభములును; కరూశ ముఖసీమలెనయు నడవు
లేగి వెంపుడేన్గులతో ననేకపములఁ
బల్లములద్రోసి మావటీల్బట్టి రెలమి. 188

అచరమాస్తిఁ గుటుంబము లమ్మఁగూడ
దపహృత మలబ్ధమైనచో నధిపుఁడొసఁగు,
మరల; లిఖితముల్ బహిరంగసరణి నెఱయు;
చెనటుల పరోక్షకృత్యముల్ శిక్షితములు. 189

సాక్ష్యరహితంబులగు పనుల్ జరుపలేరు,
వితథముఁ దిరోహితోపాధికృతములైన
తప్పుడుపనులెల్ల బహిష్కృతంబులయ్యె;
నాస్తి జెనఁకడు బతి నిర్జితార్జితముల!
బ్రాహ్మణుఁడు దోషియైన సర్వస్వమీఁగు. 190

అష్టపాదప్రతోళ్యాదు లధ్వవితతి
తక్క, ద్వాత్రింశ దంఘ్రివిస్తార "రథ్య"
లల, జతుష్షష్టివా "వ్యూహ"ములును, విపిన
పథము లన్నియు నృపునాజ్ఞఁ బరగుచుండె. 191

అధ్వరక్షకవ్రజము, గ్రామాధికృతులు
రాజకార్య ప్రసక్తు లుర్వరను బ్రోచి
రెల్లఋను బ్రజాహితరీతి నుల్లసిలిరి
ధర్మబోధక లిపు లవితథములయ్యె. 192

"ప్రతినిధులు" రాజ్యభాగముల్ ప్రగతినేల
"రజ్జుకులు" మండలేశులై ప్రబల, వారి
క్రింద "ప్రాదేశికులు" నుండి రందునందు,
దండనాధికారు లఖర్వధర్మనిపుణు
లమరి రెందు "మహామాత్రు" లనఁగఁబొల్చి ! 193

రాజకింకరకృతుల వార్తాలిగలిపి
సర్వవార్తావహు ల్వేగు లుర్విఁగల్గు
ద్రోహముల బయల్పడఁజేయఁ దొడరుచుండ,
వంచకులు లంచాలకుఁ బాలుపడరు. 194

పట్టణముల, ధర్మప్రవర్తకులును
విడిగ స్త్రీ యధికారిణుల్ పెంపుగనిరి
తథ్యసూచకులగు "సుప్రదష్ట" లమర
వార్తపత్రిక లెందెందు వఱలుచుండె. 195

వయసుమీరినవారును బహుకుటుంబ
ధారులును, హఠాత్సంభవ ఘోరకర్మ
చయమనుద్దేశముగఁ జేయు జనుల, క్షమకుఁ
బాత్రులేమొ, విచారింపఁ బాడియయ్యె. 196

అల శతద్రువు నొరసి కుశాద్రివరకు
తక్షశిలరాజ్యభాగమై తావు్రాలికె;
దక్షిణమునఁ బశ్చిమవార్థిదాఁక నెసఁగి
ప్రబలె నుజ్జైనరాజ్య మవంతితోడ. 197

పూర్వతీరంబు - త్రికళింగభూమి యెల్లఁ
దోసలీభాగమై యొప్పె - దూరసీమ
స్వర్ణగిరి జనపదమయి జాలువాఱె;
ద్వ్యనదితటమెల్ల బాటలితో రహించెఁ
గ్రాలె సామ్రాజ్యమును బంచఖండములుగ 198

అన్యదేశీయు లధిపుని యాజ్ఞ లేక
రాష్ట్రమునఁ జొరకుండగ రాత్రులెల్ల
పగఱగతి, ఖరు లూఁచమట్టుగ మాదింప
మెలఁకువలఁ గాచి రల పొలిమేరలందు
విద్విషాటనవారకవిధులు వెలసె. 199

చెనటులెల్లఁ బశ్చాత్తాపమెనయుటయును
చేఁతలెల్లను సుష్ఠుగాఁ జేయుటయును
ధర్మచయ సమాచరణంబు దవులుటయును
గ్రాలె బరిణామము లశోకుఁ డేలునపుడు. 200

ఇతర ధనమాఁచి కొనరెవ్వ రెందునట్టి
పాలనము; పదునేడు సంవత్సరములు
వఱలె; రాజ్యవ్యవస్థయుఁ బరిణతముగ
సూరినుతమైన కీర్తి రాజుఁ గడించె. 201

ఇద్ధులగు ఛాత్రవరుల మహేంద్రుడనొద్ద
నునిచి గంగోత్రిగిరిఁ దపంబెనసియున్న
యనఘు నుపగుప్తు గురువర్యునాఢ్యు ధిషణు
ధర్మబోధనావిష్కార తత్పరమతి. 202

సార్థ సప్త దశాబ్ద సత్సమయమగుడు
బృధివిపతి బిల్వ దుష్టసభికుల, దోలి
బుధుల పరిషత్తుగూర్చి 'వైబుధ్య'నియమ
సారమును జాటె ధిషణుఁ డుదారుఁ డగుచు. 203

సత్యవిధులుఁ "గథావత్తు" సరణినొసర,
నెలలు తొమ్మిది; పరిషత్తు నెఱవు గనియె,
వంచకాచార్యు లుడిగిరి – మంచివారు
ధార్మికులు సాంఘికులు గాఁగఁ దనరిరంత. 204

తత్త్వసువిచారణము జనుల్ దార్కొనంగ
క్షుణ్ణముగ బౌద్ధనిగమంబు సుగమమయ్యె
పరమవిజ్ఞానపథము శుభ్రత్వ మొరసె
శాక్తముఖ దురాచారముల్ సమసిపోయె, 205

అవల గురువుఁ ద్రివిష్టప మలమి వెలుఁగ
నలుదిశల దేశపతులెల్ల నలఘుబలురు
ధిషణుఁ డొక్క సుధాంధస వృషభుఁడనుచు
తారకుండుగఁ ద్రాతఁ గాదలఁచి రెలమి ! 206

కటకపంచకమున కల్లలు పంచబం
గాళమై చనఁ గలికలుషమారె
సూయాణముల వార్త శూన్యమైపోవఁగా
మనుగడ కుదిరికన్ మనసువాఱె
నధికారులే ధర్మమాచరింపఁగ బ్రజల్
దప్పుడు తెరువేగుతమియు జాఱె,
నాటవికజనాలి యడలెల్లఁ బాయఁగా
సౌజన్యవృత్తులు జాలువాఱె

భిక్షుకద్విజతతియెడఁ బ్రీతిమీఱె
పెద్దలకు భక్తి సత్కారవితతి చేరె
నవనిఁ బాలింప శుభవర్తి! యమలకీర్తి!
సూనృతాచారసుకృతి! యశోకనృపతి! 207

వారని తమకంబులతో
నారయుదురు జనులు గద్దె నతఁ డెక్కిన యా
వారం బెదియని, యధికృతు
లూరూరన్ బెల్లుసేతు రుత్సవగణముల్. 203

తాలిమిఁ గోల్పోయియుఁ జెఱ
సాలలఁబడి మఁదియు దీనజను లెల్లఱు ను
ద్వేల స్వేచ్ఛానందము
పాలై గృహములకుఁ జనిరి పట్టదినములన్. 209

పట్టాభిషేకదినముల
నొట్టుగఁ గొడుకులును గూఁతులొాగి కోడండ్రున్
జుట్టునుఁ దోడుగ బీదల
దట్టములకు దానమిచ్చు ద్రవ్యవసనముల్. 110

ఈ రీతిని మఱి నాలుగు
వారము లుత్సవములయ్యెఁ బదపడి తీర్థా
గారంబుల నవనీశ్వరుఁ
డారామముగాఁగఁ జూడ నాత్మదలంచెన్. 211

ఉపగుప్తాజ్ఞన్ బుద్ధుని
సుపవిత్రపదాబ్జయుగళి సోఁకినతావుల్
విపులోపదేశ బోధా
తపకాంత్యు జ్వలిత పూతతలములఁ జూడన్; 212

ఁడేడు సన్నద్ధుఁ డప్పుడయ్యె; జోడుగూడి
వెలఁది కరుణావతియుఁ బతివెంటఁబోవఁ
గోరె; దేవపాలుండును జారుమతియు
ననుసరించిరి విభుని యాత్రార్థులగుచు. 213

ఎండవడబాపు సంభార మితరవసతు
లంటి యాపె; సైన్యములు; వెన్నంటిరాఁగ
రమ్యవిభవంబు లెసఁగె; - విరాళ మొసఁగె
లక్షలాదిగ స్వర్ణదళంబు లధిపుఁ
డనదలకు, బేదలకు, దీను లర్థ్యగులకు, 214

కడువేఁడి విదిర్చెను రవి
వడగాలియు వీచె, నుడుకువడె నీరంబుల్
వడపుల డాగిరి మునుల్
తడి చలిపందిరుల నిడిరి, తద్గ్రీష్మమునన్. 215

అశోకుని ధర్మయాత్రావివరణము

చైత్రమాసాంత సువసంత సమయమందు,
గంగదాఁటి చంపారణ్యగామి యగుచుఁ
బోయి, కేసరీయస్తూప పుణ్యభూమి
నరసి, హరియుత స్తంభద్వయంబు గొల్చి
నాథునిర్యాణతలిఁ గుశనగరి నిల్చి. 216

అవల గండకిని దరించి, యతఁడు పూజ్య
ధామ మాలుంబినీ శుభారామభూమి
బుద్ధజన్మస్థలంబు, సంఫుల్ల ముల్ల
మొనరఁ గని శిలాస్తంభంబు నొండు నిల్పె. 217

స్తంభమగ్రమున నొక యశ్వమునుఁ గట్టి
"పరమపావనతీర్థంబు పట్టమాది
నిరువదొకటవయేట దా నిటకు వచ్చి
యిచ్చెఁ బ్రియదర్శి యాచార్య లేలుకొనఁగ
క్షేత్రమంతయు" నని లిపిఁ జెక్కఁజేసె. 218

"సరవి, సప్తాహములఁ దల్లి, చావువాఁతఁ
బడుట, పుట్టినతోడనే యడుగు వేసు
నడచి సూచించె నణిదిమాదినాథుఁ డగుట"
ననుచు నుపగుప్తుఁ డగ్గించె ఘనుని బుద్ధు. 219

తిమురురాజుల, క్షమఁదేల్చి యజ్ఞానమ్ము
గూల్చెనీతఁ డతండు గాల్చినాఁడు
కల్యాణకటకంబు, కపిలవస్తుపురాన
పుట్టె నీతఁ డతండు మెట్టినాఁడు
ప్రకృతికతీతుఁడౌ పరుని, నిర్వాణాబ్ధి
నెట్టె నీతఁడతండు దొట్టినాఁడు
సత్యజీవతరంగ, సచ్ఛాంతిగంగ, వ
హించె నీతఁడతండు నించినాఁడు

సిద్ధిమార్గప్రతిష్ఠితుల్, శుద్ధులగుచుఁ
దరళ దుఃఖవిముక్తికి ద్వారములుగ
బుద్ధదేవుండు - కపిలుండు - పూర్ణులుద్ధు
లగుచు నిర్వాణసాంఖ్యంబు లరసినారు ! 220

సూరి యుపగుప్తుఁ డిట్లనుచోఁ, బవిత్ర
రోహిణీనదియొడ్డున రూపుగొన్న
కపిలవస్తుపురి - నృపసంక్రందనుండు
కనుగొనియె సమ్మదాశ్రువుల్ గనుల రాల. 221

సరగ నటనుండి, బోధివృక్షంబుఁజేరి
కనకవర్షంబుఁ గురిసి సజ్జనులఁ బొరసి
సారనాథంబు, ఋషిపురిదారిఁజొచ్చి
వరుసఁ జేతవనంబు, శ్రావస్తిఁ జూచి. 222

మౌద్గలాయన కాశ్యపమహాని వసతు
లెల్ల నీక్షించి, వకుళ యోగీశువలన
లోకమున కేమి యుపకృతి ప్రాఁకదనుడు
రాగినాణెంబునొకటి విరాళ మొసఁగి. 223

అవల నానందు బుద్ధుని యాప్త శిష్యు
స్థూప మెదురుగా బ్రణమిల్లి యోపిసంత
నతని గొనియాడి స్వర్ణంబు లారుకోట్లు
దాన మొసరించె భూపుఁ డుదారుఁడగుచు. 224

వెనుదిరిగి పతియు, సుపగు
ప్తునితోడఁ గూడిపోయి, బుద్ధసుధియు స
జ్జనసుతగుణనిధి, ధిషణుని
గని భవితవ్యంబునడుగఁగా మునిరాజుఁ. 225

రాజును, శిష్యుని, గని ని
ర్వ్యాజంబగు భక్తిమెఱయ వర్ధిలితిరి, మి
మ్మోజనుఁగన్న ధరిత్రియు
సాజంబుగ ధన్యమయ్యె, సంతసమయ్యెఁ. 226

ఘన సుజ్ఞానాతపమున
మునుపటి వ్యామోహభరముఁ బొటిబొటియగున
ట్లినుసన్నిధిఁ జుచ్చుఱుకై
మొనరఁ బ్రహస్వంబు లగుచు మొనయుఁ నీడల్. 227

మలయజ జలసేకమువలె
జలువఁ జేకూర్చు వటవిశాలమహీ రు
డ్వోలసచ్ఛాయల నిలువుం
ఢలధియించె నిదాఘమిదియు నగ్నినిభంబై. 228

పాదద్వంద్వము నేలనూని, పవనుఁ బాలించి, సర్వేంద్రియో
న్మాదంబీఁగియు, కేవలత్వమను సుధాస్నానంబులో నోంక్రియా
నాదాంగార మహార్చిఁ బేర్చుము, మనోనాళీకకుండామృతా
స్వాదానందవిభూతి పక్వమగు, విశ్రాంత్యాకృతిస్ఫీతమై. 229

అని గురు వాదేశించిన
విని రాజుఁ బక్వబుద్ధి, వేగమ యటులై
మునుకొని ధ్యానంబున, ని
ల్చిన నా నౌనని, కరంబుఁ జేర్చుచుఁ దలపై. 230

బుద్ధుఁడు నణిమాదికగణ
సిద్ధుం డదె నీకు నేఁడు సేవ్యుం డయ్యెన్
శుద్ధుని గనుమన, రా జని
రుద్ధాక్షులఁ గాంచెఁ బ్రభుని రూపుఁ బ్రాపున్. 231

ఏకు, నఖండుని నిక్షే
దాకృతిఁ గైవల్యపూతు నధిపుఁడుఁ గనియెన్
బాకారి ప్రముఖ సురా
నీకస్తుతు, శుద్ధు, బుద్ధు, నిర్వృతి మహితున్. 232

ధన్యతగని పూర్ణుండై
మాన్యుఁ డశోకుండు నాత్మ మానము నూనన్
బుణ్యులు, దేశికశిష్యులు
నన్యోన్యము ముదమునొంది రంత; ధిషణుఁడున్. 233

"ఇఁక నీ వనుపుము దిక్కుల
కకలంక సుధర్మవృత్తి నడరెడు వారిన్
ప్రకటింపుము శుద్ధాధ్వము
సకల మహీనాథు లెఱిఁగి సన్నుతి సేయన్." 234

## బౌద్ధమత వ్యాప్తికిఁ గృషి

అని యోనతి నిడ విని, శి
ష్యుని శిష్యుఁ డశోకనృపతి, శుద్ధపదార్థుం
డనఘుఁడు పనివినె; భూవిభు
ననుపమ నిర్వాణవేది ననిపె ధిషణుఁడున్. 235

ఉపగుప్తుండును, దిష్యుం
డుపమింపగరాని శాంతి నొనరుచు నిర్వా
ణ పరత నుండి రశోకుఁడు
విపుల ప్రతిభా ప్రశాంతి వెలయ, విగదుఁడై. 236

సత్యధర్మోపదేశక సారవిదులఁ
బంచె గాశ్మీర, గాంధార, పశ్చిమ ప్ర
దేశముల కెల్ల, యవన విదేశములకు
నాగరకవాసములు సర్వనగరములకు. 237

రమ్య వనవాసి ధర నపరాంతకమున
మహిషమండలమున ధర్మవహులు నిలువ
గ్రామ, గృహ, దేశ, క్షేత్ర తీర్థముల నఖిల
రాజ్యసీమలన్ బౌద్ధంబు పూజ్యతగనె. 238

అరిగి లంకనుజేరి దివ్యాష్టసిద్ధి
మహితుఁడు మహేంద్రయోగి ధర్మంబు, బౌద్ధ
మచట స్ఫిరము స్థిరమ్ముగా వ్యాప్తిగొల్ప,
శాంతి దనరెను, సుగతవిశ్రాంతి బూనరె. 239

గాంధార కాశ్మీర సింధు దేశములకు,
"యవన ధర్మాఖ్య మధ్యాంతిక"లను,
మహిషమండలము హిమాద్రిసీమలకయి
"మహదేవ సాహస మాలిక"లను,

వాయవ్య మహారాష్ట్రవనవాసి భూములఁ
బ్రాఁక "రక్షిత మహారక్షితు"లను
స్వర్ణ రాజ్యమునకుఁ బార్శ్వ దేశముల కు
త్తములఁ "గశ్యపుని - మధ్యముని" మునుల
సింహాళమునకు "మహేంద్ర సింహాబలుర"
నిట్లు తిష్యాజ్ఞఁగొని యన్పె నిద్ధమతుల
"పేటికు" లను - "సూత్రాంతిక" - విమల "ధర్మ
కథకు"లను మఱి "పంచనికాయకు"లను. 240

ఈ విధి భూమండలమున
నావంతయు నుడుగకుండ నఖిలజనులకున్
భూవల్లభుండు, బౌద్ధ సు
ధావిష్కృతి నెఱపి, తాఁ గృతార్థతఁ బొరసెన్. 241

పంచమధార - సింహాళమునకు గూఁతురి నశోకుఁ డంపుట

అమరపురికి నగ్నిబ్రహ్మ యరుగఁ, గన్న
కొడుకు సుమను, దోడ్కొని తనకడకు వచ్చి
"సంఘమిత్ర" సంసార మసారమనుచు
గఱువ భిక్షుకియయ్యె; నా గడువునందె
రాజు డగ్గఱె, సింహాళ రాయబారి. 242

"బోధితరుశాఖ నిల్పు నుద్బోధితుఁడయి
వృక్షరక్షకు నుత్తమ భిక్షుకిఁ దన
చెలియ ననుప, మహేంద్రుండు చెప్పిపంపె"
నన్నఁ దండ్రితోఁ బోయెద ననెఁ గుమారి! 243

రమ్యగుణ గణనీయ, గారాబు తనయ
నెడలి యుండలేదు నృపుండు - విడువకున్న
సత్యధర్మచ్యుతియు నను శంకవొడమె
కడుపు కక్కుర్తి నియమ మక్కసములొలయ. 244

తుదకు నిత్యధర్మంబె విధ్యుక్తమనుచు
నిర్ణయము సేసి, ధర్మనిర్ణిద్రుఁ డతఁడు
శంతనుఁడు దోడ్పడంగఁ బ్రశాంతమతిని
నవ్యగతిఁ దానె కూఁతు వెన్నంటిపోవ
సర్వసన్నాహ వహుఁడయ్యె సత్వరముగ. 245

అశ్వగజపదాతులునుఁ దూర్యములు బలిసి
వెంటనడువ నశోకుండు విబుధయుతుఁడు
పెరిమతోడ బయల్దేరు పరుసుసూడ;
పుణ్యనిధి బోధి తరుశాఖ మోయు రథము
మెఱవణినిజూడ; సురు లనిమేషులైరి. 246

ఱేఁడు, తామ్రలిప్తినిఁ బెనురేవుదరిని
జూచె లంకేశుఁడనిచిన, సుఖకరైక
నౌక; – నూడిగీంద్రను దాక్షిణాత్యులఁగనె,
వ్రీలి తాటంకములఁ జెవుల్ వీఁగ, లేచి
నాగరములఁజెక్కిన సతుల్ నానఁదొలఁగ. 247

పుట్టగోచులఁబెట్టి నిట్టనిల్చుచుఁ దెప్ప
మ్రానులపై మీల రాల్చువారి,
దట్టమౌ పడవల మట్టంబుగా నిల్పి
జలహృత వస్తువుల్ వెలఁచువారి
పులులేని వలవైచి చలియించు కెరటాలఁ
దెలిశంఖముల్ పైకిఁ దేల్చువారి
నాణెము త్రైపుఁజిప్ప లగపడ నగవుఁ బెం
పున నీటఁదిగి తెవఁ బొల్చువారి
వివర మడుగుచు, సూడిదలచటి ధనికు
లలఘు మాణిక్య ముక్తాఫలాదు లొసఁగి
వసతులఁ జూపునెడ; నేత్రపర్వముగను
నరసె; నిర్వాణనిభము రత్నాకరంబు. 248

జాబిల్లితునక, నుచ్చైశ్శ్రవాశ్వంబును
హరుఁడు దాల్చెను శచీవరుఁడు విల్చె
హాలాహలంబును నమృతంబు బేర్చిన
గ్రుక్కిరి దితిసుతుల్, సురలు మెక్కి
రంబుజాలయయుఁ జిరత్నకల్పములేవ
కరివేల్పు గొనియె స్వర్గంబు మనియె
పండె గంగాసంగ డిండిరముల ముత్తి
ముత్తెములవి మునుల్ నెత్తిదాల్చె
రనుచు, విద్వాంసు లగ్గింప నవనిపుండు
నీల సికతాప్రకీర్ణ శైవాలజాల
కలితతటముల, నలల, వెక్కసపుఘోష
మొలయ దాఁకుచు లోని కల్లోలములను
బయటఁ బడవేయు పాథోధిహొయలుగాంచె. 249

నవ్య తరళోర్మ్ములన్ సమ్మృణాళ కమల
రాజి నర్చన, పూర్వాపరాహ్ణవేళఁ,
బోటు పొడిచివిచ్చుటె క్రమపున్ బ్రదక్షి
ణమ్ముగ సముద్రుఁడున్ బుద్ధు నమ్మికొలిచె. 250

ఇసుకదరిఁ దన్ని మినుముట్టి, యెసఁగు తరఁగ
లాలసెఁ గ్రేళ్లువాఱెడు శాబకులను బోలి;
సంసరణఘోష లిల్లె భీషణము లనుచు
వార్ధి భోరురావము లతిధ్వనుల నెఱపె. 251

లంగరులెత్తి నావికదళంబులు నోడల నొయ్యనన్ మహో
త్తుంగ తరంగమార్గమునఁ దోరపుఁ దెడ్డులనేసి, త్రోసి, పో
వం గనుచూపుమేఱఁ దనుపార నశోకుఁడు ‘సంఘమిత్ర’’ రూ
పుం గను తల్లిదండ్రులకు బుత్రికలన్ ఝుమకారమెట్టిదో! 252

పతియును బాటలి దిక్కై,
సుతయును దగవీడిపోవ, "జాగ్రత్తైడు నే
యతివ" యనె, నక్కజమున, నా
తత నిజనగర ప్రయాణ తత్పరుఁడగుచున్. 253

వెనుదిరిగి యశోకుఁడు, పా
వన గంగాతరణవేళ, పార్శ్వస్థితమున్
వనిఁ, దన విధి, నరసెఁ బినా
కినివలె, సత్ప్రకృతి నీతికిన్, బెన్నిధియై. 254

జల జల నాకుల రాల్చుచుఁ
జలిచెంగలి సొంటుఁబాసి జనియె, నిశాంతం
బులు నీ షత్పాండుద్యుతి
కలితంబులఁ బర్ణతతులఁ గమనీయములై. 255

గ్రామముల, శిశిరగతి, కనుఁ
బ్రాముచు, వేవెనుకఁజిక్కె; రంజకమయి, పే
రామని తలచూపఁదొడఁగె
కోమల కిసలయమిగిర్చి కొల్కొనుచుండన్. 256

ధరణిపుఁడు ద్రోవఁ దోఁటకేతములఁ ద్రొక్కి
నీటి నెత్తు వైతనికుల పాటనీటు;
చెఱుకుగానుగు టెద్దులఁ గఱకుఁగోల
నడపు పడుచుల సరసగానముల వినుచు. 257

రోఁజుచుఁ బాటలిఁ జేరెను
సాజపుదృశ్యములఁ గొంత శాంతినెలయుచున్
భూజము లెల్లెడఁబూఁచె, మ
హీజనులహ్లాదిమనిరి, హృషితహృదయులై. 258

''బోధిశాఖయు దనయంతఁ బూఁచివేచి
పడవ నెడఁబాసి, యుదధిలోఁ బడియుఁ దేలి
లంకదరిఁజేర భూమి నిశ్శంకరీతిఁ
బెల్లదరి పగుల్వారఁగా నెల్లజనులు. 259

మదులఁ గుదిరికగని బౌద్ధమతముఁజేరి
రనియు; బంచసహస్రంబు లంగనలును,
సంఘమిత్రకు ననుగలై జాలువారి
రనియు;'' – సింహళేంద్రుఁడు పంచినట్టి, చారు
లధిపునకుఁ దెల్ప నడరె హర్షాతిశయము. 260

శిశిరం బంత్యంబైనన్
వశమయ్యెన్ జగము మాధవ క్షితిపతికిన్
కృశయయ్యె నిశాసతియును
భృశము నహస్సుల నెసంగె వితతాతపముల్ 261

కంది, పెసర, కొఱ్ఱ, సెనగకట్టెల్ల
కల్లములఁ బేర్చి, రేనాట నెల్లయెడల
రైతులున్ గుండుఁద్రిప్పఁగ, రాష్ట్రధనము
లను, వసూల్సేయ నంత శంతనుఁడు నరిగె. 262

తనుజ, శుద్ధయానము లంకఁ దనరఁజేయ
నుత్తర విదేశముల నన్యు లుద్ధరించి
రుత్కలిక బౌద్ధమతము సదుద్యములయి;
యదె మహాయాన మదె నిగమాప్తమయ్యె. 263

## షష్ఠధార — వీతాశోకోపాఖ్యానము

అయిన నొకకొంతయె విభు నాత్మఁజెనకె
లోకమే శాశ్వతంబని సుఖలోలుఁడైన
యనుజుని మహీంద్రుని, విశృంఖలాచరితము
లప్పుడప్పుడు చెవిబడ నొప్పివుట్టి
ఘనుఁ డశోకుఁడు చింతచిచ్చునను బడియె. 264

ఆతతభోగి మహీంద్రుఁడు
భ్రాతయు బ్రదికెన్ వృథాగ రట్టున కెడమై,
శ్రోతలు దెగడఁగ నగుణ
వ్రాతుఁడు, దుర్వీధి విదగ్ధపథ పథికుండై. 265

అతఁ డొకతఱి భిక్షుకయతి
వితతిన్ గని "పనియుఁ బాటువీడిన వీరల్
గతుకుదురు చెన్నుగా నిఁక
వెతవడుదురు దేనికొఱకొ వెంగలు లగుచున్." 266

అని పరిహాసము సేసిన
విని యన్నకు నెదు రితండు, "వీతాశోకుం"
డని వారలు పేరిడినన్
దనకు బిరుదయని యతండుఁ దనిసిన విభుఁడున్. 267

తమ్ముఁడ! తల్లికై నిను నుదారత సైఁచితి నంతెగాని, నీ
విమ్ముగ నుండలే కకట! యెల్లలుఁ భిక్షులుఁ దిండిపోతులం
చుమ్మడి దూఱితేల? నగుచున్ యతు లేమని పేరువెట్టిరో
వమ్మది జన్మనామము! లవమ్మును లజ్జ వహింప వేలొకో? 268

నీ కేరీతిని, వీతా
శోకుండను వింతపేరె - సొబగై తోఁచెన్?
లోకాంతరగతమాతృ
శ్రీ కీకథ చెవిని జొఱదు క్షేమంబయ్యెన్. 269

నా కీ రాజ్యభరం బతి
లోకంబయి తోఁచె! - కీర్తిలోలుఁడవగు నీ
వే, కమనీయస్థితి, ధ
ర్మైకాగ్రమతిన్ భరింపు మవనీతలమున్. 270

ఏదేని దొసఁగుఁ బొసఁగిన
నీదేసుమి, పూచి ! నిన్ను నిజముగఁ గొఱులన్
నేదయఁజూడక యసువుల
పా దగలింపంగవలసి వచ్చును వత్సా ! 271

నెలచాలును; విశ్రాంతికి
నెలవగు జీవితము గడపి, నేనును వత్తున్
వెలయింపుము రాజటీకము
నలుకక యని యతనిఁ బ్రెగడ హస్తముల నిడన్. 272

వెనుకకు నెట్టెనుఁ దగులము
లనయంబుల నెగవిడిచె మహాత్మునిభాతిన్
వినతాశ్రితుల మహీందుఁడు
వినయంబున గారవించె విహితక్రియలన్. 273

తనవిధుల్ గఱపఁగా నెనయు నాచార్యుల
కాదరమతిని సాష్టాంగమెఱఁగు
తన కల్మి నాశించి యనువు లన్వేషించు
స్వైరిణీజనత విస్మరణఁ బొరయు,
తన ధర్మకార్యంబు లనిశంబు నెరవేర్చు
ధర్మమహామాత్రతతుల నరయు,
తనకు నాశీర్వచస్తుతి మాల లంకించు
భిక్షుక బోధాంకపీఠి నొరగు

భోగములఁగాని యితరము లూహ్వనలేని
తమ్ముఁడు విరాగశీలియై ధరణిపాల
క క్రియకె బ్రదుకెసరుగాఁ గనలుచుండ
శోకమంతయు దొఱఁగి యశోకవిభుఁడు. 274

చారుమతినిఁ దద్వల్లభు
నారయగాఁ నేగి వారి కతులముల సిరుల్
గూరిమితోఁ జేకూర్చియు
నేరుగ మాసాంతరముననే వెనుదిరిగెన్. 275

వచ్చి యథాస్థితి తనకున్
నచ్చినగతి రాజ్యపాలనంబున దాక్ష్యం
బచ్చువడ నేలు సోదరు
మచ్చికతోఁ గానఁబోయి, మమత యెలర్పన్. 276

ఏరా తమ్ముఁడ! లోకులెల్ల సురమాహేయిన్ నినున్ గొల్వఁగా
రారాజై, విభవోన్నతిన్ బడసితౌ! రాజ్యంబునన్ గీర్తియో
షా రత్నంబొనగూఁడు నిప్పు డయయో! శల్యావశిష్టుండవై
తీవేలొక్కొ? కృశించిపోవ నెది వేధించున్ నినున్? దెల్పవే! 277

సార తపోనిరతిన్ బా
ధారామంబుల సుజీవితాచారముఁ జే
కూరన్ వసియింపగఁ జవు
లూరెడు నా కెప్పు డేలు ముర్విని నీవే! 278

అన్న! మహోగ్ర నిష్ఠనుగదన్న జయించితి వింద్రియంబులన్!
నన్నను మీఱి ధర్మరచనన్ నిపుణుండవటండ్రు లోకు; లీ
వన్న! కృతార్థుఁడైతివి! మహాశయుఁ డీవిలఁ బ్రోవుమన్న! చే
కొన్న ముముక్షుతన్ జయముఁ గోల్కొనగన్ సెలవిమ్ము పోయెదన్.

అన్నన్ విని బావురుమని
యన్నా! వలదెట్టి రాజ్యమాసయు నీవే
మన్నించి, గద్దెనెక్కుము
మున్నెన్నఁడు లేని భయము మునుకొనె నన్నున్. 280

కన్నులఁగట్టినట్లు శవకర్మముఁ గర్మఠులెల్లఁ జేరి నా
సన్నిధి సల్పినట్లు ననిశంబుఁ గలల్గనుచుంటి! రాజ్యమున్
బెన్నిధి చావుగుట్టయె! ద్రవించెడు గుండె! మతిన్ స్మరింప, నీ
యున్నతి చాలుఁ జాలునిఁక నూరకనుండఁగ నెంతు నగ్రజా! 281

అంచు వచించుచు పదముల
యంచులఁ దన తలను వ్రాల్చి యడలు మహీంద్రున్
మంచిది! నిజ మగుపించెనె?
కంచికి గథయేగెఁగాక! కలఁగకు మింకన్. 282

అని నిజసోదరుఁ గౌగిట
ననురాగముతోడఁ జేర్చి "యరసితె? మరణం
బెనయున్ ప్రాణికి తథ్యం
బని, శాశ్వతపదముఁ గోరు యతి భావనలన్. 283

నిను శిక్షింతునె యనుజున్
గనుఁగొనెదవు నిజమునెలయుఁ గడచన ననుచున్
బనిచితిఁ బనికిన్ జననీ
జనకుల వాసికిని మచ్చ సమసెను దీనన్. 284

శ్రీనగరంబును శ్రీ సమృద్ధిగ గట్టఁ
గాశ్మీరమున "జలౌకసుఁడు" నిల్చె
నేపాల లలితపురీపాలనమున ను
ద్దండుఁడై "దేవపాలుండు" గొఱలె,
ఉజ్జయినీ నగరోత్తమ ప్రతినిధి
ప్రభుత వాటించి సంపాది మెఱసె
ఘన సువర్ణగిరి శంతనుఁడు వల్లభుఁడుఁ ప్రే
మను దాక్షిణాత్యుల మరులుఁగొలిపె

నీవు వలసిన రాజ్యాన, నేతవగుచుఁ
బాలనముసేసి నా సేవఁ బాలుగొనవె?
వితత ధర్మ సముద్దీప్తి నతుకఁగలవు!
హితము బాటింపుమన్న! మహేంద్రరాజ! 285

అన నాలించి, మహేంద్రుఁడు
గొనకొని "సంఘంబు" జేరి కొనసాగింతుర్
వినుతం బష్టాంగపథం
బని చనియెన్ ఘోషయోగిసన్నిధిఁ గొలువన్. 286

ఎంత సుధీసముద్రుఁడో! మహీశుఁ డశోకుఁడు; శిక్షచేతఁ గా
సంతయుఁ జక్కఁగాని పనినౌర! యొకే త్రుటి నిర్వహించె; దు
ర్దాంత విమూఢచేతసులఁ దత్ప్రియకార్యనియుక్తిఁ బూన్చి య
త్యంత శుభార్థ్యగాములుగ నాదృతిఁద్రిప్పుటఁ బాడియా! కదా! 287

## సప్తమధార - అశోకుని చరమదశ

నిఖిల భరతంబు సద్ధర్మ నిభృతమయ్యె
ప్రాక్ప్రతీచు లుదగ్యామ్య పార్శ్వదేశ
వితతులన్ బౌద్ధమత నీతి విదితమయ్యె
తానుఁ దలపెట్టినవి యెల్లఁ దావుకొనియె. 288

పట్టమునకెక్కి సామ్రాజ్యపాలనాది
ముప్పదేండ్లైన "కరుణయు" ముక్తివడసె
చారుమతియును బొందెను శాంతిపథము
పశుపతి మఠంబు నిర్మించి భవ్యయగుచు. 289

రాజముద్రికాముద్రిత రచనఁ దనదు
తండ్రి యాజ్ఞగ నెన్ను నుత్తమ సుతుండు
నా గుణాలుఁడు దృష్టియే నాశమొంద
ఘోషమునికృపఁ జక్షువు ల్గొనఁగఁ గల్గె
నైనను విరక్తి, యతిపథం బతఁడు నొరసె. 290

(తుది నశోకుండు, వార్ధక్య మొదవినపుడు
తిష్యరక్షిత యను నామె దేవిగాఁ గ
గొనియె నం్రదది శాసనంబుననుఁ గనము.
"తిష్యయాలాప" సరణి సంధించుకొన్న
గాథలేమొ, పరంపరాగతములయ్యె.) 291

అవలఁ బదియేండ్లు, తొంబదియారుకోట్లు
స్వర్ణముద్రికల్ విభుఁడు వెచ్చంబుసేసె;
రాజకోశాన మిగులేమి రానికతన
శేషమగు నారుకోట్ల కశేషరాజ్య
మక్షయమిడె దానార్థమై భిక్షుకులకు.

"రత్నగర్భ! సర్వంసహ! ప్రభుత మెఱయు
నింద్రమణి నీలరుచుల వహించు నుదధి
తనకు మొలనూలుగా నొప్పు ధరణియెల్ల!
ధర్మసంఘంబునకు నిదే దత్తమయ్యె!

దానఫలముగ నింద్రపదంబు వలదు!
ధన్యతమమగు బ్రహ్మపదంబు వలదు!
నవ్యశరవేగమును మించి నాశనమగు
దీని రాడ్విభూతినిఁ గలనైనఁ గోర! 292

బౌద్ధధర్మంబు నమ్మి నే నిద్ధమతిని
ప్రతిఫలము వాంఛసేయక, నితరు లెన్న
టకునుఁగాక జితేంద్రియ ప్రకటవృత్తి
దానమొసఁగితి నిదియు నన్యూనమగుత!" 293

రాజ్యమంతకు దానపత్రంబు నిట్లు
వ్రాసి సంఘాధికారికరంబున నిడి,
దివిజవరులును దను సన్నుతింపఁ దనరి
నలువ దొక యబ్దముల్ పాలనంబుసేసి
బౌద్ధపతి యశోకుఁడును నిర్వాణమొందె. 294

అవల, ఘనుఁడు గుణాళుని కౌరససుత
వరుఁ డశోకుపౌత్రుండు సంపాదిరాజు
నాల్గుకోట్ల నొసంగి దానంబుఁ ద్రిప్పి
మౌర్యసామ్రాజ్య భర్తయై మాన్యుఁడయ్యె. 295

సంపాది "సుపార్శ్వుండ"న
దంపుగ నిలఁ గొంత యేలి, దశరథుఁ డను ద్రే
మంపు కుమారునిఁ బతిగాఁ
బెంపునఁ బట్టమున నిల్పి పృథుజైనమతిన్. 296

ఉజ్జయినికిఁ జని ప్రతినిధి
యజ్జనకుఁడు జినులఁ బ్రోవ, నాదటఁ గొడుకున్
సజ్జనుఁడు, "బంధుపాలితుఁ"
డుజ్జీవితుఁడయ్యె ధర్మ మూఁతగ గొనుచున్. 297

కాలాంతరమున మౌర్యుల
పాలనమున్ ముగిసె నైనఁ బ్రాభవ యశముల్
కాలగతిన్ జెందక యి
క్కాలంబును జాటు మనకు ఘనతన్ గరుణన్. 298

## కాండ సమాప్తి - సింహావలోకనము

ఏవురఁ బతులుండియే సభ వలువొల్వ,
స్థిరచిత్తయౌ ద్రౌపదీపురంధ్రి
నడవి నీడేలేని యిడుమఁబాసిన పతి
ననురక్తిఁగను దమయంతిరాణి
సాధ్విని దన్ను బజారున నిడు హరి
శ్చంద్రుసైఁచినతల్లి చంద్రమతియు
వరసతి బరదేశిగరితనా జితిఁబేర్పఁ
జి చ్చుటికిన గుణస్ఫీత, సీత

మూఁడుమూర్తులఁ దనయొడిఁ గూడియాడు
సుతులుగా మార్చు నా యనసూయదేవి
పుట్టినట్టి దీ పూజ్యార్యభూమిపైన
నుదయమందెను రాజుల నుత్తముండు
సూనృతాచార సుకృతి యశోకనృపతి. 299

ఏ సార్వభౌము నహీన శాసనశిలా
సింహాలి స్వాతంత్ర్య చిహ్నమయ్యె,
నే మహామహు ఘనప్రేమపాలనఁ "బంచ
శీలముల్," దాలి కలి నేలఁబర్వె,
నేవేత్తవలన సమేష్ట సత్కృతుల బ్రా
హ్మణ బౌద్ధ నిర్గ్రంథిగణము లొందె
నే ధన్యజన్ము సద్బోధాంబుధార "మ
హాయాన" నిర్ఝరికాదిఁ జాల్చె,
బలి దధీచి విద్యాధరేశ్వరశిబీంద్ర
తుల్యుఁడేదాత? శాంతిదాంతులకు నేడు
జగముజను లేనియడుగుల జాడలరయ
సాగి రతఁడె; సమ్యగ్ధర్మసారమూర్తి
సూనృతాచార సుకృతి యశోకనృపతి. 300

శతకోటి సొన్నముల్ యతుల వెచ్చమునకై
దానంబునిచ్చె వదాన్యుఁడెవఁడు?
కొల్వని యాటవికులను శిక్షింపక
ననుగులఁజేసె ధర్మాత్ముఁడెవఁడు?
గాంధారముల్ బెన్న గరిగాఁగ నేపాల
మోమె నరేంద్రదలలాముఁ డెవఁడు?
బ్రాహ్మణ నిర్గ్రంథి బౌద్ధమతంబులఁ
దుల్యంబులుగ బ్రోచెఁ గల్యుఁడెవఁడు?

స్వపథ మన్యంబు నననిఁ, విశాలహృదయుఁ
డెవఁడు? తన ధర్మకార్యం బహీనమగుచు
వేన వేలాది యేండ్లు, నుద్వేల కీర్తిఁ
నిగుడ నిపుడుఁ బురాస్మరణీయుఁ డెవఁడు?
సూనృతాచార సుకృతి యశోకనృపతి! 301

సముఁ డననగు ధనంజయునకు నే వీరు
నునుపమ శౌర్యవిహారమందు;
జోడని వినుతింపఁ బాడియౌనేఁ బుతం
భరునలునకు బుణ్యభావమందు
నెనకొంతయనవచ్చు నేమహీవరు రాము
నకు ధర్మసంస్థాపనంబునందు;
నీడని యనఁగూడు నేరాజచూడు, హ
రిశ్చంద్రునకు వితీర్ణిత్వమందు;
యవనరాజాధిరాజ నుత్యర్హశీలుఁ
డతఁడు, సార్వభౌముఁడు, కళింగావనీంద్ర
రత్నమయ మహోష్ణీష నీరాజితపద
భాసురుఁ డసన్మనస్తమో భాస్కరుండు
సూనృతాచార సుకృతి! యశోకనృపతి. 302

ఇటుల నుడివిన దేశికు నెనసి మంత్రి
శాసనంబులు పదునాల్గె, చాటినాఁడో?
తిష్యరక్షిత యెవ్వరో తెలియబల్కుఁ
డనెడు బాలాజికిఁ వక్తయగు యతియును. 303

ఒకటి రెండే శిలాళి నవికలములగు
ముప్పదియునైదు శాసనములును గలవు
పారమును ముట్టి నెమకిన వ్రాతశిలలు
నెన్ని వెల్వడునో చెప్ప నెవరితరము?

ప్రాచ్య నిశ్చితమగు కాలగణన మరయఁ
జాలకాలంబు గడచె నిక్కలిని; – "తిష్య
రక్షితాం"కంబు, లంకపురాణములును
తడవవయ్యె; తద్జ్ఞులు దాని తథ్యమనరు –

శిష్యుఁడగు నాపితుఁడు దన్నుఁజేరి కొల్వ
తిష్యుఁ డతని బిడ్డనుఁ గన్నెతీవఁబెంచె
విషసుమంబుల ఫలమును విడిగెఁ దిష్య;
వేపచెట్టది, పండ్లఁ గ్రవ్వించె, చేదె!

భవ్య "పరిశిష్ట" ధర్మప్రవర్తనముల
శాసనానుగ మానాటి జగతి పండె!
నిఁకఁ జతుర్మాసనిష్ఠ, వ్రతేష్టిఁ గడతు
నని వచించి, వేదానందుఁ డంత లేచె. 304

చనె యతియుఁ దదాశీస్సునుఁ
గని బాలాజీశుఁడును వికార విదూరుం
డును, విధ్యుక్త విదుఁడునై
యెనసెన్ బృథు ధర్మశాంతి నింద్రియజయమున్. 305

## కాండాంత ప్రార్థనము

ధర్మాకారా! ఋషిగణ
నిర్మల చిదచిద్విశిష్ట నిర్మలరూపా!
శర్మద నిశ్శ్రేయస, స
త్కర్మాకర! లోకభావుక స్థితికారా! 306

అష్టాదశవర్ణనములు
శిష్టములైవఱల నీవె చేసితివి కృతిన్!
కష్టములెల్లను దీర్ప మ
రిష్టములు శమింప నీ వరీణదయాళూ! 307

సాధితములు షట్కాండలు
వేధస్మృతి కురియు నర్థవృష్టి భరితముల్
బోధాక్షేందు విజృంభిత
గాథాంబుధి సంగమించెఁ గమనీయములై. 308

నర్తింప మాయింట నవరత్నమండప
శాలలు; పచ్చిక చాలు బయలె!
అడుగుఁదమ్ములజోడుఁ గడుగంగఁ బన్నీరు
బయలఁ ద్రవ్విన చేదుబావి నీళ్ళె!
నీయలంకృతికినై నీరజవనమాల
మా తోఁటఁ దులసికొమ్మల దళాలె!
ఆరగింపఁగ నీకుఁ జారు భక్ష్యాదులు
రాగిసంగటిముద్ద యోగిరంబె
సత్యధర్మంబు మఱుఁగైన సంధికాల
మిపుడు మా బోంట్లకెందు; నీ కృపయె దిక్కు-
మాటుమున్గకమున్నె; యేలోటులేక
మఱతు కైదోయి! హృద్వీణ మాఱుమ్రోఁగ!
దేవ! రావోయి; యిటు నీ కిదే నమస్సు. 309

శ్రీవర వధూమృదు కుశేశయ శయప్రథిత
చిత్రవనదామ ధృతవక్షా!
భావిత సమస్తగుణభాగ్య, సుయశోవిదిత
భక్తనికురుంబ నుతరక్షా!
భూవినుత భవ్యతరభూతి నికరోజ్జ్వలిత
భూమ కరుణాకలితవీక్షా!
సేవకజనావనవిశిష్ట సుమనోవిమత
శిక్ష! జయమంగళమహాశ్రీ! 310

శ్రీరస్తు

# శ్రీమదశోకచరిత్రము

## పరిశిష్ట సప్తమకాండము

### తిష్యాలాప, శాసన పాఠాదులు - అనుబంధములు

### ప్రథమధార — కాండనాంది

శ్రీ రమయున్ నగాత్మజ, కుశేశయగర్భ గజాననార్భకుల్
మారకుమారులున్; విబుధమాని, హరీశ, ఫణీశ, వీశులున్;
జేరి నుతింప సింధు వటసీమల నింద్ర ఋషీంద్రరుంద్ర పూ
జారుణపాదులౌ, హరిహరాకృతు లీకృతిపాలు రయ్యెడున్. 1

శ్రీకరిణీ కరోజ్ఝిత విశిష్ట జగత్పరిణామశక్తి ప
ద్మాకర శీకరోత్కర సుధాప్లవన ప్రవణప్రసంగుఁ, డ
స్తోకదయాంతరంగుఁడు, విధూత నిజాశ్రిత దుఃఖసంగుఁ డు
త్సేక శుభార్థరంజిత సుధీజనపాఠ్యముఁజేయు నీ కృతిన్. 2

విశ్వశ్రేయఃప్రథితా
నశ్వర సద్భావ భవ్య నవరసమయ వా
గీశ్వరి జయమొందు శిలా
శాశ్వత కవితల్ ప్రసిద్ధి సంపాదింపన్. 3

### ద్వితీయధార - తిష్యరక్షితాలాపము

నవమంజరీద్విపద (3-4-3-4-5-3 మాత్రాగణములు -
పంచమగణా ద్యక్షరము, యతి.)

అక్క టక్కట బుద్ధ! దైవమ! ఆగ్రహింపకుము
నిక్కవంబుగఁ దప్పుసేసితి - నీవె రక్షింపు. 4

అహాహా ! యెంతటి ధన్యజీవులు – నవని నున్నారో ?
ఇహము గోరని బుద్ధసాధకు – లెందఱున్నారో ? 5

తిష్యమునికడ దివ్యబోధలఁ – దీర్థమాడితిని
శిష్యుఁ డధిపతివశ్యుఁడగుటకు సేవవేడితిని. 6

ప్రసవశయ్యలఁ బ్రభుని నిల్పియుఁ బాటఁబాడితిని
దిసమొలన్ దనువల్లి వీఁగఁగఁ దేజుగూడితిని. 7

అనయమున్ జవులూరగను సయ్యాట కీడ్చితిని
కినిసి నేఁ బ్రణయాన రాణిగఁ గేలుమోడ్చితిని. 8

ఉల్లిపాయల నతని రోగం బుడుకు జల్లార్చి
కొల్లగొంటిని రాజు ప్రేమను – గోతుకుల్ దీర్చి. 9

"కరుణవతి," సతి కన్నపుత్రుఁడు – కామసన్నిభుఁడు
ఉరుగుణాఢ్యుఁడు, ధీవరాఖ్యుఁడు – నూర్ధ్వలోచనుఁడు. 10

తేరిచూచితి వారగన్నుల – దిగులు జెందితిని
తేర కంగజు గుఱికి జిక్కితిఁ – దృష్ణఁ గుందితిని. 11

ధీరుఁడతని నుదాత్తగుణుఁడని – తెలియలేనైతి
కారుకూఁతగ సరసవాణిని – గానలేనైతి. 12

ఇద్ధధర్మ విభూషణంబుల – నెఱుఁగలేనైతి
బుద్ధరూపక నటన మిషఁ దన్ – బొందలేనైతి. 13

కోపఘూర్ణితనైతి, దుగుణము – క్రోధముప్పొంగఁ
బాపి సుమశరు నారసంబులఁ – బాడియున్ గ్రుంగె. 14

రాజముద్రికవైచి దృష్టిని – రాల్పఁబంచితిని
గాజుకుప్పెలుగా గుణాళుని – కనుల నెంచితిని. 15

పెల్లగించెను లోచనద్వయి – వేఁడఁ డోడనఁడు
వెల్లబాఱఁడు – వెడలివచ్చెను – వ్రీలెగుండియయు. 16

తొంగిచూచితి; మూర్ఛనొందితి – దొరయు నన్ గాంచి
గంగనీళ్ళను గన్నుదోయినిఁ – గడిగి రక్షించె. 17

రోషమింతయు లేక పతికా-రుణ్యముం జూపి
ఘోషయోగిని బిల్చి కోరెను - కొడుకునకుఁ బ్రాపు. 18

'కనరు వ్రాలఁగునె? కోడలిదిగో !- కడుపు దీఁ'పనియె
'కనికరింపుఁడు, మీ పదంబులె - కాచు మ'మ్మనియె. 19

ధీవరాక్షులఁదీసి యదికియు - దెసల, చేఁజాపి
తీవరపు మునివల్కె "సీతని - తెగులు నేఁబాప 20

పాపరహితులు, సత్పతివ్రత - వడియు కన్నీరు
నోపికను దెమ్మదియ యోషధి - యార్మియుం దీరు.'' 21

పురుషు లదివిని తెచ్చియిచ్చిరి - పూతమౌ నీరు !
తెఱవలందఱు వచ్చి యిచ్చిరి - తేట గన్నీరు ! 22

సురులు సజ్జను లటకు గుములై - స్రుక్కుచుం జేరి
వరుస దీవెన లనఘులిచ్చిరి - పలుకు పన్నీరు ! 23

ఎట్టిదో బుద్ధాజ్ఞ ! యెవ్వరి - కెఱుఁగఁగా రాదు !
దిట్టధీవరుఁ డక్షులక్కట ! - తెఱవఁగా లేదు ! 24

కట్టకడఁ జేరిరి గుణాళుని - గరితనే వారు
నెట్టి, యామె దృగంతముల సుధ - నిండె గన్నీరు ! 25

* * * *

అక్షియుగ్మము నెత్తిచూచెడు - నాత్మజుం గాంచి
"అక్షయుండ ! గుణాలయుండవు - నమిత సత్త్వుఁడవు ! 26

మూఢుఁ దండ్రిని, శిక్షజేయుము, - ముద్దు నాయనన్న !
గాఢమఘు''మని తలను వంచెను - గన్నతండ్రియును. 27

ఆనతుండై జనకు బాహువు లంది కౌఁగిటను
పూని సూనుండనెను, "నేనిఁక - బోను, తక్షశిల. 28

దీనిధ్యానము, బుద్ధపదయుగ - దివ్యసన్నిధిని,
మానుగా నిర్వాణ శరధిని-మగ్నుఁడయ్యెదను'' 29

ఆ త్రివిష్టప దూతయొక్కఁడు – నంత నేతెంచి
ఛాత్రుఁడును, ధిషణుండు నిర్వారు – స్వర్గముఁ బెంచి 30
రని వచించిన నా యశోకుఁడు – ననిచె ధీవరుని
నొనరిక "టిబెట్" బోధి పీఠము – నుద్ధరింపుమని. 31

ఏవిధంబున నీసు జెందఁడ ! – యిలకు తేఁడయ్యె !
నావిభుఁ డశోకుండు, దేవుం – డాత్మ శాంతమున ! 32

భిక్షుకీ వ్రతమూని కంటిని – భీతియున్ దొలఁగ
రక్షకంబయి, ధర్మముఁ బూన–రఁ శరణ్యముగ ! 33

చారు జీవన శాంతియే క్షితి – శాశ్వతంబంటి
వైరివర్గము నారు గూల్చెడు – భవ్యపథమంటి 34

దివ్యమగు కారుణ్య దీక్షయె – తీర్థపదమంటి
అవ్యయమ్మ పరాత్పరమె ! సేవ్యముగ నేఁగంటి॥ 35

## తృతీయధార - ప్రథమ చతుర్దశ శిలాశాసనావళి

వెన్కనుండియె ముందు కవ్వించు వ్రాల
నా "ఖరోష్ఠి"ఁ, బ్రకటనద్వయంబు వెలసె
వఱలెఁ దక్కు–శాసనములు, బ్రాహ్మిలిపిని –
ఆది ప్రాంతకదేయందు రార్యభూమి. 36

1

ప్రథమ శాసనవృత్తంబు పరగె నిట్లు
"పావనుఁడు "ఘనప్రియదర్శి" ప్రకటితముగ
నీ పవిత్ర శాసనముఁ జెక్కించి నాఁడు
జాతరలయందు బలులకై జంతువులను, 37

చెనటులై వధించుటలు నిషిద్ధమింక.
దుష్కృతము లనేకంబుల, దూష్యములగు
సాంఘికోత్సవముల నెందుఁ జరుపఁగూడ
దడవనిపుని పాకశాలలో వ్యంజనములు 38

జంతువధ కాకరంబుల సల్పకుండీక
హరిణ మొకటి, రెండు నెమళ్లు నాహరించు
సరణి విలసిల్లె శాసన సమయమందు
తెలియుఁడిక నివి మూఁడు వధింపఁబడవు.'' 39

2

రెండవది శాశనంబు నీరీతిఁ దనరె
"ప్రణతుఁడైనట్టి ప్రియదర్శి ప్రభుని రాజ్య
మన్ని నెలవుల చోళ, పాండ్యముల, సత్య
పుత్ర, కేరళ, సింహళములను, గ్రీకు. 40
రాజ్యమున 'నాంటియోకస్సు' రాజునాజ్ఞ
చెల్లుబడియగు సామంత సీమలందు
జనుల, కెల్ల పశువుల, కౌషధచికిత్స
ద్వివిధముగ నెలకొల్పితి; వేర్లు, పండ్లు. 41
నాటఁబడియె – నోషధులెల్ల చోటులందు
బాటలఁ బావులును జెట్లు, వఱలుచుండె;
మనుజులనెకాదు, మృగముల మనుపుకొఱకు''

3

మూఁడవది శాసనంబది, పొలిచె నిట్లు. 42
''పట్టమెక్కిన పిదప నీ పదియు మూఁడు
నైన యేఁటను బ్రియదర్శి యాజ్ఞఁ జేయు
నాగరకులఁ బౌరులఁ గూడి, నా యధికృతు
లందఱును మాండలికులును, నైదువర్ష 43
ములకు, నొకసారి సభఁ జేసి ముఖ్య బౌద్ధ
ధర్మములఁ బ్రకటించుట, తప్పనిసరి –
ముఖ్యధర్మంబు జీవన (1) ముదితులుగను
దల్లి దండ్రుల సువిధేయతఁ దలిర్చి 44
గొలువనగుఁ (2) బరిచితు, లనుఁగులును, మిత్రు
లుత్తములు యోగులును బ్రాహ్మణౌఘములును

బంధువులు దార సమ్మాన పాత్రులగుట
సత్కరింపుఁడు వారి (శ్రీ) నసౌమ్య భాష 44
ణంబు, నమితవ్యయము విడనాడవలయు;
లగ్గగు, మతగురువులు కూలంకషముగ
సల్పుఁడీ బోధ నగరుల జనులకెల్ల''

4

నాల్గవదగు శాసనం బిట్లు వఱలె. 46
''ధర్మభేరియు కర్ణతాడితం బిదియె!
మ్రోసెను; రణభేరి మొరయ దింకెందు!
చాలకాలంబుగా జనులు జంతువుల
వధజేయుటయు, హింస పరగించుటయును. 47
తల్లిదండ్రులసేవఁ దనరకుండుటయు,
బ్రాహ్మణభిక్షుక బౌద్ధయోగులను
సత్కరింపక యునికి, జరుగుచున్న వివి,
దుర్ణయంబులు గావె? దోసఁగులుగావె? 48
మోక్షార్థి, ప్రియదర్శి, దీక్ష వహించె
స్వర్గమార్గంబును, సరిగఁ జూపించు
నా సులోచనములై యలరు నుత్సవము
లిభములు రథములు నిద్ధ దీపములు. 49
నయనోత్సవంబుగా నవ విధానముల
కడిదిఁ బ్రదర్శింపఁ గడఁగి లోకులును
నతరలి బహు శతాబ్దంబులనుండి
విడువని మృగవధ విడనాడినారు. 50
బంధు భిక్షుకులను బ్రహ్మబృందముల
వివిధరీతుల గౌరవించుచున్నారు
మాతాపితరులు సమ్మానింపఁబడిరి
శాఖోపశాఖలై సర్వ ధర్మముల 51

యాచరణ సమృద్ధియంతటఁ వెలసె
మంచిది చేయ, దుర్మార్గుఁ డర్హుండె,
కాన నా పుత్రులుఁ గల్గు పౌత్రులును
బౌద్ధ ధర్మంబుల బాగుగా నెన్ని 52
భక్తినీతులు గల్గి పాలింపవలయు
ధర్మమాచరణంబుఁ దవిలి వర్ధిల్లు
ఆచరణములేక యదియు క్షీణించు
పట్టాభిషిక్తుఁడై పదుమూఁడు నేఁటఁ 53
బ్రకటితమిది సేసె భవ్య శాసనము.''

5

ఐదవ శాసనం బమర నాదర్శ
ధర్మ ప్రవర్తియై ధారుణీవిభుఁడు
ప్రియదర్శి యిట్లని పేర్కొనుచుండె. 54
"సత్కృత్యములు కష్టసాధ్యంబులిలను;
కష్టసాధ్యములయ్యుఁ గడఁగి చేసితిని
సత్కృతుల్ బెక్కులు; సత్పరాయణత
నా పుత్రపౌత్రు లానందింపవలయు. 55
ఆజ్ఞ నుల్లంఘించు నవ్వాఁడు హాని
చేసినట్టిఁ, డఘంబు సేఁతయు సులభ
మనుచు, మున్నెచ్చటనైన లేనట్టి
ధర్మోపదేశకుల్ ధార్మికోద్యోగి 56
వరులు నియుక్తులై పరగుచున్నారు
ఇది పదునాల్గవయేడు! "పైటీన,
గాంధార రాష్ట్రీయ కాంభోజ'' జనుల
క్షేమసౌఖ్యంబులు చెలువార, వార 57
లరయుచు రాజ భృత్యావళి విప్ర
ధనిక దరిద్ర వృద్ధ ప్రజాగణము,
సుఖముల గట్టెక్క సాగియింపవలయు
క్రమములే కెవరుఁ గారాబద్ధులైన 58

నక్రమ శిక్షచే నలజడిఁ గన్నఁ,
బాపకృత్యముల నివారించుకొఱకు
బహు కుటుంబికులు నాపన్నులున్ వృద్ధు
లెవరేని శిక్షల నెనసిన నట్టి 59
దయనీయుల విడువ, ధర్మాధికారు
లను నియమించి యెల్లఱకు మే లొనర;
సోదరీ సోదరుల్ సొంత బంధుగులు
నైన నా ప్రజలను, నారీవ్రజముల 60
సద్విచారణ సల్పి సౌఖ్యంబుఁ గొల్పి
యేర్పాటుఁ జేసితి; నెలమి వా రెపుడు
ధర్మనిష్ఠులు, నిత్యదానపరాయ
ణులఁ జేరి వారికి నూత్న సౌకర్య 61
ములఁ గల్పనముఁ జేయ ముదలయి చ్చితిని
శాసనం బిదియు నా చంద్రతారకము
నమరి నిరంతరాయముగఁ బెంపొంద
పరధామ ధర్మమీ ధరనె చెన్నొంద 62
మహిత ధర్ములు జను ల్మనుదురు గాత !”

6

ప్రియదర్శిఘనుఁ డిట్లు పేర్కొనుచుండె
నారవశాసనం బాలింపుఁ డీరు –
“చాలకాలమునుండి సవ్యంబులుగను 63
వార్తలు సేరవు; వ్యవహార వితతి
సమ్యగ్విధంబున సమకూర్ప లేదు ! –
అంతిపురాన శయ్యామందిరమున
భోగినై యున్నను – భుజియించుచున్న 64
మడుగులోనున్న, కమ్మని నిద్రనున్న
పయనించుచున్నను, వనములోనున్న
నెందైన, నేవేళ, నే జంకు లేక
నెదియు, నుపద్రష్ట లెఱిఁగింపవలయు 65

వార్తలే శ్రుతములై వ్యవహృతి మూల
ములగు; వానిని సిద్ధముగ, నిర్వహింతు;
దానంబులందు నుత్తసువులయందు
నధికృతావళి పాలి కనిపిన పనుల, 66
దైవికంబుగ నోటఁ దనరు నానతుల
వాదంబు లేమేని వంచనల్ పుట్ట
నాచార్యులగు వారియం దెగ్గులైన
వడిగ నాకుఁ శ్రుతపరుపంగవలయు. 67
పాలనవ్యవహార పథమున నాకు
సంతృప్తియు నుదీర్ణ సరణిఁ గాలేదు -
వ్యవహరించుటయెల్లఁ బ్రజల మేల్కొఱకె!
విన్యుక్త సత్కర్మ వినియోగమెల్ల 68
మత్కృషిమూలమ్ము - మత్ప్రజసామ్ము -
సొరిదిఁ గొందఱు నిహసుఖముల్ బొంది
పరభువి శ్రేయంబుఁ బడసిర యేని
జీవుల ఋణము దీర్చెదు శ్రమ యొండె 69
సకల జనక్షేమ సత్కృతి యొండె
సారాభిలషణీయ సద్ధర్మమొండె
అన్యసుఖంబేను యాచింపనొల్ల
శ్రమలేక సుఖము ప్రజావలి కగునె? 70
నా యధికారులు నాదు సంతతియు
సుప్రజాక్షేమార్థ సుకృతి బంధురత
పాటింప, నిల శాంతి పర్వెడుఁగాక!"

7

రాజాధి రాజ ధర్మప్రియుండైన. 71
ప్రియదర్శి పల్కు నీ రీతి నేడవది
శాసనం బిదియును; "సకల మతస్థు
లెటనైన నివసింప నే యడ్డు లేదు
ఎల్ల మతస్థులు నేవేళగాని 72

చిత్తశుద్ధి వహించి శిష్టులై మనుచు
నింద్రియ జయమొంది యెసఁగ వాంఛింతు
నెట్టి సంకల్పము లెట్టి కామ్యముల
నిలుకడఁ గనలేరు నిజము మానవులు ! 73

ఆయా మతానుగులంతఁ గొందఱును
గొమరారు నాయాజ్ఞఁ గొంత గొందఱును
పూరించియున్నారు; పూర్ణ దానముల
కేదారి లేకున్న, నింద్రియవశము. 74

తగు మనశ్శుద్ధి కృతజ్ఞతఁ బొరసి
నెఱయు వారలు గణనీయులె కారె ?
(వారలు సత్క్రియావ్యాప్తిఁ జొప్పడిన)"

8

శాసనాష్టమసార సంగ్రహంబిదియె. 75
"పూర్వ రాజవిహారములనెల్ల విడిచి
ధర్మయాత్రలఁ 'బ్రియదర్శి' తలంచె
పాఱుల, భిక్షుల, భవ్యయోగులను
దర్శించుటయు, హేమదానంబు సేఁత, 76
ప్రజల రాజ్యంబును బరికించుటయును,
బౌద్ధ ధర్మావళిఁ బ్రకటించుటయును,
ధర్మ మీమాంసలఁ దనరించుటయును,
బదునొకండవ యేఁటఁ బ్రారంభమైన 77
నష్టాంగ మార్గంబు, ననువదించుటయు;
విడువ హింస; వహింప విపులానుకంప;
తప్పక పొలుపొందె ధర్మయాత్ర లవి."

9

నవమమైనది శాసనం బిద్ది గనుఁడు. 78
"ఉవిదలయెడ నిష్ప్రయోజనంబులగు
నాచారములు, నసంఖ్యాకము ల్గలవు

శేబవల్పుత్ర పుత్రికల పెండ్లిండ్ల
నతిరోగ పీడల యందపత్యాతల 79
నితర కార్యంబుల నేమి పాటింతు
రాయలవాటుల నాపఁగాఁ గాదు -
పూర్వపద్ధతులకుఁ బొత్తును గూర్చ
దాస భృత్యులకు నాదరణ నూపుటయు; 80
జీవితలక్ష్యంబు సిద్ధిఁ బొందుటయు;
భూదేవులకు భిక్షువులకు నిచ్చుటయుఁ
దల్లిదండ్రుల, గురుల్ దవిలి గొల్చుటయు
ననెడు ధర్మాచార మంతటఁ బర్వ 81
యజమానుఁడుఁ బుత్రుఁ డనుజులు మిత్రు
లందఱు ధర్మ సహాయులై మనుఁడు
లౌకికాచార విలోల్యంబువలన
సంకల్ప సిద్ధియో సౌఖ్యమో కల్గు. 82
కాని ధర్మాచారగరిమ నిత్యంబు !
ఈ భువి నొడగూర్చు నిహభాగ్యములను
లోకాంతర సుఖంబులును సమకూర్చు"

10

దశమ శాసన సార ధర్మ మిట్లుండె. 83
"అమరు ముముక్షుత నమృతత్వ మవని
తదుపేక్ష మరణంబు; తథ్యంబుఁ గనుఁడు -
సాహుకార్లకును, గష్టము ధర్మపథము ! -
ప్రియదర్శి బుద్ధుని ప్రీతిగా ననఘ 84
పరలోక హితమైన బాహుదర్పంబు
కీర్తికాముకత రక్తియును, బౌద్ధమ్ము
ధర్మమ్ము నొనరింప దవులు సార్థకత;
యనెడు విశ్వాసంబు నలముకొన్నాఁడు 85
సంపూర్ణ వైరాగ్య సద్ధర్మ పరత
లగియించు పుట్టు దుర్లభమండ్రు బుధులు !"

11

పదునొకండవదిట్లు పరగె శాసనము
" బానిసలఁ గృప బంధులఁ బ్రీతి 86
పితృ విధేయత, యతి భిక్షు సపర్య,
విప్రులయెడ దానవిధియును, జీవ!
బౌద్ధ ధర్మములివి పాటింపవలయు -
తద్ధర్మ మొనఁగూర్చు దానంబుకంటె. 87
తద్ధర్మగతి మైత్రిఁ దవులుట కంటె,
తద్ధర్మ బాంధవత, మనుటకంటె,
యుత్తమ ధర్మ మీ యుర్విలో లేదు
పొరుగువారలు గురుల్ పుత్ర మిత్రులును. 88
సహచరుల్ దీనిని జక్కఁ బల్కుఁడు
వస్తుదానముతోడి, వరబోధ మేలు!"

12

పరగె శాసనమిట్లు పండ్రెండవదియు
"ఆయా మతంబుల కాధారములగు. 89
ధర్మసారముల సంతత మాచరించు
టిల యవశ్యకమని, యేలిక యెఱుఁగు
ధర్మము మూలంబు! తద్వాక్యనియతి
భిక్షుకుల గృహస్థ విజ్ఞానిజనుల 90
గౌరవసత్కార గరిమఁ బ్రోచితిని
మతమేదియైన సమ్మానింపవలయు
హీనావమానంబు లెనయఁ జేయకుఁడు
అల్పకారణమున నన్యమతాలిఁ 91
గొంచెము సేయుటకూడ దెన్నఁడును
స్వమతంబునం దనుష్ఠానపరుండు
పరమతంబునకు శుభంబునుగూర్చు
స్వమతంబు నభివృద్ధి సల్పినవాఁడు 92

నన్యమతస్థుల కనుపయోగి యగు
నితర మతంబును హీనంబుఁజేయ
నగు స్వమతానకు హాని తథ్యంబు !
స్వమనోవశంబగు పరమత శ్రుతిని ! 93
ప్రతి మనుష్యుఁడును ధర్మముల బాహ్యముగ
నరసి సేయుట యవశ్యంబనరాదు
తమ తమ మతముల ధర్మంబులెల్ల
ప్రజలు సుష్ఠుగఁ జేయ, బౌద్ధమతంబు. 94
సుప్రకాశమగు సంస్తుత్య శీలముల !
అధికారిణులు స్త్రీలె యబలా సమితికి
నొనర నుద్యోగుల నుత్తమవర్త
నుల నియోగించితి న్యూనతల్ దుల్చి 95
సర్వమత సుధర్మ సత్పరిణతికి
సత్యసదాచార సత్క్రియోన్నతికి
ధర్మాధికారులు తచ్ఛోధకులును
సద్వృద్ధిపరత నెసఁగెదరుగాక ! ''- 96

13

సార త్రయోదశ శాసనమిదియె
''త్రికలింగము జయించె ఁడు నవాబ్ద
మునసె, ధర్మధ్వజముఁ షట్ఛతంబు
యోజన విస్తీర్ణ మిర్విపై నెత్త 97
''సైరియాంట్యోకస్సు'' సమ్రాట్టు భూమి,
''ఈజిప్టు టోలమీ'' యేల్బడిసీమ
కొస ''మాసిడోన్యంటిగోనస్సు'' నుర్వి
''అవిరసాలెగ్జాండ'' రవనిస్ఫుధరణి 98
''సైరీణ మాఘా'' సుసామ్రాజ్యమందు
ధర్మజయం బెంచఁ దనరె; దిగ్వ్యాప్త
మగుచు; నాటవికులా నాంధ్రపుళింద
కాంభోజ హైతనిక కళింగ జనులు 99

బౌద్ధ ధర్మాలంబ పరిణతులైరి
ధర్మోపదేశకుల్ దరియని తావు
లందును బ్రియదర్శి, యాదరపూర్వ
విజ్ఞాపనలఁ బ్రజల్ విన్నంతఁ జాలు 100
ధర్మాచరణము వ్యాప్తంబుగాఁదనరె.
బౌద్ధ ధర్మవ్యాప్తిఁ బరగె హర్షంబు
పరలోకసాధన పరమ భావ్యముగ
గను బ్రియదర్శికి ఘనమదే కాదు ! 101
ఉభయోర్వి తారకం బుత్తమంబయిన
ధర్మజయంబె నిస్తంద్రదమా దీక్ష
సాధించి, మత్పుత్ర సంతతి వెలయ
యోజించుఁగాత ! యే యుద్ధంబువలదు ! 102
విధిలేక పోరైన విహిత శాంతంబు
సహనంబు, నిహపర సత్య తౌల్యంబు
వారికి లక్ష్యమై వఱలుటకొఱకు
నర్థి శాసనమిది యమరించినాఁడ.” 103

14

చివరి శాసనమిది చెలఁగు నీ రీతి
“విస్తృత సామ్రాజ్య విభుత నేర్పడిన
వివిధ భాగములకు విధ్యుక్తములగు
సారధర్మములతో సంగ్రహాలిపుల 104
ఫణితులఁ బదునాల్గుఁ బరగె శాసనము
లీ లిఖితంబులు నెక్కడేవలయు
పునరుక్తి దోషముల్ బొల్చెఁ, దేనెలను
మించి మాధురి నించు మేల్మి బోధనల 105
మఱి మఱి పల్క సమ్మదమది కాదె ?
ప్రకటముల్ శాసన గ్రంథలోపములు
పరిఢవిల్లియుండు బహుకారణముల;
స్థలము సంకోచమై. సరదు శిల్పియును 106

ఐహికాముష్మిక మమరించు ధర్మ
మర్హాంత పదమందుటదె సార్థకంబు !''

## చతుర్థధార - ఇతర శాసనావళి

### ౧. కళింగ శాసనము

కదన మంతు ముట్టఁగ నశోకప్రభుండు
సభల సూచించె సంస్కార సరణిఁ దేని 107

నదియుఁ గృతియందుఁ, గథలోనఁ గుదురుకొనియె
నదియు కాళింగ శాసనాహ్వాయము గనియె
శేషముఁ త్రయోదశంబునఁ జెలఁగె నిటుల
"పట్ట నవమాబ్ద కాళింగ భండనమున. 103

లక్ష సైనికుల్ హతులైరి లావఱంగ
రోగ బాధల నసువుల నీఁగి రెంద
రకట ! యొకటిన్నరయు లక్షయా జనములు !
ఇదియు జయమౌనె ? కాళింగు లెంద ఱకట 109

చెఱఁబడిరో ? హత్యపాలైరో ? చెన్నుఁవోఁఱఁగి
మరణముల వరించిరో ? యెన్నఁదరముగాదు !
రాజ్యసంపాదనేచ్ఛ కరంబు సెబ్ర !
బ్రదికినట్టిరు కడు దుఃఖభాజనులుగ 110

బహు కుటుంబులు భిక్షువుల్ బ్రాహ్మణాప
లెందరు బలాత్కృత వియోగ మందినారో ?
సాధు సజ్జను లెందఱు బాధపడిరో ?
ప్రభువునకు ఖేదమూలమై పరగె రణము ! 111

ఆటవికజనుల వధింప నడుగు సచివ
వాక్యములు రుచింపవు ! దయాభరుఁడు రాజు !
వారు తమ రోషముల మానవలయు ! - ధర్మ
జయమునే జయంబనె రాజు ! శాంతిమనుఁడు'' 112

## ౨. "ధౌలి" శిలాశాసనము

ధౌలికడ సచివాలికి ధరణివిభుఁడు
తోసలీ పాలనార్థ మద్భుతములైన
సదుపదేశంబులను శిలా శకల ఫలక
మివ్విధముగఁ జేర్కొనుచుఁ జెక్కించియుండె 113
"సజ్జనాభిమతోచిత సాధనముల
నాశ్రయంబుగఁ గొనుఁడు, మీ రనవరతము
ప్రజయు నాసంతు నొకటిగాఁ బరగుఁ గాన
నస్మదుక్త ధర్మముల నాద్యంత మెల్ల 114
జనులు నాచరింపఁగ బోధ సల్పుఁ డీరు
అక్రమంబుల నుద్రిక్తులౌచుఁ గూర్తు
రట్టి మానస కాలుష్య మడపుఁడీరు !
అక్రమంబుగఁ గారాగృహాశ్రయులకు 115
హింసల విధింపకయు జాగ్రదాత్ములగుఁడు !
ఓర్పులేమియు, నిష్క్రియ, యొడలువంగ
కునికి ప్రతిబంధకంబులై యుద్యమముల
సాగనీయ, వుద్యోగులు సత్ప్రవర్త 116
నంబు సహనంబుఁ బూనిక, నాని, ప్రాలు
మాలకయు, తమ విధులలోఁ గ్రాలవలయు;
ప్రభువు నాజ్ఞ లవెట్టివో, ప్రయతులగుచు
సరిగఁ జెల్లింపఁ గల్గు రాజప్రసాద 117
మల్ల దైవంబు నోము; మీ రట్లు చేయ
రేని సుగతి కల్గదు; జేని ఋణము నిల్చు
ఉజ్జయినిఁ దక్షశిలఁ, బ్రజయున్, ద్రయాబ్ద
మొక్క సభగూడు; నైదేండ్ల కొక్కసారి 118

తోసలీజనసభ చేరు; వాసిగన్న
జీవ గౌరవ యుతుల సౌశీల్యపరుల
తథ్య వాగ్విధానముఁ దలఁ దాల్పుఁ డీరు !

## ౩. లఘుశాసనములు రెండు (బ్రహ్మగిరి)

స్వర్ణగిరి దండనాథులు బ్రభుఁడు పంపు 119
ప్రార్థనానుసార "మిశిలఁ" బరగ, సైన్య
పతుల కీరీతిఁ గుశల సంప్రశ్న మొనర
లిఖితమిది శిలాశాసన లిపినిఁ గనుఁడు
"మనితి సార్థ ద్వయాబ్దంబు మతముఁబట్టి 120
యవల షడ్వర్షము లుపాసనాంతరములు
భరతఖండానము న్గల పరమతముల,
సత్యములును గన్పట్టె నసత్యములుగ;
నల ముముక్షువు శ్రద్ధాళువయ్యె నేని 121
పాపుఁ డధికుఁడు నాక నిర్వాణ మొరయు
రాజ్యశుభగతి నెల్లఱుఁ బ్రాజ్యధర్మ
వృత్తి నెగడిన సగమైన వృద్ధిఁ గనును
అల్పుఁ డధికుండు నెవఁడో ? స్వర్గాప్తికొఱకు. 122
నీ ప్రవేక సుబోధ రసేద్ధ మన్న
మాహరించు నిరంతర మతఁడె వొందు
నింద్రియ జయంబుఁ, దుష్టి, నిస్తంద్ర ఘణితి !
నేను బట్టంబుఁ గని పదునేడు నేండ్లు 123
నరిగె, నిన్నాట నేఁబదియారు వర్ష
ములకు మున్నిల తనువొంది యలఘు మహిమ
బోధ సేసిన మహనీయు బోధ యిదియె !
తల్లిదండ్రులను విధేయతఁ భరింప 124
జీవులెడల గౌరవదయల్ ప్రోవుఁగొనఁగ
బంధుగురువులకు సపర్య భక్తిఁ బఱుప

సత్య ధర్మ ప్రవృత్తిఁ బ్రశస్తిఁగనఁగ
వలయు నిదె శాక్యసింహుని వాగమృతము ! '' 125

## ౪. బాభ్రా శాసనము

"సల్లలిత మతజ్ఞాను లాచార్యులార !
బుద్ధ ధర్మంబు చిరకాల ముద్ధరించు
మహి ననిన శాక్య సింహుని మాట వినరె ?
''వినయ సంకాశ''మున ధర్మవిధుల నియతు 126

''లార్యవేషాని'' మునుల మాహాత్మ్యములు, ''న
నాగతభయాని''లో భావి నడరు భయము,
''భిక్షు గీతంబు''లో సత్కథేక్షణములు,
''భిక్షు జీవిత భాషణ'' మిక్షురస, ము 127

దీర్ణ బోధలు గల ''యుపతిష్య ప్రశ్న''
రాహులార్థము బుద్ధోక్తి రంజితమగు
సదుపదేశ ముపన్యాససారమరసి
సత్కృతి శ్రవణ మనన సరణిఁ బొరసి. 128

ప్రజయు సతులును, బోధసంపదలుఁ బొదల
నాతథాగత వాక్కుల నలరుఁడీరు ''

## పంచమధార - సప్తమ శిలాస్తంభ శాసనసారము

అవనిపుఁడు భిక్షువులకు గుహాలయముల
దానమిచ్చిన శాసనద్వయము గాక 129

ప్రభుతమొద లేకవింశతి వర్షమందు
మహితుఁడగు శాక్యసింహు జన్మస్థలంబు
కనకముని ఘనస్తూపముఁ గట్టడముల
దానము లొసంగు శాసనద్వయముగాక 130

వాసి గని యేడు కంబాల శాసనములఁ
బాలన వ్యవస్థ రీతులఁ బ్రజకుఁ దెల్పె

(1) ఇరువదెనిమిదియగునేట నేలుబడిని
నిర్మితములందు లిఖితముల్ ధర్మగతులు 131
మొదటి శాసనపాత్రమై పొదలె (2) జనుల
రక్షణము, నిరుపద్రవ రాజ్యసరణి
మార్గరక్షక ప్రభృతుల మహితవృత్తి
పాపభీతియు సత్కర్మభరముఁ దెల్పి 132
జ్ఞాన దానాది సత్కృతుల్ పూనుటయును
జలచతుష్పాద్ద్విపా జ్జంతుజాలములకు
నుపకృతు లొనర్చు సద్విధు లుత్తమముల,
బౌద్ధనియమ నీతుల రెండవదియుఁ దెల్పె 133
(3) ఆత్మశోధన మిల నవశ్యంబుగాగ
పాపమంటని క్రోవయే పరము నొసఁగు
ననుచు మూఁడవ శాసనం బమరఁ జాటె
(4) రాజు నుద్యోగులెల్ల నిరంతరంబు 134
తల్లివలె బిడ్డలను బ్రోచు దాదులనియుఁ
బాపితతికిఁ బశ్చాత్తాప రూపశుద్ధిఁ
గూర్చి, చెఱఁబడ్డవారికిఁ గోమల మతి
నొసఁగుటాదిగ సద్ధర్మమొసక మొసఁగు 135
సత్యమనియు జతుర్థశాసనము వల్కె
(5) సన్నతాఁబేళ్లు, కౌజులు, సారసములు
బాతులును, చీఁకురేవులు, బల్లు లుడుత
ఏదుపందులు, పావురా లెదుగు రొయ్య 136
లులియు శుకములు, నాడు చీమలును, బెడిస,
లావుబోతులు, దుప్పులు, నాహరింపఁ
జంపఁగూడదు పుష్యమాసమున, శుద్ధ
పాడ్యమిని, జతుర్దశినాఁడు, బౌర్ణవమిని 137
మత్స్య విక్రయ వధలను, మానుఁడనుచుఁ
బాలు, జూలు, మేఁకలఁ జంపఁ బోలదనుచుఁ

గోడిపుంజు విత్తులఁ దీయఁగూడదనుచు
జంతుబలి నిషిద్ధంబు, పుష్యమి మొదలగు 138
వర్జ్యదినముల నుపవాస వాసరముల
నెలకు నాల్గింట వాఁతలు నెఱపఁగూడ
దనుచు; నిరువదియైదు సుహోయనములుఁ
జెఱబడినవారుఁ గనిరి సుస్వేచ్ఛలనుచుఁ 139
బంచమము, కంబమున, లిపిఫణితి వ్రోల్చె
(6) దుష్టకృతుల, దురభ్యాస చరితములను
జనత వీడియు, స్వమత ప్రసన్న ధర్మ
పరత మనుఁడని చాటె, సచ్చరితు లిలను 140
సారె సత్కృతిఁ గనిరనె నారవ శిల
(7) బౌద్ధ విధులను స్వయముగాఁ బఱపె రాజు
మఱి యుపన్యాసములఁ బల్కె మాన్యరీతి
శాసనములఁ జాటెను ధర్మసారములను 141
సులువుగ నరులు మృగములు సుఖముఁ గనిరి
మాత్తె నుపదేశకులచేత, నుత్తమతయు
రాజకృతదాన వినియోగరతియు నెసఁగె
ధర్మ, మననాదులకును బ్రోత్సాహ మమరె. 142
సత్క్రియాధ్వము ల్విపులముల్ శ్రావ్యమయ్యె
పూర్వభూపతు లీ రీతిఁ బొల్చరైన
బౌద్ధపథసాధనము పొందె, పరమహితము
లుపకృతుల నీ యశోకుండు నుర్విఁబఱపె. 143
దయయు నౌదార్యమును బుణ్యధర్మ రతియు.
శాంతి, పరిశుద్ధి, సౌజన్య సత్యములును
జనుల యాచరణంబునఁ బొనరుఁగాత !
పటువులగు నిబంధనలఁ దల్పండు పతియు 144
ముఖ్యములుగ; నాచరణయే ముఖ్యమనియె.
బౌద్ధనీతి సువ్యాప్తికై ప్రభుఁడుఁ జాటె

స_ప్తమంబగు శాసన సరణి నిట్లు
ధర్మమే శాశ్వతంబుగాఁ దనరుఁ గాత 145
నెందు నాచంద్రతారకం బిద్ధమనుచు.

షష్ఠధార - బుద్ధ వివేకసారము (బౌద్ధ షోడశి)

(1) శ్రీ నిహితామోఘ శీల సన్నిహిత
నిర్వాణ మొక్కటే నిరుపద్రవంబు
(2) ఆత్మఁ జర్చింపంగ నలవియు గాని 146
దనుభవ ఘణితినే, యరయంగవలయు
(3) జన్మ వయోరుజల్, చావు దుఃఖములు
ప్రత్యవస్థను జనుల్ బడలికఁ గనుట
సంసృతియుఁ బ్రవాహ సన్నిభంబగుట 147
జన్మాది తర్కంబు సాధ్యంబుగాదు
(4) సకల లౌకికముల శాశ్వతమయ్యు
సత్యదృశ్యముగ విశ్వంబు గన్పట్టు
(5) నిష్కర్మ మెటు లేదు - నియత కర్మమ్మ 148
మనుజుండు సల్పులే మాన్యమై తనరు
(6) అతి భోగమతి తపం బరయ వర్జ్యములు
మధ్యమార్గంబ సమ్మాన్యంబు సూవె!
(7) సర్వ సద్ధర్మముల్ సంఘాశ్రయములు 149
సంఘుంబు హితధర్మ సరణిఁ బెంపారు
(8) సంఘవ_ర్తన ధర్మసంగతిఁ బొనర
వ్య_క్తి జీవిత మఘ వర్జితంబగును.
బుద్ధి నిర్వాణ ప్రఫుల్లతఁ గనును. 150
(9) సర్వ హితశాంతి సౌశీల్యమెనయఁ
బొల్చు దానములచేఁ బుణ్యసంభార
మది శీల పరిమితి, యార్జింపఁదగును
(10) సకల దుఃఖాతీత సమత; వీర్యంబు; 151

నిస్సంసశయజ్ఞాన నిభృతంబు ప్రజ్ఞ;
యతిశయ విశ్రాంతియా ధ్యాన మిదియు
నరయ ప్రజ్ఞాపరిమితియు నమరవలయు
(11) విశ్వమెందును గర్మ వితతమై యుండఁ 152
బొల్చుఁ గ్లేశాబ్ధికి మూలమై తృష్ణ
(12) తృష్ణను దెగఁగొట్టి తెలిసిన తథ్యంబు
నష్టాంగమార్గంబు నలవరించుకొని
దయ, మైత్రి, ముదమును, ధర్మంబు, దనర 153
పరమ జీవాత్మల భ్రాంతిఁ బోనాడి
నిత్యనైమిత్తిక నిష్ఠఁ బోనాడి
కామంబు ద్వేషంబుఁ గడకుఁ బోద్రోసి
విషయ రూపారూప కృషిని బోఁద్రోసి 154
మాన బౌద్ధత్వ సంభ్రాంతుల మాని
నిత్య సంతుష్టుఁడై నెఱయు సుజ్ఞాని
(13) [1]"దురదత్త" దానాన, దొంగ గాకుండ
వధయది [2]"ప్రాణాతిపాదంబు" విడిచి 155
వ్యభిచార [3]"కామమిథ్యాచార" మడఁచి
వడి [4]"మృషావాద" మవశ్యంబు నెడలి
[5]"పైశున్య" [6]"పారుష్య" [7]"వ్యర్థోక్తు" లీఁగి
[8]"వ్యాపాదము" [9]"నభిధ్యఁ" బరవిత్త మోహ 156
వంచనలను వీని వరుసగా నుడిగి
కలఁచు [10]"మిథ్యాదృష్టిఁ" గలుషుండుగాక
ప్రతిబంధకంబులఁ బదియుఁ జెండాడి
శోక విముక్తత సుఖయింపఁదగును. 157

---

1 దొంగతనము 2 జంతువధ 3 వ్యభిచారము 4 అబద్ధము 5 కొండెములు సెప్పుట 6 దుర్భాష 7 సంభిన్నప్రలాపము (వృథా ప్రసంగము) 8 ద్రోహముసేఁత 9 పరధనాపేక్ష 10 అసత్యాభిప్రాయము. ఇందు 1, 2, 3 శారీరదోషములు. 4, 5, 6, 10 వాగ్దోషములు. 7, 8, 9 మానసిక దోషములు.

(14) దేవతాబలులకై దేవులాడకుండు
కులభేదములు లేక సలుపుచుండు న్యాయ;
మీశు గన్గొనె నెవం డేల తపంబు ?
నిర్వాణ మది యొండె, నిత్యమై తనరు.   158
(15) పిన్నల చేదివ్వె పెనువెల్గు నిచ్చు
నగ్ని యల్పంబయ్యు నన్నిటిఁ గాల్చు
సన్నత్రాఁచయ్యును జంపును జనులఁ
బావన జ్ఞానియౌ వాఁడె పూజ్యుండు.   159
(16) శుద్ధోపదేశాళి, సూత్రపేటికను
వివిధ నిబంధనల్, వినయపేటికను
దత్త్వ సిద్ధాంతాభి ధర్మపేటికను
ధర్మ సంస్మృతులఁ గథావత్తునందుఁ   160
బఠనఁ జేసి యథార్థ పథముఁ గన్గొనుఁడు
మాంసభుక్కులు హింసమానుటే బాగు !
భవ్యాధికారార్థ భాగ్యంబులెందు
సద్వినియోగంబు సల్పుటే బాగు !   161
మదిర - జూదమును - సోమరితనం బుడిగి
మంచి మానుషతతో - మను టవశ్యంబు

## సప్తమధార - కాండ సమాప్తి

అఖిల దేవతామయము, బ్రహ్మాండమందు
దాని కణుబింబ మీ చిత్రతనువునందు,   162
సద్వ్యయతఁ బొల్చు నిర్వాణమందు వెలయు
పురుషరూపత్రయు నమేయుఁ బూర్ణుఁ గొలుతు
వత్సరంబంతయుఁ జరిత్ర పఠన మొనర,
బూనిక వహించియును వ్రాయలేని నన్ను   163
నూటెనిమిది దినంబుల దాఁటవేసి
తీవు ! కృతి సముద్రంబు ! కవీంద్రవంద్య !

విశ్వము నీ ప్రతిబింబము
విశ్వమునకు హేయబింబవిధి దేహము, నం
దీశ్వరుఁడ వౌదు వీవే
శాశ్వతపదుఁ గొల్వనిమ్ము! సారనిధి! నినుఁ. 164

స్వామీ! నీకుఁ భృత్యుఁడ;
నీ మహిమయె నాకు రక్ష! నీతి నియతులుఁ!
నీ మహిమ నీవ యెఱుఁగుదు!
కామోపహతుండ నన్నుఁ గరుణింపఁగదే. 165

అక్కజముగఁ దిరుపతి, గయ,
మక్కారోములను, నొక్క మహిమ వెలయఁ బెం
పెక్క భవనామాకృతు
లిక్కథఁ బేర్చుఁగాక నిద్ధయశంబుల్. 166

వేథస్సతి! కృపఁ జేయుము
గాథాబ్ధియుఁ దెసలఁ దొలుకఁ గదలెఁ దరఁగలుఁ
సాధిత మేఁడు, విశిష్టము;
బోధార్థేందుండు మింటఁ బొదలి యెదుగఁగఁ. 167

లౌకిక రాజకీయైక విశ్వమునఁ గ
ల్లయె ధర్మమగుచు దలంపు నొంప
స్వప్న దృష్టాది శేషస్ఫూర్తి వారిదం
బాశా లతాలంబమై రహింప
నెన్నఁడేనియు జీవుఁ డిహముఁబాయుట నిజం
బనుమాట కృతివ్రాయునాశఁ బెంప
మిత్ర విస్రంభ వాఙ్మిహిరప్రకాశంబు
హీనసంకటతమంబెల్ల డింప
హేమలంబి కాలపు దెరనీడ్చి లేవ
దుర్ముఖియు పెడమొగంబయి దొర్లిపోవఁ
జేయు ఋతువది మాఘోత్తరాయణాదిఁ
బద్య "రత్నాకర" స్నానఫణితిమనితి, 168

"రాదికనే "ప్రమోషను," ధరాపతులే తమవారి వారికిన్
గాదనరైరి, నైజమునకై వెతలేలొకో ! మారుమూల మ
ర్యాదలు దూదిపింజ లిల న్యాయము"లంచు జనుల్వచింప నా
కా దృతిపాత్రయయ్యె గవితాంబ పునస్స్మృతిసీతబింబమై. 169

"నైషధకావ్యకర్తృకుని నవ్యతఁ బ్రోచినవారి వార లే
దోషమొ ! తోడుగారు భవదూర్జిత ధర్మధనాగమ క్రియా
పోషకమైన యున్నతికిఁ, బోవునె కాల విభేద దుష్ఫలా
శ్లేషము లెట్టివారి కిఁకఁ జేసెడిదేమి ? గతంబు వచ్చునే ? 170

ముప్పదియేండ్లు భృత్యగతి మోచియు, రాచతికంబు గ్రుల్లినన్
దప్పి, గృహంబుచెంగట నిదానముగాఁ దను వీడ్చుచుంటి వో
యప్ప ! కవీంద్రకైరవ సుధాకర చారునవోక్తిపూరముల్,
చొప్పడఁ జెప్పు కావ్య"మనుచున్ హితులందఱు గూడియాడినన్.

ఆర్షమతి; వసిష్ఠాన్వయుఁ డన్నదాత
సుకృతి, కల్లూరి "యజమాన సుబ్బరాయ
మౌళి" నాజనకుండు లక్ష్మాంబతల్లి
జ్యేష్ఠుఁడై ; చదువు లయ్యల శ్రేణినుంటి. 172

విశ్వవంద్యుఁడు శ్రీరాఘవేంద్రఋషియు;
సారకరుణాళు వతని యర్చనముఁ జేసి
రచనఁబూనితి; నమ్మహావ్రతి కృపాంబు
ధారఁ జివురువెట్టెను దేవతరువు కవిత ! 173

మా చిరంజీవి; సీ - వి - రామాఖ్యరాయఁ
డనుజుఁడు సుధీయుతుఁడు, ధైర్యమూదుకొనగ
పొత్తమల్లితి నొప్పొ ! తప్పొ ! యెఱుంగ !
లోకకృతికర్త నా కృతి కేకభర్త ! 174

తిష్యరక్షితమతిని సంధించి పిదప
శాసనాంత ర్లిఖితముల వాసిదెల్పి
బౌద్ధమత సారబోధనల్ భద్రపఱచి
చెప్పితిఁ జరిత్రయును బరిశిష్టకృతిని. 175

మండలం బనుదినమును మాపొ రేపొ
యెవ్వరేనియు గ్రంథమహీనభక్తిఁ
జదువ వారికి నాయుః ప్రశాంతులిచ్చి
ప్రోతునంటివి! శ్రుతిఁబడె! బుద్ధదేవ!
ఈశసుమతాదిదేవ! శుభేద్ధభావ! 176

ఎలవయసున్ మహాబ్దములు నేబదియైదునుజాఱె; దుర్ధరో
త్కలికలు, నర్ధకాంక్షలుడుగన్ గడు దూఱు కుటుంబగాధలన్,
కలఁగెడు దీనులన్ గడఁగికావఁ బదస్థులుఁ బెట్టువేధలన్,
దలఁకిన నన్ను నెట్లు కవితన్ బనిగొంటివొ? చోద్యమీశ్వరా. 177

పల్కిన పల్కులాశ్రితులు పావనవేదవచో నిరూఢినే
జిల్కు సుబోధమాగమ విశిష్టత నెన్నఁగనైదునేబదేం
డ్లేల్కొని తీవు దేవ! తనువింకను డస్సి జరాభరంబునన్
గీల్కొనుమున్ ద్వదంఘ్రియుగ కింకరుగా మనఁజేయు మీశ్వరా! 178

వరగతి నీ ప్రబోధమతి భక్తినిఁజేఁపగ *రక్తనేత్రకే
తొఱఁగిన నా కవిత్వమెటుఁ దోఁచదు విస్మృతిబల్మి; నీవె నా
కుఱఁగలి నిల్వ భారతి యొకోవచియించెను; కావ్యపూర్తియున్
దొరసె! నివే ప్రణామములు! దుష్టనిబర్హణకీర్తి! మారుతీ! 179

నా జీవత్పితృపాదులిచ్చెడు నుదీర్ణాశీర్వచస్సంపదల్
నీ జాగ్రన్మతిరూప సంస్మృతి, కృతిన్ నిర్మింపఁ దోడయ్యెఁ గా
కోజన్ బాండితిలేదు; భక్తి సహజం బుద్దామ వాగ్ధాటియే
నైజంబై, హనుమా! భవత్కృప శరణ్యంబయ్యెఁ బ్రాణాకృతిన్. 180

* రక్తాక్షి సంవత్సరము.

సమరశంఖారవ శ్రవణమైనంతనే
పారతంత్ర్య మడంపఁ బాటువడియె
గాంధి మహాత్ముని కనుసన్న మెలఁగుచు
మహిత దేశాశక్తి మాన్యత గనె
నాపశేలు మనంబు నచ్చెరువొందగా
సచివతకై చెయిఁజాపఁడయ్యె
పతితవర్గముదెసఁ బరమప్రియుండయి,
సిల్గులడఁచె దయా సింధువగుచు

నాశ్రితప్రియుఁ డతఁడు నిర్వ్యాజమమత
నలఘు చరిత లాధారము ల్గలుగు కృష్ణ
రాయముఖ్యుల విడిచినన్ వ్రాయఁబంచెఁ
బ్రభు వశోకుని కథను; సుబ్రాయమహాళి. 181

అధిక రాజకీయ వ్యవహారనిపుణ
మతియు, నశ్రాంత కార్యసమ్మానగతియు,
దనరియును గర్వపడఁడు ! సద్బంధుభాగి !
పుణ్యగణభోగి ! సత్కలాపూర్ణ యోగి ! 182

పొట్టి శ్రీరాములను 'విధి' వోయె నింగి
కెరగ; నాంధ్రప్రదేశావతరణకార్య
వార్థి మథిత విషాహారి "ఫాలనయనుఁ"
డా ప్రకాశంబు దివికేగె; "నబ్జనాభు"
రహిని నిల్చెఁ గల్లూరి సుబ్రాయమహాళి. 183

బలియుఁ డతని విశ్వాసము
బలిమిని మాసములు నాల్గు వాలకమును పే
యలవోక ముగిసెఁ గాండము
లలఘు కృతియు వేంకటేశ్వ రాంకితమగుచున్. 184

జీతము రాదు 'పెన్న' నది చెచ్చెఱసేమియుఁ బంపలేదు నా
చేతము నొచ్చె లేవడినిఁ జేరెడు కన్నుల మిన్నురోయు, సా
గాతరుఁజేరి యాదృతినిఁగాచిన దాతను, సత్రసాలవం
శాతతభవ్యు సుబ్బయ ననంత శుభంబుల నోము నీశుఁడుక్. 185

పాలిత బంధువర్గుఁడు, కృపాపరతంత్రుఁడు, మేడవంశ్యుఁ డు
ద్వేలవనప్రకాండుఁడు నవీన కథాశ్రవణ ప్రమేయుఁడై
మేలిమి ముద్రణంబునకు మేకొనె వృద్ధుఁడు సౌమ్యమూర్తి; నం
ద్యాల నివాసి శేషయకు నబ్బునుగాత సమస్తభాగ్యముల్. 186

శ్రీపతి, శుభంబులిచ్చి రక్షించుగాత,
నాయురారోగ్యమైశ్వర్య మవిరతముగ !
'మేడ రామయ్య' నెపుడు - సన్మిత్రుఁ డతఁడు !
గ్రంథ ముద్రణమునుఁ బూర్తిగాఁగఁ జేసె. 187

ధీ సముద్రుఁడు కవిరాజు దీక్షితులను
సద్విమర్శకు లక్ష్మణాచార్యు సుగుణ
గణ పరిచయాఢ్యు, నాగభూషణ మనీషి,
మత్కృతికి హితులగుట నమస్కరింతు
సన్మతుల భీమ ముఖ్యుల సంస్మరింతు. 188

సుసమగ్రాశోక కథా
వసుగిరిఁ బరికించి, చరిత వ్రాసిన, విద్వ
ద్రసికుని భావింతు సుధీ
లసితుక్ ఘను బేతపూడి లక్ష్మీకాంతుక్. 189

వ: అనంత బ్రహ్మాండంబె భువనంబుగ, విశ్వాలక్ష్మియే పరిగ్రహంబుగ, నలువయె నిసుఁగుగా, శివుండు పౌత్రుండుగా, శయ్యా శేషుండుగాఁ బరగు నయ్యాది దేవుండును; గరుడేంద్రాగ్నియమ నిఋుతివరుణవాయుకుబేరేశానులును; విష్వక్సేనవిఘ్నేశ్వరులును; అత్రిమరీచి కుత్సపులహ పులస్త్యక్రతువసిష్ఠ మిత్రావరుణ కౌండిన్య



శ్రీ నంద్యాల మేడ శేషయ్యగారు,
కృతిముద్రణకర్త.



శ్రీ శేషయ్యగారి సతీమణి
శ్రీమతి నరసమ్మగారు

శక్తి పరాశర వ్యాస జమదగ్ని భృగు మాండవ్య విశ్వామిత్రాగస్త్య గౌతమకార్వ భరద్వాజాది ఋషి పుంగవులును; గంగా సింధు యమునా సరస్వతీ గోదావరీ నర్మదా కృష్ణా భైమీ ఫల్గు సరయూ గండకీ గోమతీ కావేరీ కపిలా తుంగభద్రా వేత్రావతీ, ప్రముఖదివ్య వాహినులును; బ్రహ్మ పుష్కరంబును; శ్రీమేరు హిమాచల మందర కైలాసమహేంద్ర శేషాచల త్రివిష్టపమలయవింధ్య సహ్యా శ్రీశైల రైవతక సింహగంధమాదన మైనాక గోమంతకాది భూధరంబులును; వేదోపనిషత్పురాణాగమ తర్క వ్యాకరణస్మృతి కావ్యాలంకృతి నీతి నాటక సంగీతాయుశ్శాస్త్ర ధనుర్విద్యాది చతుష్షష్ఠి కళావాఙ్మయ రత్నదీపంబులును; షడ్దర్శనంబులును; భారతరాజ తరంగిణీ ప్రముఖేతిహాసంబులు; నాదిత్యేందుకుజ బుధ గురు శుక్ర శని రాహు కేతువులును; బదరీ కాశీ ప్రయాగా వంతి మధురాయోధ్యా కాంచీ ప్రభృతి క్షేత్రంబులును; మేషాదిరాసులును; నశ్విన్యాది తారాగణంబులును; యోగకరణ వార మాస ఋత్వబ్దంబులును; సంధ్యారాత్రులును; నండస్వేదోద్భిజ్జరాయుజ స్థావరజంగమ చేతనాచేతన విశిష్టావశిష్ట సర్వ విసృష్ట జగంబులును; బ్రహ్లాద నారద పుండరీక విభీషణ బాహ్లీక బలిదధీచిధ్రువ సుషేణ ఋషభ చండీశ బాణాదివైష్ణవ శైవ భాగవతులును; స్వాయంభువాది మనువులును; మరుద్వసురుద్రాది దేవతానికురుంబంబులును; మార్కండేయ కృపాశ్వత్థామాంజనేయ పరశురామాది చిరంజీవులును; శివు నష్టమూర్తులును; చండికా వైష్ణవీ కుమారీవారాహీమాహేశ్వరీ బ్రాహ్మీ మహేంద్రీ ముఖశక్తులును; పూర్ణ లోకాయత బౌద్ధ జైన మీమాంసా పాంచరాత్ర భట్టాచార్య శూన్యాది మతంబులును; హరిశ్చంద్ర నల పురుకుత్స పురూరవ సగరకార్తవీర్య చక్రవర్తులును; న్యగ్రోధప్లక్షౌదుంబరవేత సాశ్వత్థాది మహీరుహంబులును; గాత్యాయనపతంజలిపాణిని ప్రముఖ మునులును; దత్తాత్రేయాద్యవతారంబులును; నరనారాయణకృష్ణ కపిలాది సిద్ధవిభూతులును, ననంగకుసుమాది యోగినులును, శుశ్రూష శ్రవణగ్రహణధారణ సదూహార్థ విజ్ఞానతత్త్వ నివేదనాభ్యుదయ గుణంబులును; వజ్రశక్తిదండకుంత పాశ ధ్వజ ఖడ్గత్రిశూలాంకుశ

ధనుర్విద్యాత్రింశాద్యాయుధంబులును; అష్టసిద్ధులును; షోడశమాతృకా, షోడశ చంద్రకళా, షోడశ కావ్యధ్వనులును; గయాంబరీష శశిబింద్వ సంగ పృథు మరుదుత్తానపాద నహుష సుహోత్రధర్మ భరతేక్ష్వాకు శ్రీరామదిలీప నృగరంతియయాతి మాంధాతృ భగీరథ రాజేంద్రులును; దైనందిన శుభార్థంబు బొసంగ (రమారమి ముప్పదేండ్లు గడచనియు, రాగిరువ్వాయు నార్థికంబుగఁ బ్రతిఫలం బొదవింపని "యాంధ్ర వాఙ్మయసంగ్రహ చరితంబు," గద్యగా, నాంగ్లేయ విమర్శనాను రూపంబుగ మున్నెను విద్యార్థి దశలో రచించిన ఫక్కినే నేఁడును గల్పితంబై [1] కథా సందర్భానురూప ప్రకృతిరంగ చిత్రంబులు, [2] పాత్ర ప్రత్యక్షీ కరణ కారణ వేష చేష్టాది వివరణంబులు [3] పాత్రోక్తికృత కథా పరిణామనిరూపణంబులును [4] మనః ప్రవృత్తి బోధక వర్ణనంబులు [5] నిర్వచనదృశ్యానుకరణ శబ్ద ప్రయోగ విధానంబులు ననఁబరగు నాంగ్లేయ కావ్యలక్షణ పంచకంబును, యథా శక్తిని బ్రదర్శించు వాక్తరంగిణుల కూడలియై, బోధార్థేందు విజృంభిత గాథాంబుధియునగు నీ యశోకశాంతి సమ్రాట్చరిత్రం బవధరించు వారలకుఁ, బాఠకులకు, ననవరత శ్రేయంబులు గురియ, నా చంద్రతారార్క మఖిల దిగ్విశ్వ వ్యాప్తంబుగా కావ్యంబు దనరారుఁ గాత! 190

"ఓం-తత్-సత్-కృతిశాంతిరస్తను"చు, వేదోక్త ప్రమేయోల్లసత్
శాంతిన్ బల్కి ఋషిస్తుతన్ దశదిశాంతన్యస్తపాదాంబుజా
క్రాంతాంభోధిహిమాగ సింహళతటీకాంత్యుజ్జ్వలత్తాండవా
శ్రాంతన్; 'భారతమాత' నభ్యుదయదస్వాంతన్ బ్రశంసించెదన్. 191

సమస్తమంగళాని భవంతు



# శుద్ధపత్రము



| పేజి | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 41 | గల్లలయ్యె | గానఁజేరె (పాఠాంతరము) |
| 9 | 44 | సేవ | సేన |
| 10 | 45 | యురురాష్ట్రి | "మహారాష్ట్రి" |
| 11 | 49 | చరను | చరమ |
| 43 | 40 | చలికాపు | చలినాపు |
| 49 | 71 | గర్భాలయ | గర్భాలయు |
| 50 | 77 | కరజ్జమేమొ | కర్జమేమొ |
| 55 | 106 | బ్రహ్మణి | బ్రాహ్మణి |
| 56 | 111 | ఋతువువేగు | ఋతువేగు |
| 60 | 136 | నిల్చ | నిల్ప |
| 69 | 184 | ఘనంఘణా | ఘణంఘణా |
| 72 | 199 | దాయము | దామము |
| 90 | 81 | నపాప్రథ | నపప్రథ |
| 93 | 95 | యెవఁడొ | యెవఁడో |
| 118 | 106 | సమగ్ర | సుసమగ్ర |
| 122 | 122 | నట | వట |
| 126 | 148 | తండ్రియన్ | తండ్రియున్ |
| 132 | 183 | దెప్పరిల్లు | దెప్పిరిల్లు |
| 141 | 41 | పడక్ | పడుక్ |
| 141 | 40 | వొదవె | నొదవె |
| 143 | 55 | పాయ | బాయ |
| 145 | 63 | స్వస్తిజయత్రయైక - | స్వస్తిజగత్రయీయాసు (పాఠాంతరము) |
| do | do | వసుంధరాక్ర...విశేష ! | పయోధివేల్లిత ధరావిజిగీష ! |
| 147 | 77 | మొకండడది | మొకండె |
| 150 | 96 | బుభూర్త్షువు | బుభూర్షువు |
| 154 | 121 | విభాగ్య | విభాజ్య |
| 164 | 175 | దాసె | దార |

| పేజి | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 169 | 200 | భంగమగుచు | భంగయగుచు |
| 171 | 210 | మూరక | నూరక |
| 175 | 6 | సుమనను | సుమనసు |
| 178 | 24 | మిందిడి | మందిడి |
| 183 | 52 | జేరును | జేరెను |
| 184 | 55 | పొదదివి | పొదివి |
| 186 | 65 | నిరాకాశో | నిరాశో |
| 189 | 82 | వాసంతో...కలకలమ్ము | వాసంత లతాంతోత్సవస్ఫూర్తికోకిల వాక్యఫణితి (పాఠాంతరము) |
| 191 | 94 | నాస్త్యము | నాస్యము |
| 194 | 108 | వెల్తురు | కాంతులు |
| 196 | 119 | విచారరహితుకంటె | కుతర్కమతికిఁబోల్ప |
| 199 | 140 | సమపి | సమసి |
| 211 | 201 | నూరినుతమగు | నూరతంబగు |
| 221 | 249 | డిండిర | డిండీర |
| 222 | 256 | కొలాహ్లను | కోలాహ్లను |
| 229 | 292 | నారు | నాల్గు |
| 231 | 299 | పూజ్వార్య | పూజ్యార్య |
| 238 | 38 | దడవని | దవని |
| 242 | 65 | మడుగులో | మడుగుతో |
| 261 | 181 | శక్తి | సక్తి |
| 262 | | భువస | భవన |



# రెండవ శుద్ధ పత్రము (ఛందస్సు)

| పేజి | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 42 | 34 | కాల్యంబు | బ్రాప్తంబు |
| 43 | 39 | రాజు వడఁకుగొనంగన్ | నృపలలాముఁడు వడఁకన్ |
| 43 | 42 | బంచిన | బంబిన |
| 53 | 95 | యా | య్యున్ |
| 61 | 141 | నెలత | మెలఁత |
| 64 | 156 | నున్నయామె | వలయునామె |
| 67 | 173 | జిఱపు | నెడఁగ |
| 71 | 196 | పన్నంబుల | పాద్యంబుల |
| 80 | 21 | మృదువుగ | మృదువుల |
| 90 | 79 | తార్కిక | మాయిక |
| 90 | 80 | చంద్రుఁడెన్న | చంద్రుండెన్న |
| 95 | 110 | మేకొన | వెన్కొన |
| 99 | 130 | గ్రీడారంగపు | గ్రీడాంకణపున్ |
| 104 | 23 | ప్రమోయఁగ | వీఁగగ |
| 113 | 77 | దుర్వివిమాత్న | నాఁజడిదుర్వి |
| 120 | 116 | వితీర్ణగుణదీప్త | వితీర్ణి ఘనతాప్త |
| 122 | 121 | జూడజని | సరణిజని |
| 122 | 125 | దిశన్‌జని | మొగంబయి |
| 137 | 16 | మనీష | సమీక్ష |
| 139 | 27 | తోడ నాదిలోన | వరకు మలసి, య |
| 145 | 63 | ఘటితోరు | పటిమాత్త |
| 159 | 149 | దొరయున్ | దొరయన్ |
| 179 | 31 | వారణైక విధ్యుక్త కృతుల్ | వారణప్రణిహిత క్రమమున్ |
| 185 | 57 | కోద్గాథ తతిన్ | కేద్ధసుగాథల్ |

ప.రా:— కొన్నియెడల నఖండయతి; గృహీతము.

శ్రీరస్తు

# శ్రీమదశోకచరిత్రము

## పరిశిష్ట భాగము - ప్రథమానుబంధము

### చారిత్రకవిషయ సమన్వయము

శ్రీ విన్సెంటు స్మిత్ ప్రోక్త కృతినుండి సముద్ధృత విషయము లీ క్రిందివి నాచే నాంధ్రీకృతములు.

"క్రీ. పూ. 273 లో సెల్యూకసు మరణానంతరము బిందుసారుని పుత్త్రులలో నొకఁడగు నశోకవర్ధనుఁడు (సామాన్యముగా నశోకుఁడనఁబడినవాఁడు) పాటలీపుత్ర సింహాసన మెక్కి నలువది సంవత్సరములు రాజ్యపరిపాలనము చేసెను. అశోకుఁడు చక్రవర్తి యగుటకుఁ బూర్వమే తక్షశిలాప్రాంతమున తొలిసారియు, నుజ్జయినీ ప్రాంతమున మలిసారియు, రాజప్రతినిధిగ నుండెనను నైతిహ్యమును నిజమనియే భావింపవచ్చును. అశోకుని పట్టాభిషేకము 273 మొదల్కొని నాల్గు సంవత్సరముల వఱ కాపుచేయఁబడె ననుటయు సత్యమనియే తోచుచున్నది. ఈ దీర్ఘాలస్యముచే రక్తపాతమున కిరవై రాజతిలకము నొందుట కహమహమికతో బెరసిన సంఘర్షణ మొండు సంభవించియుండు ననుట కవకాశము కలదు. కాని యట్టి సంఘర్షణ మొనరె ననుటకుఁ దగిన స్వతంత్ర సాక్ష్య మేమియును గానరాదు. అశోకుని చరిత్రలో పాఠకుల కభిరుచి, మతవిషయక మానసికప్రవృత్తి పరముగనే వర్తించును. ఈ యభిరుచిమాత్రము శాశ్వతమైనది. చరిత్ర పాఠకుఁ డెవఁడును దీనిని విస్మరింపఁ జాలఁడు. ఓమరు ఖలీఫా, కాన్‌స్టంటయిన్ రాజేంద్రుల పంక్తికిఁ జేరినవాఁ డశోకుఁడు. అశోకుఁడు తన పూర్వవయస్సులో శివభక్తి ప్రధానమగు బ్రాహ్మణమతమునే యనుసరించుచు సామాన్య హిందూ భూపునివలెనే మనె నను నైతిహ్యమును మనము విశ్వసింపవచ్చును. క్రీ. పూ. 261 లో బంగాళాఖాతము తీరమున గోదావరీ మహానదులమధ్య గల త్రికళింగుల కళింగరాజ్యమును సామ్రాజ్యమునఁ గలిపివేయ నతఁడు ప్రయత్నించెను. యుద్ధమును విజయాంతముగ సాధించిన యశోకనృపతి కాఖండనభూమిలోని భీభత్సాకరదృశ్యములు మఱపురానివై కలఁచినవి. బహుశా, యిప్పటి ధౌలీపట్టణమే యనఁదగిన యొరిస్సాలోని పూరీజిల్లాలో నుండిన తోసలి యను రాజధానిలో రాజవంశీకుఁడగు తన ప్రతినిధి, నూతనార్జిత కాళింగభూమిని పరిపాలింప నేర్పాటయ్యెను. పట్టాభిషిక్తుఁడైన తర్వాత నవమ వత్సరములో సామాన్య బౌద్ధమతస్థుఁడై యుండి యవ్వల రెండున్నర సంవత్సరములకు - అనగా రాజ్యాభిషేక త్రయోదశవర్షంబున క్రీ. పూ. 257 లో మతమునందధికాసక్తిని బ్రదర్శించుచు రాజ

శాసనంబుల నశోకుఁడు వెలువరించెను. తన షష్ఠ స్తంభ శాసనమున నర్యేఁటి నుండియే శాసనంబుల వెలువరించితి నని యతఁడు ప్రకటించెను. ప్రపంచములో జన్మించిన మానవుఁడు తాను వహించిన స్థానము ననుసరించి చేయవలసిన యాధ్యాత్మిక సాంఘిక నైతిక విధ్యుక్త బాధ్యతలన్నియు నొక్కుమ్మడిగ నిరూపించునట్టిదియ హిందూధర్మమై యున్నది. కనిష్ఠ శిలాశాసన ప్రథమములో నశోకుఁడు "అధములు నుత్తము లందరును ధర్మ మనుష్ఠింప యత్నింపవలె" నని యుగ్గడించెను. ఇది యాతఁడే నిర్వచించినట్టి స్వవాక్యమై యుండనోపును. బౌద్ధసూక్తులు "ఉన్నతులకు ధర్మనిష్ఠ కష్టము" అనునది మొదలుగాఁ గ్రైస్తవ నీతులను స్మరణకుఁ దెచ్చును గాని బైబిలులోని ముఖ్యాభిప్రాయ మశోకుని నీతిపద్ధతికి విభిన్నమైనది. ప్రాఁత నిబంధనలో గాని క్రొత్త నిబంధనలో గాని మానవునకు భగవంతునితో గల సంబంధము పైనను, భగవంతుని యనుగ్రహముపైననే మానవుఁ డాధారపడి యుండునను భావము పైనను నీతి విధింపబడినది. జైన జరాతృష్ణ స్టాయిక్ సిద్ధాంతముల కనుబంధమైనది బౌద్ధుల మానసికస్థితి! అది క్రైస్తవ సిద్ధాంతమునకు వ్యతిరేకమైనది. అశోకుఁడు - భిక్షుకుఁడు రాజును గూడనై యుండుననుట నిర్వివాదాంశము. బుద్ధునకుఁ బూర్వ మట్టి బుద్ధు లవతరించి యుండిరను విశ్వాస మా కాలమునఁగూడ నుండినదే. ఈ విశ్వాస మెట్లుత్పన్నమైనదియు నెవ్వ రెఱుఁగరు. అశోకుని దేశికుఁడగు నుపగుప్తుఁడును చారిత్రక పురుషుఁడుగనే గన్పట్టుచున్నాఁడు. అశోకుఁడు నానా ప్రదేశములలో మతబోధక సమాజములను (Mission) సమగ్రముగ నేర్పరచుట ప్రాముఖ్యమైన విషయము. మతబోధకులకు దన విశాల సామ్రాజ్యమం దంతటను, పొలిమేరలందే కాక పశ్చిమాసియా, తూర్పు యూరప్పు, ఉత్తరాఫ్రికా ప్రాంతములకుఁగూడ పంచెను. శాసనములలోఁ బేర్కొనఁబడిన రాజేంద్రు లందరును నొకే కాలమున జీవించియుండి నని క్రీ. పూ. ౨౫౮ యగుటచే నదియ మతబోధకు లాయుగపు నాగరకవిశ్వ మంతట నలుమూలల కరిగిన సమయము కావచ్చును. సిలోను కరిగిన ప్రబోధకుఁడు (apostle) చక్రవర్తి కొడుకు గాఁడనియుఁ, దమ్ముఁడనియు ననుకొందును. మధురా ప్రాంతమును ప్రదర్శించిన చైనా రాయబారి దాక్షిణాత్యులమధ్య బౌద్ధారామము లేర్పరచినది తమ్ముఁడగు మహీంద్రుఁడనియే వాకొని యుండెను. కాని సింహళపు పురాతన వ్రాఁత లతనినిఁ గొడుకుగఁ జెప్పినది కల్పనగా నోపును. అశోకుఁడు సకల మతములలోను మంచి యున్నదనియే నమ్మెను. ఆతఁడు పరమత సహిష్ణువు. కాని యతని కాలమున నిస్లాము, క్రైస్తవమతములవంటివి, పరాక్రమణ పటువులు, ప్రత్యేకములు, (Militant & Exclusive) నైనవి లేవుగదా? కాశ్మీర చరిత్రలో నశోకుఁడు పునర్నిర్మాణము చేసినవి క్రొత్తగాఁ గట్టినవియునగు బ్రాహ్మణ దేవాలయములు పేర్కొనఁబడినవి. ఔషధాలయములు శాసనములలో నెన్నఁబడలేదు కాని యశోకుని తర్వాత ఆరున్నర శతాబ్దములకుఁ బాటలీపుత్రమును దర్శించి యందున్న గొప్ప యాస్పత్రిని, అశోకుని కాలమునుండి యున్నట్టిదిగా వర్ణించుటచే నా కాలమున ననేకము లవియు, స్థాపితములయ్యె ననవచ్చును. నైతిక ధర్మమును సర్వోత్తమముగా బుద్ధమత మెన్నినది. మృగములయెడఁ గనికరముజూపుట క్రైస్తవరాజులచేఁ గూడ ననుష్ఠింపఁబడలేదు. అశోకచక్రవర్తి బానిసలను, భృత్యులను, జీవజంతువుల

నొక వర్గమునకుఁ జేర్చి దయ యావశ్యకమని యుద్ఘోషించినాఁడు. జైన కృతుల నుండి జైనమతాభిమానియగు సంప్రాతియను నశోకుని పౌత్రుఁ డుజ్జయినిలో నతని తర్వాత నేలెనని తెలియుచున్నది. పూర్వభాగమునఁ గల సామ్రాజ్యము, దశరథుఁ డనువాఁ డశోకుని పిదప పాలించినట్లు లైతిహ్యమున్నది. కాని శాసనములవలన నశోకుఁ డనేక పుత్ర పౌత్రులను గల్గియుండెనని విశదమగుచున్నదే కాని యందు "కారువాకి" యను నతని రెండవరాణి పేరును "తీవరుఁ"డను కుమారుని యాహ్వాయమును మాత్రము కానవచ్చుచున్నవి. ఆ పుత్రుని గతి యేమైనదియు మన కించుకయుఁ దెలియరాలేదు." అని తన యశోక చరిత్రలో (Rulers of India Series) చరిత్రకారుఁడగు విన్సెంటు స్మిత్తు దొర పేర్కొన్నాఁడు.

## II

మెగస్తనీ సను గ్రీకురాయబారి స్వయముగాఁ జూచిన విషయములు కొన్ని :-

"గంగా శోణా సంగమ స్థానమున పాటలీపుత్రము 10 మైళ్లు పొడవు, 2 మైళ్ల వెడల్పును గలిగి 570 బురుజులు 64 ద్వారములతో నొప్పియుండెను. చుట్టును గందకము 600 అడుగుల వెడల్పు, 30 అ. లోతు కలిగి యుండెను. మగధరాజ్యమున బానిసలు లేరు. ప్రజలు తత్త్వజ్ఞులు, వ్యావసాయికులు, వణిజులు, శిల్పులు, యుద్ధవీరులు, చారులు, సభికులు నను తెగలుగ నుండిరి. రాజమార్గముల దూరము దెలుపు స్తంభము లుండెను. భూ సంబంధవృత్తికారులు, గనులు త్రవ్వువారు, మృగయులు నుండిరి. నీటిపారుదల భూమికొలతలు చేసి భూమి పన్ను వసూలు చేయుచుండిరి. సైన్యాంగము; ఆరు లక్షలు కాలిబంట్లు, ముప్పదివే లశ్వబలము, ఎన్మిదివేలు రథబలము, తొమ్మిదివేలు గజములు నుండెను. ప్రతియుద్ధ వీరుఁడు నొకబల్లెము, విల్లు ధరించెను. వారి బాణ మెట్టి డాలునుగాని కవచమునుగాని భేదించును. జనులు సత్యసంధులు, దంభ విరహితులు, మితవ్యయులు నై యుండిరి. యథాయోగ్యులు, విశ్వాసపాత్రులై యన్యోన్య సుఖజీవనము జేసిరి. చారులు సూక్ష్మగ్రాహులు సత్యసంధులు నగుటచే వారి మూలకంబుగా రా జంతయు నెఱుంగటచే చార నియామకము రాజునకుఁ బ్రజకు నానందోత్పాదకంబయ్యె."

## III

ఆర్యులు (బ్రాహ్మణులు) దూరమునుండి దావాగ్నితుల్యాస్త్రములను బ్రయోగించి రని అలెగ్జాండరు చక్రవర్తియు, 'ఫిలాస్ట్రాటస్స' ను నతఁ డార్యులు సుడి వాయువులను పిడుగులవంటి యస్త్రములను వాడిరనియు, మఱికొందరు సర్వసైన్య పట్టణాది విధ్వంసక తైలము లార్యులకడ నుండెనని వ్రాసియున్నారు.

## IV

బేతపూడి లక్ష్మీకాంతరావుగారి యశోకమహారాజుగారి చరిత్రనుండి యథారూప సంగృహీతములు కొన్ని :-

"చంపా గ్రామవాసియగు బ్రాహ్మణుని కూఁతురయిన సుభద్రాంగిని నామె జనకుఁడు పరిణయార్థము బిందుసారునకు సమర్పింప రాజభార్య లామెను దాసినిగాఁ గైకొనునట్లు తంత్రము చేసిరి. పదంపడి యామె దన కౌశల్యముచేఁ దాను బ్రాహ్మణ కన్య యగుటను బిందుసారునకు బ్రకటపఱచి నమ్మించి ప్రభువుయొక్క ప్రేమను బడ సెను. అశోకుఁడు, విగతశోకుఁడు నను పుత్రద్వయంబు బిందుసారునివలన నామెకుఁ గలిగిరని నేపాళదేశమందున్న భరతఖండ పూర్వ చరిత్రవలనఁ దెలియుచున్నది. అశో కునియందు మహావీరలక్షణంబులను గనిపెట్టినను, ఆయన దైవబలంబు గలవాఁడని గ్రహించినను, బిందుసారుఁ డశోకుని దలఁపక జ్యేష్ఠుఁడగు సుషీమునే రావించెను. కొన్ని కారణంబులచే నమాత్యాతివర్గం బతని యందు బద్ధ ద్వేషంబై కుహకవృత్తిచే నతఁడు మరణించునటుల చేసి, యశోకుని రాజ్యపదంబునందు నిల్పినటులఁ దెలియు చున్నది. జనకనియామకంబున నశోకుఁ డుజ్జయినియందు రాజప్రతినిధిగ నున్నప్పు డొక వర్తకుని కుమార్తెను బాణిగ్రహణంబుఁ జేసికొని, యామెవలన మహేంద్రుఁడను పుత్రుని సంఘమిత్రయను పుత్రికను బడసి తాను పాటలీపుత్రమునకుఁ బోవునపుడు హీన స్త్రీ యనుచు నామెను విడిచివెళ్లెనని సింహళ చరిత్రలయందున్నది. (14వ పేజి)

అశోకుని ప్రభుత్వకాలముయొక్క యాద్యష్ట వర్షంబుల విశేషంబులను చరిత్రలు గాని శాసనములుగాని విశదపఱచి యుండలేదు. తొమ్మిదవ సంవత్సరంబునఁ గళింగ రాజ్యముపైన నశోకుఁడు యుద్ధయాత్రఁ జేసెను. ఘోరయుద్ధానంతరము దిగంత విశ్రాంతకీర్తి సమేతయై జయలక్ష్మి, యశోకుని భుజదండంబుల నలంకరించెను. ఈ జయంబును బరరాజ్య సంపాదనంబు నశోకున కానందంబు నొసంగక యెడతెగని విచారంబులకుఁ గారణంబులయ్యె. మఱియు నీ జయశాలి తన విచారంబును విజితుల కష్టంబులను శిలాక్షరములతో శాశ్వత వచనంబులఁ జేసెను. అశోకుఁడు తాను నిర్మిం చిన శాసనములందుఁ బ్రియదర్శియను నామాంతరంబు వహించెను. కళింగ యుద్ధా నంతరము 5 సం॥ లకు నిర్మింపఁబడిన పదుమూఁడవ శిలాశాసనంబునఁ దన విచారం బును లిఖింపఁజేసెను. "ధర్మజయమే జయ" మని ప్రభువుయొక్క తలంపని వ్రాయఁబడెను. (16, 17 పేజీలు)

అశోకుని తర్వాత 1000 సంవత్సరములకు నీ దేశమున కేతెంచిన చీనాదేశ యాత్రికుఁడు శిలాప్రతిమలయం దశోకుఁ డొకవిధమైన భిక్షువేషము ధరించినట్లుండె నని లిఖించెను. బోధివృక్షశాఖను సింహళమందు స్థాపించిరి. ఈ వైభవంబంతయు సాంచీవన ప్రాక్శిలా ద్వారమందుఁ బ్రతిమాకారంబుగాఁ జెక్కఁబడియె. తూర్పున రాజకీయుఁ డొకఁడు హయావరోహణం బొనర్చునట్లున్నది. ఈ రాజకీయుం డశోకుండయి యుండును. అశోకుఁడను ధర్మక్షేత్ర కృషీకుఁడు, బౌద్ధసంఘమను పందిరిని, విస్తరించి తన నిర్మలబోధ రసంబుచేఁ దన్మతరూప లతను లెస్సగఁ బోషించి దానిని నిరాతంకముగ వ్యాపింపఁజేసి యా లతాసంరక్షణార్థము ధర్మోపదేశకులను కావలికాండ్రనుంచి, నిర్వాణఫలంబుఁ గాలించెననియు వర్ణింపఁదగియున్నది. ప్రజా కుటుంబములఁ దన కుటుంబములుగ భావించి, దానం జేసి తాను బహు కుటుంబి యనుకొని, తద్బహుకుటుంబ రక్షణార్థము బహుళాయాసంబుఁ బడియె. సంవత్సర

ములో నేఁబదియారు ముఖ్య దివసంబులయందు మత్స్యగ్రహణ విక్రయంబులు చేయఁగూడదనియు, వేటాడి జంతువులఁ జంపఁగూడదనియు శాసించెను. ఏ జంతువులఁ జంపుట నిషేధించెనో వాని నామవివరణ పట్టిక ప్రచురించెను. ఈ సర్వ నిషేధము చతుష్పాత్తులయందే వ్యాపించెను. ఏ జంతువుల కళేబరములు భక్షణమునకుఁగాని తదితర కార్యములకుఁగాని యనర్హములయి యుండునో వానిం జంపఁగూడదని నిషేధించెను. 'సర్వకాల సర్వావస్థలయందును ప్రజలు మనవి చేసుకొనవచ్చును. లోకోపకారార్థము నేను కృషిచేయవలెను. జీవకోటికి నా ఋణము దీర్చుకొనుట యనఁగా నీ లోక సుఖము కలుగంజేసి తన్మూలకమున బరలోకసుఖ ప్రాప్తులుగ నొనరించుట నా ముఖ్యోద్దేశ'మని ప్రకటించెను. (24 - 25 - 28- 33 - 35 పేజీలు)

తీర్థయాత్ర నశోకమహారాజు తన పాలనకాలములో 21 వ యేఁట నొనరించెను. అశోక చక్రవర్తి భవిష్యజ్జన్మమని కొన్నిచోట్లను పరలోకమని కొన్నిచోట్లను వచించియుండెను. ఇది విచారణీయమై యున్నది. (45 - పేజీ)

కావేరీనదికి దక్షిణముగా నున్న దేశమం దుండిన పురాతన గృహాదులను గూర్చి హ్యుయాన్ట్సియాం గిటు విశదీకరించెను. రాజధానికిఁ దూర్పుగా సంఘారామ మను మఠ మున్నది. ఇది యశోక ప్రభువుయొక్క కనిష్ఠ సోదరునివల్ల నిర్మింపఁబడినది. (53 - పేజీ)

అవంతిదేశ మేలుచు నశోకుఁ డుజ్జయినిని రాజధానిగాఁ జేసికొనెను. అక్కాలమున విదిశాగిరి యను నగరమందు దేవియను పేరుగల యొక సుందరాంగి యుండెను. వీ రిరువురకు నొక కొమరుఁడు గలిగెను. పిమ్మట రెండేండ్లకు సంఘమిత్రయను పేరు గల కుమార్తె పుట్టెను. అశోకుఁడు, మగధ రాజ్యాధిపతి యగుటకుఁ బాటలీపుత్రమునకు వెళ్లినప్పు డీ దేవి, విదిశాగిరికి వెళ్ళి యచ్చట నివసించెను. పుత్ర పుత్రికాద్వయం బశోకుని వెంబడించి పాటలీపుత్రమునకు వెళ్ళెను. అచ్చట నశోకుఁడు తన మేనల్లుఁడైన యగ్నిబ్రహ్మకు సంఘమిత్ర నిచ్చి వివాహము చేసెను. వా రిద్దరికి సుమనుఁడను సుపుత్రుఁడు కల్గెను. (266 - పేజీ)

మహేంద్రుఁడు సింహళమునకుఁ బోవు దారిలో తన జననిని జూడ వెళ్ళెను. ఆమెఁ దాను గట్టించియున్న మనోహరమైన మఠంబున ప్రవేశపెట్టెను. సింహళమందు మహేంద్రుఁడు చేసిన ప్రథమ బోధతోనే సింహళరాజు 40,000 అనుచరులతో బౌద్ధ సంఘమందు గలిసెను. (270 - పేజీ)

తిష్యుఁడు వచ్చి కపట బౌద్ధులను వెడలించి కథావత్తు - అను గ్రంథమును రచియించి పాటలీపుత్రమం దున్న యశోకారామములో మూఁడవ మహాజన సభ చేసెను. ఇది యశోకుఁడు పాలనమునకు వచ్చిన 17½ సం॥ లకు జరిగినది. మూఁడవ ధర్మసభ 9 మాసంబులు జరిగి ముగిసెను. (268 - 269 - పేజీలు)

కాశ్మీర్ నేపాళ దేశములు మౌర్యరాజ్యములో జేరియున్నట్లు పురాణంబుల వలనఁ దెలియుచున్నది. కాశ్మీరమునకు నిప్పటికి రాజధానియై యున్న శ్రీనగరము

నశోకుఁడు ప్రతిష్ఠించెనని చెప్పుదురు. తన పుత్రులలో నొకఁడైన 'జలౌక' యను నతని గాశ్మీర దేశపాలకునిగా నశోకుఁడు నియమించెననియు గాశ్మీర దేశచరిత్రమం దున్నది. అశోకుఁడు పూర్వపు రాజధానికి నాగ్నేయమూలగా రెండు మైళ్ళ మిట్ట ప్రదేశమందు నిప్పుడు లాలి (లలిత) పట్టణ మనఁబడు పట్టణమును నిర్మించెను. అశోకుని కుమారియు దేవపాలుఁడను క్షత్రియుని గృహిణియునైన చారుమతి తన జనకునితో దీర్ఘయాత్రఁ జేయుచు ఖాట్మాండు నగరమునకు రెండు మైళ్ళ దూరమునఁ బశుపతి నాథమను మఠముఁ గట్టించి దానియందు నివసించుచుండెను. ఈ మఠమిప్పటికిని నీమె పేరఁ బరగుచున్నది. (94 - 95 పేజీలు)

పింగళవత్సజీవుఁ డను యోగిని రావించి కొమారుల భవిష్య త్తెట్లుండునని బిందుసారుఁ డాయన నడిగెను. అశోకుఁడు నాగరికములేక మోటుగాఁ గనిపించుటచేఁ దండ్రి కాతనియం దసూయకలదని య య్యోగి యెఱింగి నిజంబును బిందుసారునకుఁ జెప్పవెఱచెను. సుషీముఁడు జ్యేష్ఠపుత్రుఁడు. అశోకునికంటె పెద్దవాఁడు. ఒకనాఁ డతఁడు తన చేతి మేజోడును దీసి ఖల్లాతకుఁడను మంత్రిశిరంబున నాట్లాటకు విసిరి వేసి పోయెను. ప్రబల ద్వేషము మంత్రి హృదయమున నాటుకొనుటచే నయిదు వందల మంది యాలోచన సభికులతో గుట్ట చేసి యతని రాజ్యంబునుండి వెడలఁగొట్టి యశోకునకు రాజ్యం బొసంగఁ దలపెట్టెను. (280 - 81 పేజీలు)

బిందుసారుని పెద్ద కుమారుఁడైన సుమనుఁడు వధింపఁబడిన కాలమున కాతని కళత్రము గర్భవతియై యుండెను. ఆ చిన్నది మాలపల్లెయందు దాగుకొనెను. ఆమె ప్రసవించి పుత్రుని గనెను. ఆ బిడ్డనికి న్యగ్రోధుఁడని పేరు పెట్టిరి. పుట్టుకతోనే యా బాలుఁడు మహాత్ముఁడుగాఁ బుట్టె ననఁదగియున్నది. ఒకనాఁ డాతఁ డేడవ సంవత్సరంబున రాజనగర సమీపముగా, దారివెంబడి పోవుచుండెను. ప్రభువైన యశోకుఁ డాతనియందు దీపించుచున్న పావనత్వాది దివ్యలక్షణంబుల గ్రహించి విభ్రాంతి జెందెను. ఆ చిన్నవాఁడును దగిన పీఠముమీఁదఁ గూర్చుండుమని రాజనఁగాఁ దగినపీఠము సింహాసనమే యని భావించి యా బాలుఁడు దానిపైఁ గూర్చుండఁబోయెను. అశోకుఁడు కైదండ యొసఁగి సింహాసనముపైఁ గూర్చుండఁ బెట్టెను. మఱునాఁడు మతాచార్యులను ముప్పది యిద్దఱిని వెంటఁ బెట్టుకొని యా బాలయోగి బౌద్ధ ధర్మమును సలక్షణంబుగ బోధించెను. (263 - 264 పేజీలు)

ఉపగుప్తుఁ డను ముని వచ్చి యశోకుని బౌద్ధమతావలంబునిగ నొనర్చినట్లు హ్యూయన్సియాంగు వ్రాసిన గ్రంథమువలనఁ గన్పట్టుచున్నది.'' (285 పేజీ)

# IV

పై చరిత్రాంశములను సామాన్యబుద్ధికి (common sense) సముచితముగాఁ దోచిన విధంబునఁ బరస్పర విరుద్ధములుగాని యట్లు, సమన్వయముచేసి యశోక కథను మనస్సులో వస్త్వైక్యత గుదురున ట్లూహించుకొని, యా యూహాచిత్రమునుఁ జరిత్ర విషయ నిబద్ధంబుగఁ గావ్యంబునఁ గుదురు కొల్పితిని. వస్తుకల్పనా సమన్వయ

సామంజస్యమును గుఱించి పాఠకులే నిర్ణయించుకొందురుగాక. తిష్యరక్షిత యశోకుని వార్ధక్యమున రాణిగ నుండి గుణాలుని (శాసనానుసారము ధీవరుఁడను పేరుగల వాని) నయన నాశనమునకు దారితీసెనను కథ ననౌచిత్య భీతిచే విస్తరింపనైతిని. తక్కిన యంశములన్నియు కావ్యమున నంకితములైనవి. మహీంద్రుఁడు భ్రాతగా మహేంద్రుఁడు దేవీసుతుఁడుగా, ధీవరుఁడు గుణాలుఁడను నామాంతరముగల్గిన కరుణావతి కొడుకుగా, న్యగ్రోధోపగుప్త లొక్కఁడ యని సుషీమాత్మజుఁడుగా, వర్ణితులైరి.

## V

ధర్మసూత్రములలోని తత్త్వమును, బౌద్ధ విద్యాలయములలో బోధించువారిని "ధర్మకథకు"లని పిల్చిరి. సంప్రదాయసహితము సూత్రపేటికను, గంఠతః వల్లించిన వారిని "పేటికు" లనిరి. సూత్రములుమాత్రమే నేర్చినవారిని "సూత్రాంతికు"లనిరి, బౌద్ధధర్మముల నిరూపించు నాగమంబుల (నికాయముల) యందు బండితులగువారిని. "పంచనికాయకు" లని పేర్కొనిరి. స్థావిర యోగప్రకారము దివ్యదృష్టి, దివ్య శ్రోత్రత, పూర్వస్మృతి, పరేంగితజ్ఞానము, అప్రత్యక్షవిషయ జ్ఞానము, వియద్గమన మనునవి యారు మానుషాతీత శక్తులను కొందరు బౌద్ధమునులు సంపాదించి యుండిరి. ముఖ్యములైన బౌద్ధశాఖలు నాల్గు - వైబాధ్యాయవాదులు, కేవలోపాసకులగు శ్రావకయానులు, మధ్యమస్థులు, ప్రత్యేక బుద్ధయానులు, ఉత్తములగు బోధిసత్త్వయానులు నను వారిని వీరిలో సౌత్రాంతికులు, వైనాయకులు, అభిధార్మికులు వేఱువేఱ అభిప్రాయముల గల్గియుండిరి. అశోకుని కాలమున ధర్మయాత్రలలో ఇరువది మూరల కన్న నెత్తుగా, బొంగుల నేటవాలుగా నడిమిరాజస్తంభ మాధారముగా నుంచి కట్టిన రథములలో చుట్టును దెల్లని పట్టువస్త్రములను గట్టి రంగులు బూయుచుండిరి. ఆ రథములకు నాల్గు వైపుల గూళ్లును వానిలో బుద్ధ విగ్రహములను, రత్న రజత స్వర్ణములు పొదిగిన వాని నుంచి యట్టి యరదము లిరువదింటిని మహోత్సవములతో నూరేగించిరి. బ్రాహ్మణులు పోయి బౌద్ధభిక్షుకులను మర్యాదతో నాహ్వానింపగా వచ్చి రెండు రాత్రములుండి రాత్రియంతయు దీపములు వెల్గుచుండ నైవేద్యాదులతో దేవతలను, బుద్ధుని, వా రర్చించుచుండిరి.

## VI

అశోకచరిత్రమును కావ్యముగా వ్రాయుటకు నా కుపకరించిన గ్రంథములు మూఁడు. ఒకటి తెలుఁగులోని యాంధ్ర భాషాభివర్ధనివారి యశోకచరిత్రము. రెండవది కన్నడములోని "కౌటిల్య" యను గ్రంథము. మూఁడవది, **(Ancient Polity)** అను నాంగ్లేయ కృతి. ఏ తద్గ్రంథకర్తలకు కృతజ్ఞతావందనము లర్పించువాఁడను,

# పరిశిష్టభాగము - ద్వితీయానుబంధము

## ప్రాచీన కాలగణనములోని భిన్నపంథలు :

శ్రీకృష్ణుం డవతరించి భూభారమును దొలఁగించి ద్వారకానివాసంబు చాలించిన దినంబునఁ గలియుగం బారంభమయ్యెగదా! భారతయుద్ధానంతరము 36 సం॥లకు పరీక్షిద్రాజ్యపట్టాభిషేకంబును ధర్మజాదుల స్వర్గారోహణంబును బ్రవర్తిల్లె. క్రీస్తునకుఁ బూర్వము 3102 సం॥ ల నాఁడు మఖయందు సప్తర్షులుండ ఫిబ్రవరి యిరువదవ తేదీ 2 ఘంటల 27 ని॥ 30 సె॥ కాలమునకు సరిగా శని గురు ప్రభృతు లొకచో నొసరిల్ల, ప్రమాదివత్సర చైత్ర శుక్ల ప్రతిపచ్ఛుక్రవాసరంబున "యస్మిన్ కృష్ణో దివం యాతి స్తస్మిన్నేవ తదాహని ప్రతిపన్నం కలియుగం" అను ప్రమాణానుసారంబుగఁ గలికకము మొదలయ్యెను. మహాభారత యుద్ధావసానంబునకు హస్తినాపుర సార్వభౌమతయు, మగధాయోధ్య రాజ్యంబులును శేషించినవి. అవియు 1468 సం॥ లవిచ్ఛిన్నంబుగ నడచి యంతమొందె. పాశ్చాత్య ఖగోళవేత్త లీగణితము సెకండ్లవఱకు సరిగా నున్నదని తీర్మానించినారు. ఈ ఖగోళస్థితి మరల నాంధ్ర రాజుల కాలమున నఁగా 2700 సం॥లకు రెండవసారి ఘటిల్లినదని నుడివిరి. ఈ విధముగా రాజవంశములు సరియైన క్రమములో క్రీ. త. 1000 సం॥ల వఱకుఁ బురాణకారులు నిరూపించినారు. కాశ్మీరదేశమున నున్న శంకరాచార్య మందిరము క్రీస్తుపూర్వమే రిపేరీల నందినట్లు శాసనాధారము లుండ శంకరాచార్యులను క్రీస్తు తర్వాతి వానినిగా పాశ్చాత్యు లెన్నిరి. ఇట్టి యవకతవక కాలమానముఁ బుట్టించుటకుఁ చంద్రగుప్త మౌర్యునితో నలెగ్జాండరు దండయాత్ర నుడిపెట్టుటయనియు గ్రీసు చరిత్రకారులు, "శాండ్రోకొట్టసు" తండ్రిని జంపి రాజ్యమునకు వచ్చినట్లు పేర్కొనినందున, సముద్రగుప్తకాలముననే యలెగ్జాండరు దండయాత్రసంభవించియుండెననియు నట్లయినఁ గాళిదాస విక్రమార్కాది వృత్తాంతముల కాలములు సరిపోవుననియు జనుల వాడుకలో నున్న కాలపరిగణనము నూరక నిరాధారమని తీసివేయుట తగదనియు బ్రహ్మశ్రీ కోట వేంకటాచలము, కీ॥ శే॥ కుప్పయ్య మున్నగువారి వాదమైయున్నది. వారి వాదను సహృదయులకు సకారణముగనే కన్పట్టుచున్నది. పురాణములలో వర్ణితమైన కుశఖండ వృత్తాంత మాకర్ణించి యాకళించుకొని పాశ్చాత్య వివిధ స్థలాన్వేషకు లాఫ్రికా ఖండములోని నైలునదీ జన్మస్థానమును గన్గొనిరనుటఁ బత్రికలలోఁ జూచియున్నారము. వేనవేలాది హాయనంబులకుఁ బూర్వ ముదాహృతమైన భౌగోళిక వివరము లిట్లు సరిపోవుచుండఁ బౌరాణిక కాలనిర్ణయము సరికాదని ఘోషింపుచుంట యసమంజస మగుచున్నది. ఈ కాలనిర్ణయ సమస్య నెఱవేర్చినంతనే భారతీయ నాగరికత ప్రాచీనతయు - ఆ నాగరికత యితర దేశములపై వ్యాపింపఁజేసిన సంస్కారములును నిస్సంశయముగఁ దెల్లమగును. చరిత్రకారులు సమావేశమై యొక నిర్ణయమునకు రావలయుననెడు నాశతోఁ బౌరాణికములగు నీ కాలపాచిక మిట సంగ్రహముగఁ

ప్రతిపాదితమైనది. శ్రీ తిలకు మహాశయులు, తన ఓరియన్ మున్నగు గ్రంథములలో వేదకాలము తదీయ ఋక్కుల ననుసరించి హిమప్రళయమునకుఁ బూర్వములని, కాన పదునొకండువేల వర్షములకంటెఁ బ్రాచీనములనియు నుగ్గడించిరి.

భారత యుద్ధానంతరము హస్తినాపురము రాజధానిగాఁ బరీక్షి జ్జనమేజయ, శతానీ, కాశ్వమేధా, దత్తాది, సిమకృష్ణ, నిచక్నూష్ణ, చిత్రరథ, శుచిరథ, వృష్ణిమంత, సుషేణ, నృపేగాక్షు, సుఖిబాల, పరిప్లవ, సునయ, మేధావి, రిపుంజయోర్వ, తిగ్మ, బృహద్రథ కసుదాస, శతానీకో, దయన, కిహీనార, దండపాణి, నిరామిత్ర, క్షేమకులు పాలించిరి.

అయోధ్యలో బృహత్క్షణో, రుయక్షు, వత్సవ్యూహ, ప్రతివ్యోమ, దివాకర, సుదేవ, బృహదశ్వ, భానురథ, ప్రతీతస్య, సుప్రతీక, మరుదేవ, సుతక్షత్ర, కిన్నరా నాథరక్షు, సుప్రాణామిత్రజిత్, బృహద్భజ, ధార్మి, కృతంజయ, రమంజయ, సంజయశాక్య, శుద్ధోదన, సింహ, రాహుళ, ప్రసేనజిత్, కహుద్రక, కుండక, సురథ, సుమిత్రు లేలిరి.

గిరివ్రజమును మగధరాజ్య రాజధానిగా జరాసంధతనయుఁడు సహదేవుండు పాలించిన పిదప బార్హద్రథులగు సోమాపి, శ్రుతశ్రవా, ప్రతీప, నిరామిత్ర, సుకృత్త, బృహత్కర్మ, శ్యేనజిత్, శత్రుంజయ, మహాబల, శుచిక్షేమ్యా, సువ్రత, ధర్మనేత్ర, సిర్వృతి, సువ్రతదృఢసేన, సుమతి, సుబల, సునేత్ర, సత్యజి, ద్విరజి, రిపుంజయులును, ప్రద్యోతపాలక, విశాఖయూప, జనక, నందివర్ధనులును, శిశునాగాన్వయులగు శిశునాగ, కాకవర్ణ, క్షేమవర్మ, క్షేమజి, బింబిసార, నృపాజాతశత్రు, దర్భకో, దాసీన, నందివర్ధన, మహానందులును పాలించిరి.

అయోధ్య భూపతులలో నిరువదిమూఁడవ రాజగు శుద్ధోదనునకుఁ గ్రీ. పూ. 1887 లో శాక్యసింహుఁడను పేర బుద్ధుఁ డుదయించెను. అతండు నలువదవయేఁట సన్న్యసించి, శిశునాగవంశపు క్షేమజి త్తర్యోడ మగధ నేలుచుండఁ దన మతంబు విస్తరింపఁజేసి తన యెనుబదవయేఁటఁ గుశనగరంబుచెంత సిద్ధిజెందె. హస్తినాపురాయోధ్యలలో తుద నేలిన రాజులు క్షేమక సుమిత్రుల పుత్రకులుగా గతించిరి. మహానందుని యుపపత్నికి జనించిన మహాపద్మనందుఁడు, క్షత్రియులందరను నిర్మూలించి మగధలో పట్టాభిషిక్తుఁడై క్రీ. పూ. 1634 లో (కలి 1468) హస్తిపురాయోధ్యలకుఁగూడ సమ్రాట్టయ్యెను. ఇతఁడు 88 సం|| లేలి మృతినొంద, నతని యెనమండ్రుడు పుత్రులు రాజ్యమేలిరి. పండ్రెండు వర్షంబులకే రాజకీయ సంక్షోభ ముప్పతిల్లఁగాఁ, జంద్రగుప్త మౌర్యునకుఁ దోడై, చాణక్యుఁడు నూతన సామ్రాజ్య స్థాపనాచార్యుఁడయ్యెను.

చంద్రగుప్తమౌర్యుని యనంతర మౌ వంశీకులు, బిందుసారాశోక సంపాది సుపార్శ్వ) దశరథేంద్ర పాలిత హర్షవర్ధన సంగత శాలి శూకసోమశర్మ శతధన్వ

బృహద్రథు లను పృథ్వీశులు, క్రీ. పూ. 1218 వఱకు నేలిరి. కలియుగంబున నప్పటికి 1884 వర్షములు గడచినవి.

అనంతర మరాజకముఁ దొలఁగింపఁ బుష్యమిత్రుఁడను సేనాని బ్రాహ్మణుఁడు – బృహద్రథుని వధించి సార్వభౌముఁ డయ్యెను. ఆతని శుంగవంశమున నగ్నిమిత్ర, వసుమిత్ర, సుజ్యేష్ఠ, భద్రక, పుళిందక, ఘోషావసు, వజ్రమిత్ర, భాగవతదేవభూతులు వరుసగఁ బాలించిరి. పిదప కాణ్వులు బ్రహ్మక్షత్రియులు వసుదేవ భూమిమిత్రనారాయణ సుశర్మ లేలిరి. కలియుగము 2269 అబ్దంబు లయ్యెను. అది మొదలు కలి 2775 వఱకు (క్రీ. పూ. 327 వఱకు) నాంధ్ర సమ్రాట్టులు భరతఖండమును శాతకర్ణు లను పేరఁ బాలించిరి. వారు శాతవాహ నాన్వయులు. శ్రీముఖ శ్రీకృష్ణ శ్రీమల్ల పూర్ణోత్సంగ శ్రీశాతకర్ణి స్కంధస్తంభిల లంబోదరా పీతక మేఘ స్వాతి శాతస్వాతులను, స్కంద మృగేంద్రమాతలి సౌమ్య శాతపులోమయ మేఘారిష్మ హాలమండలిక పురేంద్ర సేనసుందర చకోర మహేంద్ర శివ శ్రీచంద్ర శ్రీయజ్ఞ పులోమాయులు పాలించిరి. ఆఖరు చక్రవర్తి కొడుకగు చంద్రశ్రీని సంహరించి ఘటోత్కచ చంద్రగుప్తులు రాజ్య మపహరించిరి.

మెగస్తనీసు పేరుకొన్న Xandrames చంద్రశ్రీయనియు, రాజ్యాపహర్త యగు చంద్రగుప్తుఁడే Sandrocothus అనియుఁ, దండ్రి సవతికొడుకునకుఁ బట్టముఁ గట్టఁగాఁ గినిసి పితృవధ చేసి సమ్రాట్టయిన సముద్రగుప్తుఁడే Sandrocyptus అనియుఁ దజ్ఞులు నుడువుచున్నారు. ఇదియె నిష్కర్షగా విమర్శనీయమైన చరిత్రాంశము! దీనిని సరిగాఁ బురాణవంశావళుల కవిరోధముగా నిర్ధరించినచో భారత ప్రాచీనేతిహాసము క్రమబద్ధమగును. సముద్రగుప్తున కశోకాదిత్యుఁ డనియు బిరుదము గలదు.

సముద్రగుప్తుని యనంతరము విక్రమాదిత్య గుమారగుప్త స్కందగుప్త బాలాదిత్యులు పాలించిరి. కడపటివాఁడు ప్రేమాదిత్యుఁడు క్రీ. పూ. 82 వఱకు నేలి ప్రమరవంశ విక్రమార్కునిచే విజితుఁడయ్యెను. (చంద్రశర్మ పుత్రుఁడు విక్రమాదిత్యుఁ డితనికన్న భిన్నుఁడు.) పుష్యమిత్రాదిగ రాజులను బ్రాహ్మణు లంద్రు.

ప్రమరవంశ రాజులను వసిష్ఠవంశులని పేర్కొనిరి. ఆంధ్ర శాతవాహనాది చక్రవర్తుల కాలములో 36 గురు – ఆయాకాలముల యువరాజులు రాజపుత్రస్థానము మొదలగు చోట్లఁ బ్రతినిధులై చాళుక్య రాష్ట్రకూట పరిహారప్రభృతి (కదంబాది) రాజవంశకర్తలుగా నెగడిరి. విక్రమార్కుఁడు క్రీ. పూ. 82 లో రాజైనను క్రీ. పూ 57 నుండి శకుల నోడించి సమ్రాట్టయ్యెను. ఇతని తర్వాత నితని మనుమఁడు శాలివాహనుఁడును దక్షిణదేశమంతయుఁ బాలించి శకకర్త యయ్యెను. వీరు క్రీ. శ. 1000 వఱకు నచట నచట రాజ్యమేలిరి. వారే శాలివాహన శాలిహోత్ర శాలివర్ధన శకహంత్ర సుహోత్ర హవిర్హోత్రేంద్ర పాలమాల్యవంత శంభుదత్త భీమవత్స భోజశంభుప

బిందుపాల రాజపాల మహావీర సోమవర్మ నరసింహ రంగపాల కల్పసింహ గంగసింహు లను నిరువదినల్గురు. వీ రందఱిని బ్రాహ్మణవంశ్యు లనిరి.

క్రీ. శ. శ్రీహర్షాదివైశ్య రాజులయు, పల్లవ చోళ చాళుక్యాదిరాజుల చరిత్రంబులును లబ్ధంబులై యున్నవి. పాశ్చాత్య చరిత్రకారుల కాలపద్ధతియు నధునాతన పాఠకులకుఁ బూర్ణముగఁ బరిచితముకాన నుల్లేఖింప నవసరములేదుగదా!

ఈ కాలనిర్ణయవిషయమై విజయవాడ వాస్తవ్యులు, శ్రీ కోట వేంకటాచలముగారి వివిధ గ్రంథములు, పఠనీయములు; — చారిత్రకాధారములు, వా రుదాహరించినవి విమర్శనీయములు - విమర్శనానంతర మిదమిత్థమని నిర్ణయించిన తర్వాతనే అమెరికా, ఆఫ్రికా, గ్రీసు దేశములు కూడ, నొకప్పుడు, భారతీయులచే నిర్జితము లనునవి మొదలగు పాశ్చాత్యోక్త విషయములు నిర్ధరింపబడగలవుగదా!

—♦ సమాప్తము ♦—